# ఉత్తర భారత సాహిత్యములు

( వంగ, ఓఢ్ర, పంజాబీ, కాశ్మీరి సాహిత్య చరిత్రలు )




ప్రచురణ:

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి

తిలక్ రోడ్ : : హైదరాబాదు.

# తొలి పలుకు

దేశభాషల సాహిత్య చరిత్రలను ఆంధ్ర పాఠకలోకానికి పరిచయము చేయు ఉద్దేశముతో సంగ్రహముగా ప్రకటించ వలెనని ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి నిర్ణయించినది. ఆ నిర్ణయానుసారము రెండవ సంపుటముగా యీ గ్రంథములో వంగ, ఓఢ్ర, పంజాబీ, కాశ్మీరీ సాహిత్య చరిత్రలను క్రోడీకరించి ప్రకటించినాము. మొదటి సంపుటములో తమిళ, కర్ణాటక, మళయాళ, మహారాష్ట్ర సాహిత్య చరిత్రలను చేర్చి ప్రకటించుట జరిగినది.

భిన్నముగా గోచరించు దేశభాషల సాహిత్యముల యేకత్వమును సృష్టీకరించుటయే యీ గ్రంథ ప్రచురణ ఉద్దేశమని వేరుగాచెప్పవలసిన అవశ్యకత లేదు. మనదేశ సమస్యలలో యీ నాడు జాతీయ సమైక్యము ముఖ్యాతిముఖ్యమై యున్నది. జాతీయ సమైక్యమును ప్రబోధించు వాఙ్మయమును కేంద్ర రాష్ట్రీ సాహిత్య అకాడమీలు ప్రోత్సహించి ప్రచురించుచున్నవి. కడమ దేశ భాషా సాహిత్యములకు సంబంధించిన సంపుటాలను కూడ త్వరలోనే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రకటించ నున్నది.

ఈ గ్రంథమును వ్రాయించు నప్పుడు ఆయా భాషలలో మంచి పరిచయము కలిగిన వారికి యీ సాహిత్య చరిత్రల రచనను అప్పగించవలెనని నిర్ణయించినాము. మేము కోరినంతనే యీ సాహిత్య చరిత్రలను నిర్ణయించిన పరిమితిలోను, వ్యవధిలోను వ్రాసియిచ్చిన నలుగురు విద్వాంసులకు అకాడమీ పక్షాన కృతజ్ఞతానేక వందనములు.

హైదరాబాదు,
25-2-65.

దేవులపల్లి రామానుజరావు
ప్రధాన కార్యదర్శి.

# విషయసూచిక

## వంగ సాహిత్య చరిత్ర

—శ్రీ పురిపండా అప్పలస్వామి.

### పూర్వరంగము



### ఉత్తరరంగము



## ఓఢ్ర సాహిత్య చరిత్ర

—పండిత పెనుమత్స సత్యనారాయణరాజు.

## పంజాబీ సాహిత్య చరిత్ర

మూలం : ఆచార్య మోహన సింగు.

అనువాదం : శ్రీ గడియారం రామకృష్ణ శర్మ.



## కాశ్మీరీ సాహిత్య చరిత్ర

మూలం : ఆచార్య జె. యల్. కౌల్.

అనువాదం : శ్రీ కె. గోపాల కృష్ణారావు.

# వంగ సాహిత్య చరిత్ర

## చర్యాపదాలు

వంగ సాహిత్య ప్రాచీన స్వరూపం చర్యాపదాలలో చూపుతారు చరిత్రకారులు. లూయిపా, భుసుకూ, కాన్హాపా (కృష్ణాచార్య), కామలీ, డోంబీ, శాంతి, సరవాపా, అజదేవా, దారికా, ఖాదే, తాదకా, కంకణా, జయనందీ, ధామా, వీనా, సవరపా, ఢేందనా, చాటిలా, బిరుఆ, మహిందా మొదలైన సిద్ధాచార్యులు ఆనాటి వాడుకభాషలో వ్రాసిన పదాలు చర్యాపదాలు. ఈ కవులందరూ క్రీ. శ. 950 – 1200 కాలం వారు. వీరిలో కాన్హాపా ఉత్కలుడు. భుసుకు విక్రమపురంలోని ప్రసిద్ధ బౌద్ధాచార్యుడైన దీపాంకురుని శిష్యుడు.

బౌద్ధమత హీనయాన సాహిత్యం పాలీ భాషలోనూ, మహాయాన సాహిత్యం సంస్కృతంలోనూ వెలిశాయి. మహాయానం నుంచి చీలిన వొక శాఖ సహజయానం. ఈ సహజయానానికి చెందిన పదాలే చర్యాపదాలు. సహజయాన చర్య నిరూపించే పదాలు కనక వీటికి చర్యా పదాలని పేరు.*

ఈ చర్యాపదాల సంపుటం సంస్కృతవ్యాఖ్యానంతో సహా నేపాల ప్రభుత్వ గ్రంథాలయంలో మహా మహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి సంపాదించాడు; కొన్ని పురాతన దోహాలు కూడా చేర్చి 'బౌద్ధగాన ఓ దోహా' అని ప్రకటించారు. చర్యాపదాలూ, సంస్కృత వ్యాఖ్యానమూ కూడా టిబ్బతు భాషలోకి పద్నాలుగో శతాబ్దంలో అనువాద మైనాయి. నేపాల ప్రతిలో నలభై ఎనిమిది పదాలు మాత్రం దొరికాయి. ఇందులో లేని మరి రెండు పదాలు టిబ్బతు అనువాదంలో వివరాలతో వున్నాయి.

చర్యాపదాలలో చిత్రమేమిటంటే వాటి బాహ్యార్థం వొకటయితే అంతరార్థం మరొకటయి వుంటుంది. అసలు అంతరార్థమే వాటిలో ముఖ్యమైంది. అది సాంకేతికంగా వుండి, సామాన్యులకు అవగతం కాదు. బాహ్యార్థం సాధారణంగా

---

*చూ. మణీంద్ర మోహన సేను 'బాంగ్లాసాహిత్య' పు. 113.

అసభ్యంగా కూడా వుంటుంది తరుచు. సంస్కృత వ్యాఖ్యానంతోపాటు టిబ్బతు అనువాదం కూడా జతపరిచి పరిశీలిస్తేనే కాని సహజంగా చర్యాపదాలు బోధ పడవు. *

ఉదాహరణకి వొక పదం చూడండి :

నిసి అంధారీ ముసా అచారా,
అమిఅ భకఅ ముసా కరఅ అహారా.
మారరె జోఈఅ ముసా పబణా,
జేణ తుటఅ అబణా గబణా.
భావ విందారఅ ముసా ఖణఅ గాతి,
చంచలముసా కవిఅ నాశక థాతీ.
కాల ముసా ఊహ ణ బాణ,
గఅణె ఊఠి కరఅ అమిఅ పాణ.
తావ సె ముసా ఉంచల పాంచల,
సద్గురు జోహె కరహ సో నిచ్చల.
జబె ముసా ఎర అచార తుటఅ,
భుసుకు భణఅ తబె బాంధన ఫిటఅ.

(చర్యా-21.)

ఇందులో చంచల చిత్తాన్ని ఎలుకతో పోల్చబడింది. చీకటిలో ఎలుక స్వేచ్ఛగా తిరిగి తినుబండారాలు చిందరవందర చేసి పాడు చేస్తుంది, అలాగే చంచలచిత్తం అజ్ఞానంలో పడి, విషయాలలో విహరించి జ్ఞానామృతం నష్టపరుస్తుంది. కనుక యోగి చంచలచిత్త మనే ఎలుకని చంపడమే కర్తవ్యం. ఇదీ దీని అంతరార్థం. కవి భుసుకు పాడిన పద మిది.

చర్యాపదాలలో అనాటి సాంఘిక పరిస్థితులూ, ప్రజల భావాలూ మనకు అవగత మవుతాయి.

---

* I findout that it was almost impossible to interpret the songs without the help of Tibatan Text. — Prabodh Chandra Bagchi.

ఈ పదాలు ప్రాచీన బాంగ్లా సాహిత్య సంపద అని బాంగ్లా పండితులు చెప్పు తున్నట్టే మైథిలీ, ఒడియా, అస్సామియా పండితులు కూడా ఆవి తమ తమ ప్రాచీన సాహిత్య సంపద అని వాదిస్తున్నారు. బలమైన కారణాలు కూడా చూపు తున్నారు. దీనికి కారణం ఆ యా భాషలలోని పురాతన శబ్దజాలం కొంత ఈ పదాలలో గోచరం కావడమే.

బాంగ్లా సాహిత్య చరిత్రలో చర్యాపదాలు బాంగ్లా ప్రథమ రచనలని గుర్తించినా, అవి ప్రథమ సార్థక సాహిత్యం సృష్టించలేదు.* అయితే బౌద్ధమత భస్మావశేషం నుంచే బెంగాలీ సాహిత్యం అంకురించింది. బాంగ్లా బౌద్ధ కావ్యాలలో రామాయి పండితుడి (1100-1200) 'శూన్య పురాణం' ఈ సందర్భంలో పేర్కొన దగినది. శూన్య మూర్తి ధర్మదేవత ఆవిర్భావమూ, ధర్ముడి నుంచి బ్రహ్మ విష్ణు మహేశ్వరుల పుట్టుకా, ధర్ముడి చెమటలో ప్రకృతి పుట్టడమూ, జలప్రళయమూ, హరిశ్చంద్రుడి ధర్మపూజా, యముడి కథా. ఇందులో విలక్షణంగా వర్ణించాడు రామాయి పండితుడు. ఇతడు 'అంటరాని కులం' లో పుట్టిన కవి.

## మంగళ కావ్యాలు

పన్నెండో శతాబ్దం నాటికి పాల, సేన మొదలైన రాజవంశాలు బాంగ్లా దేశం ఏలుతూ వుండేవి. ఈ రాజుల ఏలుబడిలో దేశంలోని కళలు వృద్ధిపొందుతూ వచ్చాయి. పన్నెండో శతాబ్దం చివరిదినాల్లో దేశం మీద తురకల దండయాత్ర లారంభమయాయి, ఈ దండయాత్రలు పద్నాలుగో శతాబ్దం వరకూ పదేపదే ఉప్పెన లలా వచ్చిపడ్డాయి. వీటి మూలంగా దేశం నిస్సారమైంది. కళలు సన్నగిల్లి పోయాయి. సాహిత్యం రూపు మాసిపోయింది. పండితులూ, కవులూ, బౌద్ధాచార్యులూ తమ తమ గ్రంథాలూ అవీ మూటకట్టుకుని దేశం విడిచి నేపాళం వలస వెళ్ళిపోయారు. పదమూడు, పద్నాలుగు శతాబ్దాలలో వంగ సాహిత్యం గొడ్డుపోయింది. తురకలూ, తమ తరువాత వచ్చిన ముస్లిము పాలకులూ రాజకీయాలకు పార్శీభాషనూ, మత విషయాలకు అరబ్బీభాషనూ ఉపయోగిస్తూ వచ్చారు. బాంగ్లా భాషకు రాజాశ్రయం లేకుండా పోయింది. ఈ రెండు శతాబ్దాలు చీకటి శతాబ్దాలు అని వర్ణించారు చరిత్ర కారులు.

---

*చూ. ప్రొ. హుమాయును కబీరు 'బాంలార్ కావ్య' పు. 16

అయితే వంగదేశం ఢిల్లీ పరిపాలననుంచి విడిపోయాక ఈ పరిస్థితి మారింది. స్వతంత్ర పరిపాలన ఏర్పరుచుకున్న రాజులూ, నవాబులూ హిందూ పండితులను ఆదరించడ మారంభించారు. అలా తొలిదినాల్లో రాజాస్థానాల్లో కుదురుకున్నవారు సంస్కృత పండితులు. వీరు గ్రంథరచనకి పూనుకోలేదు.

సంస్కృత పండితులు మూగవోయినా పల్లెలలో గేయకవులు మాత్రం వూరుకో లేదు. ఇదిగో ఈ పల్లె కవులలోనే బాంగ్లా మంగళ కావ్యాలు బయలుదేరాయి. రాజుల కోసమో, ధనికులకోసమో కాక సామాన్య జనంకోసం వ్రాసిన కావ్యా లివి. పురాణ కథలతో వీటికి సంబంధం లేదు. ధర్మమంగళ, చండీమంగళ, మనసామంగళ కావ్యాలు ప్రజల సమావేశాలలోనూ, పండుగలలోనూ, జాత్రలలోనూ కవులు గానం చేసేవారు. ఈ మంగళ కావ్యాల రచనలో కవులకు దేవతలు ప్రత్యక్షమై, లేదా కలలో కనపడి ఆదేశించడం కద్దు. మన ప్రాచీనాంధ్ర కవుల కలలలో దేవతలు కనపడి కావ్య రచనకు ఆదేశించడం వంటిదే ఇది. మంగళం (శుభం) కలిగిస్తాయి కనుక వీటికి మంగళ కావ్యాలని పేరు. అందుకనే రాత్రిళ్ళు జాగరం చేసి వీటిని గానం చేసే ఆచారం ఈ నాటికీ బాంగ్లాదేశంలో వుంది.

## ధర్మమంగళ

ధర్మదేవుని భక్తుడు లావుసేను వీరగాథ ధర్మమంగళ కావ్యాలలో ముఖ్యమైన కథావస్తువు. ప్రాచీన గాథ ఇది. వర్ధమాన జిల్లా పేకూరగడంలోని ఈచ్ఛాయీఘోషు, గౌడాధిపతి అయిన ధర్మపాలుడి మీద దండయాత్ర చేశాడు. ధర్మపాలుని సేనాధిపతి కరణసేనుని కుమాళ్ళు ఆరుగురు ఈచ్ఛాయిఘోషుతో పోరాడి వీరధర్మం పొందారు. అనంతరం ధర్మపాలుడి మరదలు రంజావతిని కర్ణసేనుడు వివాహమాడాడు. ధర్మ దేవత వరప్రసాదం వల్ల రంజావతి గర్భంలో లావుసేను జన్మించాడు.

లావుసేను ప్రయోజకు డయాక యుద్ధంచేసి ఈచ్ఛాఘోషుని వోడించాడు. అద్భుతమైన ఇతడి వీరత్వమూ అసాధారణమైన సాహసచర్యలూ, వర్ణిస్తూ ఎంతోమంది కవులు ధర్మమంగళ కావ్యాలు వ్రాశారు. లావుసేను కథ పశ్చిమ బాంగ్లాలో బాగా ప్రచారంలో వుంది. ధర్మమంగళలోని యుద్ధవర్ణన పాఠకుల్ని ఆశ్చర్యంలో ముంచు తుంది. తెలిసినంతవరకు పన్నెండో శతాబ్దప్రాంతంలో మొదట ధర్మమంగళ వ్రాసిన కవి మయూరభట్టు. అయితే ఇతని కావ్యమిప్పుడు లభ్యంకాదు. లభించిన గ్రంథాలలో రూపరామచక్రవర్తి ధర్మమంగళ ప్రాచీనమైంది.

రూపరామచక్రవర్తి తండ్రి శ్రీరామచక్రవర్తి. తల్లి దమయంతి. రూపరామ కవి వొక పాకీ యువతిని ప్రేమించి వివాహమాడాడు. కులంలో వెలిపడి కట్టుగుడ్డలతో గ్రామం విడిచిపోయాడు. ఆదుయీ గ్రామంలో రఘురామభట్టాచార్యుడు కనికరించి అతణ్ణి ఆదరించాడు. శిష్యునిగా చేసుకుని విద్య గరిపాడు. వ్యాకరణమూ, ఛందస్సూ, సాహిత్యమూ ఆచార్యుడి దగ్గిర నేర్చుకుని పండితుడయాడు చక్రవర్తి.

ఒకనాడు చక్రవర్తి అడిగిన ప్రశ్నలతో గురువు చికాకు పడ్డాడు; పుస్తకంతో నెత్తిమీద కొట్టాడు; తన ఇంటినించి పొమ్మన్నాడు. చక్రవర్తి అక్కడినుంచి బయలు దేరి పోయాడు. దారిలో అతనికి ధర్మదేవత ప్రత్యక్షమయాడు. తన యశో గానంతో ధర్మమంగళ వ్రాయమని ఆదేశించాడు.

ధర్మదేవత ఆదేశం ప్రకారం 1571 లో ధర్మమంగళ వ్రాశాడు రూపరామ చక్రవర్తి. తన చరిత్ర తన గ్రంథంలోనే చెప్పుకున్నాడు కవి.

పదహారో శతాబ్దంలోనే మానిక గంగోపాధ్యాయ, 1711 లో కవిరత్న వ్యన రామచక్రవర్తి, 1781 లో మానికరామ గంగూలీ కూడా ధర్మమంగళ కావ్యాలు వ్రాశారు. గంగూలి తన కావ్యం ఆనాటి వ్యావహారిక భాషలో వ్రాశాడు,

## చండీ మంగళ

చండీమంగళ కథలు రెండు రకాలు ప్రచారంలో వున్నాయి. అందులో వొకటి కళింగదేశం నుంచి బంగ్లాకి దిగుమతి అయింది. రెండోది వ్రత కథ.

మొదటి కథ — కళింగదేశంలో కాలకేతు అని వొక కిరాతుడు వుండేవాడు. మృగాలు వేటాడి జీవనం గడుపుతూ వుండే వాడతడు. అతడి భార్య ఫుల్లరా ఇంటింటా మాంసం విక్రయించేది. కళింగదేశం అడివి మృగాలు కాలకేతు క్రౌర్యానికి దద్దరిల్లి పోయాయి. చండీదేవితో పోయి మొరపెట్టుకున్నాయి. దేవి కనికరించింది.

చండీదేవి మహిమవల్ల రెండుదినాలు కాలకేతుడికి వేట దొరకలేదు మూడో నాడు వొక ఉడుము మాత్రం కంటపడింది. దాన్నేపట్టి ఇంటికి తెచ్చాడతడు. అయితే అతడు వచ్చేసరికి భార్య ఫుల్లర ఇంటలేదు. నట్టింట ఉడుముకట్టి పెట్టి భార్యకోసం బయటికి వెళ్ళాడు కాలకేతు! ఇంతలో ఫుల్లరా ఇంటికి వచ్చింది. ఇంట అందమైన వొక బ్రాహ్మణ యువతి కూచునివుంది. ఆశ్చర్య పోయింది ఫుల్లరా. 'ఎవరు నువ్వు?' అని అడిగింది.

'కాలకేతు నన్ను తెచ్చాడు. నేను కూడా ఈ యింట్లో వుంటాను' అంది బ్రాహ్మణ యువతి. ఇంతలో కాలకేతు తిరిగి వచ్చాడు.

ఉడుంగా దొరికి, బ్రాహ్మణ యువతిగా మారింది చండీదేవి. కాలకేతు పేదరికం చూసి కనికరించిం దామె. తన వృత్తాంతం వినిపించింది. తనను పూజించమని ఆదేశించింది. కాలకేతు చండీపూజ చేశాడు. చండీదేవి అతడికి అమితంగా బంగారం అనుగ్రహించింది. కాలకేతు ధనవంతు డయాడు. కళింగం నుంచి గుజరాతు వెళ్ళాడు. అక్కడ రాజధాని ఏర్పరుచుకున్నాడు; రాజయాడు. ఎందరెందరో కాలకేతు రాజధానికి వచ్చారు; అక్కడ నివాస మేర్పరుచుకున్నారు. వారిలో వొక దొంగవుండే వాడు. అతడి పేరు భాఁముదత్తు. భాఁముదత్తును కాలకేతు దండించాడు. దాంతో దొంగ భాఁముదత్తు గుజరాతునుంచి పారిపోయి, కళింగం వచ్చాడు. కళింగం రాజుని రెచ్చగొట్టి కాలకేతుడి మీద దాడిచేయించాడు. కాలకేతు వోడిపోయాడు. కళింగరాజు అతణ్ణి బంధిస్తాడు; అయితే చండీదేవి మహిమవల్ల వొదిలి పెట్టేస్తాడు; చండీదేవి భక్తుడై ఆమెని పూజిస్తాడు.

రెండో కథ — ఉజ్జయినిలో వొక వర్తక ప్రముఖుడు వుండేవాడు. అతడి పేరు ధనపతి. ధనపతికి ఇద్దరు భార్యలు. మొదటి భార్య లహనా, రెండోభార్య ఖులనా. లహనాకి సంతానం లేక ఖులనాని వివాహమాడా డతడు. లహన దాసి పేరు దుర్బల. ఖులనా అంటే అమెకి పడేది కాదు.

ఒకనాడు ధనపతి ఓడ వ్యాపారానికి వెళ్ళాడు. దుర్బల ప్రోత్సాహంతో లహనా తన సవతిని మేకల మేపుకు రమ్మంది; అడివికి పంపింది. అడివిలో వొక మేకపిల్ల తప్పిపోయింది. ఖులనా దుఃఖంతో ఇంటికి వచ్చింది. చండీదేవి ఆమెని కనికరించింది. తన ఎనమండుగురు చెలికత్తెల్ని ఖులనా దగ్గిరికి పంపింది. తన్ను పూజించమంది. ఖులనా చండీపూజ చేసింది. తప్పిపోయిన మేకపిల్ల దొరికింది.

ధనపతి ఇంటికి తిరిగి వచ్చాడు, భర్తలేనప్పుడు ఖులనా బయిటికి వెళ్ళింది, కనక వ్యభిచారి అయింది అని కులంవాళ్ళు ధనపతిని వెలివేస్తారు. చండీదేవి అనుగ్రహం వల్ల తన పాతివ్రత్యం రుజువు చేసుకుంటుంది ఖులనా.

మరోమారు ధనపతి వోడవ్యాపారానికి సింహళం బయలు దేరుతాడు. బయలు దేరేముందు ఖులనా చండీపూజ చెయ్యడం చూస్తా డతడు. తాను శివభక్తుడు. కనక

భార్య చేస్తున్న చండీపూజ చూసి మండిపడతాడు. దాంతో పూజాకుంభం తన్నేశాడు ధనపతి. అందువల్ల చండీదేవికి అతడిమీద ఆగ్రహం కలుగుతుంది.

ధనపతి సింహళం పయనమయాడు. ప్రయాణం సుఖంగానే జరిగింది. కాని, సింహళ సముద్రతీరంలో వొక వింత అవుపడిం దతడికి. ఒక యువతి పద్మం మీద వుంది. ఆమెని ఏనుగులు అభిషేకిస్తున్నాయి. చూసి పట్నంలోకి వెళ్ళాడతడు.

సింహళం రాజు ధనపతిని గౌరవించాడు. తాను సముద్రతీరంలో చూసిన వింత ధనపతి రాజుతో చెప్పాడు. రాజు నమ్మలేదు. తనకు చూపించమని పట్టుపట్టాడు. ధనపతి రాజుని సముద్రతీరానికి తీసుకవచ్చాడు. కాని, తాను చూసిన దృశ్యం కనపడలేదు. రాజు ఆగ్రహించాడు. అబద్ధమాడిన నేరానికి ధనపతిని కారాగృహంలో బంధించాడు.

ధనపతి సింహళం వెళ్ళిన సమయానికి ఖులనా గర్భవతిగా వుంది. యథా సమయంలో కుమారుణ్ణి కన్నదామె. అతడి పేరు శ్రీమంతుడు. శ్రీమంతుడు పెరిగి పెద్దవాడయాడు. తండ్రికోసం సింహళం బయలుదేరాడు. సింహళం సముద్రతీరంలో తన తండ్రికి కనపడిన వింతదృశ్యమే తనకు కూడా కనపడింది. తన తండ్రిలాగే తాను కూడా అది రాజుతో చెపుతాడు. కాని, వెనకటిలాగే అది అసత్యమని తేలుతుంది. రాజు అతడికి మరణశిక్ష విధిస్తాడు, చండీదేవి రాజుని భయపెడుతుంది. ధనపతినీ, శ్రీమంతుణ్ణీ విడుదల చేయిస్తుంది. రాజు తన కూతుర్ని శ్రీమంతుడి కిచ్చి పెళ్ళి చేస్తాడు, కొడుకుతోనూ, కోడలుతోనూ ఇంటికి తిరిగి వస్తాడు ధనపతి. భక్తుడై చండీదేవిని పూజిస్తాడతడు.

ఇదే కథ "ఖులనా సుందరి" అని ఒడిశాలో వ్రత కథగా ప్రచారంలో వుంది. 'నిశామంగళవార ఉసా' అని దీని మారుపేరు. ధీవర భికారి దీని రచయిత.

చండీమంగళ మానికదత్తు మొదట తెల్పినట్టు ముకుందరామ చక్రవర్తి వ్రాశాడు. చండీదేవి రాక్షసుల్ని జయించాక ఆమెకీర్తి కావ్యంగా ప్రజలలో ప్రచారం కావాలని వాంఛించిందట. నారదముని మానికదత్తు పేరు ఆమెకు సూచించాడు. అప్పుడామె వొకముసలమ్మ వేషంలో మానికదత్తు కలలోకనపడి, తన చరిత్ర కావ్యంగా వ్రాయమని ఆదేశించిందట. ఒక సంస్కృత గ్రంథం కూడా ఇచ్చిపోయిందట. శ్రీకాంత పండితుని సాయంతో ఆ సంస్కృత గ్రంథం చదివి, బాంగ్లాలో చండీమంగళ కావ్యం వ్రాశాడు మానికదత్తు. తాను శ్రీగాయకుడుగానూ, తన కుమాళ్ళిద్దరు వెనక పాటకులుగానూ, శ్రీకాంత పండితుడు మార్దంగికుడుగానూ ఏర్పడి కళింగదేశం వెళ్ళాడు దత్తు. కళింగ

దేశంలో చండీమంగళ గానం చేశాడు. కళింగం రాజు మానికదత్తుని నిర్బంధించాడు. రాత్రి చండీదేవి రాజు కలలో కనపడి దత్తును విడిచిపెట్టమని ఆదేశించింది. మర్నాడు కవిని విడుదల చేశాడు రాజు. తన ఆస్థానంలో ఆశ్రయమిచ్చి గౌరవించాడు.

అనుశ్రుతంగా వచ్చిన ఈ కథకు చారిత్ర కాధారాలు లేవు.

మాధవ కవి 1579 లో వొక చండీమంగళ వ్రాశాడు. అది అక్బరు చక్రవర్తి ఢిల్లీ సింహాసన మెక్కిన కాలం. అక్బరు అర్జునుని అవతారమని వ్రాశాడు మాధవ కవి హుగ్లీతీరం కవి జన్మస్థానం. తన కావ్యంలో మాధవకవి చండీదేవిని మంగళ చండి అని వర్ణించాడు.

ముకుందరామ చక్రవర్తి (1600)

చండీమంగళ కావ్య రచయితలలో సుప్రసిద్ధుడు చక్రవర్తి; కవికంకణ బిరుదాంకితుడు. వర్ధమాన జిల్లా దామున్య గ్రామం ఇతని జన్మస్థానం. తండ్రి హృదయ మిశ్రుడు.

ముకుందరామ చక్రవర్తి చండీమంగళ కావ్యానికి కవికంకణ చండి అని వాడుక పేరు. కవి తన చరిత్ర తన కావ్యంలోనే వివరించాడు ముందు.

శేర్ షా ఏలుబడి (1543-1548) లో ముకుందరామచక్రవర్తి తన పిత్రార్జితమైన భూములు విడిచి మేదినీపురం జిల్లాకు వలస పోవలసివచ్చింది. భార్యా, చిన్ని కుమారుడూ, తమ్ముడూ కలిసి స్వగ్రామం నుంచి కొంతదూరం వెళ్ళారో లేదో వారిని దొంగలు దోచుకున్నారు. సర్వస్వమూ పోయిన ఆ కవి కుటుంబాన్ని ఆనాటికి ధర్మాత్ముడొకడు ఆదుకున్నాడు. మూన్నాళ్ళు అక్కడ ఆగి సకుటుంబంగా ముందుకు సాగాడు చక్రవర్తి. దారిలో వొక చెరువు దగ్గిర ఇన్ని నీళ్ళు మాత్రం తాగి విశ్రమించాడు. ఇంతలో చండీదేవి అతని కలలో కనపడింది. తన చరిత్ర కావ్యంగా గానం చెయ్యమని ఆదేశించి, ఆశీర్వదించింది.

ముకుందరాము మేలుకుని నివ్వెరపోయాడు. అక్కడినుంచి మేదినీపురం వెళ్ళాడు. ఆందవార రాజు బాంకుడాదేవు నాశ్రయించాడు. బాంకుడాదేవు తన కుమారుడైన రఘునాథరాయికి విద్య గరపమని చక్రవర్తిని నియోగించాడు. అక్కడే వుండి రఘునాథరాయి ఏలుబడికి వచ్చాక (1573-1603) చండీమంగళ వ్రాశాడు ముకుందరామ కవి. ఈ రాజా స్థానంలోనే 'కవి కంకణ' బిరుదు లభించిం దతడికి.

1589 లో రాజా మానసింగు మేదినీపురం దారిని (ఒరిస్సా) ఒడిశా వచ్చాడు. అప్పుడు ముకుందరామ చక్రవర్తి తన చండీమంగళ అతనికి వినిపించాడు. మానసింగు మెచ్చుకుని కవికి బంగారం మురుగులూ, మధుపర్కమూ, తలపాగా, ఒక గుఱ్ఱమూ ఇచ్చి గౌరవించాడు.

చక్రవర్తి చండీమంగళలో శివాయన ఖండము, అక్షతి ఖండము, వణిక ఖండము అని మూడు ఖండాలున్నాయి.

ముకుందరామ కవికంకణుడు గొప్పకవి. పాటలో కథ నడపడమూ, సున్నితమైన హాస్యం కల్పించడమూ, పాత్రలు సజీవంగా చిత్రించడమూ అతనికి వుగ్గుపాలతోనే అలవడ్డాయి. పదహారో శతాబ్దం వంగదేశ జీవితం కన్నుల కట్టినట్టు చిత్రించాడతను. ఇతని చండీమంగళ ఈనాడు కూడా బాంగ్లా ప్రజలు ఆదరంతో గానం చేస్తున్నారు. దీని ననుసరించి ఎంతోమంది తరువాతి కవులు కావ్యాలు వ్రాశారు.

చక్రవర్తి చండీమంగళలో వొక లాలి పాట చూడండి :

"ఆరె బాచా ఆయ్ బాచా ఆయ్
కి లాగియా కాందె బాచా కి ధన చాయ్ ?
ఆనిబ తులియా గగన ఫుల,
ఏకెక ఫులెర లక్ష మూల.
సె ఫుల గాంథియా పరాబ హార,
సోనా బాచా మొర నా కాంద ఆర.
గగన మండలె పాతిబ ఫాంద,
బాంధి యా దిబ తొరె శరదచాంద,
కపాలె దివ తొరె సె చాంద ఫోట,
కాలి గరాయియా దిబ సోనార ఛాటా.
ఖావాయాబ క్షీరఖండ మాఖాచ చుయా,
కర్పూర పాకా పాన సరస గుయా.
రథ గజ ఘొడా జవుతిక దియా,

రాజార దుయి కన్యా కరాబ బియా.
శ్రీమంత చాపిబె సోనార నాయ్,
కస్తూరి కుంకుమ చందన గాయ్.
ఖాఇబె నిద్రా జాబె చామర బాయ్,
అంబికా మంగల ముకుంద గాయ్."
(రా బాబూ రా, రా కన్నా రా,
ఎందుకోసం ఏడుపునాన్నా, ఏం ధనం కావాలోయ్ ?
ఆకాసం నించి పువ్వులు తెస్తా
ఒక్కొక్కటీ లక్షలు చేస్తాయి.
అవి దండకూర్చి నీకు వేస్తానోయ్,
నా బంగారు తండ్రీ ఏడవకోయి.
గగన మండలానికి వల వేస్తాను
చంద్రుణ్ణి తెచ్చి నీలలాట మణి చేస్తాను.
రేపు బంగారం బంతి తెచ్చిస్తాను, నువ్వు ఆడుకుంటావు.
క్షీరఖండమూ వెన్నా నీకు తినడాని కిస్తాను.
కర్పూరమూ పండు తమలపాకులూ నమలడాని కిస్తాను.
రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ అరణమిచ్చి
ఇద్దరు రాజకన్యల్ని నీకు పెళ్ళి చేస్తాను.
నా శ్రీమంతుడు బంగారం పడవలో పయనం చేస్తాడు.
కస్తూరి కుంకుమ చందనం పూస్తాను.
మంచం మీద చామంవేస్తూ నిద్ర పుస్తాను.
అంబికా (చండి) మంగళ ముకుందుడు పాడతాడు.)

రామానంద యతి 1766 లో వొక చండీ మంగళ వ్రాశాడు. కవులకు చండీదేవి కనపడడం నిరసించా డితను.

"బుద్ధి నాయి జార ఘటె
తారా బలె సత్య బటె
పథె చండి దిలా దర్శన."
(బుద్ధిలేని వాళ్ళు మాత్రం దార్లో చండీదేవి దర్శనం సత్యమంటారు.)

రామానందుడి ఈ తిట్టు ముకుందరామ చక్రవర్తి నుద్దేశించే అని వేరే చెప్ప నక్కరలేదు.

చండీ మంగళకావ్యమే అనుసరించి 1710 లో రామేశ్వర భట్టాచార్యుడు 'శివ సంకీర్తన' అని వొక కావ్యం వ్రాశాడు. మేదినీపురం జిల్లా యదుపురం ఇతని నివాస స్థానం. తండ్రి లక్ష్మణభట్టాచార్యుడు. 'సత్యనారాయణ పాంచాలీ' ఇతని మొదటి రచన. 'శివ సంకీర్తన' రచనాకాలంలో ఇతను కర్ణగడ రాజు రామసింహుడి ఆస్థానకవిగా వుండేవాడు.

## మనసా మంగళ

మనసా మంగళకు పద్మాపురాణమని కూడా పేరు. మనసాదేవి శివుడి కూతురు. పద్మంలో పుట్టిం దామె. అంచేత ఆమెకి పద్మ అని కూడ పేరు. పద్మ కథ కనకనే మనసామంగళ పద్మా పురాణం. మనసాదేవిని పాములు తమ రాణిగా ఎన్నుకున్నాయి. తమ విషభండారం ఆమె అధీనంలో పెట్టాయి.

మనసా స్నానమాడుతూ వుండగా శివుడు చూశాడు. తన కూతురని తెలియక మోహించాడు. మనసా తన వృత్తాంతం వినిపించి, శివుడితో కైలాసంవెళ్ళింది. శివుడి రాణి చండి ఆమెని చూసింది; సవతి అని మచ్చరించింది; కయ్యమాడింది; కన్ను పొడిచి తరిమేసింది.

పాలసముద్రం తరిచినప్పుడు హాలాహలం మింగి పడిపోయాడు శివుడు. పాములరాణి మనసాదేవి విషభండారానికి అధినేత్రి కనక ఆమె వచ్చి అతణ్ణి బతికిస్తుంది. దాంతో దేవతలలో ఆమెకి స్థానం లభించింది.

మానవులు పూజిస్తేనే కాని దేవతల దేవత్వం నిలవదు. కనక మనసాదేవి మానవలోకంలో పూజింపబడాలన్న కోరికతో తన చెలికత్తె నేతాను వెంటపెట్టుకుని

భూమి మీదికి వచ్చింది. మొదట కొంతమంది గొల్లవాళ్ళకూ, తరవాత హుస్సేను, హొసేను ముస్లిము సోదరులకూ, అనంతరం జాలూ, మాలూ అనే బెస్తవాళ్ళకూ తమ మహిమ కనపరిచింది. వాళ్ళు మనసాదేవి పూజచేస్తారు భక్తిగా.

చాంద్ సాదాగర్ చంపానగరం వర్తక ప్రముఖుడు. అతడిభార్య సనకా. ఆమె జాలూ, మాలూల వల్ల విని మనసాదేవిని పూజించింది. చాందసాదాగరు శివభక్తుడు. తన భార్య ఈ కొత్త పూజచెయ్యడం సహించలేక పోయాడతడు. దాంతో మనసాదేవి కోపదృష్టి అతడి మీదపడింది. మనసాదేవి పాములు అతడి ఆరుగురు కుమాళ్ళని చంపేశాయి. అయినా అతడు మనసాదేవిని పూజించడు.

చాంద సాదాగరు కడసారి కొడుకు లఖింధరుడు. లఖింధరుడి భార్య బేహులా. లఖింధరుడు తన భార్యతో కలిసిన తొలిరాత్రి మనసాదేవి పాములు అతణ్ణి కరవకుండా వుండాలని చాంద సాదాగరుడు సందులేని ఇనపగది చేయిస్తాడు. అయితే గది నిర్మించిన శిల్పి సూదిమొనంత రంధ్రం వొదిలిపెట్టినట్టు చేస్తుంది మనసాదేవి.

మధు శయ్యనాటి రాత్రి ఆ రంధ్రంలోంచి ఇనపగదిలో పాము చొరబడుతుంది. లఖింధరుణ్ణి కాటువేస్తుంది. సంప్రదాయం ప్రకారం పాము కరిచిన లఖింధరుడి మృత దేహం కర్రపెట్టెలోపెట్టి నదిలో విడిచిపెట్టారు. భర్త మృతదేహంతో బేహులా కూడా పయనిస్తుంది. దారిలో మనసా చెలికత్తె నేతా చాకలిస్త్రీ వేషంలో ప్రత్యక్షమై బేహులాను దేవతల దగ్గిరికి తీసుకువెళుతుంది. బేహులా నాట్యంచేసి దేవతల్ని మెప్పిస్తుంది. వారిముందు తన దుఃఖగాథ మొరపెడుతుంది. తన మామ మనసాదేవిని పూజించినట్టు చేస్తానని మాట ఇస్తుంది.

బేహులా వాగ్దానంతో మనసాదేవి ప్రసన్నురాలవుతుంది. లఖింధరుణ్ణి బతికి స్తుంది. అతడి ఆరుగురు అన్నల్నికూడా బతికిస్తుంది. చనిపోయిన కుమాళ్ళు తిరిగి వచ్చాక చాందసాదాగరు బుద్ధిమారింది. మనసాదేవిని భక్తితో పూజిస్తా డతడు.

ఇదీ సంక్షిప్తంగా మనసా మంగళ కథ.

1495 లో విప్రదాసు మనసా విజయ వ్రాశాడు. అదే సమయంలో విజయగుప్త మనసా మంగళ వ్రాశాడు. పదహారో శతాబ్దంలో నారాయణదేవు మరొక మనసా మంగళ వ్రాశాడు. వీటికంటె ముందు కానా హరిదత్తు బేహులా లఖింధరుల కథ

వ్రాశాడు. వంశీదాస చక్రవర్తి, రాధానాథ చౌధురి, కేతకాదాసు (క్షేమానంద) విష్ణు పాలుడు మొదలైన కవులు సుమారు పాతికమందికి పైగా మనసా మంగళకావ్యాలు వ్రాశారు. వీరిలో కేతకాదాసు సుప్రసిద్ధుడు. ముకుందరామ చక్రవర్తివలె తన కావ్యంలో ఆత్మకథ చెప్పుకున్నా డితను. ఇతని నివాసం వర్ధమాన మండలం. తండ్రి శంకర మండలుడు.

హఠాత్తుగ వొకనాడు కేతకదాసుకి మనసాదేవి పాములతో ప్రత్యక్షమై మనసా మంగళ వ్రాయమని ఆదేశించింది.

ఒకనాడు కేతకదాసు తల్లి అతణ్ణీ అతని తమ్ముడు అభిరాముణ్ణీ దగ్గిర పొలాల నుంచి పశువుల కసవు తెమ్మని పంపింది. దారిలో కొందరు పిల్లలు చేపలు పడు తున్నారు. వారినుంచి చేపలు తీసుకుని అభిరాముడి చేత ఇంటికిపంపి, వొక్కడే పొలానికి వెళ్ళాడు దాసు. అప్పటికి పొద్దుగూకి పోతూవుంది. పొలంలో పిట్టమనిషిలేదు. హఠాత్తుగా తుఫానులా దుమ్మురేగింది. కేతకదాసు వచ్చెయ్యబోతుండగా ఎదట వొక ముచ్చి యువతి అవుపడిందట! ఆమె వొక బట్ట అతడికి అమ్మ చూపిందట. ఇంతలో కేతకదాసు కాలిలో చుర్రుమని నొప్పి పుట్టిందట. చీమ కరిచిందేమో అని వొంగి, లేచేసరికి ఎదట యువతి లేదట. నివ్వెర పోతూవుండగా మరొక భయంకర దృశ్యం కనపడిందట. పాములతో మనసాదేవి ప్రత్యక్షమయిందట. తన రూపం వ్యక్తపరచ వద్దని చెప్పి, మనసా మంగళ వ్రాయమని ఆదేశించి అంతర్ధానమైందట! ఆమె ఆదేశ ప్రకారం కవి గ్రంథరచన చేశాడట! తరవాత తరవాత కూడా ఎంతో మంది కవులు మనసా మంగళ వ్రాశారు.

## కృష్ణ మంగళ

భాగవత కథ ననుసరించి వైష్ణవ కవులు 'కృష్ణమంగళ గోవింద మంగళ' 'ముకుంద మంగళ', 'గోకుల మంగళ' 'రాధికా మంగళ' మొదలైన మంగళకావ్యాలు వ్రాశారు.

### మాధవాచార్య

భాగవత దశమస్కంధం అనుసరించి 'శ్రీకృష్ణ మంగళ' వ్రాశాడు మాధవా చార్యుడు. శ్రీకృష్ణమంగళ కావ్యాలలో ఇదే ప్రాచీనకావ్యం. చైతన్యస్వామి భార్య

విష్ణుప్రియాదేవి పినతండ్రి ఈ మాధవాచార్యుడు. నదియా నగరం ఇతని నివాసం. తండ్రి కాళిదాసు. తల్లి విధుముఖి. మాధవాచార్య సర్వశాస్త్రపండితుడు. తండ్రి ముందే కాలం చేశాడు. వయసు వచ్చాక తల్లి పెళ్ళి ప్రయత్నం చేసింది. కాని, మాధవుడు బృందావనం పారిపోయాడు, అక్కడ సన్యాసం పుచ్చుకున్నాడు. తల్లికాలం చేశాక తిరిగి వచ్చాడు. కొన్నాళ్ళుండి మళ్ళీ బృందావనం వెళ్ళిపోయాడు.

చైతన్యస్వామి సన్యాస దీక్షపూనక పూర్వమే 'శ్రీకష్ణమంగళ' వ్రాశాడు మాధవాచార్య. (1510 కి పూర్వం) కవి కలలో శ్రీకృష్ణుడు కనపడి గ్రంథరచనకు ఆదేశించాడట!

"స్వప్నె పాయిను ముయిఁ కృష్ణ ఉపదేశ"

(స్వప్నంలో నేను కృష్ణుడి ఆదేశం పొందాను.) అని కవి వ్రాసుకున్నాడు.

ఉదాహరణకి ఇతని రచన కొంచెం చూడండి: శ్రీకృష్ణుడి మురళీధ్వని విని గోపికలు —

"లజ్జా భయ పరిహారి యత గోపీగణః
యే యే కర్మె రతఛిల త్యాజిల తఖన.
కెహ కెహ త్యాజిలేక దేనుర దోహన,
కెహ గృహ పరిహారి దుగ్ధ ఆవర్తన.
కెహ కెహ త్యాజిలేక రంధన భోజన,
కెహ శయ్యా త్యాజి, కెహ పతిర సేవన.
కెహ పుత్రెస్తన్యపాన కరి పరిహారి,
భూషణ కరయె సచె దెఖితె శ్రీహరి.
లహ కెహ దెయ ఏక నయనె అంజన,
కెహ ఏక కుచె దెయి కుంకుమ చందన.
కెహ కెహ దెయ అధి సీమంతె సింధుర,
కెహ భ్రమె పదహార, కరెతె నూపుర.

హా స్తైర భూషణ కెహూ పరయె చరణె,
హాస్తెతె పర యె కెహూ పదెర భూషణె."

(లజ్జా భయాలు వొదిలిపెట్టి గోపికలందరూ తమతమ పనులు మానేశారు తక్షణం. కొందరు పాలు పిదకడం మానేశారు. కొందరు వంటాపెంటా మానేశారు. కొందరు తిండీతిప్పలు మానేశారు. కొందరు పక్కలు వొదిలిపెట్టారు. కొందరు పతి సేవ మానేశారు. కుమాళ్ళకి కొంతమంది పాలు కుడపడం మానేశారు. శ్రీహరిని చూడడానికి అంతమందీ ముస్తాబులయారు. కొంతమంది వొక్కకంటికే కాటుక పెట్టు కున్నారు. కొంతమంది వొక్క స్తనానికే కుంకుమ చందనం పూసుకున్నారు. కొంత మంది సీమంతంలో సగం సగం సిందూరం పెట్టుకున్నారు. భ్రమవశాత్తు కొందరు పాదాలకూ హారాలూ, చేతులకు నూపురాలూ తొడుగుకున్నారు. చేతి నగలు కాళ్ళకూ, కాళ్ళ నగలు చేతులకూ పెట్టుకున్నారు.)

మాధవాచార్య సంస్కృతంలో 'ప్రేమరత్నాకర' మని వొక గ్రంథం వ్రాశాడు.

కృష్ణదాసు

మాధవాచార్యుణ్ణి ఆదర్శంగా పెట్టుకుని 'శ్రీకృష్ణమంగళ' వ్రాశాడితను. ఇతని తండ్రి యాదవానంద. తల్లి పద్మావతి. గంగానది పశ్చిమతీరం కవి నివాసం. ఇతని కలలో కూడ స్వామి కనపడి శ్రీకృష్ణమంగళ వ్రాయమని ఆదేశించాడట !

భాగవత దశమ ఏకాదశ ద్వాదశ స్కంధాలలోని కృష్ణచరిత్ర శ్రీకృష్ణమంగళ వ్రాశాడు. ఇతని రచన సులభశైలిని మధురంగా సాగింది. కవి 'వ్రజబులి' లో కూడ కొన్ని పదాలు వ్రాశాడు. ఇతని వ్రజబులి 'బారమాసియాః' నుంచి చిన్న పద్యభాగం :

"శ్రాబణ బేల పరబేశ,
జరజర పాంజర శేష.
సఘనె బరిఖత మేహా,
కామె ఝూంపి ఉఠె దేహా.
ఖాదే ర నాగర ఖోర
అబ శూన్య మందిర మోర.

ఘనఘన బిజ్జుక మాలా,
కే సహే బిరహక జ్వాలా.
ఆశ్విన భేల పరదేశ,
అబహు రహుల దూరదేశ.
ప్రియాకో దరశన లాగి,
ఈ దిన జామినీ జాగి.
ఆయత కార్తిక మాస,
కేలికరిబ ఇహ రాస.
కహ తహు కిసోన దాస,
అబ తబ దూరె గెయ ఆశ."

(శ్రావణం వచ్చింది. మేఘం జరజర కురుస్తోంది. కామంతో దేహం కంపర మెత్తుతోంది. భాద్రపదం మేఘబంధురంగా వుంది. నా మందిరం శూన్యంగా వుంది. పదేపదే మెరుపులు మెరుస్తున్నాయి. ఎవరు భరిస్తారీ విరహజ్వాల! ఆశ్వయుజం వచ్చింది. ప్రియుడు దూరదేశంలో వున్నాడు. ప్రియుడి దర్శనంకోసం రేబవళ్ళు కని పెట్టుకుని వున్నాను. కార్తీక మాసం వచ్చింది. రాసకేళి జరుగుతుంది. కిసోనదాసు (కృష్ణదాసు) చెప్పుతున్నాడు. అన్ని ఆశలూ దూరమైపోయాయి.)

**అభిరామదాసు** (1700)

ఇతని శ్రీకృష్ణమంగళకు 'గోవింద విజయ' అని కూడా పేరు. కురుక్షేత్ర యుద్ధంతో ఇతని గ్రంథ మారంభమైంది. చండీదాస దానలీలా, నౌకాలీలా ఇతను తక్కిన కవులవలె శ్రీకృష్ణమంగళలో చేర్చలేదు. కాని 'వంశీచురి' కథ చేర్చాడు. జలకేళి సమయంలో శ్రీకృష్ణుని వంశి ఎవరో దొంగిలిస్తారట. ఎంత వెదికినా కృష్ణునికి అంతుచిక్కదు. అప్పుడు గోపికలందరినీ యమునలోనుంచి బయటికి రప్పిస్తాడు. యమునలోనే వంశి దొరుకుతుంది. ఇది వంశీచురి కథ.

పరశురామదాసు

భాగవత దశమ ఏకాదశ స్కంధాల ననుసరించి 'శ్రీకృష్ణమంగళ' వ్రాశాడు. కవి చైతన్య భక్తుడు.

## గోవింద మంగళ

### దుఃఖీ శ్యామదాసు (1700)

మేదినీపురం జిల్లా కేదారకుండ పరగణా హరిహరపుర గ్రామం ఇతని నివాసం. తండ్రి శ్రీముఖదే. తల్లి భవాని. 'గోవింద మంగళ' భాగవత దశమస్కంధం అనుసరించి వ్రాశాడు కవి. రచన సులభంగా మధురంగా సాగింది; చండీదాసు శ్రీకృష్ణ కీర్తనలోని దానలీల శ్యామదాసు కూడ తన గోవిందమంగళలో మనోజ్ఞంగా సంధించాడు. ఇందులో 'బడాయి' అవ్వ చిత్రం ప్రత్యేకంగా గమనించదగింది.

"ఫాకాచూలె రంగఫులె బెంధెఛె కబరీ,
సీథాయ సిందుర భాలె చందనేర ఫోఁటా,
శ్రవణె కుండల యేన దినమణి ఛటా.
ఏ వృద్ధ వయసె బుడీ నా ఛాడె కజ్జల
రసనా చాపనె నడె దశన సకల,
స్వర్ణసూత్రె నాసాపుటె గజమతి దులె,
స్తన దుయి గోటా తార దూలె నాభిమూలె.
అష్ట అంగె పరె బుడీ అష్ట అలంకార,
గోరవరన రూపె అస్థి చర్మసార,
ఏకపద చలె బుడీ చార పద బైసె,
హాంటు ధరి ఉఠె బుడీ ఘనఘన కాసె,
అష్టఅంగ బాంకా బుడీ పరె పీతాంబర.

(పండు జుత్తు సిగముడిచి రంగుపువ్వులు పెట్టుకుంది. పాపటలో సిందూరం పెట్టుకుంది. నుదుట గంధంబొట్టు పెట్టుకుంది. చెవుల కుండలాలు సూర్యుడివలె మెరుస్తున్నాయి. ఈ ముసిలివయసులో ముసిల్ది కాటుక మానలేదు. నాలికతగిలి పళ్ళన్నీ కదులుతున్నాయి. బంగారం సూత్రంతో ముక్కున గజమౌక్తికం వేలాడుతోంది. స్తనాలు రెండు బొడ్డుదగ్గిర వేలాడుతున్నాయి. అష్టాంగాల్లోనూ అష్టాలంకారాలు ముస్తాబయింది ముసిల్ది. అస్థిచర్మావశేషమైన తెల్లని రూపం అవ్వది. ఒక అడుగు నడిస్తే నాలు

గడుగులు కూచుంటుంది. ముడుకు పూతంపట్టి వేస్తుంది, మాటిమాటికి దగ్గుతుంది. అష్టాంగ వక్రమైన శరీరానికి పీతాంబరం చుట్టింది.)

## కవిచంద్ర శంకర చక్రవర్తి (1800)

భాగవత గ్రంథానికి భావానువాదం ఇతని 'గోవింద మంగళ' కావ్యం. విష్ణుపురం చేరువ పానుయా గ్రామం శంకర చక్రవర్తి నివాసం. తండ్రి మునిరామ చక్రవర్తి. 'భాగవతామృత', శ్రీకృష్ణమంగళ', 'రాధికామంగళ' మొదలైన కావ్యాలూ' విష్ణుపురం రాజు గోపాలసింహ (1712-1740) కోరినప్రకారం భారతం కొంత భాగమూ వ్రాశాడితను. ఇతనికి కూడా వ్యాసుడు కలలో కనపడి 'గోవింద మంగళ' వ్రాయమన్నాడట :

"ద్విజ కవిచంద్ర గాయ్ వ్యాసేర ఆదేశె,
స్వప్నే కృపాకైల జార బ్రాహ్మణేర వేశె."

(బ్రాహ్మణ వేషంలో వ్యాసుడు కలలో అనుగ్రహించాడు. అతని ఆదేశ ప్రకారం కవిచంద్రుడు కావ్యగానం చేశాడు.)

### రా ధి కా మం గ ళ

రాధాకృష్ణుల ప్రేమలీల 'రాధికామంగళ' కావ్యాలలో ప్రధాన కథావస్తువు. కృష్ణమంగళ వ్రాసినట్టే పలువురు వైష్ణవ కవులు 'రాధికా మంగళ' వ్రాశారు.

## ఉద్ధవానందదాసు (1800)

ఇతని అసలు పేరు కృష్ణకాంత మజుందారు, ముర్శిదాబాదు సైదా గ్రామం ఇతని నివాసం, రాధామోహన ఠాకూరు (1698-1768?) శిష్యుడు. 'నాయిక పరకీయ అయితేనే కాని ప్రేమ ఉదయించదు' అని తన 'రాధికా మంగళ' లో శ్రీకృష్ణుడిచేత అనిపిస్తాడు కవి.

"పరకీయా వినె ప్రేమ నా హయ ఉదయ,
సతత జాహారె దెఖి ఏకగ్రామ వాసె

రాగశాంతి హాయ తార అనురాగ కిసె :
దూరె థాకి యత రాగ, నికటె నా హాయ,
అపూర్వ హాయిలె ప్రేమ బహుత బడాయ.
జార ఘరె ధన థాకె, క్షుధా శాంతి తార,
నిర్ధనపురుషేర క్షుధా బాడయె అపార."

(పరకీయ వినా ప్రేమ ఉదయించదు. ఒకే వూళ్ళోవుండి ఎల్లప్పుడూ చూస్తూ వుంటే అనురాగం ఎక్కడుంటుంది. అంతరించక ! దూరంగావుంటే అనురాగం హెచ్చినట్లు దగ్గరవుంటే హెచ్చదు. అపూర్వమైతేనే ప్రేమ అధికంగా పెరుగుతుంది. ఇంట ధనముంటే ఆకలి వుండదు. దరిద్రుడికే ఆకలి అధికం)

## శంకర చక్రవర్తి

ఇతని పరిచయం గోవిందమంగళ కవులలో వివరించాను. ఇతని 'రాధికా మంగళ' లో రాధికా కలంకభంజనం కథావస్తువు. తనకు వ్యభిచారిణి అన్న కలంకం వచ్చిందని రాధాదేవి దుఃఖిస్తుంది. అది తొలిగించడం కోసం కృష్ణుడు మాయవేషం వేస్తాడు, ఎందునా మానని జబ్బు చేస్తుంది. కృష్ణుడికి ఎంతోమంది వైద్యులు ఎన్నో మందులిస్తారు. లాభం లేకపోతుంది. తుదకి వొక వైద్యుడు (కృష్ణుడే) వస్తాడు. సతి అయిన స్త్రీ వెయ్యి చిల్లులకడవలో నీరుతెస్తే నయమవుతుందంటాడు. వ్రేపల్లెలోని స్త్రీలందరూ ప్రయత్నిస్తారు. చిల్లుల కడవలో నీరెలా వస్తుంది ? చివరికి రాధ వెళుతుంది. వెయ్యి చిల్లుల కడవలో నీరుపట్టుకు వస్తుంది. అందరిలోనూ ఆమె సతి అని తేలుతుంది. ఆమె కలంకం మాసిపోతుంది, ఇదే కలంకభంజనం. చండీదాసు కలంకభంజనానికి ఇది అనుకరణ.

## కృష్ణరామదాసు

ఇతని చరిత్ర తెలియదు. దత్తవంశస్థు డితను. వైష్ణవకవుల సంప్రదాయం ప్రకారం 'దత్తు' కి బదులు 'దాసు' అని పేరు చివరపెట్టుకున్నాడు. 'రాధికామంగళ'లో దత్తు అని కూడ వ్రాసుకున్నాడు.

"కృష్ణరామ దత్తె చోలె రాధికా మంగళ,
శునిలె పాతక నాశె శరీర నిర్మల."

బృందావనదాసు

గురుశిష్యుల సంవాద రూపంగా 'రాధికామంగళ' వ్రాశాడితను.

"శిష్య కహె శునగురు కరి నివేదన,
వివరియా కహ హోరె రాధికా జనమ."

(శిష్యుడు అంటున్నాడు. 'గురుదేవా నా నివేదన విను రాధికా జన్మకథ వివరంగా వినిపించు')

కలలో రాధిక కవికి కనపడి 'రాధికామంగళ' వ్రాయమని ఆదేశించిందట ; రాధాకృష్ణుల పరకీయప్రేమ కవి చక్కగా చిత్రించగలిగాడు.

## అన్నదా మంగళ

'అన్నదా మంగళ' (1753) రచయిత గుణాకర భారత చంద్రరాయి (1712-1760). ఇతని పరిచయం ముందు తెలిపాను. 'అన్నదా మంగళ' (అన్నపూర్ణ మంగళ) లో మూడు భాగాలున్నాయి. మొదటి భాగంలో శివాయనం, దేవీమంగళ, రెండో భాగంలో కాలికా మంగళ, మూడోభాగంలో మానసింహ, ప్రతాపాదిత్య, భవానందుల కథలూ, కృష్ణచంద్ర వంశప్రశస్తి వర్ణించాడు కవి.

# వైష్ణవ సాహిత్యం

బాంగ్లా భాషలో ప్రథమ సార్థక కావ్యసృష్టి వైష్ణవ కవిత.*

బాంగ్లా దేశంలో వైష్ణవమతం నాలుగో శతాబ్దం నాటికే ప్రచారంలో వుండినట్టు శాసనాలు చెపుతున్నాయి. కృష్ణపూజ ఆరో శతాబ్దంలో ఆరంభమైనట్టు ప్రొ. బాగచీ తన బాంగ్లా దేశచరిత్రలో పేర్కొన్నాడు.‡ అయితే బౌద్ధమతం క్షీణించాకే వైష్ణవ మతం దేశంలో ప్రాబల్యానికి వచ్చింది. అది క్రమక్రమంగా అధికమై చైతన్యస్వామి అవతరించడంతో వెల్లువలై పొంగిపొర్లింది. బాంగ్లాలో. వైష్ణవ మతం అమృతం వర్షించినా దీని పుట్టుక మాత్రం దక్షిణాది. ఆళ్వారుస్వాములు దీని స్రష్టలు.

బాంగ్లా వైష్ణవ సాహిత్యమనగానే మొదట బడు చండీదాసు ప్రత్యక్షమవుతాడు. జయదేవుని గీతగోవింద ప్రభావం ఇతడి మీద వుండినా, బాంగ్లా వైష్ణవకవులలో మాత్రం ఇతడే మొదటి కవి; మహాకవి. ఇంచుమించు ఇతడి సమకాలికుడే అయిన మైథిలికవి విద్యాపతి 'వ్రజబులి' వైష్ణవ పదాలుకూడా బాంగ్లాదేశంలో ముఖరిత మైనాయి. చండీదాస విద్యాపతులతో ప్రారంభమైన వైష్ణవ కవిత చైతన్యస్వామి ఆవిర్భావంతో తుంగస్థాయి నందుకుంది. జ్ఞానదాసు, గోవిందదాసు, బలరామదాసు, నరోత్తమదాసు,రాజశేఖర కవివంటి ఉత్తమకవులు ఉత్తమ వైష్ణవసాహిత్యం సృష్టించారు. ఎందరో కవయిత్రులూ, ముస్లిము కవులూ కూడా వైష్ణవ కావ్యాలు వ్రాశారు. రాధా కృష్ణుల ప్రేమలీల వీరి ప్రధాన కావ్యవస్తువు.

వైష్ణవ కవుల పదాలను కీర్తన లంటారు. ఉత్సవాలలో ఈ కీర్తనలు వొక ప్రత్యేకమైన పద్ధతిలో గానం చేస్తారు. చైతన్యస్వామి ప్రభావంవల్ల వైష్ణవులలో తర తమ భేదాలు సమసిపోయాయి. హిందువు ముస్లిము, బ్రాహ్మడు, శూద్రుడు అన్న విభేదం అంతరించింది. వైష్ణవులకు బృందావనం యాత్రాస్థలమైంది. బాంగ్లాలో ఉత్పన్నమైన వైష్ణవ ప్రేమ సాహిత్యం మరో భారతీయభాషలో లేదేమో అనిపిస్తుంది.

---

* చూ. హుమాయును కబీరు "బాంలార్ కావ్య." పు. 17.

‡ History of Bengal.

చండీదాసు

తురకల దండయాత్ర తరవాత బాంగ్లాలో అవతరించిన మహాకవి (బడు) చండీదాసు. ఇతని కాలం గురించీ, ఉనికి గురించీ ఎన్నో వ్యతిరేకాభిప్రాయా లున్నాయి పండితులలో. అయినా కొందరు ఇతని కాలం క్రీ. శ. 1417-1477 అని నిశ్చయించారు. ఇతని నివాసం వీరభూమ జిల్లా నాన్నూరు గ్రామం అని కొందరూ, బాంకూరా జిల్లా చాట్నా అని కొందరూ వాదిస్తున్నారు.

చండీదాసు తండ్రి దుర్గాదాసు బాగచీ. చండీదాసు ప్రయోజకుడు కాకముందే అతని తల్లిదండ్రులు కాలం చేశారు. అనాథుడైన ఆ బ్రాహ్మణ యువకుణ్ణి గ్రామస్థులు తమ గ్రామదేవత వాసులీదేవి (విశాలాక్షి) మందిరంలో పూజారిగా నియమించారు.

వాసులీదేవి మందిరంలో వొక చాకలిపిల్ల పరిచారికగా వుండేది. ఆమెపేరు రామి. (అసలు పేరు రామమణి అని కొందరు, తారమణి అని కొందరు.) రామి అపురూపమైన అందకత్తె. తొలిచూపుల్లోనే చండీదాసును చకితుణ్ణి చేసింది రామి. క్రమంగా రామీ చండీదాసుల ప్రేమలత పెరిగి పారిజాత పుష్పాలు పూచింది; స్వర్గీయమైంది. రామి ప్రేమ చండీదాసును అమరకవిగా తీర్చి దిద్దింది; నిష్కామ సాధకుడుగా తయారు చేసింది. అందుకనే చండీదాసు ఇలా కంఠమెత్తి గానం చేశాడు:

"సున రజకినీ రామి,
ఓ దుటి చరణ శీతల జానియా
శరణ లయిను ఆమి.
తుమి వేదవాదినీ హరేర్ ఘరిణీ
తుమి సే నయన తారా,
తోమార్ భజనే త్రిసంధ్యా యజనే
తుమిసే గలార్ హారా.
రజకినీ రూపకిశోరి,
కామనాంధ నాహిఁ తాయ్
రజకినీ ప్రేమి నికషిత హేమ
బడు చండీదాస గాయ్."

చండీదాసు తన అరవయ్యో ఏట కీర్ణాహార గ్రామంలో కాలం చేశాడని జన ప్రవాదం. ప్రేయసి రామితో కలిసి అక్కడ వొక దేవాలయంలో గానం చేస్తూ వుండగా దేవాలయం విరిగిపడింది. రామీ చండీదాసులు వొక్కమారే ఈ లోకం విడిచి వెళ్ళిపోయారు.

చండీదాసు రాధాకృష్ణుల ప్రణయగాథ పదాలుగా వ్రాశాడు. ఇతని పదాలు పన్నెండు వందలకిపైగా ప్రచారంలో వున్నాయి. వసంతరంజనరాయి చండీదాసు పదాల సంపుటం పురాతన వ్రాతపతి సంపాదించి 1916 లో వంగీయ సాహిత్య పరిషత్తుద్వారా ప్రకటించాడు. ఆ సంపుటానికి "శ్రీకృష్ణ కీర్తన" అని ఆయనే పేరు పెట్టాడు. జన్మఖండ, తాంబూలఖండ, దానఖండ, నౌకాఖండ, భారఖండ, ఛత్రఖండ, బృందావనఖండ, యమునాఖండ, వస్త్రహరణఖండ, బాణఖండ, వంశీఖండ, కాయ దహనఖండ, విరహాఖండ — ఇలా ఖండాలతో విభాగమైవుంది 'కృష్ణ కీర్తన'. అపూర్వ సన్నివేశాలతో కూడిన రాధాకృష్ణుల ప్రణయగాథ ఇందలి కథావస్తువు. రాధా కృష్ణుల దూతికగా పనిచేసి ఉభయులకూ కత్తు కలుపుతుంది 'బడాయి' అవ్వ. రాధ తల్లి పదుమకు మేనత్త ఈ బడాయి. చండీదాసు సృష్టించిన ఈ అవ్వ బడాయి బాంగ్లా సాహిత్యంలో వొక సజీవపాత్రగా నిలిచిపోయింది.

"శేతచామర సమకేశె
కాశీసమ బాహు యుగలె
నాభిమూలే దుయి కుచలూలె."

(తెల్లచామరంలా జుత్తు, పుడకల్లాటి జేతులు, నాభిమూలాన కుచయుగళం వేలాడుతోంది.)

సంస్కృత ఛాయకి పోకుండా చక్కని చిక్కని బాంగ్లాపదాలతో పదరచన చేసిన లలిత కవి చండీదాసు. కృష్ణకీర్తనలోని ప్రతి పదమూ (కీర్తన) నాటకీయరీతిని పాడుతూ అభినయించడానికి అనువుగా వుంటుంది. అందుకనే చైతన్యస్వామి శ్రీకృష్ణ కీర్తనలోని దానఖండమూ, నౌకాఖండమూ అంకాలుగా విభజించి అభినయించాడని 'చైతన్య భాగవత' కారుడు వ్రాశాడు. చండీదాస పదాలన్నా, విద్యాపతి పదాలన్నా, జయదేవుడి అష్టపదులన్నా చెవికోసుకునే వాడు చైతన్యస్వామి.

"విద్యాపతి చండీదాస శ్రీగీతగోవింద
ఎయి తిని గీతె కరాయి ప్రభూర ఆనంద."

—చైతన్య చరితామృత.

బాంగ్లా సాహిత్యంలో 'శ్రీకృష్ణకీర్తన' మహాకావ్యం. 'బడు' చండీదాసు మహాకవి. అతని రెండు పదాలు చూడండి :

కాంచన వరణీ కే బటె నే ధనీ
ధీరె ధీరె చలి జాయ్,
హాసిర ఠమకె చపల చమకె
నీలశాఢీ శోభెగాయ్.
దెఖిత బదన మోహిత మదన
నాసాతె దులి ఛె దుల్,
సువిశాల ఆంఖి మానస భాబియా
ఛుటి ఛె మరాల కూల్.
ఆంఖి తారా దుటి బిరలె బసియా
సృజన కరెఛె విధి,
నీలపద్మభాబి లుబధభ్రమరా
ఛుటి తెఛె నిరవధి.
కిబా దంతభాతి ముకుతారపాంతి
జినియా కుందక కుండి,
సింధాయ సిందూర జినియ అరుణ
కాణె కర్ణవాలా ఛేఁడి.
శ్రీఫలయుగల జినికుచయుగ
పాతలా కాంచలి తాహె,
తాహార ఉపర మణిమయహార
ఉపమా కహిబ కాహె ?

కేశరి జిణి కృశ మాజాఖాని ముతె
కరిజాయధరా,
గజకుంభజిని నితంబవలని
ఊరు కరికర పారా.

చరణ యుగల జినియా కమల
అలతా రంజిత తాయ్,
మఝుమన తాహే కాహే నా భులబ
మదన మూర్ఛాపాయ్.
కాహార నందినీ కాహార రమణీ
గోకులె ఎమన కే ?
కోన పుణ్యఫలె బలబలసఖా ! సె
రామాపాయిలసే ?

చండీదాస బలె భెబనా భెబనా
ఓహే శ్యామ గుణమణి,
తుయి సె తాహార సరబస ధన
తో మారి ఆభె సే ధనీ.

(మెల్లిమెల్లిగా వెళిపోతూవుంది, ఎవరీకాంచన వర్ణి ? నీలిచీర కట్టుకుంది, నవ్వులో మెరుపులు మెరుస్తున్నాయి ! ఈమె మోహంచూస్తే మన్మథుడైనా మోహిస్తాడు కదా ! ముక్కున ముత్యం కదులుతోంది. సువిశాలమైన నేత్రాలు మానస సరోవరమనుకుని రాజహంసలు పరిగెడుతున్నాయి. నిశ్చలంగా కూచుని ఈమె కనుపాపలు సృజించి వుంటాడు విధి. దంతపంక్తి ముత్యాలనూ, మల్లి మొగ్గలనూ నిరసిస్తోంది. పాపిటలో సిందూరం అరుణరేఖని పరిహసిస్తోంది. సన్నని రవికలో కుచయుగళం శ్రీఫలాలని కాదంటున్నాయి. వాటిమీద మణిహారం దేంతో పోల్చనూ ? సింహాన్ని గెల్చినట్టుంది నడుము పిడికిల్లో ఇమిడిపోతూ. పిరుదులు గజకుంభాల్లాగా, తొడలు ఏనుగు తొండంలాగా వున్నాయి. పారాణితో పాదాలు పద్మాల్ని జయిస్తున్నాయి. నా సంగతేమిటి మన్మథుడైనా మూర్ఛపోతాడు ! ఎవరి

కూతురీమె ? ఎవరి భార్య ? గోకులంలో ఇలాటి ఆడది ఎవతెవుంది ? చెప్పు, చెప్పు, సఖుదా? ఏ పుణ్యబలంతో ఈమెని పొందాడు ఈమె ప్రియుడు ?

ఓయి శ్యామసుందరా : మరోలా భావించకు, భావించకు. చండీదాసు చెపుతున్నాడు, నువ్వే ఆమె సర్వస్వ ధనం. ఆమె నీ ప్రియతమ,)

"బంధు యిది గెల బనె సున ఒగో సఖి,
బూడా బెంధె జాబ చల దెఖ కమల ఆంఖి,
విపినె ఘటిబ జెయె శ్యామ జలధరె.
రాఖాలేర్ వేషె జాబ హరిష అంతరె.
చూడాటి బాంధహ శిరె యత సఖీగణ,
పీత ధడా పరసబె ఆనందిత మన.
చండీదాస బలె సున రాధా వినోదినీ,
నయినె దెఖిబ సెయి శ్యామ గుణమణి."

(సఖులారా : ప్రియుడు అడివికి వెళ్ళాడా ? అయితే సిగముడి వేసుకుని (స్మరసమరోచిత విరచిత వేషం) ఆ జలధర శ్యామమూర్తిని అక్కడే కలుస్తాను పదండి. ఆలకాపర్ల వేషంతో వెళదాం. మీరంతా సిగముళ్ళు వేసుకుని, పసుపంచు బట్టలు కట్టండి.

చండీదాసు చెపుతున్నాడు. ఓ రాధావినోదినీ : విను అడివిలో కళ్ళారా గుణమణి శ్యామసుందరుణ్ణి చూస్తావు.)

చండీదాస పదాలు కొన్ని సంపుటంగా ఫ్రెంచిభాషలో Amours de Radha et Krishna అని అనువాదమయినాయి.

దీనచండీదాసు, ద్విజచండీదాసు అని మరిద్దరు చండీదాసు లున్నారు. వీరున్నూ రాధాకృష్ణ ప్రణయగాథ పదాలలో వ్రాశారు.

## విద్యాపతి (1400-1506 ?)

నిన్న మొన్నటిదాకా విద్యాపతి బాంగ్లా కవిగా గణింపబడేవాడు, కాని, ఇప్పుడతడు మైథిలికవి యని రూఢిపడింది. చండీదాసు వలెనే విద్యాపతి గొప్ప వైష్ణవ పదాలు వ్రాశాడు. మిథిలలో కంటే అవి బాంగ్లాలోనే ఎక్కువ ప్రచారంలో వున్నాయి.

మిథిలరాజు శివసింహుడి ఆస్థానకవి విద్యాపతి. దర్భంగా జిల్లా విసపీ గ్రామం ఇతని జన్మస్థానం. సంస్కృతంలో కూడ మంచి పండితు డితను. సంస్కృతంలో ఎన్నో గ్రంథాలుకూడా వ్రాశాడు. పదావళి వ్రజబులి భాషలో వ్రాశాడితను. బాంగ్లా, మైథిలీ; అస్సామియా, ఒడియా భాషలు కలగాపులగం చేసిన భాష 'వ్రజబులి'. బాంగ్లా తెలిసిన వారికి ఇది అల్ప పరిశ్రమతో అర్థమవుతుంది.

ఉదాహరణకి వొక పదం :

"ఫుటిల కుసుమ సకలవన అంత.
మిలన సబసఖి సమయ వసంత.
కోకిల కుల కలరవ విథార,
పియా పరదేశ హమ సహయె నపార.
అబ యది జాఈ సంవాదహ కాన,
అపుబ ఐసె హమర మనమాన.
ఇహ సుఖ సమయసే హో మఝునాహ,
కాసంచె విలసవ కే కహ తాహ.
తుహ యది ఇహ సుఖ కహ తసు థామ,
విద్యాపతి కహ పూరబ కామ."

చండీదాస విద్యాపతులను పరామర్శించి రవీంద్రనాథ ఠాకూరు ఇలా వ్రాశాడు.

"విద్యాపతి కవితలో ప్రేమభంగి వుంది, ప్రేమ నృత్యముంది, ప్రేమచాంచల్య ముంది. చండీదాసు కవితలో ప్రేమతీవ్రత వుంది, ప్రేమ ఆలోకముంది."

## దీనచండీదాసు

చండీదాసు వలెనే ఇతడున్నూ ఎన్నో వైష్ణవపదాలు వ్రాశాడు. ఇతని గ్రంథానికి 'కపాలీ మిలన' అని పేరు. కపాలీ (ఎరుకలసాని) వేషంలో శ్రీకృష్ణుడు రాధతో కలియడం ఇందలి కథావృత్తం. 'నాపితానీ మిలన' (నాపితానీ = మంగలిస్త్రీ) అనికూడ ఇతని పదాలు కొన్ని వున్నాయి. శ్రీకృష్ణుడు నాపితానీ వేషంలో వెళ్ళి రాధిక పాదాలకు పారాణి పూస్తాడు. దాని ప్రతిఫలం మజూరీ రాధిక కౌగిలి కోరతాడు.

దీనచండీదాసు పదావళి మొత్తానికి 'స్వయం దౌత్య' అని కూడ పేరు. ఇతను చైతన్యస్వామి తరవాత కాలంలో ఉండిన కవి అన్నాడు మణీంద్రమోహనదాసు.

## చైతన్యస్వామి (1486-1533)

చైతన్యస్వామి ఉద్యమం వైష్ణవమతానికి వొక కొత్త వెలుగు ప్రసాదించింది. ఆయన 1486 లో నవద్వీపంలో జన్మించాడు. వైష్ణవ భక్తులలో ఆయన ప్రవేశపెట్టిన నామసంకీర్తన అనతికాలంలోనే నవద్వీపంలో అతని ఖ్యాతి విస్తరింపచేసింది. ఆయన శిష్యులూ, ప్రశిష్యులూ ఆయన అవతార పురుషుడే అని ఆరాధించారు. ఒక్క బాంగ్లా దేశంలోనే కాక భారత దేశం పలుమూలల వైష్ణవమతం విస్తరింపచేశాడాయన. జాతిమత భేద కుసంస్కారాలు నాశనం చేశాడు. మహమ్మదీయులు కూడా ఆయన ప్రియభక్తులయారు. హిందువులను ప్రేమించినట్లే మహమ్మదీయ వైష్ణవ భక్తులను ప్రేమించాడాయన.

చైతన్యస్వామి బాంగ్లాలో కావ్యరచన చెయ్యలేదు. కాని అనేక బాంగ్లా గ్రంథాలకు, ఆయన కాలంనాటి, అనంతరం నాటి వైష్ణవ సాహిత్యానికి మూలకారణమయ్యాడు. సంస్కృతంలో ఆయన వ్రాసిన 'శిక్షాష్టకము', 'జగన్నాథస్తోత్రము' తప్ప ఆయన రచనలు లేనేలేవు.

చైతన్యస్వామి దేశంలో కలిగించిన నూతన చైతన్యం వల్ల ప్రభావితులై ఎంతోమంది కవులు గ్రంథరచన చేశారు. ఈకాలంలో ముఖ్యంగా అతని జీవితచరిత్రలు బాంగ్లా సాహిత్యచరిత్రలో వొక నూతనాధ్యాయం సృష్టించాయి. స్వామి జీవితకాలంలోనే అతని జీవిత చరిత్రలకు శ్రీకారం జరిగింది. సంస్కృతంలోనూ, బాంగ్లాలోను కూడా చైతన్యస్వామి జీవితచరిత్రలు వెలిశాయి.

## మురారి గుప్త

చైతన్యస్వామి జీవిత రచయితలలో తొలి రచయిత మురారి గుప్త. చైతన్య స్వామి సహపాఠి ఇతను. శ్రీహట్టగ్రామం ఇతని జన్మస్థానం. తండ్రి అచ్యుతానంద. 'చైతన్యచరిత' (1475) సంస్కృతంలో 'కడచా' (సంక్షిప్త వివరణ) వ్రాశాడు. బాంగ్లాలో కొన్ని గేయాలూ వ్రాశాడు.

## రఘునాథదాస గోస్వామి (1425-1505)

సంస్కృతంలో స్వామి జీవితం పద్యకావ్యంగా వ్రాశాడితను. హుగ్లీజిల్లా కృష్ణపురం ఇతని జన్మస్థానం. తండ్రి గోవర్ధనుడు. పన్నెండు లక్షల ఆదాయం జమీందారు రఘునాథదాసు. అయినా అది విడిచిపెట్టి, మతం పుచ్చుకుని, చివరిదినాల్లో చైతన్యస్వామి దగ్గర పూరీలో గడిపాడీయన. 'స్తనావలీ', 'విలాస కుసుమాంజలి', 'దానకేళీ చింతామణి' 'ముక్తాచరిత' మొదలైనవి ఇతని ఇతర గ్రంథాలు.

## కవికర్ణపూర, పరమానందసేను (1524)

కాంచనపడా ఇతని నివాసం. తండ్రి శివానందసేను. గోపికల కర్ణభూషణాలు చక్కగా వర్ణించడంచేత చైతన్యస్వామి ఇతనికి 'కర్ణపూర' బిరుదిచ్చాడు. 1542 లో 'చైతన్య చరితామృత' వ్రాశాడితను. 1538 లో 'చైతన్యచంద్రోదయ' నాటకమూ, 1545 లో చైతన్యస్వామి అనుచరుల జాబితా గౌరాంగగణోద్దేశ దీపిక వ్రాశాడు. అలంకార కౌస్తుభ', 'ఆర్యాశతక', 'ఆనంద బృందావన' మొదలైనవి ఇతని ఇతర గ్రంథాలు. ఇవికాక ఎన్నో పదాలుకూడా వ్రాసిన పదకర్త ఇతను.

పైన తెలిపిన స్వామి జీవిత చరిత్రలు సంస్కృత గ్రంథాలు. బాంగ్లాలో స్వామి జీవిత చరిత్రలు వ్రాసిన కవులలో మొదటి కవి బృందావనదాసు ఠాకూరు.

## బృందావనదాసు (1507-1609)

ఇతని గ్రంథానికి 'చైతన్య భాగవతమ'నీ, 'చైతన్య మంగళమ'నీ పేరు. ఆదిఖండమూ, మధ్యఖండమూ, అంత్యఖండమూ అని మూడు ఖండాలూ, ఏభై రెండు అధ్యాయాలూ కలిగిన మహాకావ్యం చైతన్యభాగవతం. గ్రంథమంతా ఇంచుమించు పయార్ * ఛందస్సులోనే సాగింది. చైతన్యస్వామి జీవితకాలంలోనే గ్రంథరచన

* పద్నాలు గక్షరాల ఛందస్సు.

ఆరంభించాడు రచయిత. స్వామి స్వర్గస్థుడైన కొద్దికాలంలోనే 1540 ప్రాంతంలో ముగించాడు.

బృందావనదాసు నతిగ్రామంలో జన్మించాడు. వర్ధమాన జిల్లా ధేనుడ గ్రామంలో నివసించాడు. తండ్రి వైకుంఠనాథుడు. తల్లి నారాయణి. 'నిత్యానంద వంశవిస్తార', 'చైతన్యలీలామృత', 'భక్తిచింతామణి', భజన మొదలైనవి ఇతని ఇతర గ్రంథాలు. ఇతడున్నా పదకర్త. ఎన్నో పదాలు వ్రాశాడు. పదాల సంకలన గ్రంథం 'పదకల్ప తరువు' లో ఇతనివి ముప్పయి పదాలున్నాయి.

## కృష్ణదాస కవిరాజు (1496-1583)

'చైతన్య చరితామృతం' వ్రాసిన కవి ఇతను. వర్ధమాన జిల్లా ఝామటపురం ఇతని జన్మస్థానం. తండ్రి భాగీరథుడు. తల్లి సునంద. 'చైతన్య చరితామృత' 1575-1595 లో వ్రాశాడు కృష్ణదాసు. ఆదిలీల, మధ్యలీల, అంత్యలీల అని ఈ గ్రంథంలో మూడు ఖండాలున్నాయి. గ్రంథమంతా త్రిపదీ, పయార ఛందస్సులలో సాగింది. భాషలో ప్రాచీన బాంగ్లాతోపాటు హిందీకూడా కనపడుతుంది. సంస్కృతంలో 'గోవింద లీలామృతం' కూడా వ్రాశాడు కృష్ణదాసు.

## త్రిలోచనదాసు (1523-1589)

మురారిగుప్త సంస్కృతంలో వ్రాసిన 'కడచా' ననుసరించి బాంగ్లాలో 'చైతన్య మంగళ' 1537 లో వ్రాశాడితను. సూత్రఖండమూ, ఆదిఖండమూ, మధ్య ఖండమూ, శేషఖండమూ అని నాలుగు ఖండాలున్నాయి. ఇందులో. వర్ధమాన జిల్లా ఇతని జన్మస్థానం. తండ్రి కమలాకర ఠాకూరు.

బాంగ్లాలో మాత్రాఛందస్సు ప్రవేశపెట్టిన కవి లోచనదాసు. సిద్ధహస్తుడైన పదకర్త. చక్కని వాడుక పదాలూ, పల్లెవరుసలూ ఉపయోగించి ఎన్నో పదాలు వ్రాశాడు. ఇతని గురువు నరహరి మంచి పదకర్త. గురువు ప్రోత్సాహంతోనే చైతన్యమంగళ వ్రాశాడు లోచనదాసు.

## చూడామణిదాసు

'గౌరాంగవిజయ' (1560) వ్రాసిన కవి ఇతను. ఇందులో కవి చైతన్య, నిత్యానందుల చరిత్ర చిత్రించాడు.

జయానంద (1512–?)

వర్ధమానజిల్లా ఆమాయీపురం ఇతని జన్మస్థానం. తండ్రి సుబుద్ధిమిశ్ర. 1550 ? లో 'చైతన్య మంగళ' వ్రాశాడితను. స్వామి జీవితచరిత్ర లన్నిటిలోనూ జయాచైతన్య మంగళలోనే స్వామి నిర్యాణం వర్ణింపబడింది. పౌరాణిక గాథలు కూడా జయానంద తన గ్రంథంలో చేర్చాడు.

ప్రేమానంద

ఇతని అసలు పేరు పురుషోత్తమ మిశ్ర, నవద్వీపం పులియా గ్రామం ఇతని జన్మస్థానం. తండ్రి గంగాదాస మిశ్ర. తన పదహారో ఏట సన్యాసం పుచ్చుకున్నాడితను. సంస్కృతంలో పరమానందసేను వ్రాసిన చైతన్య చంద్రోదయ నాటక మను సరించి బాంగ్లాలో 'చైతన్య చంద్రోదయ కౌముది' పద్యకావ్యం వ్రాశాడు (1712). 'వంశీశిక్ష' (1716) అని మరొక కావ్యంకూడా వ్రాశాడితను. ఇవికాక ఎన్నో పదాలు కూడా వ్రాశాడు.

ఈ కాలంలోనే మరికొన్ని గ్రంథాలు కూడా వచ్చాయి. వాటిలో భగీరథబంధు 'చైతన్యసంహితా', ఈశ్వరసాగరుడి 'అద్వైతప్రకాశ' (1564), నిత్యానందుడి 'ప్రేమ విలాస' (1600), యదునందనదాసు 'కర్ణానంద' (1607), రాజవల్లభ భట్టు 'మురళీవిలాస' (1700), గోపీజన వల్లభదాసు 'రసికమంగళ' (1652), మనోహరదాసు 'అనురాగవల్లి' (1697) మొదలైనవి ముఖ్యగ్రంథాలు.

చైతన్యస్వామి ఉద్యమ ప్రభావం వల్ల సుమారు రెండు వందల మందికి పైగా వైష్ణవ పదకర్తలు అవతరించారు బాంగ్లాలో. వారిలో వసుదేవఘోషు, జ్ఞానదాసు, గోవిందదాసు, బలరామదాసు, నరోత్తమదాసు, రాజశేఖరకవి, కవిరంజన విద్యాపతి మొదలైనవారు ప్రసిద్ధులు. వీరిలో పలువురు బాంగ్లాలోనూ, వ్రజబులిలోనూ పదాలు వ్రాశారు.

వసుదేవ ఘోషు :

చైతన్యస్వామి సమకాలికు డితను. తమలూకు ఇతని నివాసస్థానం. ఎన్నో మధురమైన పదాలూ, 'గౌరాంగచరిత', 'నిమాయి సన్యాసి' అని రెండు గ్రంథాలు వ్రాశాడు.

## జ్ఞానదాసు (1530-?)

వర్ధమానజిల్లా కుందడా గ్రామం ఇతని నివాసం. 'మాథుర', 'మురళీ శిక్ష', ఎన్నో పదాలు వ్రాశా డితను.

## గోవిందదాసు (1532-1612)

శ్రీఖండం ఇతని జన్మస్థానం. తండ్రి చిరంజీవి. తల్లి సునంద. సునంద తండ్రి యశోరాజఖాను, హుసేనుషా దర్బారులో ఉద్యోగి. తండ్రి కాలంచేశాక గోవిందదాసు ముర్షిదాబాదు వచ్చేశాడు. మంచి బాంగ్లా వైష్ణవ పదాలతోపాటు సంస్కృతంలో 'సంగీత మాధవ నాటకం' 'కర్ణామృత' కావ్యం వ్రాశాడితను. ఇతని కవిత్వం మెచ్చుకొని జీవగోపాలస్వామి 'కవిరాజు' అని బిరుదిచ్చాడు.

గోవిందదాసు అన్న రామచంద్రదాసు వ్రజబులిలో మంచి కవి.

## బలరామదాసు (1537-?)

ఇతని అసలుపేరు నిత్యానందదాసు. వర్ధమానజిల్లా దోగాఛియా ఇతని నివాసం. తండ్రి ఆత్మారామదాసు. 'ప్రేమవిలాస', 'రసకల్పసార', 'గౌరాంగాష్టక', 'కృష్ణ లీలామృత', 'వీరచంద్రచరిత', 'హాటవందనా' మొదలైన గ్రంథాలూ, పదాలు వ్రాశాడు బలరామదాసు. బాలగోపాలుడి మీద యశోదమ్మ వాత్సల్యం చిత్రించడంలో ఇతడికితడే సాటి అనిపించుకున్నా డితను.

## నరోత్తమదాసు ఠాకూరు (1540-1607 ?)

రాజసాహి జిల్లా ఖేతరీ గ్రామంలో ధనవంతు లింట జన్మించా డితను; తండ్రి కృష్ణానందుడు. తల్లి నారాయణి. వైరాగ్యం కలిగి పదహారో ఏట బృందావనం వెళ్ళి పోయాడు నరోత్తముడు. అక్కడ అద్వైతాచార్యుల శిష్యుడయాడు. జీవగోస్వామి ఇతనికి 'ఠాకూరు మహాశయి' బిరుదిచ్చాడు.

ఒకమారు తన గ్రంథాలిచ్చి నరోత్తమదాసును బాంగ్లాదేశంలో ప్రచారంకోసం పంపాడు జీవగోస్వామి. వెంట శ్రీనివాసాచార్య, శ్యామానంద దాసులను కూడా పంపాడు. కాని, విష్ణుపురం రాజు వీర హంవీరుడు దొంగలను పంపి దారిలో వారి గ్రంథాలు అపహరించాడు. నరోత్తముడు స్వగ్రామం వెళ్ళి కొంత కాలమున్నాడు.

తరవాత నవద్వీపం వెళ్ళి చైతన్యస్వామి భార్యను విష్ణుప్రియాదేవిని దర్శించాడు. పూరి వెళ్ళి వైష్ణవ గురువయాడు.

'ప్రేమభక్తి చంద్రిక' 'హాటపత్తన', 'ప్రార్థన', 'స్మరణమంగళ', 'కుంజ వర్ణన' మొదలైన గ్రంథాలు వ్రాశాడు నరోత్తమదాసు. 'ప్రేమచంద్రిక' వైష్ణవ సాహిత్యంలో సుప్రసిద్ధ గ్రంథం. పదాలలో కొత్త శైలి స్థాపించాడు దాసు.

వీర హంవీరుడు కొంతకాలం తరవాత మారి శ్రీనివాసాచార్యుల శిష్యుడయాడు. ఆనాటినుండి విష్ణుపుర సంస్థానం వైష్ణవమతానికి ఆటపట్టయింది. ఆస్థానంలో వైష్ణవ కవులకు ఆశ్రయం దొరికింది. ఆ కవులు 'కవిచంద్ర' బిరుదు వహించారు. రామాయణ మహాభారతాలు బాంగ్లాలో వ్రాశారు. గోపాలసింహుడు (1712–48) ఏలికగా వుండి నప్పుడు విష్ణుపుర రాజ్యం వైష్ణవ రాజ్యమే అయింది. అతని ఆస్థానకవులలో వొకడు 'కృష్ణమంగళ' వ్రాశాడు. విష్ణుపురాస్థాన కవులలో కవిచంద్ర శంకరచక్రవర్తి సుప్రసిద్ధుడు. వీర హంవీరుడు కూడా మంచి వైష్ణవ పదాలు వ్రాశాడు.

పైన తెలిపిన కవులే కాక శ్రీకృష్ణమంగళ కర్త రఘునాథ పండితుడూ, భాగవతాచార్య పరమానందగుప్త, మాధవాచార్య, కవిశేఖర కృష్ణదాసు, ఛోటావిద్యాపతి, గోవిందమంగళ కర్త 'దుఃఖి' శ్యామదాసు మొదలైనదారున్నూ సుప్రసిద్ధులు.

ఈ కాలం బాంగ్లా కవులలో నూటికి తొంబై తొమ్మండుగురు చైతన్య మత మవలంబించిన వారే. చాలమంది ఆయన శిష్యులు; ప్రశిష్యులు. ఇందువల్ల ఈ కాలపు సాహిత్యం చైతన్య సాహిత్యం అనవచ్చు.

చైతన్యస్వామి ప్రభావంవల్ల బాంగ్లాలో ఎంతోమంది ముస్లిము వైష్ణవ కవులు ఆవిర్భవించారు; చక్కని వైష్ణవ పదాలు వ్రాశారు. వారిలో సయ్యదు మార్తుజా, నాసిర్ మామూదు మొదలైనవారు ప్రసిద్ధులు. చైతన్యప్రభావం వల్ల వొక్క బాంగ్లాలోనే కాదు. బాంగ్లా ఉత్తర పశ్చిమ దేశాల్లో కూడా ఎంతోమంది ముస్లిము వైష్ణవ కవులు పుట్టారు. వారిలో సాలబేగు, అకబరు, గరిబుఖాఁ, అబ్దుర్ రహీము, మొదలైనవారు ముఖ్యులు.

బాంగ్లా వైష్ణవ సాహిత్యంలో ఆ యుగం నిజంగా స్వర్ణయుగం. వైష్ణవ పదాలలో ఆనాడు బాంగ్లా పల్లెలూ, పట్టణాలూ ముఖరితమైనాయి. ఈ పదాలు 17 శతాబ్దం

లోనే సంకలన గ్రంథాలుగా తయారయాయి. రామగోపాలదాసు సంకలనం చేసిన 'శ్రీరాధాకృష్ణ కల్పవల్లి' పీతాంబరదాసు సంకలనం 'రసమంజరి' విశ్వనాథ చక్రవర్తి సంకలనం చేసిన 'క్షణదా గీత చింతామణి' రాధామోహన ఠాకూరు సంకలనం చేసిన 'పదామృత సింధు', వైష్ణవదాసు సంకలనంచేసిన 'పదకల్పతరు' ప్రసిద్ధమైనవి. 'పదకల్పతరు' లో మూడువేల నూటా వొక్క పదాలున్నాయి.

పద్దెనిమిదో శతాబ్దంలో వైష్ణవభక్తుల చరిత్రలు కొన్ని వెలువడ్డాయి. వాటిలో నరహరి చక్రవర్తి 'భక్తిరత్నాకరమూ' లాలదాస బాబాజీ అనువదించిన భక్తమాలా చెప్పదగినవి.

## నరహరి చక్రవర్తి

ప్రసిద్ధ వైష్ణవకవి ఇతను. తండ్రి జగన్నాథ చక్రవర్తి. 'భక్తి రత్నాకర', 'గీత చంద్రోదయ' 'ఛందస్సముద్ర', 'ప్రక్రియాపద్ధతి , నరోత్తమవిలాస' మొదలైన గ్రంథాలూ, ఎన్నో పదాలూ వ్రాశాడు చక్రవర్తి.

ఇతని 'భక్తిరత్నాకర' లో గోపాలభట్ట, నరోత్తమదాస, లోకనాథ, శ్యామా నంద, సంతోషదత్త, సనాతన, రూపగోస్వామి, జీవగోస్వామి, శ్రీనివాసాచార్య, వీరహంవీర, నరహరి, గంగాదాస, మురారిగుప్త, జయగోపాలదాస,జ్ఞానదాస, రామ చంద్రకవిరాజ, హరిరామ, రామకృష్ణాచార్య, గంగానారాయణ చక్రవర్తి మొదలైన వైష్ణభక్తుల చరిత్రలున్నాయి.

**లాలదాస బాబాజీ :**

ఇతని అసలుపేరు కృష్ణదాసు. 'భక్తమాల' హిందీ నుంచి బాంగ్లా చేశాడితను. ఇందులో చరిత్ర, తాత్విక అని రెండు భాగాలున్నాయి. హిందీలో దీనికర్త నాభాజీ. ప్రియదాసు దీనికి టీక వ్రాశాడు.

ఈ పద్దెనిమిదో శతాబ్దంలో వైష్ణవసాహిత్యంలో గొప్ప కావ్యాలు వెలువడక పోయినా కవులు తమ రచనలో మార్పుకోసం ప్రయత్నించారు. అట్టివారిలో లాల్ చంద్ర, నందలాలుల పేర్లు ప్రసిద్ధమైనవి. వీరిద్దరూ అన్నదమ్ములు; జంటకవులు. వైష్ణవపద కవితలో మార్పు సాధించిన కవి మధుకాన (1813-68). సంగీతములో

ఇతను ఏర్పరచిన రీతి 'ధప' అని ప్రచారంలోకి వచ్చింది. కీర్తనలో ఇది బాగా జనాదరణ పొందింది. ముఖ్యంగా ఇది స్త్రీలలో బహుళ ప్రచారం పొందింది. మధుకాన తూర్పు బాంగ్లాకి చెందిన కవి.

## అనువాద సాహిత్యం

ఇంచుమించు మన భారతీయ భాషలన్నిటిలోనూ అనువాద సాహిత్యం * ఇతిహాస పురాణాలతోనే ఆరంభమైంది. అలాగే బాంగ్లాలో కూడా జరిగింది.

ముసల్మానుల ఏలుబడిలో బాంగ్లాదేశంలో సంస్కృత భాషకు రాజాదరణ సన్నగిల్లింది. ఈ అవకాశంతో దేశభాష బాంగ్లా బాగా తల ఎత్తగలిగింది. ముస ల్మాను ఏలికలు ఫార్శీ, అరబ్బీ భాషల పక్షపాతులే అయినా సాధారణ జన వ్యవ హారానికి వారికి బాంగ్లాభాష తప్పనిసరి అవుతూవచ్చింది. రాజకీయ వ్యహారాలలో ఫార్శీభాషతోపాటు బాంగ్లా అనువాదం కూడా అవసరమయింది. ఈ కారణంగా మాతృ భాషమీద ప్రత్యేకమైన అనురాగం ఏర్పడింది ప్రజకు. దాంతో సంస్కృత పురాణాలూ, ఇతిహాసాలూ తమ తల్లిభాషలోకి అనువదించుకోవాలన్న అభిలాష స్వాభావికంగానే వారికి కలిగింది. ప్రజలు యావన్మందికి అవగతం కావాలన్న అభిప్రాయంతోనే మొదట కృత్తివాస ఓఝ రామాయణం బాంగ్లాభాషలో అనువదించాడు. తరవాత తరవాత ముసల్మాను ఏలికలున్నూ భారతం మొదలైన గ్రంథాలు బాంగ్లాలోకి అను వాదం చేయించారు.

తమ ఉద్గ్రంథాలు దేశభాషలో అనువాదమైతే తమ ఆధిపత్యానికి భంగం కలుగుతుందని భయపడి వ్యతిరేకించారు బ్రాహ్మణ పండితులు. అందుకనే మొదట రామాయణం కృత్తివాస ఓఝా అనువదించినా, భారత అనువాదకులు సంజయ, కవీంద్ర పరమేశ్వర, శ్రీకరనంది ప్రభృతులు బ్రాహ్మణేతరులే అయారు. భాగవత ప్రథమ రచయిత మాలాధరవసు కూడ కాయస్థుడు.

---

* Hitherto the Brahmin priesthood had consistently opposed all such attempts for they enjoyed a monopoly of the Sanskrit texts even as the Christian priests momopolised Latin and Greek in the Middle Ages. As the clergy frowned on the translations of the Bible so the Brahmins frowned upon translations of their sacred books. They feared it would undermine their authority.

— Bengali Literature. By Annadasankar and Lilaray.

బాంగ్లాలో పురాణాదుల అనువాదం పదిహేనో శతాబ్దంలో ఆరంభమైంది. అలా ఆరంభమైన గ్రంథాలలో రామాయణ మహాభారతాలూ, భాగవతమూ మొదలైన పురాణాలు ముఖ్యమైనవి. పదిహేనో శతాబ్దం మొదలుకుని పద్దెనిమిదో శతాబ్దం చివరి వరకుచూస్తే కృత్తివాస ఓఝూ, గంగా నారాయణ ఓఝూ, అద్భుతాచార్య, కైలాస వసు, చంద్రావతీ, గుణరాజఖాఁ, ఘనశ్యామదాసు, భవానీఘోషు, ద్విజలక్ష్మణ, రామశంకర, రామానందఘోషు, శంకర కవిచంద్ర, జగద్రామదాసు, రామప్రసాదు — ఇలా పద్నాలుగురు రామాయణ కవులు కనిపిస్తారు. ఇరవయ్యో శతాబ్దం వరకు చూస్తే ఏ యేభై అరువయి మందో వుంటారు. అలాగే భారత రచయితలు మొత్తం ఎనభై మందీ, భాగవత రచయితలు పాతిక మందికి పైగానూ వుంటారు.

## రామాయణ రచయితలు

### కృత్తివాస ఓఝూ

నదియా జిల్లా ఫులియా గ్రామం ఇతని జన్మస్థానం. ఇతని ముత్తాత నరసింహ ఓఝూ. తాత మురారి ఓఝూ. తండ్రి వనమాలి ఓఝూ. తల్లి మేనక. వనమాలి ఓఝూకి ఆరుగురు కుమాళ్ళూ, వొక కుమార్తె వుండేవారు. వీరిలో కృత్తివాసుడు మొదటివాడు. 'కృత్తివాస ఓఝూ ఆత్మ వివరణి' అని వందా ఏభై చరణాల పద్యభాగ మొకటి ప్రచారంలో వుంది. దినేశచంద్రసేను తమ 'వంగభాష ఓ సాహిత్య' గ్రంథంలో ప్రకటించాడు. ఆత్మవివరణిలో కృత్తివాసుడు తన పుట్టిన దినం ఇలా వివరించాడు :

> "ఆదిత్యవార శ్రీపంచమి పూర్ణమాఘ మాస
> తిథిమధ్యే జన్మలయలాదు కృత్తివాస."

(మాఘమాస సంక్రమణం, శ్రీపంచమి, ఆదివారం జన్మించాను, కృత్తివాసుణ్ణి.)

అయితే అది ఏ సంవత్సరమో తెలపలేదతను. లెక్కవేసి 1432 సంవత్సర మని తేల్చాడు సేను. కాని సునీతికుమారచట్టోపాధ్యాయ 1399 అని వ్రాశాడు.

తన పదకుండో ఏట కృత్తివాసుడు ఉత్తర బాంగ్లా వెళ్ళి విద్యనేర్చుకున్నాడు. విద్యపూర్తయాక గౌడేశ్వరుల దగ్గిరికి వెళ్ళాడు. అతని పాండిత్యం

మెచ్చుకొని గౌడేశ్వరుడు మధుపర్కాదు లిచ్చి గౌరవించాడు. గౌడేశ్వరుల ఆదేశం వల్లే ఓఝా రామాయణం అనువదించడానికి పూనుకున్నాడు (1420).

కృత్తివాస రామాయణం వాల్మీకి రామాయణానికి అనువాదమే అయినా అనేక చోట్ల అనువాదకుడు స్వతంత్రించాడు. కొన్ని కొన్నిచోట్ల — అనేక ఘట్టాల్లో మూలంతో సంబంధమే వుండదు. ఇతర పురాణాలూ, మహానాటకమూ, భట్టికావ్యమూ మొదలైనవి కూడా కృత్తివాస రామాయణంలో తొంగిచూస్తాయి. సంస్కృతంలో అసాధారణ పండితుడు కృత్తివాస ఓఝా. అందుకనే అతడికి అది సాధ్యపడింది. తెలుగు రామాయణం వలె ఇంకొకరు అర్ధం చెప్పవలసిన అవసరముండదు దానికి. ఒక్క కృత్తివాస రామాయణానికే కాదు బాంగ్లా మొదలైన భాషల ఏ పురాణానికీ తెలుగువలె ఇంకొకరు అర్థం చెప్పవలిసిన అవసరముండదు.

కృత్తివాస కవి పేర 'సీతారబారమాస్య', 'లక్ష్మణేర్ శక్తిశేల', రామరాస', 'అద్భుతరామాయణ' మొదలైన గ్రంథాలు కూడ ప్రచారంలో వున్నాయి.

కృత్తివాస రామాయణం నుంచి చిన్న ఉదాహరణ : రామవిలాపం :

"గోదావరీ తీరె అఛె కమల కానన,
తథా కి కమలముఖీ కారేన భ్రమన.
పద్మాలయి పద్మముఖీ సీతారె పాయియా,
రాఖిలేన బుఝి పద్మవనె లుకాయియా.
చిరదిన విపాసిత కరియా ప్రయాస,
చంద్రకలా భ్రమె రాహు కరిలాకి గ్రాస,
రాజ్యచ్యుత ఆమాకె దెఖియా చింతాన్వితా,
హరిలేన పృథివికి ఆపన దుహితా.
రాజ్యహీన యద్యపి హయేఛి ఆమిబటె,
రాజ లక్ష్మీ తథాపి ఛిలేన సన్నికటె.
ఆమార సె రాజ లక్ష్మీ హరాయిల వనె,
కై కేయీర మనోభిష్ట సిద్ధ ఏత దినె."

(గోదావరి తీరాన పద్మవనముంది. అక్కడికి వెళ్ళిందేమొ పద్మముఖి సీత! పద్మాలయి (లక్ష్మి) పద్మముఖి సీతని పద్మవనంలో దాచేసిందేమో! చిరకాల పిపాసతో ప్రయత్నించి, చంద్రకల అన్న భ్రమతో రాహువు మింగేశాడేమో! రాజ్యంపోయిన వాణ్ణని భూదేవి కూతుర్ని పట్టుకుపోయిందేమో! రాజ్యచ్యుతుణ్ణయినా రాజలక్ష్మి దగ్గిరవుండేది. ఆ రాజలక్ష్మిని కూడా పోగొట్టుకున్నాను అడవిలో. ఇన్నాళ్ళకి కైకమ్మ కోరిక తీరింది!)

కృత్తివాస ఓఝా అనంతరం వచ్చిన రామాయణాలలో వాల్మీకి రామాయణం కంటే అద్భుత, అధ్యాత్మ రామాయణాల అనువాదాలే అధికం అవుపిస్తాయి. మహాభారతంలోని రామాయణం అనుసరించి కూడా రామాయణాలు వెలువడ్డాయి. వీటికి 'భారత రామాయణం' లేదా 'సంక్షిప్త రామాయణం' అని పేరు.

## అద్భుతాచార్య (నిత్యానంద)

ఇతని అసలుపేరు నిత్యానంద ఆచార్య. తాత మార్కండ, తండ్రి శ్రీనివాస, తల్లి మేనక. ఏడేళ్ళ వయస్సులో నిత్యానందుడికి శ్రీ రామచంద్ర మూర్తి కవి నిత్యానందుడికి దర్శనమిచ్చి రామాయణం వ్రాయమని ఆదేశించాడట. బాణం మొనతో నాలిక మీద మహామంత్రం వ్రాశాడట. ఆ ప్రభావం వల్లే నిత్యానందుడు రామాయణం వ్రాశాడట. అతని రామాయణానికి 'అద్భుతరామాయణం' అని పేరు. అద్భుత రామాయణం వ్రాశాక అతని పేరు అద్భుతాచార్యుడయింది.

'అద్భుత రామాయణం' లో ఎన్నో అద్భుతమైన కొత్త విషయాలు చేర్చాడు అద్భుతాచార్యుడు. సీతాదేవి కాలికాదేవి అవతార మనడం వాటిలోవొక అద్భుత విషయం. అద్భుతాచార్యుడు 'శతకంఠ రామాయణం' కూడా వ్రాశాడు.

## చంద్రావతి (1550)

'మనసా మంగళ' రచయిత వంశీదాసు కూతురీమె. తల్లిసులోచన. మైమసింగు మండలం పాటవాయారి గ్రామం ఈమె నివాసం. వంశీదాసు 1575 లో మనసా మంగళ వ్రాశాడు. కనక కవయిత్రి చంద్రావతి పదహారో శతాబ్దం చివరిభాగంలో తన రామాయణం వ్రాసివుండాలి. 'రామాయణ గీత' అని ఈమె రామాయణం పేరు. 'దస్యుకెనా రామ' అని మరొక గ్రంథం కూడా వ్రాసిందీమె.

చంద్రావతి జీవితం విషాదంతో గడిచింది. జయచంద్రు డని ఆమె సహపాఠి వొకడుండేవాడు. అతణ్ణి ప్రేమించిందామె. అతడున్నూ ఆమెని ప్రేమించాడు. ఉభయుల వివాహమున్నూ నిశ్చయమైంది. కాని జయచంద్రుడు ముసల్మానులలో కలిసి, వొక ముసల్మాను కన్యని వివాహం చేసుకొన్నాడు. చంద్రావతి మర్మాంతికమైన వేదన పొందింది. చిర కుమారిగా వుండి పోయింది. తరవాత జయచంద్రుడు పశ్చాత్తాప పడి, చంద్రావతి దగ్గిరకి వచ్చాడు, కాని, ఆమె నిరాకరించింది. ఒకనాడు ఆమె శివ మందిరంలో వుండగా, ఉన్మత్తుడివలె వచ్చి మందిరంలో ప్రవేశించడానికీ యత్నించాడు. చంద్రావతి తలుపులు మూసేసింది. హతాశుడయి జయచంద్రుడు దగ్గిర నదిలో ఆత్మహత్య చేసుకున్నాడు. అనంతరం అల్పకాలంలో శివారాధనలో వుండి కాలం చేసింది.

ఈమె ఈ జీవన చరిత్ర వొక గాథగా కూడా వ్రాయబడింది.

చంద్రావతి రామాయణం నుంచి చిన్న ఉదాహరణ :

"రసాల వనేర ఫల గో పాతార్ కుటీర పాయియా,
అయోధ్యార రాజ్యపాట గో గెలామ్ భులియా.
మృగమయూర ఆర్ వనేర్ పశుపాఖీ,
సీతార్ సంగేర్ సంగీ గో తారా సీతార్ దుఃఖేర్ దుఃఖీ.
శివ శంకర నామ గోలయియా అచంబితె,
దండాయిల యోగి ఏక గో ఆసియా ద్వారెతె.
ఆమి కిగో జాని సఖి కాలసర్పవేశే,
ఏమని కరియా సీతాయ్ గో ఛలిబె రాక్షసె.

(మామిడిపళ్ళూ, పర్ణకుటీరమూ చూసి అయోధ్య రాజవైభవమే మరిచి పోయానమ్మా. లేళ్ళు, నెమళ్ళు మొదలైన పశువులూ, పక్షులూ సీతకి నేస్తాలయా యక్కడ. సీత దుఃఖంతో అవి కూడా దుఃఖించాయమ్మా, 'శివశంకర శివశంకర' అంటూ హఠాత్తుగా సన్యాసి వొకడు వచ్చి ద్వారం ముందు నిలబడ్డాడు. నాకేం తెలుసునమ్మా కాలసర్పం ఈ వేషంలో వచ్చిందని ? రాక్షసమాయ నాకేం తెలుసు ?)

### రామశంకర దత్తు (1700)

రాయరా గ్రామం ఇతని నివాసస్థానం. బ్రహ్మాండపురాణాంతర్గతమైన అధ్యాత్మ రామాయణం అనుకరించి ఇతడు రామాయణం వ్రాశాడు. రామశంకర రామాయణ మని ఇతని రామాయణానికి పేరు. ముఖ్యంగా అధ్యాత్మరామాయణమే అనుసరించినా "వాల్మీకి, వశిష్ఠ, ఆర్ అద్భుత గ్రంథకా'ర, మహాభారత ఆది పురాణ ప్రచార, ఏసబి గ్రంథి శుని శ్లోక అనుసారె, పద వంద కరి కహె భిషక శంకరె" అని ఇతర రామాయణాలు కూడా అనుసరించా డితను. ఇంచుమించు కృత్తి వాసరామాయణమంత గ్రంథం రామశంకర రామాయణం. కృత్తివాస రామాయణంలో 17670 పద్యాలుంటే రామశంకర రామాయణంలో 15340 పద్యాలున్నాయి.

### శంకర కవిచంద్ర (1702)

ఇతని రామాయణానికి విష్ణుపురీ రామాయణమని పేరు. ఇతనుకూడా వాల్మీకిలో లేని కథాభాగాలు తన రామాయణంలో చేర్చాడు.

### జయప్రసాద రామప్రసాదులు (1770, 1796)

ఈ కవులిద్దరూ తండ్రీకుమళ్ళు. ఉభయులూ కలిసి రామాయణం వ్రాశారు. దామోదర తీరంలో భులుయీ గ్రామం వీరి నివాస స్థలం, జయద్రాముడి తండ్రి పేరు రఘునాథుడు. తల్లి శోభావతి. అన్నజిత రాముడి ఆదేశం ప్రకారం జయద్రాముడు రామాయణ రచనకి పూనుకున్నాడు. కుమారుడు రామప్రసాదు తనతో చేతులు కలిపాడు, ఈ విషయం కవి తన గ్రంథంలోనే వివరించాడు.

రామప్రసాదుడు 'దుర్గాపంచరాత్ర' అని కూడా మరో గ్రంథం వ్రాశాడు (1796).

## భారత కవులు

రామాయణ కవుల వలెనే ఎంతో మంది మహాభారత కవులు సంజయుడూ, కవి శ్రీపరమేశ్వరుడూ, శ్రీకరనందీ, విజయపండితుడూ, దేవకీనందన, రామచంద్ర ఖాను, ద్విజహరిదాసు, ఘనశ్యామదాసు, నిత్యానంద ఘోషు, కాశీదాసు చందనదాసు మొదలైన వారున్నారు. వీరిలో పలువురు జైమినిభారతం వ్రాసినవారు.

## సంజయుడు (1500 :)

బాంగ్లాలో మొదటి భారత రచయిత సంజయకవి. ఇతని అసలుపేరు హరి నారాయణదేవు. హుసేనుషా (1493–1518) సమయంలో పరాగల్‌ఖాను కొలువులో ఇతని భారతం పఠింపబడేదట! దీనినిబట్టి కవి పదిహేనో శతాబ్దం వాడని భావింప బడుతున్నది. నానారసమయమైన భారత పుణ్యకథ బాంగ్లా సామాన్య జనానికి అందు బాటు కావాలన్న సంకల్పంతో సంజయుడు తేలిక బాంగ్లాభాషలో భారత రచనికి పూను కున్నానని వ్రాశాడు.

> "భారతేర్ పున్నకథా నానా రసమయ,
> లోక బుఝూబార హేతు కహిలా సంజయ."

సంజయకవి మొదలుకుని తరువాతి బాంగ్లా మహాభారత రచయితలందరూ అశ్వమేధపర్వం మాత్రం వ్యాసభారతం నుంచి తప్పించి జైమిని అశ్వమేధపర్వమే చేర్చి వ్రాశారు. బాంగ్లా భారత రచయితలు అనుసరించిన విలక్షణ పద్ధతి ఇది.

సంజయుడి కంటె ముందు నాసరత్ఖాను కాలంలో (1519–1533) బాంగ్లాలో మహాభారతం అనువాదమైంది. కాని అది ఇప్పుడు లభించలేదు.

## కవీంద్ర పరమేశ్వరదాసు (1500)

హుసేనుషా (1497–1518) సేనాధిపసేతి అయిన పరాగల్‌ఖాను ఆస్థానకవి ఇతను. పదిహేనో శతాబ్దం చివర దినాలలో జన్మించి పదహారో శతాబ్దం తొలి భాగంలో కాలంచేశాడు పరమేశ్వరదాసు. పరాగలుఖాను అనంతరం కూచి బిహారు రాజయిన నరనారాయణుడి (1540) దగ్గిర మంత్రిగా పనిచేశాడితను. అలా ఇతని చివరి దినాలు శారీపురంలో గడిచాయి.

రాజరాజనరేంద్రుడు ఆంధ్రంలో మహాభారతం వ్రాయించినట్టు బాంగ్లాలో మహా భారతాలు మహమ్మదీయ ప్రభువులు వ్రాయించారు. తమ ఆస్థానాలలో మహాభారతం చదివించాలని అభిలాషపడ్డారు వారు. అయితే సంస్కృత గ్రంథాలు వారికి 'అడివి' లా అంధకారబంధురమైనాయి. అందుకని తేటతెల్లమైన బాంగ్లా అనువాదాలు చేయించారు.

పారగల్ ఖాను ఆదేశం ప్రకారం మహాభారతం సంస్కృతం నుంచి బాంగ్లా చేశాడు పరమేశ్వరదాసు. అందుకని ఇతని భారతానికి పారగల్ మహాభారతమని పేరు. తన గ్రంథ రచనకు కారణం ఆదిలోనే వివరించా డతను.

"లస్కర పారగల్ సునంత కాహినీ,
యేనమతె పాండవె హారాయిల రాజధాని
వనవాసె బంచిలేక ద్వాదశవత్సర,
కేనమతె ధర్మ రయిల వనేర్ భితర.
వత్సరేక అఖిలంత అజ్ఞాత వసతి,
కేనమతె తారా సబె పాయిల వసుమతీ ?
ఎహి సబ కథా కహ సంక్షిప్త కరియా,
దినేక సునితె పారి పాంచాలీ కరియా.
తాఁహార ఆదేశమాల్య మస్తకె కరియా,
కవీంద్ర కహిల కథా పాంచాలీ రచియా."

(పాండవులు రాజధాని ఎలా పోగొట్టుకున్నారు ? ధర్మానికి కట్టుపడి పన్నెండేళ్ళు వనవాసమూ, సంవత్సరమూ అజ్ఞాతవాసమూ ఎలాచేశారు ? ఎలా తిరిగి రాజ్యం సంపాదించారు ? ఇదంతా సంక్షిప్తంగా వొక్కదినంలో వినగలిగినట్టు పద్యకావ్యంగా రచించమని పారగల్ సేనాని ఆదేశించాడు. అతని ఆదేశమాల్యం శిరస్సున దాల్చి కవీంద్రుడు పద్యంగా (భారత) కథ వ్రాశాడు.)

భారతకథంతా వొక్కదినంలో చదవగలిగినట్టు మొదట సంక్షిప్తంగానే వ్రాశాడు కవీంద్రుడు. తరవాత దానినే విస్తృతపరిచాడు. ఇప్పుడది మొత్తం 17000 పద్యాలతో వుంది.

## శ్రీకరనంది (1500, 1600)

పారగల్ ఖాను కుమారుడైన నసరత్ఖాను (ఛోటీఖాను) ఆస్థానకవి ఇతను. నసరత్ఖాను ఆదేశంతో జైమిని భారతం అశ్వమేధపర్వం బాంగ్లాలో అనువదించాడు నంది.

"సునంత భారత తబె అతిపుణ్యకథా,
మహాముని జైమిని కహిల సంహితా.
అశ్వమేధ కథాసుని ప్రసన్న హృదయ,
సభాఖండె ఆదేశిల ఖాన మహాశయ.
దేశీ భాషాయ్ ఎహికథా రచిల పయార,
సంచరాక కీర్తి మోర జగత్ సంసార.
తాహార ఆదేశమాల్య మస్తకె ధరియా,
శ్రీకరనంది కహిలేక పయార రచియా."

(మహాముని జైమిని వ్రాసిన భారత సంహిత అశ్వమేధపర్వ కథ విని ప్రసన్నుడై ఖాను మహాశయుడు సభామధ్య ఆదేశించాడు నన్ను, అది దేశభాషలో పయార్ ఛందస్సులో వ్రాయమని. అతని ఆదేశమాల్యం శిరస్సున దాల్చి నేను శ్రీకరనందిని పయార్ ఛందస్సులో వ్రాశాను.) పరమేశ్వరదాసు తన భారతములో చేర్చిన జైమిని అశ్వమేధపర్వం అక్కడక్కడ సంక్షిప్తంగా వుంది. శ్రీకరనంది అనువాదం అలాకాక విస్తృతంగా వుంది.

## రఘునాథ కవి (1600)

జైమిని భారతం అశ్వమేధపర్వం అనువదించా డితను. కవి నివాసం తెలియదు. ఒడిశారాజు (తెలంగా) ముకుందదేవు రాజసభలో రఘునాథకవి తన అశ్వమేధపర్వం చదివినట్టు కవి తన గ్రంథంలో వ్రాశాడు.

"శ్రీయుక్త ముకుందదేవ నృపశిరోమణి
పరమవైష్ణవ, దానె బలి, కర్ణజిని.
అశ్వమేధపర్వకథా శ్రీరఘునాథ భాణె.
ఆయిల తొమార దేశె గుణ సుని అతి,
శ్రీరఘునాథ విప్రకులె ఉత్పత్తి.
పాంచాలీ రచియా ఆయిలు తోమార సమాజె,
చిరకాల రాజ్య కర ఉత్కలర మాఝె.

అశ్వమేధ పాంచాలీ సే వరించా కౌతుకె,
ఆజ్ఞాదేహ ఆహ్మాపడి తుమార సభాతె.
సునంచా విప్రేరజోల్ రాజాహరషితె,
ఆజ్ఞాదిల బ్రాహ్మణకె పాంచాలీ పడితె."

(శ్రీయుక్త ముకుందదేవ నృపశిరోమణి పరమ వైష్ణవుడు. దానంలో బలిచక్రవర్తినీ, కర్ణుణ్ణీ జయించాడు. అశ్వమేధపర్వ కథ శ్రీరఘునాథుడు వ్రాశాడు. ఓరాజా! నీ గుణాతిశయం విని మీదేశం వచ్చాను. శ్రీరఘునాథుడు నాపేరు. బ్రాహ్మణకులంలో నాజన్మ. అశ్వమేథపర్వం కావ్యంగా వ్రాసితెచ్చాను. చిరకాలం ఉత్కలం రాజ్యం చెయ్యి నువ్వు. నీ సభలో అశ్వమేధపర్వ కథ చదవడానికి ఆజ్ఞాపించు, అన్నాను. విని రాజు సంతోషంతో అనుమతించాడు.)

## రామచంద్రఖాను (1600)

ఇతను కూడా అశ్వమేధ పర్వమే అనువదించాడు. రాఢదేశ దండసిమలియా గ్రామం ఇతని నివాసం. తండ్రి కాశీనాథుడు. 'ఖాను' అన్నది మహమ్మదీయ ప్రభువుల ఆస్థానంలో లభించిన బిరుదు. కవి అశ్వమేధ పర్వం 1572 లో వ్రాశాడు. కవి తన పరిచయం తన గ్రంథంలో ఇలా తెలుపుతున్నాడు :

"రాఢాదేశె వసతి అచ్ఛయే పుణ్యస్థానె,
దండ సిమలియా డాంగా సర్వలోకజానె.
కాయేత కులేతె జన్మ దండత పద్ధతి,
కాశీనాథ జనక, జననీ పుణ్యవతీ"

(రాఢ దేశంలో పుణ్యస్థానం దండసిమలియాలో వసతి. దండసిమలియా అంటే అందరూ ఎరుగుదురు. కాయస్థకులంలో జన్మించాన్నేను. 'దండ' సౌంజ్ఞమాది. కాశీనాధుడు నా తండ్రి; తల్లి పుణ్యవతి.)

## ద్విజహరిదాస ఆచార్య (1600)

ముర్షిదాబాదు జిల్లా కాంచన గడియా ఇతని నివాసస్థానం. చైతన్యస్వామి భక్తుడితను. భక్త రత్నాకరంలో ఇతని చరిత్ర కనబడుతుంది. చైతన్యస్వామి కనపడక

పోతే ఆత్మహత్య చేసుకుంటానని దీక్షపూనాడు హరిదాసు, కలలో స్వామి కనపడి వారించాడట. అనంతరం బృందావనం వెళ్ళి చివరిదినాలు గడిపాడట. ఇతను కూడ జైమిని అశ్వమేధ పర్వమే బాంగ్లాచేశాడు. సంస్కృత గ్రంథం బాంగ్లాలో అనువదించడానికి కారణం ఇలా వ్రాశాడు కవి.

"సంస్కృత నాహి బుఝెసాధారణ జనె,
భాషాకథా కహి ఆమి తథిర కారణె.
భాషా కథా కహి వీర నా కరిఒ హేలా,
హాథ దిలె అఖునె నా పోడె కోన్ లేలా."

(సంస్కృతం సాధారణ జనులకు తెలియదు. ఈ కారణం చేత భాషలో (బాంగ్లాలో) కథా రచన చేస్తున్నాన్నేను. భాషకదా అని హేళన చెయ్యకండి వీరులు (పండితులు), అగ్గిలో చెయ్యి పెడితే ఎప్పుడైనా కాలకండా వుంటుందా:).

హరిదాసు జైమిని భారతమే కాక 'ముకుందమంగళ' 'శ్రీకృష్ణ అష్టోత్తర శతనామ', కొన్ని వైష్ణవ పదాలూ వ్రాశాడు.

## నిత్యానంద ఘోషు

భారతం పద్దెనిమిది పర్వాలూ అనువదించాడితను. పాకుడా రాజు పృథ్వీ చంద్రుడు తన 'గౌరీమంగళ' కావ్యంలో ఇలా వ్రాశాడు.

"అష్టాదశ పర్వ భాషా కైల కాశీదాస,
నిత్యానంద కైల పూర్వే భారత ప్రకాశ."

(కాశీదాసు భారతం పద్దెనిమిది పర్వాలూ బాంగ్లా భాషలో వ్రాశాడు. అంతకు పూర్వం నిత్యానందుడు అనువదించాడు) ఇతని మహాభారతం 'విజయ పాండవకథ' అన్న పేర ప్రసిద్ధిపొందింది.

"విజయ పాండవ కథా అమృతలహరీ,
సునిలె అధర్మఖండె పరలోకె తరి.
సున సున అరె భాయిహాయె ఏకమన
నిత్యానంద ఘోష బలె భారత కథన."

(విజయ పాండవ కథామృతలహరి వింటే అధర్మంఖండనమవుతుంది, పరలోకం లభిస్తుంది, వినండి వినండి సోదరులారా! ఏకాగ్రచిత్తంతో వినండి భారత కథ నిత్యానందఘోష చెపుతున్నాడు.)

ఘోష కూడా అశ్వమేధపర్వం మాత్రం వ్యాసుడి రచన కాక జైమిని రచనే తీసుకుని అనువదించాడు. ఇతని రచన సరళమైంది; ఆబాల వృద్ధులకు అవగతమవు తుంది. కురుక్షేత్ర రణరంగంలో దుర్యోధనుడి మృతదేహం చూసి గాంధారి అన్న మాటలు చూడండి :

"దేఖ కృష్ణ ! మరి ఆఛె రాజాదుర్యోధన,
సంగేతె నాదెఖి కెన కర్ణ దుశ్శాసన ?
శకుని సంగేతె కెన నా దేఖి రాజన ?
కథాభీష్మ మహాశయ, గాంధార నందన ?
ఏకాదశ అక్షౌహినీ యార సంగె జాయ్,
హేన దుర్యోధన రాజా ధులాయ్ లుటాయ్ ?
సువర్ణేర ఖాటె జారీ సతత శయన,
ధూలాయ్ ధూసర తను హయ్యాఛె ఏఖన.''

(చూడు కృష్ణ ! దుర్యోధనరాజు చచ్చి పడున్నాడు. దగ్గిర కర్ణదుశ్శాసనులు కన పడరేమి? రాజ రాజుతో శకునిలే లేడేమి? భీష్మమహాశయుడేడీ? పదకొండు అక్షౌహిణుల సేన వెంట నడిచే మహారాజు ధూళిలో ఇలా పొర్లాడుతున్నాడో! బంగారం మంచం మీద ఎల్లప్పుడూ శయనించే రాజు ఇప్పుడు ధూళిధూసర దేహంతో పడున్నాడు!)

## కాశీరామదాసు (1700)

బాంగ్లా మహాభారత రచయితలలో సుప్రసిద్ధుడితను. వర్ధమాన జిల్లా సిలగి గ్రామం జన్మస్థానం. తండ్రి కమలాకాంతదాసు. కమలా కాంతుడు ఎంతోకాలం సపరివారంగా ఒడిశాలో నివసించాడు. కాశీరామదాసు సోదరులు కృష్ణదాసు (శ్రీకృష్ణ కింకర), గదాధర దాసులు కూడా కవులు. కాశీరామదాసు తమ్ముడు గదాధరుడు ఒడిశా కటక జిల్లా మాఖనపురంలో వుండి 'జగన్నాథమంగళ' (1643) వ్రాశాడు. అన్న కృష్ణదాసు 'శ్రీకృష్ణవిలాస' వ్రాశాడు. ఇతడు సన్యాసాశ్రమంస్వీకరించి 'శ్రీకృష

కింకరుడు' అని పేరు పెట్టుకున్నాడు. కాశీదాసు కుమారుడు ద్వైపాయనదాసు కూడ కవి. మహాభారతం వొకటి రెండు పర్వాలు ఇతడు కూడా అనువదించాడు.

కాశీరామదాసు వంశపరిచయం వివరంగా గదాధరదాసు తన 'జగన్నాథ మంగళ' కావ్యంలో ఇలా వ్రాశాడు.

"భాగీరథీ తటే వాటి ఇంద్రాయిని నామ,
తారమధ్యే ప్రతిష్ఠిత గణి సింగిగ్రామ.
అగ్రద్వీప గోపీనాథ రాయపదతలె,
నివాస ఆమార సెయి చరణ కమలె.
తాహాతె శాండిల్యగోత్రె దేవదైత్యారి,
దామోదర పుత్రతార సదాసేవే హరి.
దుబరాజ శుభరాజ తాహార నందన,
తాహార నందన హైల మీన కేతన,
తాహార తనయ హైల నామ ధనంజయ,
తాహా హైతె హైల ఏయితినటి తనయ.
వసుపతి, ధనపతి దేవ, నరపతి
వసుపతిర పంచపుత్ర ప్రతిష్ఠితమతి.
ప్రియంకర, సుధేశ్వర, కేశవ సుందర,
చతుర్థే శ్రీముఖదేవ, పంచమె శ్రీధర.
ప్రియంకర హైతెహల్యా ఏ పంచ ఉద్భవ.
యదు సుధాకర మధు శ్రీరామ రాఘవ,
సుధాకర నందన ఏతిని పరకాశ,
శ్రీమంత కమలాకాంతదేవ, చండీదాస.
దేవ, కమలాకాంత తేజియా నివాస
జగన్నాథ దెఖియానే ఓడ్ర కైలవాస.
కమలా కాంతేర హైల్యాఏతిన కోంర.
ప్రథమే నే కృష్ణదాస శ్రీకృష్ణ కింకర,

ద్వితీయ శ్రీకాశీదాస భక్త భగవాన్,
రచిల పాంచాలిఛందే భారత పురాన్.
తృతీయె కనిష్ఠదీన గదాధరదాస
జగత్మంగళ కథా రచిల ప్రకాశ."

(సంగ) హంగా దీని అర్థం: గంగాతీరాన సింగి గ్రామం నివాసం. మాది శాండిల్య గోత్రం. దామోదరదేవు దైత్యాది పుత్రుడు. దామోదరదేవు హరిభక్తుడు. అతనికి దుబరాజ శుభరాజ ఇద్దరు కుమాళ్ళు. శుభరాజు కుమారుడు మీనకేతనదేవు. అతని కుమారుడు ధనంజయదేవు అతనికి వసుపతి, ధనపతి, నరపతి అని ముగ్గురు కుమాళ్ళు; వసుపతి దేవుకి ప్రియంవరదేవ, సురేశ్వరాదేవ, కేశవసుందరదేవ, శ్రీముఖ దేవ, శ్రీధరదేవ అని అయిదుగురు కుమాళ్ళు. ప్రియంకర దేవుకి యదుదేవ, సుధాకర దేవ, మధుదేవ, శ్రీరామదేవ, రాఘవదేవ అని అయిదుగురు కుమాళ్ళు. సుధాకర దేవుకి శ్రీమంతదేవ, కమలాకాంతదేవ, చండీదాసు అని ముగ్గురుకుమాళ్ళు. కమాలా కాంతదేవు స్వగ్రామం విడిచిపెట్టి జగన్నాథస్వామి దర్శనానికి వెళ్ళి ఒడిశాలో వుండి పోయాడు. కమలాకాంతదేవుకి ముగ్గురు కుమాళ్ళు. పెద్దవాడు కృష్ణదాసు శ్రీకృష్ణ కింకరుడు. రెండోవాడు కాశీదాసు భగవద్భక్తుడు. భారత పురాణం కావ్యంగా వ్రాశాడు. మూడోవాడు కనిష్ఠుడు దీనుడు గదాధరదాసు. జగత్మంగళ వ్రాసి ప్రకటించాడు.)

బాంగ్లామహాభారతాలలో కాశీరామదాసు మహాభారతానికి వున్న పేరు మహా బాంగ్లా భారతానికి లేదు. 1801 లో జయగోపాల తర్కాలంకారుడు పరిష్కరించి మొదటి సారిగా శ్రీరామపురంలో ఈ మహాభారతం ప్రకటించాడు, తరవాత 1836 లో దీని రెండో సంస్కరణ వెలువడింది. మరి కొంత కాలానికి 1854 లో పదిహేడుగురు పండితులు పరిష్కరించి ప్రకటించారు. ఆ మరుచటి సంవత్సరం (1855) తర్కవాశీశగౌరీ శంకరుడు పరిష్కరించి ప్రకటించాడు.

కాశీరామదాసు పూర్తిగా పద్దెనిమిది పర్వాలూ వ్రాయలేదని కొందరు చరిత్ర కారులు వ్రాశారు.* కాని 'అష్టాదశ పర్వభాషాకైల కాశీదాస' అన్న 'గౌరీమంగళ' కర్తవాక్యం దీనిని స్పష్టంగా ఖండిస్తున్నది.

* Kasiram wrote only the first four sictions '(Parva)'

— History of Bengali Literature, Dr. Sukumar Sen, P. 132.

కాశీరామదాసు రచన సుబోధమై సలాకలా సాగిపోతాంది ఉదాహరణకి ఇతని 'ఉత్తర కుమార ప్రజ్ఞాఘట్టం' చూడండి.

"ఏకటిఒ సంగె నాహి ఆమార సారధి,
సారథి థామాక దూరె, నాహిక పదాతి,
మమపరాక్రమ మత పాయిలె సారధి,
ముహూర్తెకె జనిబారె పారికురుపతి,
మత్త గజగణె యథా ఏకాకి కేశరీ,
దైత్యగణె దలె యథా ఏకా వజ్రదారీ,
సెయి మత దలి ఆమి కురు సైన్య గణ.
ఏయిాక్షణె ఫిరాయిబ ఆపన గోధన.
జనైక సారధి యది మమయోగ హయ,
ఏకరథె కరిబ జే కురుపరా జయ.
ధనంజయ వీర యథా దలి దేవగణ
ఏకేశ్వర కరిలేక ఖాండవ దాహన.
తద్రూప మహత్కర్మ ఆజిసే కరిబ
ఏకేశ్వర సర్వసైన్య నిమిషే మారిబ."

(ఒక్క సారథికూడా నాకు లేడు. సారథిమాట అలావుండనీ, వొక పదాతి అయినాలేడు. నా పరాక్రమానికి తగినట్టు సారథి వుంటేనా, ముహూర్తంలో కురుపతిని గెలవగలను. మదపుటేనుగుల మంచలో వొక్క సింహంలాగ, రాక్షసుల మధ్య దేవేంద్రుడిలాగ కురుసేన నురుమాడతాను. ఈ క్షణంలో గోధనం మళ్ళిస్తాను. నాకు తగిన సారథి వొక్కడు దొరికితే చాలు, వొక్కరథంతో కురుపరాజయం జరిపేస్తాను. దేవసేన జయించి ఖాండవము కాల్చిన ధనంజయుడిలాగ ఈ ఘన కార్యం చేసేస్తాను. ఒక్కణ్ణే సర్వసైన్యం నిమిషంలో చంపేస్తాను.)

కాశీరామదాసుని మెచ్చుకొని మైకేలు మధుసూదన దత్తు పాడిన

"హేకాశీ ! కవీశదలేతుమి పుణ్యవాన్"

అన్న పాటతో మనం కూడా ఏకీభవిస్తాం. పైన తెల్పిన కవులేకాక దైవకీ నందన, చందనదాసు, ద్వైపాయనదాసు, నందరామదాసు, కృష్ణానందవసు, అనంత మిశ్ర, రాజారామదత్త, రాజీవసేను కుముదదత్త, జయంతిదేవ మొదలైన కవులు ఎంతోమంది భారత కథలు వ్రాశారు.

## భాగవత కవులు

ఏ వొకరిద్దరో తప్పిస్తే బాంగ్లా భాగవత రచయితలందరూ శ్రీకృష్ణ జన్మంతోనే గ్రంథారంభం చేశారు. వ్రజలీలా, మథురాలీలా, ద్వారకాలీలా వర్ణించడంలోనే వారి శక్తి సామర్థ్యాలు వినియోగించారు. చండీదాసు కల్పించిన దానశీల కూడా చేర్చారు (1500).

### మాలాధర వసు

'శ్రీకృష్ణవిజయ' అనుపేర బాంగ్లాలో తొలిసారిగా భాగవతం వ్రాసిన కవి మాలాధర వసు. పశ్చిమ బాంగ్లా కులీనగ్రామం ఇతని జన్మస్థానం. తండ్రి బాగీరథి వసు. తల్లి ఇందుమతి.

"బాప భాగీరథీ మోరమాతా ఇందుమతీ"

అని కవి తన గ్రంథంలో వ్రాసుకున్నాడు. ముత్తాత శ్రీపతి వసు. తాత యజ్ఞేశ్వరవసు. మాలాధరుడు పద్నాలుగురు కుమాళ్ళ తండ్రి.

పండితుల నోట విని భాగవతం బాంగ్లాలో వ్రాశానని చెప్పుకున్నాడు వసు.

"భాగవత సునిల ఆమి పండితేర్ ముఖె
సాధారణ లోకతాహా బుఝుతే నా పారె.
భాగవత సునితే అనేక అర్థచా హి
తే కారణే భాగవత గీతఛందే గాయి."

(భాగవతం నేను పండితుల నోట విన్నాను. సాధారణ లోకులు అది తెలుసుకోరు. భాగవతం తెలుసుకోడానికి అనేకార్థాలు అవసరం. ఆ కారణంచేత గీత ఛందస్సులో నేను బాంగ్లా దేశభాషలో వ్రాశాను.)

అంతేకాదు బాంగ్లాలో భాగవతం వ్రాయమని వ్యాసుడు కలలో కనపడి కవిని ఆదేశించాడట :

"స్వప్నే ఆదేశ దిలేన ప్రభువ్యాస,
తాఁర ఆజ్ఞామతే గ్రంథకరిను రచన."

(స్వప్నంలో వ్యాసభగవానుడు ఆదేశించాడు. అతని ఆజ్ఞప్రకారం నేను గ్రంథ రచన చేశాను.)

సుల్తాను రుక్మిద్దీను బారక్‌షాహ వసుకవికి గుణరాజఖాను బిరుదిచ్చి సత్కరించాడు.

"గుణ నాహిఁ అధమముంచి నాహికోన జ్ఞాన,
గౌడేశ్వర దిలా నామ గుణరాజఖాన."

(అధముణ్ణి నేను. గుణమేమీలేదు. గౌడేశ్వరుడు గుణరాజఖాను అని బిరుద నామ మిచ్చాడు.)

మాలాధరుడు భాగవతం 1473లో ఆరంభించాడు. ఏడేళ్ళలో 1480 లో పూర్తి చేశాడు. ఇతని గ్రంథమంటే చైతన్యస్వామికి ఎంతో ఇష్టంగా వుండేది. ఇతని కుమారుడు లక్ష్మీనాథవసు (సత్యరాజఖాను), మనుమడు రామానందవసు స్వామిజీ శిష్యులు.

మాలధరవసు తన భాగవతం శ్రీకృష్ణ విజయం దశమస్కంధం నుంచి ఆరంభించాడు. శ్రీకృష్ణ నిర్యాణం వరకు వర్ణించాడు. మధ్య మధ్య ఇతర పురాణ కథలు కూడా చేర్చాడు. చండీదాసు పదావళి నుంచి దానలీల గ్రహించాడు. తన గ్రంథ రచనా ప్రయోజనం సాధారణ ప్రజకు అర్థం కావడమే అని కవి ఆరంభంలోనే వ్రాసుకున్నాడు కనుక గ్రంథమంతా సరళమైన తేలిక భాషలోనే సాగింది మధురంగా. రాసవర్ణన చూడండి :

"నానావర్ణె సంపూర్ణ సెయి బృందావన,
గోపీలయె క్రీడా కరిబారె హైల మన.
శారద పూర్ణిమా శశీ కరిల ఉదయె,
సుగంధి శీతల వాయూ మనోహర బహె.

కోకిలేర్ కలరవీ భ్రమర ఝంకార,
కుసుమిత దశదిక వసంత అవతార.
కామ అవతార కరి వంశీతె నాదదిల,
సునియా గోకుల నారీ మూర్ఛిత హయిల.
జానిల గోవింద వంశీ బాయ బృందావనె,
చవిల సకలనారీ ఏకచిత్తమనె.
కెహతో స్వామీర కోవె ఆఛిల సుతియె,
కెహ ఉపకథా కహె బంధుజన లయె.
కెహ తో రంధన కరె కెహకరయె భోజన,
శిశు స్తన పియెకెహ శజ్యాయ శయన,
కెయి జన యెమన ఛిల చవిల సత్వరె,
బృందావనె వంశీ బాఘు నందేరకుమారె.''

(నానా వర్ణపూర్ణంగావుంది బృందావనం. గోపికలతో క్రీడించడానికి మనసయింది, శారద పూర్ణమా శశి ఉదయించింది. సుగంధ శీతల వాయువు మనోహరంగా వీచింది. కోకిలలు కలవరము చేశాయి. తుమ్మెదలు ఝంకారం చేశాయి. పదిదెసలూ వికసించి వసంతం అవతరించింది. కామావతారంతో వంశి మోగింది. విని గోకులం స్త్రీలు మూర్ఛపోయారు. గోవిందుడా బృందావనంలో మురళి వాయిస్తున్నాడని తెలుసుకున్నారు, ఒక్క మనస్సుతో అంతమందీ బయలు దేరారు. (అప్పటికి) కొంతమంది మగల కౌగిలిలో నిద్రపోతున్నారు. కొంతమంది బంధువులతో మాటామంతీ ఆడుతున్నారు. కొందరు వంట చేస్తున్నారు. కొందరు భోజనం చేస్తున్నారు. పక్కమీద పడుకుని కొందరు శిశువులకు పాలు కుడుపుతున్నారు. ఎవరెలావుంటె అలావున్న పాళాన బయలుదేరారు సత్వరంగా. బృందావనంలో నందకుమారుడు పిల్లం గ్రోవి వూదుతున్నాడు.)

## రఘునాథభట్టాచార్య (భాగవతాచార్య) 1600

భాగవతం పన్నెండు స్కంధాలూ అనువదించిన కవి ఇతను. ఇతని భాగవతానికి 'కృష్ణ ప్రేమతరంగిణి' అని పేరు. లోకులకి అర్థం కావడం కోసమే భట్టాచార్యుడు దేశభాష బాంగ్లాలో భాగవతం వ్రాశాడు.

"సుఖె భాగవత లోక బుఝిబారతలె,
రఘునాథ పండితెరచిల కథా ఛలె''

(భాగవతం సుఖంగా లోకులు తెలుసుకోడంకోసం రఘునాథపండితుడు భాగవత కథ వ్రాశాడు.)

కవి నివాసం వరాహనగరం. భాగవతం విని చైతన్యస్వామి ఇతనికి 'భాగవతా చార్య' అని బిరుదిచ్చాడు.

"తబె ప్రభు ఆయిలేన వరాహ నగరె,
మహాభాగవత ఏక బ్రాహ్మణేర ఘరె,
సెయివిప్ర సుశిక్షిత భాగవతె
ప్రభుదెఖి భాగవత లాగిల పడితె.
ప్రభుబలె భాగవత ఎమన పడితె
కభు నాహిసుని ఆర కాహార ముఖెతె.
ఏతెకె తోమార నామ భాగవతాచార్య
ఇహాబయి ఆర కోన నా కరియె కార్య.''

—చైతన్య భాగవతం.

(చైతన్య ప్రభువు వరాహనగరం వచ్చాడు. మహాభాగవతుడైన వొక బ్రాహ్మ డింటికి వెళ్ళాడు, భాగవతంలో మంచి పండితుడా బ్రాహ్మడు. చైతన్య ప్రభువుని చూసి భాగవతం చదవడమారంభించాడతడు. 'ఇలా భాగవతం ఎక్కడా ఎవరినోటా వినలేదు. ఇవాళ నుంచీ నీ పేరు 'భాగవతాచార్యుడు.' ఇంకెవరు ఈ పేరు వ్యవ హరించ కూడదు' అన్నాడు చైతన్య ప్రభువు.)

భాగవతా చార్యుడి భాగవతంలో ఇరవై వేల పద్యాలున్నాయి. కృత్తివాస, కాశీరామదాసుల వలె కాక మూలగ్రంథానికి దగ్గిరగా రచన సాగించాడు రఘునాథ పండితుడు.

## దైవకీనందనసింహ 'కవిశేఖర'

ఇతని భాగవతానికి 'గోపాల విజయ' అని పేరు. తండ్రి చతుర్భుజసింహ, తల్లి హీరావతి. కవి ప్రతిభావంతుడు, 'గోపాల విజయ' వ్రాయడానికి ముందు ఇతను గోపాల చరిత' మొదలైన కావ్యాలు వ్రాశాడు.

"తబె మహాకార్య కైల గోపాల చరిత,
తబెకైల గోపావేర్ కీర్తనా మృత.
గోపీనాథ విజయ నాటక కైల ఆర,
తబు గోపవేశె మన నాపురె ఆమార,
తబెయి పాంచాలి కరి గోపాల విజయె,
వైష్ణవ జనేర్ రేణు ధరియా హృదయె,
సింహవంశె జన్మనామ దైవకీ నందన,
శ్రీ కవిశేఖరనామ బలె సర్వజన."

(గోపాల చరిత మహాకావ్యం వ్రాశాను, తరవాత 'గోపాల కీర్తనామృత, 'గోపీనాథా విజయ నాటక' వ్రాశాను. అయినా మనసు తీరలేదు. అప్పుడు 'గోపాల విజయ' వ్రాశాను, వైష్ణవ జనుల పాదరేణువు హృదయంలోనిల్పి, సింహాశవంశంలో జన్మించాను. పేరు దైవకీనందన. శ్రీ కవిశేఖర అని సర్వజనులు అంటారు.)

## దుర్లభానంద కవి (1700)

భాగవతాచార్యుని వలె దుర్లభానందుడు పన్నెండు స్కంధాలూ భాగవతం అనువాదం చేశాడు. అక్కడక్కడ ఉపాఖ్యానాలు వొదిలి పెట్టి మూలానికి వ్యతిరేకంగా వ్రాయలేదితను. కవి పదిహేడో శతాబ్దంలో జన్మించాడు. అంతకంటె అతని చరిత్ర అధికం తెలియదు.

# ఇతర పురాణములు

## హరి వంశం

ఇది వ్యాస రచన ననుసరించి భవానందకవి బాంగ్లా చేశాడు. కవి తన విషయం గ్రంథంలో చెప్పుకోలేదు.

"సత్యవతీ సుత వ్యాస నారాయణ అంశ,
సంక్షేపె రచిల పుణ్యశ్లోక హరివంశ.
సెయి శ్లోక బాఖాన కరియా పదబంధె,
లోక బుఝిబారె బలె దీన భవానందె."

(సత్యవతీ సుతుడు వ్యాసుడు, నారాయణాంసుడు సంక్షేపంగా పుణ్యశ్లోకాలలో హరివంశం రచించాడు. ఆ శ్లోకాలు వ్యాఖ్యానించి లోకులు తెలుసుకోడం కోసం పదబంశం చేశాడు దీనుడు భవానందుడు.) అని మాత్రం వ్రాశాడు, చైతన్యస్వామి అనంతరం జ్ఞానదాసు, గోవిందదాసు మొదలైన కవుల సమకాలికుడు భవానీదాసు అని హరివంశ సంపాదకుడు సతీశబాబు వ్రాశాడు.

## దేవీ భాగవతం

కైలాసవసు దీని తొలి అనువాదకుడు. మేదినీపురం జిల్లా పింగలా గ్రామం ఇతని నివాసం. తండ్రి వారణసీ వసు. దేవీభాగవతం కవి 1586 లో పూర్తి చేశాడు.

కైలాసవసు అనంతరం త్రిలోచన తర్కరత్న, రాధారమణ మిత్ర అని ఇద్దరు కవులుకూడ దేవీభాగతం అనువదించారు.

విష్ణుభాగవతం ఉపపురాణమనీ, దేవీభాగవతం మహాభాగవతమనీ మహాపురాణ మనీ వొక వాదముంది. వైష్ణవులు విష్ణుపురాణమే మహాపురాణ మంటారు. శైవులూ, శాక్తేయులూ దేవీభాగవతమే మహాపురాణ మంటారు. దేవీభాగవత అనువాదకులు దానిని మహా భాగవతమనే వాడారు.

"శ్రీకైలాస వసుదాస
భాషాతె కరె ప్రకాశ
మహాభాగవత పురాణ.'

భవిష్య పురాణం

దీని అనువాదకుడు కవిచంద్ర శంకర చక్రవర్తి. 'భవిష్య పురాణ ద్విజ కవిచంద్రభణె' (భవిష్యపురాణం ద్విజకవిచంద్రుడు తెల్పాడు) అని గ్రంథకర్త వివరించాడు. కవి పరిచయం గోవింద మంగళ కవులలో వెనక వివరించాను.

వరాహ పురాణం

ద్విజతిలకరామ కవి దీని అనువాదకుడు. కవి మదనగోపాలస్వామి భక్తుడు.

"శ్రీమదన గోపాల అగె అజ్ఞాయే మానియా,
శ్రీవరాహ సకహితా కహి పయార కరియా.
సర్వవైష్ణవేర పాయె సహస్రప్రణామ,
శ్రీవరాహసంహితా కహె ద్విజ తిలకరామ.''

(మదన గోపాలుడి ఆజ్ఞపొంది శ్రీవరాహసంహిత 'పయార' ఛందస్సులో వ్రాశాను. సర్వవైష్ణవుల పాదాలకు సహస్రవందనాలు చేసి ద్విజ తిలక రాముడు శ్రీవరాహసంహిత చెప్పాడు) అని గ్రంథాంతాన తెలుపుకున్నాడు కవి.

క్రియాయోగసారం

పద్మపురాణంలోని క్రియాయోగసారం ఎంతో మంది కవులు బాంగ్లానువాదం చేశారు. వారిలో ప్రాణనారాయణ, రామసుందర, గీతాస్వర ముఖోపాధ్యాయ, అనంత రామదత్త, రామేశ్వరనందీ, హరేంద్రనారాయణ, రిపుంజయ, రఘునాథ శచీనంద మొదలైనవారు ముఖ్యులు.

ఈ కవులందరూ క్రియాయోగసారంలో 'మాధవ చంద్రకలా ఉపాఖ్యానం' విస్తృతంగా వర్ణించారు.

తాలధ్వజమని వొకపట్టణం. ఆ పట్టణం రాజు విక్రముడు. రాణి హారావతి. వారి కొక కుమారుడు కలిగాడు. అతని పేరు మాధవుడు. వయస్సు వచ్చాక మాధవుడు ఒకనాడు వేటకి వెళ్ళాడు. దారిలో వొక యువతి స్నానం చేస్తుండగా చూశాడు. ఆమె అందానికి వలచి, దగ్గరికి వెళ్ళి తన ప్రేమ చెప్పాడు. యువతి తన పేరు చంద్రకళ

అనీ, తాను సుబాహు రాజు భార్య ననీ చెప్పింది. ప్లక్షద్వీపంలో వొక ఊరుంది. ఆ ఊరు రాజు గుణాకరుడు. అతని కూతురు సులోచన. అపురూప రూపవతి ఆమె. ఆమె దాసి చంద్రపళ. ఇది విని సులోచన దగ్గిరికి గుర్రం మీద బయలుదేరాడు మాధవుడు పక్షద్వీపానికి. అక్కడ వొక మాలాకారుడింట బసచేశాడు. సులోచన విద్యాధరుడనే మరో రాజకుమారుణ్ణి అవాళే వివాహమాడుతుందని మాలాకారుడు చెప్పాడు. సులోచనకి జాబు వ్రాసి మాలాకారుడి భార్యచేత పంపాడు మాధవుడు. జాబందుకుని, రహస్యంగా వచ్చి మాధవుణ్ణి చూసింది సులోచన. అతని అందం చూసి మోహించింది. 'వివాహకాలాన ప్రదక్షిణ సమయంలో వామభుజం చాపుతాను. నువ్వు నన్ను ఎత్తుకుపో' అని మాధవుడితో చెపుతుంది. కాని, ఆ సమయానికి మాధవుడు నిద్రపోతాడు. ఇంతలో అతడి సేవకుడు ప్రచేష్టుడు మాధవుడి గుర్రంమీద వెళ్ళి సులోచనని పెళ్ళి మండపం నుంచి ఎత్తుకు పోతాడు. ఆమెని పెళ్ళి చేసుకోవాలని ప్రయత్నిస్తాడు. సులోచన గుర్రమెక్కి సుసేనరాజు పట్నానికి పారిపోతుంది. పురుష వేషంలో రాజు దగ్గిరికి వెళ్ళి తనపేరు వీరవరుడనీ, అసాధ్య కార్యాలు సాధించగల ననీ చెపుతుంది. కొన్నాళ్ళయాక పట్నంలోకి వొక ఖడ్గమృగం వస్తుంది. వీరావరుడు (సులోచన) దాన్ని చంపేస్తాడు. రాజు సంతోషించి తన కూతురు నిచ్చి వివాహం చేస్తాడు. భార్యతో వీరవరుడు గంగాసాగర సంగమానికి వెళతాడు. ఎవరైనా ఆత్మహత్యకి అక్కడ ప్రయత్నిస్తే బంధించమని సేవకుల నాదేశిస్తాడు. ప్రచేష్టుడు మొదట ఆత్మహత్యకి అక్కడ వచ్చి ప్రయత్నిస్తాడు. సులోచన (వీరవరుడి) సేవకులు అతణ్ణి బంధిస్తారు. అనంతరం విద్యాధరుడు వస్తాడు. అతణ్ణికూడా సేవకులు బంధిస్తారు. చివర మాధవుడు వస్తాడు. అతనికి తన విషయం వివరించి వివాహ మాడుతుంది సులోచన. విద్యాధరుడికి ఆత్మహత్య కూడదని ఉపదేశించి పంపేస్తుంది. సుసేనరాజు దగ్గిరికి వచ్చి జరిగిన ఉదంతం వివరిస్తుంది. తన కుమార్తెను మాధవుడికే ఇచ్చి తిరిగి వివాహం చేస్తాడు సుసేనరాజు. ఇదీ క్రియాయోగసారం కథ

### కాశీ ఖండం

జయనారాయణ ఘోషాల దీని అనువాదకుడు. కవి 1793 లో అనువాదం పూర్తిచేశాడు. అనువాదం మూలానికి అనుగుణ్యంగా సాగింది. కవికాలం 1751-1835. భూకైలాసం రాజు కవి. వారన్ హేస్టింగు సాయంతో ఇతను 'మహారాజ బహదూరు' అయాడు. 'కాశీపరిక్రమ', 'శంకరీశీతా', మొదలైన గ్రంథాలు వ్రాశాడు. ఇతని అనువాదానికి వొక ఉదాహరణ :

శ్లో. వినతా ప్రాహతం పుత్రం సంప్రహృష్ట తనూరుహో,
ఖోసుపర్ణార్ణవం తూర్ణం యాహి మంగళ మస్తుతే.
సన్తి తత్రాపి బహుశో నిషాదా మత్స్యఘాతినః.
వేలాతట నివాసాశ్చ తాన భక్షయ దురాత్మనః.
పరప్రాణైః నిజప్రాణాన్ యే ప్రయన్తి హ దార్ధిషః,
శాసనీయాః ప్రయత్నేన శ్రేయస్తచ్ఛాసనం పరమ్.

—మూలం.

లోమాంయితా హైయా పున కహేన వినతా.
హేసుపర్ణ దక్షిణ అర్ణవే యోహా తూర్ణ,
సెయిస్థానె మత్స్యఖాతి నిషాద సంపూర్ణ.
సింధుతటె సేసకలె వసతి జానహా,
సెయి సర్వ దురాశయ భక్షణ కరహ.
పరప్రాణె నిజప్రాణ పోషణజే కరె,
తాహార శాసన శ్రేయః పరమ విచారే.

—అనువాదం

## ముస్లిము కవులు

బాంగ్లా సాహిత్య చరిత్రలో ముస్లిము కవులకు ప్రత్యేక స్థానముంది. వీరిలో ఎంతోమంది వైష్ణవ కావ్యాలు వ్రాశారు. కొంతమంది శాక్తేయ కావ్యాలున్నూ వ్రాశారు. ప్రాచీన బాంగ్లా ముస్లిము కవులలో దౌలతకాజీ, ఆలావులు సుప్రసిద్ధులు. వీరిద్దరూ ఆరకాను కవులు. ఇద్దరూ బౌద్ధ రాజ్యమైన రోషాంగ (ఆరకాను) నివాసులు.*

ఆరకాను రాజు నరమేఖలుడు బర్మారాజుతో వోడిపోయి (1404) బాంగ్లా దేశంలో పాతికేళ్ళు తలదాచుకున్నాడు. బాంగ్లా నవాబు జలాలుద్దీను సాయంతో తిరిగి 1430 లో తన రాజ్యం సంపాదించాడు. ఆ నాటి నుంచి ఆరకాను సంస్థానంలో బాంగ్లా సంస్కృతికి స్థానం లభించింది. బాంగ్లా సాహిత్యమూ, బాంగ్లా సంగీతమూ అక్కడ అభివృద్ధి పొందాయి. క్రమక్రమంగా ఆరకాను దర్బారులో బాంగ్లా భాష సభ్యభాషగా గణుతి కెక్కింది. చిట్టగాంగు మొదలైన చోట్లనుంచి బాంగ్లా మాతృభాషగాకల

* అరకాను ఇప్పుడు బర్మాలో వుంది.

అధికార్లు ఆరకాను వచ్చారు. బాంగ్లాలో హుసేనుషా ఏలుబడి అయిపోయాక ఆరకాను స్వతంత్ర రాజ్యమైంది. అయినా బాంగ్లాభాష అక్కడ దెబ్బతినలేదు; సరికదా మరింత వృద్ధి పొందింది. ఆరకాను బౌద్ధరాజులు బాంగ్లా ముస్లిములను మంత్రులుగానూ, ఉన్నతోద్యోగులుగానూ నియమించారు. ఆరకాను రాజాస్థానంలో ముస్లిము పలుకుబడి హెచ్చింది. అది అక్కడి రాజులు ముస్లిము పేర్లు పెట్టుకున్నంతవరకూ వచ్చింది. దీనంతటి కారణంగా బాంగ్లా ముస్లిము కవులు ఆరకానులో ఆవిర్భవించారు.

## దౌలతకాజీ (1700)

రోసాంగ (ఆరకాను) రాజు శ్రీసుధర్మా (థిరిథుధర్మా) (1622-1638) సేనాని అస్రఫుఖాను ఆస్థాన కవి ఇతను. చట్టగ్రామం ఇతని జన్మస్థానం. ఆరకాను బాంగ్లా ముస్లిము కవులలో మొదటి కవి ఇతను.

దౌలత కాజీ సూఫీ మతస్థుడు. అస్రఫుఖానుకోరిక ప్రకారం బాంగ్లాలో 'లోరచంద్రానీ' కావ్యం వ్రాశాడితను. దీనికి 'సతీమయనా' అనికూడా పేరు. రాజపుత్ర స్థాన ప్రేమగాథ ఇది. మూడు ఖండాల కావ్యం.

లోర గోహారి దేశం రాజు. అతని రాణి మయనామతి. రాజూరాణీ ఇద్దరూ ప్రేమగా కాపరం చేస్తున్నారు. కొన్నాళ్ళయాక వొక యోగి లోర దగ్గిరికి వచ్చాడు. చంద్రానీరూపచిత్రం చూపించాడు. చంద్రానీ మొహరా రాజపుత్రి; వివాహిత, అయితే భర్తతో ఆమె సుఖంగాలేదు. చిత్రపటంలో చంద్రాని అందం చూసి లోర మోహించాడు. మొహరావెళ్ళి ఆమెని కలుసుకున్నాడు. చంద్రాని లోరను ప్రేమించింది. ఇదంతా జరిగి నప్పుడు లోర భర్త వూళ్ళో లేడు. అతడు వచ్చేసరికి లోర, చంద్రానీ మొహరా నుంచి పారిపోయారు. చంద్రాని భర్త వెంటాడతాడు. అడివిలో అతడికీ లోరకీ పోట్లాట జరుగుతుంది. చంద్రాని భర్త చచ్చిపోతాడు. ఆమె తండ్రి లోరను అల్లుడుగా అంగీక రిస్తాడు. తన రాజ్యానికి అతణ్ణి ఉత్తరాధికారి చేస్తాడు.

ఇక్కడ మయనామతి భర్తకోసం విరహ మనుభవిస్తుంది. దుర్గాదేవిని ప్రార్థి స్తుంది. ఇంతలో చాతను డని వొక ధనిక యువకుడు మయనామతిని ప్రేమిస్తాడు. దూతికను ప్రయోగిస్తాడు. మయనామతి చిక్కుల్లో పడిపోతుంది. అప్పుడు తాను

నమ్మిన పాక బ్రాహ్మడిచేత పెంపుడు చిలకని పంపుతుంది భర్తని వెదకడం కోసం. వెదికి వెదికి మొహరా వస్తాడు బ్రాహ్మడు. లోరని చూస్తాడు. అతడికి మయనామతి జ్ఞాపకం వస్తుంది. కుమారుణ్ణి మొహరాకు రాజుగా అభిషేకించి గొహారీ వచ్చేస్తాడు చంద్రానితోకూడా. మయనామతిని కలుసుకుంటాడు. అందరూ సుఖపడతారు. ఇదీ మయినామతి (లోరచంద్రాని) కథ

కావ్యం అసంపూర్తిగా విడిచి అకాలంలో మరణించాడు కాజి. చివరి భాగం అలావులు పూర్తిచేశాడు.

## అలావులు సాహెబు సయ్యద్

ఫరీదుపూరు జిల్లా జాలాలు పురం ఇతని జన్మస్థానం. తండ్రి మజిలిస్ కుతుబు. ఇతను కూడా సూఫీమతస్థుడు.

అలావులు సాహెబు హిందీలో జయసీ వ్రాసిన 'పద్మావతి' బాంగ్లాలో అనువదించాడు. 'వర్జఉజ్జమూల్', 'సప్తపదకర' మొదలైన పార్శీ కావ్యాలు అనువదించాడు. అరబ్బీభాషనుంచి 'తావుఫా' (1663) బాంగ్లాచేశాడు. ఎన్నో వైష్ణవ పదాలున్నూ వ్రాశాడు.

అలావులు తండ్రి మజిలిస్ కుతుబు దిగువ బాంగ్లాలో గవర్నరు ఒకమారు కుమారుడితో కలిసి కుతుబు పడవ ప్రయాణంలో వుండగా బుడతకీచులు విరుచుకు పడ్డారు. కుతుబును చంపేసి, అలావులును అరకాను పటాలానికి అమ్మేశారు. అలావులు మంచి పాటగాడు కూడా. అతను కవి అనీ గాయకుడనీ అరకాను మంత్రి సులేమాను తెలుసుకుని ఆదరించాడు. సులేమాను కోరిక మీదే అలావులు సాహెబు గౌలతకాజీ అసంపూర్ణంగా విడిచిన 'లోరచంద్రానీ' పూర్తి చేశాడు (1959).

అనంతరం సయ్యద్ మహమ్మదు మూసా అతణ్ణి ఆదరించాడు. ఆతనిచేత నిజామీ కావ్యం 'హాఫ్ట్ పైకర' బాంగ్లా చేయించాడు.

ఆ దినాల్లో షాజహాను కుమారుడు షాసుజా బాంగ్లా సుబేదారుగా వుండేవాడు. విద్రోహకారణంగా అతడు పారిపోవచ్చి అరకాను దర్బారులో కొంతకాలం తలదాచుకున్నాడు. అలావులు అతని స్నేహితుడయాడు. అది కారణంగా అతడు సందేహపాత్రుడై నిర్బంధింపబడ్డాడు. కొన్నేళ్లు కారాగృహంలో గడిచాయి. విడుదల అయాక

అతణ్ణి ఆరకాను మంత్రులు సయ్యద్ మూసా, మజ్లిస్ నవరాజ్ ఆదరించారు. అప్పుడే నవరాజ్ కోరిక మీద ఆలావులు సాహెబు నిజామీ 'ఇస్కందరు నామా' బాంగ్లా చేశాడు.

ఆలావులు సాహెబు పార్శీ, అరబ్బీ భాషలలోనే కాక హిందీ, సంస్కృత భాషలలో కూడా అసమానమైన పాండిత్యం గడించాడు. అతని బాంగ్లా రచనలు పార్శీ లిపిలో కూడా వున్నాయి.

బాంగ్లా ముస్లిము కవులు కొంతమంది అరబ్బీ, పార్శీ కథలు పురస్కరించుకుని కావ్యాలు వ్రాశారు. కొందరు తమ మతాచారాలు పురస్కరించుకుని గ్రంథాలు వ్రాశారు. చిట్టగాంగు కవులు కొందరు హిందూ గ్రంథాలకు పటాంతరంగా బాంగ్లాలో గ్రంథ రచన చేశారు. 'హరి వంశా' నికి పటాంతరం 'నబివంశం' వెలువడింది. 'పాండవ విజయా' నికి పటాంతరం 'రసూలు విజయం' (1654) వెలువడింది. 'మహాభారతానికి పటాంతరం జంగనామా' తయారయింది.

## సయ్యదు సుల్తాను (1700)

ఇతను 'రసూలు విజయం' వ్రాశాడు. చిట్టగాంగు నివాసి ఇతను, కొన్ని వైష్ణవపదాలు కూడా వ్రాడాడితను.

## మహమ్మదు ఖాను (1700)

ఇతడు కూడా చిట్టగాంగు నివాసి. 'జంగనామా' (1645) వ్రాశాడితను. ఇతని తరవాతకూడా కొంతమంది 'జంగనామా' లు వ్రాశారు. వారిలో నసరుల్లా ఖాను, హాయాదు మామూదు ప్రసిద్ధులు.

## హాయాత్ మామూదు (1800)

తూర్పు బాంగ్లా రంగపూరు జిల్లా ఇతని నివాసం. ఇతని 'జంగనామా' కు 'మహరం పర్వం' అని పేరు. మామూదు పార్శీ అనువాదం నుంచి 'హితోపదేశం' (1732) బాంగ్లా చేశాడు. 'హితాజ్ఞానవాణి' (1753), 'అంబియా వాణి', (1758) మొదలైనవి ఇతని ఇతర గ్రంథాలు.

### గరీబుల్లా (1800)

పశ్చిమబాంగ్లా నివాసి ఇతను. 'మధుమాలతీ' 'అమీరు హమ్జా జంగనామా' (1792-1794) యూసూఫు జులేఖా, 'హానిఫా జంగనామా' లేదా 'జయగునేర పుథి' (1797), 'హాతింయయీర కిస్సా' (1804) మొదలైన కావ్యాలు వ్రాశాడు.

వీరే కాక 'లైలామజునూ' రచయిత దౌలత వజీరు 'దామినీ చరిత్ర' రచయిత షరూపు, 'చంద్రముఖి' రచయిత ఖలీలు, 'విద్యాసుందర' రచయిత షాబరీదుఖాను ప్రసిద్ధులు.

## పూర్వ రంగ సమాప్తి

పద్ధెనిమిదో శతాబ్దంతో బాంగ్లా సాహిత్య పూర్వరంగానికి సమాప్తి చెప్పవచ్చు.

ఢిల్లీ మొగలు చక్రవర్తుల సార్వభౌమత్వం సన్నగిల్లింది. బాంగ్లాదేశం స్వతంత్ర నవాబుల ఏలుబడి కిందికి వచ్చింది. వారి చేతకానితనం దేశంలో అల్లరులకు తావిచ్చింది. తూర్పిండియా కంపెనీ మెల్లిమెల్లిగా కాలూని నిలబడ సాగింది. కొత్త నగరం కలకత్తా తలఎత్తింది. బాంగ్లా నవాబు సురాజుద్దౌలా ప్లాసీ యుద్ధంలో (1757) కంపెనీతో వోడిపోయాడు. బాంగ్లాదేశంలో ఇంగ్లీషు బావుటా ఎగిరింది. పట్టుమని పదేళ్ళయినా తిరగకుండా బాంగ్లాదేశం ఘోరమైన దుర్భిక్షం పాలయింది.

పద్ధెనిమిదో శతాబ్దం బాంగ్లా సాహిత్యంలో క్షీణదశ. ఈ శతాబ్దంలో పేరుపడ్డ బాంగ్లా కవులందరూ బాంగ్లాలో కుంపినీ రాజ్యం ఏర్పడక ముందున్న వారే అన్న విషయం గమనించ దగింది. ఈనాటి కవులలో గుణాకర భారత చంద్రరాయి, కవిరంజన రామప్రసాద సేను, జయనారాయణ ఘోషాల మొదలైనవారు ముఖ్యులు.

### భారతీ చంద్రరాయి (1712-1760)

భూరసిట పరగణా పేడా వసంతపురం ఇతని జన్మస్థానం. తండ్రి జమీందారు నరేంద్రనారాయణ (ముఖోపాధ్యాయ.) తల్లి భవాని. బాల్యంలోనే భారతచంద్రుడు ఇల్లు వొదిలి హుగ్లీతీరం దేవానందపురం వెళ్ళిపోయాడు. అక్కడ రామచంద్ర మున్షీ ఆశ్రమంలో వుండి సంస్కృతమూ, కవిత్వమూ అభ్యసించాడు. మున్షీ కోరిక ప్రకారం రెండు చిన్న కావ్యాలు, సత్యనారాయణ కథలు (1737) వ్రాశాడు. అనంతరం ఇంటికి తిరిగివచ్చి, జమీందారీ వ్యవహారాలలో తండ్రికి సాయపడ్డాడు.

వర్ధమాన రాజ్యంలో నరేంద్రనారాయణుడి జమీందారి ఇజరా ఎస్టేటు, వర్ధమాన రాజు కీర్తిచంద్రుడు 1740 లో కాలంచేశాడు. దివాను ఏదో మిషపెట్టి నారాయణుడి ఎస్టేటు లాక్కున్నాడు. రాణీ దగ్గిర అపీలుకోసం భారతచంద్రుడు వర్ధమాన వచ్చాడు. దివాను అతణ్ణి పట్టుకుని కారాగృహంలో పెట్టాడు. కారాగృహంనుంచి తప్పించుకుని పారిపోయాడు భారతచంద్రుడు. పూరీ వచ్చి వైష్ణవమతం పుచ్చుకున్నాడు. సన్యాసి వేషంలో పూరీనుంచి బృందావనం బయలు దేరాడు. దారిలో అతని బంధువొకడు అతణ్ణి పోల్చాడు. అతనితో తన అత్తవారింటికి వెళ్ళాడు భారతచంద్రుడు. కొన్నాళ్ళండి స్వగృహానికి వెళ్ళాడు. ఇంట తగిన ఆదరణ లభించలే దతనికి. అంచేత మళ్ళీ ఇల్లు వొదిలిపోయాడు. ఆ వెళ్ళడం వెళ్ళడం తిన్నగా చంద్రనాగూరు వెళ్ళాడు. ఫ్రెంచి ఏజంటు దగ్గిర ఉద్యోగ మర్థించాడు. ఫ్రెంచి ఏజంటు అతణ్ణి కృష్ణగడ రాజు దగ్గిరికి పంపాడు. కృష్ణగడ రాజు కృష్ణచంద్రుడు భారతచంద్రుణ్ణి తన ఆస్థానకవిగా నియమించాడు. మూలజోడలో అతనికి భూవసతి కూడా కల్పించాడు.

కృష్ణచంద్రుడి ఆదేశం ప్రకారం భారత చంద్రుడు 'అన్నదామంగళ' (1753) వ్రాశాడు. అంతకు ముందు 'రసమంజరి' (1750) వ్రాశాడు. భారత చంద్రుడి విఖ్యాత కావ్యం 'విద్యాసుందర' వర్ధమాన రాజు వీరసింహుడి కన్య విద్య. కాంచీరాజ కుమారుడు సుందరుడు. వీరి పరిణయగాథ 'విద్యాసుందర' కావ్యం, భారత చంద్రుడికి ముందూ, తరవాతా కూడా ఎంతో మంది కవులు విద్యా సుందర కథ వ్రాశారు. కాని వాటన్నిటిలోనూ భారతచంద్రుడి కావ్యమే సుప్రసిద్ధమైంది. కృష్ణచంద్ర మహారాజు ఆస్థానంలో నీలమణి కంఠాభరణుడు గొప్ప గాయకుడు. అతడు 'విద్యాసుందర' గానం చేసి సభ సభంతా చకిత పరిచాడట. 'అన్నదామంగళ' 'విద్యాసుందర' కావ్యాలు విని కృష్ణచంద్రుడు భారతచంద్రుడికి 'రాయిగుణా కర' అని బిరుదమిచ్చాడు. భారత చంద్రుడు 'మానసింహ' అని వొక చరిత్ర కావ్యం కూడా వ్రాశాడు.

'విద్యాసుందర' 1816 లో తొలిసారిగా అచ్చుపడింది. అనంతరం ప్రఫుల్ల చంద్రపాలు సంపాదకత్వంతో మరోకూర్పు వెలువడింది. ఈ కూర్పులో సంపాదకుడు 'విద్యా సుందర' కావ్యాలు వ్రాసిన ఇతర కవులు గోవిందదాసు, కృష్ణరామదాస, మధుసూదన చక్రవర్తి, కవిచంద్ర నిధిరామ చక్రవర్తి, రాధాకాంతమిశ్ర, రామ ప్రసాద సేను, షాబిరీదుఖానుల వివరం తెలిపాడు.

భారత చంద్రుడు వైష్ణవగేయాలు కూడా వ్రాశాడు. సంస్కృతంలో 'నాగాష్టకం' వ్రాశాడు.

## రామప్రసాద సేను (1723-1775)

ఇతను సాధక కవి. హుగ్లీజిల్లా కుమారహట్ట గ్రామం ఇతని నివాసం. తండ్రి రామ రామసేను. 'విద్యాసుందర' 'కాళీకీర్తన, ఇతని గ్రంథాలు. 'కాళీకీర్తన' ఇప్పటికీ కూడా మంచి ప్రచారంలో వుంది.

రామప్రసాద సేను కూడా కృష్ణచంద్ర మహారాజు ఆస్థానంలో కవి. మహారాజు ఇతనికి కూడా పన్నులేకుండా భూవసతి అనుగ్రహించాడు.

పద్ధెనిమిదో శతాబ్దంలోనూ, అంతకు ముందూ కూడా బాంగ్లా కవులు తరుచు స్వీకరించిన కథా వస్తువులలో గోవింద చంద్రుడి కథ వొకటి. భారత దేశం ఇతర ప్రదేశాలలో కూడా ఈ కథ ప్రచారంలో వుంది.

ఈ కథ మొదట దుర్లభ మల్లిక కవి వ్రాశాడు. అనంతరం భవానీ 'దాసు' సుకురమామూదు వ్రాశారు. కావ్యాల పేరు 'మయనామతీరగాన్'.

రాజామానిక చాందు భార్య మయనామతి. ఆమె కుమారుడు గోవిందచంద్రుడు. తన కుమారుడు పద్ధెనిమిదో ఏట సన్యాసి కాకపోతే అకాలమృత్యువు వాతపడతాడని మయనావతీ యోగబలం వల్ల తెలుసుకుంది. కుమారుణ్ణి సన్యాసి కమ్మని నిర్బంధిస్తుందామె. గోవింద చంద్రుడి భార్యలు అదునా పదునా వాదిస్తారు. అయినా తల్లి బలాత్కారం వల్ల గోవింద చంద్రుడు సన్యాసి అయి దేశ దేశాలు తిరుగుతాడు. ఎంతో కాలమయాక దేశానికి తిరిగి వస్తాడు. భార్యల్నీ, అన్న దమ్ముల్నీ కలుసుకుంటాడు. సంగ్రహంగా 'మయనామతీర్‌గాన్' లో కథ ఇది. ఈ కథ వ్రాసిన కవుల కావ్యాలు సర్ జార్జి గ్రియర్సను 1878 లో సంగ్రహించాడు.

పద్ధెనిమిదో శతాబ్దం చివరి భాగంలో చిన్న చిన్న చారిత్రక కావ్యాలు కొన్ని వెలువడ్డాయి. వాటిలో గంగారామదత్తు 'మహారాష్ట్రపురాణం' (1751) చెప్పదగినది. 'మహారాష్ట్రులు భాస్కరపండితుడి నాయకత్వం కింద బాంగ్లాదేశం కొల్లగొట్టిన ఉదంతం ఇందులో ప్రధానకథ. అలీవర్దిఖాను పరాభవమూ, మహారాష్ట్రుల పోరాటమూ,

చివర మహారాష్ట్ర సేనా నాయకుడు భాస్కర పండితుడు ఆలీవర్ధిఖాను కౌశలంతో గుప్తచరుడిచేత హతుడవడమూ కనుల కట్టినట్టు వర్ణించాడు కవి.

'కవివాలాలు'

ఈ శతాబ్దం చివరిలోనూ తరవాత శతాబ్దం ఆరంభంలోనూ కొందరు కవులు 'కవిగేయాలు' వ్రాశారు. ఈ తరగతి కవులను 'కవివాలాల'ంటారు. వీరిలో కలహాలు కూడా సాగేవి. వాటిని 'కవీరలడాయిలంటారు. కవులు రెండు పక్షాలుగా ఏర్పడి ఆశువుగా తరచు ఈ గేయాలు పాడతారు. పాడినప్పుడు 'కాంశి' అనే కంచు వాద్యం వాయిస్తారు. ఈ పక్షం కవి ఆ పక్షం వారిని పాటలతో సవాలు చేస్తాడు. ఆ పక్షం కవి సవాలుకి జవాబు పాటతోనే చెపుతాడు. జవాబు చెప్పలేని పక్షం వోడి పోయినట్టు లెక్క.

కవి వాలాలలో నిధుబాబూ, శ్రీధర కథకుడూ, రామవసూ, దాశరథిరాయి, భవానీవణిక మొదలైన వారు సుప్రసిద్ధులు.

## నిధూబాబు (1741 - 1834) :

ఇతని అసలు పేరు నిధిరామగుప్త. హుగ్లీజిల్లా చాంపతా జన్మస్థానం. కలకత్తా కుమారటులీ నివాసం. 'ఉప్పా' గేయాలు వ్రాయడంలో ఇతడు సిద్ధహస్తుడు. ఇతని గేయాలకు 'నిధుబాబూరఉప్పా' అని పేరు. మాతృభాషమీద నిధుబాబూ మమత ఉదారమైంది.

"నానా దేశె నానా భాషా,
బినె స్వదేశియా భాసె పూరెకి ఆశా !
కత నదీ సరోవర
కిబా ఫల చాత కీర
ధారా జల బినె కభుఘ చెకిత్రాస ?

(నానా దేశాల్లో నాభాషలున్నాయి. స్వదేశభాషతో కాని ఆశతీరుతుందా? ఎన్నో నదులు ఎన్నో సరోవరాలున్నాయి. వాన నీళ్ళతో కాని చకోరం దప్పి తీరుతుందా ?)

### శ్రీధర కథకుడు :

సుప్రసిద్ధ కథకుడితను. నిధుబాబు సమకాలికుడు. హుగ్లీజిల్లా బాంసబేడియా ఇతని నివాసం. తండ్రి లాలచాంద విద్యాభూషణుడు కూడా పేరెక్కిన కథకుడు. శ్రీధరుడు ఎన్నో గేయాలు వ్రాశాడు. సంగీతంలో సమర్థుడు. అతని గేయాలలో 'భాలబాసిచె బల్యేభాలబాసినె' (ప్రేమించాలని ప్రేమించలేదు) అన్న గేయం అక్షరాస్యులైన బంగాలీలందరికీ ఆనాడు పరిచితం.

### రామవసు (1787 - 1829)

కలకత్తా శావిదా ఇతని జన్మస్థానం. కవివాలాలలో ఆరిందా ఇతను లెక్కలేనన్ని 'కవిగేయాలు' వ్రాశాడు. ఎన్నోవైష్ణవ గేయాలున్నూ వ్రాశాడు. మొదట కొంతమంది కవివాలాలతో వుండి తరవాత తన సొంత జట్టు ఏర్పరుచుకున్నాడితను.

### దాశరథి రాయి (1806 - 1857)

వర్ధమానజిల్లా బాంకడా ఇతని జన్మస్థానం. దాసురాయి అని వాడుక పేరు. సుమారు అరవై 'పాలా' గ్రంథాలు ఇతనివి ఈనాడు అచ్చులో వున్నాయి. శ్రీమతి ఆకాబాయితీ స్థాపించిన 'కవివాలా' జట్టులో మొదట వుండి తరువాత సొంత జట్టు ఏర్పరుచుకున్నాడు దాసురాయి. కృష్ణకమల గోస్వామి ఇతని ప్రతిపక్షుడు.

### కృష్ణకమల గోస్వామి

నదియా జిల్లా భాజనఘాట ఇతని జన్మస్థానం. తండ్రి మురలీధర ఠాకూరు. గోస్వామి 'నిమాయి సన్యాస.', 'స్వప్నవిలాస', రాయి ఉన్మాదినీ, 'విచిత్ర విలాస', 'భారతమిలన'' 'సుబల సంవాద' మొదలైన ప్రసిద్ధ గేయకావ్యాలు వ్రాశాడు చివరి దినాలు ఢాకాలో గడిపాడు. అక్కడ ఇతణ్ణి 'బడగోసాంయి' అనే వారు.

### భవానీ వణిక

వర్ధమాన జిల్లా సాతగెఛె ఇతని జన్మస్థానం. వరాహనగరము నివాసం. మంచి కవీ, గాయకుడున్నూ ఇతను. ప్రసిద్ధ 'కవివాలా' నితాయి దాసుతో ఇతను 'లడాయి' సాగించేవాడు. ఈ 'కవిలడాయి'ని 'బాఘమహిషలడాయి' అనేవారు. ఎన్నో కవి గేయాలూ, మనోహరమైన ప్రేమగేయాలూ, భక్తి గీతాలూ వ్రాశాడు వణిక.

## నితాయిదాసు (1751 - 1821)

ఇతని వాడుక పేరు నితాయి బైరాగి, ఫరాసడాంగా, చందననగరం జన్మ స్థానం. ఇతడు కూడా మొదట వొక కవి వాలాల జట్టులో వుండి, తరవాత తన సొంత జట్టు ఏర్పరుచుకున్నాడు. 'కవీర్ లడాయి'లలో ఆరింటా ఇతను. కవీ, గాయకుడున్నూ కూడా.

## మధుకాన (1813-1863)

దాశరథిరాయి సమకాలికుడితను. పదాలలో 'ధాప' పద్ధతి ప్రవేశ పెట్టిన సుప్రసిద్ధ పదకర్త.

బాంగ్లా సాహిత్యంలో పద్దెనిమిదో శతాబ్దం చివరలో ప్రాచీన పద్ధతుల మీద అభిలాష సన్నగిల్లుతూ వచ్చింది. మిషనరీల కారణంగా గద్యకు పునాదులు కూడా ఈ సమయంలోనే పడ్డాయి. ముందు ముందు రానున్న బాంగ్లాసాహిత్య మహోదయానికి దూరభూరేఖలో తెలిరేకలు ఈ కాలంలోనే కనపడ్డాయి స్పష్టాస్పష్టంగా.

# వంగ సాహిత్య చరిత్ర

## ఉత్తర రంగం

## ఆధునిక సాహిత్యం

"ఐరోపీయ సాహిత్యాను ప్రేరణ మూలంగానే ఆధునిక బాంగ్లా సాహిత్యం ఉద్భవించింది. ఇందులో సందేహం లేదు.''

— రవీంద్రుడు.

ఇంగ్లీషు సభ్యత బాంగ్లాలో మత్తుమందులా పనిచేసింది. అది బాంగ్లాసాహిత్య ప్రవాహాన్ని కొత్తదారులు పట్టించింది. అయితే తొలిదినాల్లో దీనిని వ్యతిరేకించినవారు కూడా లేకపోలేదు తీవ్రంగా, ఒక కవి ఆధునికుల్ని ఇలా పరిహసించాడు:

"హాథిక్ !
ఫేరంగ వేశే
ఏయి వాల్మీకీర దేశే
కేతోరా
బేడాస్ సబ్
ఉల్కాముఖి అయా !

(ఛీ ఛీ ! ఎవరుమీరు, ఈ వాల్మీకి దేశంలో ఫరంగి వేషంలో తిరుగుతున్నారు, గుడ్లగూబ మోహంతో వచ్చి !)

అయితే గుడ్లగూబ ఆక్రోశించినంత మాత్రాన అరుణోదయం ఆగదు; ఆగలేదు. పందొమ్మిదో శతాబ్దారంభమే బాంగ్లా సాహిత్యంలో అరుణోదయం.

### గద్య

నన్నయనుంచీ అంతకు ముందునుంచీ మన తెలుగులో గద్య కనిపిస్తుంది. కాని. బాంగ్లా సాహిత్యంలో పందొమ్మిదో శతాబ్దానికి పూర్వం చెప్పదగిన

గద్య మచ్చుకైనా కనిపించదు. పందొమ్మిదో శతాబ్దం ఆరంభంలోనే 1801 లో బాంగ్లా గద్య గ్రంథం ప్రతాపాదిత్య చరిత్ర వెలువడింది. బాంగ్లా గద్య సాహిత్య చరిత్రను నాలుగు యుగాలుగా విభజించారు. చరిత్రకారులు. రామమోహనరాయి యుగం (1801-1843), తత్వబోధినీయుగం (1843-1872), బంకిమచంద్రయుగం (1872-1892), రవీంద్రనాథ యుగం (1892-నేటివరకు) అని.

## రామమోహనరాయి (1774-1833)

హుగ్లీజిల్లా రాధానగరం ఈయన జన్మస్థానం. మొదట ఈయన పూర్తి పేరు రామమోహన వంద్యోపాధ్యాయ. ఎనిమిదేళ్ళదాకా అరబ్బీ, బాంగ్లా భాషలు అభ్యసించాడు. తొమ్మిదేళ్ళ వయస్సులో అరబ్బీ అభ్యసించడానికి పాట్నా వెళ్ళాడు. అరబ్బీలో మంచి పాండిత్యం గడించాడు; పన్నెండేళ్ళ వయస్సులో కాశీవెళ్ళి సంస్కృతమూ, వేదాంతమూ నేర్చుకున్నాడు. పదహారేళ్ళ ప్రాయంలో కాశీపండితులతో వాదించి 'నాస్తికుడు' అని పేరు పడ్డాడు. అంచేత ఇంటికి వచ్చాక తండ్రి ఇంటినుంచి తరిమేశాడు. పదహారో ఏటే తన మతప్రచారం కోసం టిబ్బతు వెళ్ళాడు. అనంతరం ఇంగ్లీషు, ఉర్దు, హిబ్రు, ఫ్రెంచి, గ్రీకు, లాటిను భాషలు క్షుణ్ణంగా అభ్యసించాడు. ఆ భాషల ధర్మగ్రంథాలన్నీ అవలోకించాడు. అవసరమైనవి బాంగ్లాలో అనువదించాడు. 'ఆత్మీయసభ' 'బ్రహ్మసమాజము' స్థాపించాడు. సహగమనం, విధవా వివాహం మాన్పించాడు. బాంగ్లాలో 'బ్రాహ్మణ పత్రిక' స్థాపించాడు. ఇంగ్లీషులో 'ఈస్టిండియా గెజటు' సంపాదకుడుగా వున్నాడు. మొత్తం డెబ్బయి గ్రంథాలు వ్రాసి ప్రకటించాడు. 1830లో ఢిల్లీచక్రవర్తి ప్రతినిధిగా ఇంగ్లాండు వెళ్ళాడు. చక్రవర్తిచేత 'రాజా' బిరుదు పొందాడు. 1832 లో ఫ్రాన్సు వెళ్ళాడు. ఆ మరుచటి ఏడు బ్రిష్టలులో కాలంచేశాడు.

బాంగ్లా గద్య సాహిత్య ప్రథమ ప్రవర్తకుడు రామమోహనరాయలు, కలకత్తా ఫోర్టు విలియం కళాశాల (1800) గద్యగ్రంథాలు ప్రకటించడానికి కూడా రామమోహన రాయల ప్రోత్సాహమే కారణం. 1801-1815 లోపల ఫోర్టు విలియం గ్రంథమాల పదమూడు గద్యగ్రంథాలు ప్రకటించింది. రాయల చేయూతతోనే 1818 లో స్థాపితమైన 'స్కూలు బుక్కు సొసైటీ' ఎన్నో గద్య గ్రంథాలు ప్రకటించింది.

"నవ్య వంగేర సృష్టికర్తా రాజా రామమోహనరాయ్ బాంలాదేశే గద్య సాహిత్యేర భూమిపత్తన కరియా ఛేన్". (నవ్యవంగదేశ సృష్టికర్త రాజా రామ మోహనరాయి బాంగ్లాదేశ గద్య సాహిత్యానికి పునాదులు వేశారు) అన్నాడు విశ్వకవి రవీంద్రనాథుడు.

రామమోహన రాయలే ఆనాటి సర్వశ్రేష్ఠ గద్యరచయిత కూడా. తన సంస్కారోద్యమానికి గద్యరచన వొక ఉపకరణగా స్వీకరించా డాయన. సామాన్య ప్రజకు దుర్గ్రాహ్యమైన శాస్త్రీయ రహస్యాలు సులభమైన గద్యలో వివరించాడు రాయలు. అందుకనే సనాతన వాదులు అతనిమీద కత్తికట్టారు. సంస్కృతంలోని శాస్త్రీయ విషయాలు దేశభాషలో వ్రాయడమే మహాపరాధ మన్నారు.

'దేశభాషలో వేదాంత విషయాలు వినడం పాపం' అని ప్రచారం చేసి పండితుల వాదం ఖండిస్తూ రాయలు 'వేదాంత గ్రంథ' (1815) బాంగ్లా గద్యలో వ్రాసి ప్రకటించాడు. రాయల బాంగ్లా గద్య సరళమైంది. సుబోధమైంది. సంస్కృత శబ్దాడంబర మాయనకు కిట్టదు. 'వేదాంత చంద్రిక' రచయిత రాయలును హేళనచేసిన దానికి ప్రత్యుత్తరంగా రాయలు 'భట్టాచార్యేర సహిత విచార' అని వొక గ్రంథం వ్రాసి ప్రచురించాడాయన. ఇందులో ఎదటి వారిని పల్లెత్తు కటువాక్యమైనా ఉపయోగించ లేదు.

రాయల యుగంలో పాఠ్య గ్రంథాలూ, 'సమాచార దర్పణ', 'సంవాదకౌముది', 'సమాచార చంద్రిక', 'సమాచారాతిమిర', 'బెంగాలు హెరాల్డు', 'వంగదూత', 'సంవాద ప్రభాకర', 'జ్ఞానాన్వేషణ' మొదలైన ప్రతికలూ గద్యవాఙ్మయ వికాసానికి తోడ్పడ్డాయి.

పాఠ్యగ్రంథాలు : బాంగ్లా మొదటి గద్య గ్రంథం ప్రతాపాదిత్య చరిత్ర. ఇది ఫోర్డు విలియం కళాశాల కోసం రామ రామ వసు వ్రాశాడు. దీనిని 1801 లో లండనులో బాంగ్లా అక్షరాలలో ప్రకటించారు. ఈ గ్రంథం అచ్చుయే ముందు రామమోహన రాయలు సరిదిద్దాడు. ఈసంవత్సరమే లోకనాథశర్మ సంస్కృతం నుంచి హితోపదేశం బాంగ్లా గద్యలో వ్రాశాడు. రామ రామవసు రెండో గ్రంథం 'లిపిమాల', ఇది 1802 లో వెలువడింది. అదే ఏడు మృత్యుంజయ విద్యాలంకారుడి 'బత్రిస సింహాసన' వెలు

వడింది. విద్యాలంకారుడు 'హితోపదేశ', 'ద్వాత్రింశత్పుత్తలిక', 'రాజావాలి', 'ప్రబోధ చంద్రిక', 'వేదాంత చంద్రిక' మొదలైన గ్రంథాలు వ్రాశాడు. ఇతని ప్రబోధచంద్రిక ఏభై ఏళ్ళు పాఠ్య గ్రంథంగా వుంది. 1803 లో తారిణీ చరణమిత్ర 'ఈ సపేల్ కథావలి' ప్రకటించాడు. 1805 లో చండీ చరణమున్షీ వ్రాసిన 'తోతా ఇతిహాస' వెలువడింది. ఆ సంవత్సరమే రాజీవలోచన ముఖోపాధ్యాయ వ్రాసిన 'రాజా కృష్ణచంద్ర రాయ చరిత్ర' వెలువడింది. విలియం కారే (W. Carey) 1812 లో 'ఇతిహాసమాల' ప్రకటించాడు. విద్యాపతి సంస్కృత గ్రంథానికి అనువాదం 1815 లో హరప్రసాద రాయి 'పురుష పరీక్ష' ప్రకటించాడు.

## రామ రామ వసు (1757 – 1813)

చుంచుడా ఇతని జన్మస్థానం. చబ్బీస పరగణా నిమ్తాలో విద్యాభ్యాసం చేశాడు. కలకత్తా బాప్టిస్టు మిషనులో మున్షీగా చేరాడు. నవద్వీపం వెళ్ళి సంస్కృతం నేర్చుకు వచ్చాడు. మిషనరీల కోసం ఎన్నో గ్రంథాలు వ్రాశాడు. 'బ్రాష్ట వివరణామృతం', 'హరకరా' గ్రంథాలు మిషనరీలు చెప్పిన ప్రకారం వ్రాశాడు. అనంతరం వసు ఫోర్టు విలియం కళాశాలలో పండితుడుగా చేరాడు. ఆ కాలేజీ కోసమే 'రాజాప్రతాపాదిత్య చరిత్ర' (1801) వ్రాశాడు. బాంగ్లా గద్యసాహిత్యంలో ఇదే మొదటి గ్రంథం. జీవితాంతం వరకు రామ రామ వసుకళాశాల పండితుడుగానే వున్నాడు.

ఈ కాలంలోనే రామజయ తర్కాలంకారుడి 'సాంఖ్య ప్రవచన భాష్యానువాద' (1818), తారాచంద్ర దత్తు 'మనోరంజ నేతిహాస' (1819), ఫిలిక్సుకేరీ (Filix karey) 'వ్యవచ్ఛేద విద్య' (1820), 'విద్యాహారావళి', కాశీనాథ తర్క పంచాననుడి 'భాషా పరిచ్ఛేదాను వాద' (1831), 'పాషండ పీడన' (1823), భవనీచరణ వంద్యోపాధ్యాయ 'కలకత్తా కమలాలయ', గౌరమోహన విద్యాలంకారుడి 'బహుదర్శన', భవానీ చరణ తర్కభూషణుడి 'జ్ఞానరసతరంగిణి' (1823), జాన్ క్లార్కు మార్షమాన్ 'సద్గుణ ఓ వీర్యేర ఇతిహాస' (1831), భారత వర్షేర ఇతిహాస' (1831), క్షేత్రమోహన ముఖోపాధ్యాయ అనువదించిన 'గ్రీకు దేశేర ఇతిహాస' (1833), కలకత్తా బైబిలు సొసైటీ వారి బైబిలు' అనువాదం (1833), గోపాలలాల్ మిత్ర 'జ్ఞాన చంద్రిక' (1837), గౌరీశంకర తర్కవాగీశుడి 'జ్ఞాన ప్రదీప' (1840) మొదలైనవి వెలువడ్డాయి.

## తత్వబోధిని

ఈ మాసపత్రిక 1843 లో ప్రారంభమైంది. దీని ప్రతిష్ఠాత దేవేంద్రనాథ ఠాకూరు సంపాదకుడు అక్షయ కుమార దత్తు. బాంగ్లా గద్యవాఙ్మయవికాసానికి తత్వబోధిని చేసిన సేవ అపారమైంది. అంత వరకు సాగుతూ వుండిన బాంగ్లా గద్యను నూతన మార్గం పట్టించిందిది. సంపాదకుడు అక్షయ కుమారదత్తు, దేవేంద్రనాథ ఠాకూరు, ఈశ్వరచంద్ర విద్యాసాగర, రాజనారాయణ వసు ద్విజేంద్రనాథ ఠాకూరు మొదలైన మహారథులు ఈ పత్రిక వ్యాసకర్తలు, వీరి వ్యాసాలతో బాంగ్లా గద్య సాహిత్యం ఎంతయినా పురోగమించింది వడివడిగా.

## అక్షయకుమార దత్తు (1820 - 1886)

పన్నెండేళ్ళు 'తత్వబోధిని' సంపాదకుడుగా వున్నాడీయన. జన్మస్థానం వర్ధమాన జిల్లా చుపీ. తండ్రి పీతాంబర దత్తు, తల్లి దయామయి. 'దర్శనశాస్త్రం'లో ప్రాక్పాశ్చాత్య గ్రంథాలు క్షుణ్ణంగా చదివిన పండితుడుదత్తు, ఈశ్వరచంద్ర విద్యాసాగరుడి ప్రోత్సాహంతో గద్య రచనకు పూనుకుని బాంగ్లా గద్య నిర్మాతలలో వొకడయాడు. విద్యాసాగరుడే మహర్షి దేవేంద్రనాథుడి పరిచయం కలిగించాడితనికి. మహర్షి 'తత్వబోధిని' పత్రిక సంపాదన దత్తుకి అప్పగించాడు. మూడు భాగాలు 'చారుపాఠ', 'భూగోల', 'బాహ్య వస్తుర సహితమానవ ప్రకృతిర సంబంధ విచార', 'ధర్మనీతి', 'పదార్థ విద్య', భారతవర్షీయ ఉపాసక సంప్రదాయ' మొదలైన గ్రంథాలు వ్రాశాడు దత్తు, ఇతని గ్రంథాలన్నీ ఇంచుమించు, తత్వబోధినిలోనే వెలువడ్డాయి. మొదటి గద్య రచన సంవాద ప్రభాకరలో వెలువడింది, 'బాహ్య వస్తుర సహిత మానవ ప్రకృతిర సంబంధ విచార' జార్జికాంబే వ్రాసిన 'కాన్స్టిట్యూషన్ ఆఫ్ మాన్' గ్రంథానికి అనుసరణ. 'చారుపాఠ' వివిధమైన ఆంగ్ల వ్యాసాల ననుసరించిన వ్యాససంపుటి. 'ధర్మనీతి' హెచ్, హెచ్. విల్సను వ్రాసిన 'ఎస్సేసు అండు లెక్చర్సు ఆన్ ది రెలిజన్ ఆఫ్ హిందూస్' గ్రంథానికి అనుకరణ.

దత్తు గద్యలో అతని తరవాత వారి లాలిత్యం లేక పోవచ్చు. కాని సరళంగా, నిరాడంబరంగా, సూటిగా వ్రాయడంలో గద్య రచయితలకు అతడు పెట్టినది తొలి ఒరవడి.

## మహర్షిదేవేంద్రనాథఠాకూరు (1817-1905)

రవీంద్రనాథఠాకురుగారి తండ్రి, 'తత్వబోధిని' సభ, 'తత్వబోధిని' పాఠశాల, 'తత్వబోధిని' పత్రికా స్థాపించాడు. ఈయన ఉద్యోగంతో 'బ్రహ్మసమాజం' స్థాపిత మయింది. 'బ్రహ్మధర్మ', 'బ్రహ్మధర్మేర వ్యాఖ్యాన', 'ఆత్మజీవని', 'ఋగ్వేద అనువాద' మొదలైనవి ఈయన గ్రంథాలు.. గాంభీర్యమూ, సరసతా కలిగిన గద్య వ్రాశా డీయన.

## ఈశ్వరచంద్ర విద్యా సాగరుడు (1820-1891)

ఆధునిక గద్యసాహిత్య జనకుడీయన. అసలు పేరు ఈశ్వర చంద్రవంద్యోపాధ్యాయ. 'విద్యా సాగర' ఉపాధి. మేధినీపురం జిల్లా వీరసింహ గ్రామం ఇతని జన్మస్థానం. తండ్రి ఠాకూరదాస వంద్యోపాధ్యాయ. తల్లి భగవతీదేవి. విద్యాసాగరుడు కలకత్తా సంస్కృత కలాశాలలో వ్యాకరణమూ. సాహిత్యమూ, అలంకారమూ, వేదాంతమూ. స్మృతీ, న్యాయశాస్త్రిమూ అభ్యసించాడు. స్వయంగా హిందీ, ఇంగ్లీషూ నేర్చుకున్నాడు 'హిందూలా కమిటీ' ఇతనికి 'విద్యాసాగర' బిరుదిచ్చింది.

విద్యాసాగరుడు మొదట ఫోర్డువిలియం కళాశాలలో పండితుడుగా చేరాడు. తరవాత 1851 లో సంస్కృత కాలేజీ అధ్యాపకుడుగా చేరి అనంతరం అధ్యక్షుడయాడు. విధవా వివాహ సంస్కారోద్యమంలో ఈయన కృషి చారిత్రకమైంది.

బాంగ్లాలో లలితమైన, మధురమైన గద్యశైలి ప్రవేశ పెట్టాడీయన. అందుకనే ఇతణ్ణి గద్యసాహిత్య జనకుడన్నారు. 'వేతాల పంచవింశతి', 'సీతారవనవాస', 'కథా మాల', 'బోధోదయ', 'చరితావలీ', 'ఆఖ్యానమంజరీ, 'ఉపక్రమణికా', 'వ్యాకరణ కౌముదీ', 'ఋజుపాఠ', 'శకుంతలా' 'ఉత్తర రామచరిత' 'భ్రాంతి విలాస', 'సంస్కృతభాష ఓ సంస్కృత సాహిత్య శాస్త్రి విషయక ప్రస్తావ', 'విధవా వివాహ ప్రచలిత హవుయా ఉచితకి నా ఏతద్విషయక ప్రస్తావ' మొదలైన గ్రంథాలు వ్రాశాడు విద్యాసాగరుడు. చివరి రెండు గ్రంథాలూ ఆయన అసాధారణ పాండిత్యానికి నిదర్శనాలు.

విద్యాసాగరుడు మహాభారతం సంస్కృతం నుంచి బాంగ్లాలో అనువాదం చేసి ఆది పర్వం 'తత్వబోధిని'లో ప్రకటించాడు. అనంతరం ఆపని కాళీప్రసన్న సింహాకు అప్పగించాడు.

సంస్కృతకాలేజీ అధ్యక్షుడుగా వుండి విద్యాసాగరుడు కొంతమంది రచయిత లను వొక గోష్టిగా ఏర్పరిచాడు. ఈ గోష్టిని 'సంస్కృత కాలేజి గోష్టి' అనే వారు. ఈ గోష్టి రచయితలు విద్యాసాగరుణ్ణి అనుసరించి గద్య రచనలు సాగించారు. వీరిలో తారా శంకర తర్క రత్న, రామగతి న్యాయరత్న, నీలమణి బసాక ముఖ్యులు.

## తారాశంకర తర్క రత్న (—1858)

నదియా జిల్లా ఫాంచపులి ఇతని జన్మస్థానం. తండ్రి మధుసూదన చటో పాధ్యాయ. సంస్కృత కళాశాల గ్రంథభండారిగా వుండేవాడు. బాణభట్టు 'కాదంబ రికి' ఇతని బాంగ్లా గద్యాను వాదం ప్రసిద్ధమైంది. 'సోమప్రకాశ' పత్రికలో వ్యాసాలు వ్రాసి పేరు గడించాడి తను 'భారతవర్షీయ స్త్రీ గణేరవిద్యా శిక్ష', 'రాసెలాస్' ఇతని ఇతర గ్రంధాలు.

## రామగతి న్యాయరత్న (1831–1894)

మంచి విమర్శకు డితను. హుగ్లీ జిల్లా హల్‌భోవా జన్మస్థానం. హుగ్లీ నార్మలు స్కూల్లో ఉపాధ్యాయుడుగా వుండేవాడు. 'బాంగ్లా భాష ఓ బాంగ్లా సాహిత్య విషయక ప్రస్తావ', 'రోమావతీ', ఇలభోవా' మొదలైన గద్య గ్రంథాలు వ్రాశాడు. 'బాంగ్లా భాష ఓ బాంగ్లా సాహిత్య విషయక ప్రస్తావ' మొదటి బాంగ్లా సాహిత్య చరిత్ర గ్రంథం.

## నీలమణి బసాక (1805-1864)

సుప్రసిద్ధ గద్య రచయిత ఇతను. తండ్రి రామచంద్ర బసాక. రామబగాన్ ఇతని జన్మస్థానం. ఇతని 'నవనారి' వాంగ్లా గద్య సాహిత్యంలో పేరుపడిన గ్రంథం. 'పారస్య ఇతిహాస' 'పారస్య ఉపన్యాస','భారత వర్షేర ఇతిహాస' మొదలైనవి ఇతని గ్రంథాలు.

'సంస్కృత కాలేజి గోష్ఠి' లాగే కొంతమంది రచయితలు 'హిందూ కాలేజి గోష్ఠి' గా ఏర్పడ్డారు. ఈ గోష్ఠికూడా బాంగ్లా గద్యసాహిత్యంలో ప్రముఖ పాత్ర వహించింది. ఈ గోష్ఠి చేతిలో 'తత్వబోధిని' పత్రిక వుండేది. 'సంస్కృత కాలేజి గోష్ఠి' బాంగ్లా సాహిత్యంలో సంస్కారం ప్రవేశపెడితే, 'హిందూ కాలేజి గోష్ఠి'

విప్లవం ప్రవేశపెట్టింది. ఈ గోష్ఠి గద్య రచయితలలో ప్యారీచాంద మిత్ర బాంగ్లా గద్యలో విప్లవం తీసుకు వచ్చాడు. ఇలాగే మధుసూదనదత్తు పద్యంలో విప్లవం సృష్టించాడు తరవాత.

'హిందూ కాలేజి గోష్ఠి' గద్య రచయితలలో మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు, రాజ నారాయణ వసు, ద్విజేంద్రనాథ ఠాకూరు, భూదేవముఖోపాధ్యాయ, ప్యారీచాందమిత్ర ముఖ్యులు.

## రాజ నారాయణవసు (1826-1899)

మంచి వ్యాస రచయిత ఇతను; భాషాతత్వవేత్త. ఇంగ్లీషులోను, బాంగ్లాలోను ఎన్నో వ్యాసాలు వ్రాశాడు. ఇతని రచనలు ఇంగ్లండులోకూడా చర్చింపబడ్డాయి అధికంగా. విద్యాసాగరుడితో కలిసి విధవా వివాహోద్యమంలో పనిచేశాడు. సంస్కృత కాలేజిలో కొన్నాళ్ళు ఉపాధ్యాయుడుగా పనిచేశాడు. 'బ్రహ్మసమాజే ర వక్తృతా' 'సేకాల ఆర్ ఏ కాల', 'వక్తృతా', 'వివిధ ప్రసంగ', 'వృద్ధహిందూర ఆశా', 'బాంగాలా భాషా ఓ సాహిత్య విషయక వక్తృతా' మొదలైనవి ఇతని గ్రంథాలు.

## భూదేవముఖోపాధ్యాయ (1825-1894)

పేరుపడిన గద్య రచయిత; విద్యావేత్త. కలకత్తా ఇతని జన్మస్థానం. తండ్రి విశ్వనాథ తర్కరత్న. భూదేవుడు మధుసూదన దత్తు సహపాఠి. కొంతకాలము Director of Public Instruction గా పనిచేశాడు. 'పారివారిక ప్రబంధ', 'సామాజిక ప్రబంధ', ఆచార ప్రబంధ పుష్పాంజలి', 'ప్రాకృతిక విజ్ఞాన', 'క్షేత్ర తత్వ' 'పురావృత్తసార'. 'ఇంలెండేర ఇతిహాస', 'రోమేర ఇతిహాస', 'ఐతిహాసిక ఉపన్యాస', 'స్వప్నలబ్ధ భారతేర ఇతిహాస' మొదలైన బహుగ్రంథాలు వ్రాశాడు. 'ఎడ్యుకేషన్ గెజటు', 'శిక్షాదర్పణ' 'సంవాదసార' పత్రికల సంపాదకుడుగా పనిచేశాడు.

## ప్యారీచాంద మిత్ర (1814-1883)

టేకచాంద ఠాకూరు అని ఇతని ప్రసిద్ధ నామం. బాంగ్లా గద్యలో విప్లవం తెచ్చిన రచయిత ఇతను. కలకత్తా నిమతలా జన్మస్థానం. తండ్రి రామనారాయణ మిత్ర. కలకత్తా పబ్లికు లైబ్రరీ లైబ్రేరియనుగా పనిచేశాడు టేకచాంద ఠాకూరు. 'అలాలేర ఘరేర దులార' ఇతని ప్రసిద్ధ నవల. 'మదఖాశ్రయా బడ దాయ',

'జీతథాకారీకి ఉపాయ', 'ఆధ్యాత్మికా' మొదలైనవి ఇతని ఇతర గ్రంథాలు. 'మాస పత్రిక' అని వొక మాసపత్రిక కొన్నాళ్ళు నడిపాడు. 'కలకత్తా రివ్యూ' లో ఎన్నో వ్యాసాలు వ్రాశాడు'.

## ద్విజేంద్రనాథ ఠాకూరు (1840-1926)

'తత్వబోధిని' 'భారతి' పత్రికల సంపాదకుడుగా కొన్నాళ్ళున్నాడు. వంగీయ సాహిత్య పరిషత్తు సభాపతిగా కొన్నాళ్ళున్నాడు. మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు ప్రథమ కుమారు డీయన; రవీంద్రుడి అన్న; కవి; సాధకుడు. 'గీతాపాఠేర భూమిక' మొదలైన రచనలు చేశాడు,

## కృష్ణమోహన వంద్యోపాధ్యాయ (1813-1885)

ఆనాటి గద్య నిర్మాతలలో ఒక డీయన. కలకత్తా ఇతని జన్మస్థానం. తండ్రి జీవన కృష్ణవంద్యోపాధ్యాయ. క్రయిస్తవమతం స్వీకరించిన కారణంగా రెవరెండు. కె. ఎమ్. బానర్జీ అని ఇతని వాడుక పేరు. ఇతని సాయంతో మధుసూదన దత్తు క్రీస్తుమత దీక్షితుడయాడు. కృష్ణమోహనుడు సంస్కృతం, ఉర్దు, ఫార్సీ, హిందీ. గ్రీకు, లాటిను, హీబ్రూ, ఒడియా మొదలైన భాషలలో పండితుడు. ఎన్నో సంస్కృత గ్రంథాలు ఇంగ్లీషులో తర్జుమా చేసాడు. బాంగ్లాలోనూ ఇంగ్లీషులోనూ గ్రంథాలు వ్రాశాడు. 'హిందూ యూథ్' 'సంవాదసుధాంశు' పత్రికలు నడిపాడు. 'ఉప దేశకథా' (1840), 'రోమేర్ ఇతిహాస' (1848), 'షడ్దర్శన సంవాద', 'The Perse cuted' మొదలైనవి ఇతని ప్రసిద్ధగ్రంథాలు.

గ్రంథ రచన ఎలాచెయ్యాలో ఇతను 'విద్యాకల్పద్రుమ' లో ఇలా వివరించాడు:

"శుద్ధంగా, స్పష్టంగా, తాత్పర్యం వ్యక్తపరచడమే గ్రంథకర్త కర్తవ్యం. అలంకారం కోసం ప్రయాస అనవసరం. బాంగ్లాభాష ఈనాడు (1850) కూడా విశృంఖలావస్థలో వుంది. ఇది అందరూ అంగీకరిస్తారు. మాధుర్యం పేరు చెప్పి భాషను అలంకార బాహుళ్యం చెయ్యడం అనర్థానికి దారితీస్తుంది, సమాసాల ఆడం బరమూ, అర్థంకాని శబ్దాలు ప్రయోగించడమూ, వంగభాష ప్రగతికి గొడ్డలిపెట్టు."

## కాళీప్రసన్నసింహ (1840-1890)

మహాభారతం గద్యలో అనువదించిన రచయిత ఇతను. జోడా సంకొ ఇతని జన్మస్థానం. తండ్రి నందలాలసింహ. 'విక్రమోర్వశీ' 'మాలతీమాధవ' నాటకాలూ.

హుతోమపేంచారనక్సా' మొదలైన ఎన్నో గ్రంథాలు వ్రాశాడు కాళీప్రసన్న. 'విద్యో' త్సాహిని' 'సర్వతత్వ ప్రకాశికా'. 'పరిదర్శక' మొదలైన పత్రికలు నడిపాడు.

బాంగ్లా ప్రభుత్వం 1851 లో 'వంగ భాషానువాదక సంఘం' స్థాపించింది. ఈ సంఘం ముఖ్యంగా ఇంగ్లీషునుంచి మంచిమంచి గ్రంథాలు బాంగ్లా గద్యలో అను వాదం చేసి ప్రకటించింది సంఘ యాజమాన్యంలో 'వివిదార్థ సంగ్రహ' పత్రిక 1851 లో వెలువడింది. బాంగ్లా గద్య సాహిత్యానికి ఎంతో సేవ చేసిందిది. దీని సంపాదకుడు రాజేంద్రలాలు మిత్ర.

### రాజేంద్రలాలు మిత్ర (1822-1891)

ఛబ్బిసి పరగణాసుండా ఇతని జన్మస్థానం. తండ్రి జనమేజయ మిశ్ర. 'ఏసియాటిక్ సొసైటి' సహాయ సంపాదకుడుగా కొంతకాలం పనిచేశాడు రాజేంద్ర లాలు. బాంగ్లా, ఇంగ్లీషు, ఫార్శీ, ఉర్దూ, హిందీ, గ్రీకు, లాటిను, జర్మనీ మొదలైన బహుభాష లెరుగు నితను. మొత్తం నూటా పాతిక గ్రంథాలు వ్రాశాడు. వీటిలో 'వివిదార్థ సంగ్రహ', 'మివారేర రాజ్యేతివృత్త', 'శివాజీర జీవని' రహస్య సందర్భ', 'వ్యాకరణప్రవేశ' మొదలైనవి ముఖ్యమైనవి. బుద్ధగయ, ఒడిశాల పురాతత్వ విషయాల గూర్చి ఇతను వ్రాసిన గ్రంథాలు సుప్రసిద్ధమైనవి.

వర్ధమాన మహారాజు మహాతాపచాంద (1820-1879) బాంగ్లా గద్య సాహి త్యానికి చేసిన సేవ చిరస్మరణీయమైంది. 'రామాయణ' 'మహాభారతాలు', 'చార్ దర్వేష', 'హాతిమతాయి' మొదలైన గ్రంథాలు బాంగ్లా గద్యలో అనువాదం చేయిం చాడితను. వాటిని ప్రకటించి ఉచితంగా పంచి పెట్టాడు. తాను స్వయంగా కవి; పండితుడు; గ్రంథకర్త.

### చంద్రశేఖరవసు (1833-1902)

నదియా జిల్లా ఉలా గ్రామం ఇతని నివాసం. తండ్రి కాళీచరణవసు. 'అధికార తత్వ', 'వేదాంప్రవేశ', 'పరలోకతత్వ', 'వక్తృతా కుసుమాంజలి' మొదలైన గద్య గ్రంథాలు వ్రాశాడితను.

### కేశవచంద్రసేను (1838-1884)

సుప్రసిద్ధబ్రహ్మ సమాజ నాయకుడితను. హుగ్లీజిల్లా గరిఫా నివాస స్థానం. తండ్రి ప్యారీమోహనసేను జన్మస్థానం కలకత్తా కలుటోలా. 1857 లో కేశవచంద్రుడు

బ్రహ్మసమాజంలో చేరాడు కాని, దేవేంద్రనాథఠాకూరుతో మత భేదం కలిగి తాను ప్రత్యేకం 'భారతవర్షేర బ్రహ్మ సమాజం' స్థాపించాడు. అయితే 1875 లో తనకూతుర్ని కూచి బిహారు మహారాజుకిచ్చి వివాహం చెయ్యడంతో ఈ బ్రహ్మ సమాజంలో కల్లోలం బయలు దేరింది. దాంతో ఇది కూడ విడిచి పెట్టి 'నవ విధాన బ్రహ్మ సమాజం' స్థాపించాడు.

కేశవచంద్రసేను మంచివక్త. గద్య రచనలో సిద్ధహస్తుడు. ఇతని బ్రహ్మ సమాజ ఉపన్యాసాలు బాంగ్లా గద్య 'సాహిత్యంలో అమూల్యమైన సంపద' 'ఆచార్యేర ఉపదేశ', 'బ్రహ్మోత్సవ', 'జీవనవేద' మొదలైన ఇతని గ్రంథాలు సుప్రసిద్ధమైనవి.

## గిరీశచంద్రసేను

పార్సీ, అరబ్బీ, భాషలలో మంచిపండితుడితను. ఆభాషలనుంచి ఎన్నో గ్రంథాలు బాంగ్లా గద్యలో వ్రాశాడు. 'హితోపాఖ్యానమాల', 'దేవర్షి దిశేర ఉక్తి', 'హాపీజ్', 'మహమ్మదేర్ జీవని', 'ఖొరాను' మొదలైనవి ఇతని గ్రంథాలు.

## త్రైలోక్యనాథ సన్యాలు

కవీ, నవలా రచయితా, వ్యాస రచయితాన్నూ ఇతను. 'గరలే అమృత', 'వింశ శతాబ్ది' అని రెండు నవలలూ, మూడు నాటకాలూ, మూడు కావ్యాలూ, జగతేర బాల్య ఇతిహాస', 'భక్తి చైతన్య చంద్రిక', 'ఈశాన చరితామృత', 'కేశవ చరిత' అని ప్రసిద్ధ గద్య గ్రంథాలూ వ్రాశాడితను.

## జీవత చరిత్రలు

బాంగ్లా గద్య సాహిత్యం జీవిత చరిత్రతో ఆరంభమైంది. తొలి గ్రంథం 'ప్రతాపాదిత్య చరిత్ర', అనంతరం క్రమంగా ఎన్నో చరిత్ర గ్రంథాలు వెలువడ్డాయి. వీటిలో అఘోరనాథగుప్త వ్రాసిన 'శాక్యముని చరిత్ర', ఈశ్వరచంద్రగుప్త వ్రాసిన 'భారత చంద్రరాయ గుణాకరేర జీవనవృత్తాంత', కాలీమయా ఘటక వ్రాసిన 'చింతాష్టక', సౌదామనీ సింహ వ్రాసిన 'నారీ చరిత', శ్యామనాథరాయ చౌధురి 'కుముదినీ చరిత', కార్తికేయ చంద్రరాయి 'ఆత్మజీవని', రాససుందరి వ్రాసిన 'అమార జీవన', మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు 'ఆత్మకథ', దేవేంద్రనాథదాసు 'గోపాలేర కథా', యోగేంద్ర విద్యాభూషణ వ్రాసిన 'జోసెఫ్ మాట్సినీ ఓ ఇతలీ', 'గారిబాల్డి

జీవన వృత్త', సత్యాచరణశాస్త్రి 'ఛత్రపతి మహారాజ శివాజీర జీవన చరిత', 'మహారాజ నందకుమారీ చరిత', నగేంద్ర చట్టోపాధ్యాయ 'రాజా రామమోహనరాయేర జీవన చరిత', వీహారీలాలు సర్కారు 'విద్యా సాగర', యోగేంద్రనాథ వసు వ్రాసిన 'మైకేలు మధుసూదన దత్తేర జీవన చరిత', చండీ చరణ వంద్యోపాధ్యాయ వ్రాసిన 'విద్యాసాగర జీవని' పేర్కొన దగినవి.

## బంకిమచంద్ర చట్టోపాధ్యాయ (1838-1898)

బాంగ్లా గద్య సాహిత్యంలో నవయుగం ప్రతిష్ఠించిన మహనీయుడు బంకిమ చంద్ర చట్టోపాధ్యాయ. నవలా రచనకు పూనుకుని గద్య రచనలో ఆయన చూపిన కళాకౌశలం అపూర్వమైంది. అతని తొలి నవల (1865) వెలువడడంతోనే బాంగ్లా గద్యకు శుభోదయమైందన వచ్చు. రామమోహనరాయి, దేవేంద్రనాథ ఠాకూరు, అక్షయ కుమారదత్తు, ఈశ్వరచంద్ర విద్యాసాగర, ప్యారీచాంద, భూదేవవసు ప్రభృతులు వేసిన రాజ బాటలో బాంగ్లా గద్య సాహిత్యరథం పరువులు పెట్టించిన విజయ సారథి బంకిమచంద్రుడు.

బంకిమబాబు 1835 ఏప్రెలు అయిదున నైహాటీ దగ్గిర కాంఠాలపాడాలో జన్మించాడు. తండ్రి యాదవచంద్ర చట్టోపాధ్యాయ. బంకిమచంద్రుడు మొదట కవిత్వమల్లుతూ సాహిత్య రంగానికి వచ్చాడు. ఇతని తొలికవిత 1854 లో 'సంవాద ప్రభాకర'లో వెలువడింది. 1853 లో తన 'లలితా ఓ మానస' కావ్యం వ్రాశాడు.

బంకిమబాబు 1865 లో కలకత్తా విశ్వ విద్యాలయంలో పట్టభద్రుడయాడు. 1868 లో బి. ఎల్. పాసయాడు. పట్టభద్రుడైన సంవత్సరమే అతని మొదటి నవల 'దుర్గేశనందిని' వెలువడింది. మొత్తం పద్నాలుగు నవలలు వ్రాశాడతను. 'కమలా కాంతేర దప్తర్', 'లోక రహస్య', 'వివిధ ప్రబంధ', 'కృష్ణచరిత్ర' మొదలైన ఇతర గ్రంథాలూ, ఎన్నోవ్యాసాలూ వ్రాశాడు. 'వంగదర్శన', 'ప్రచార' పత్రికలు నిర్వహించాడు. 'వంగదర్శన' 'సుప్రసిద్ధ సాహిత్య పత్రిక. 'కృష్ణ చరిత్ర' భారత, భాగవత, హరివంశాది పురాణాలు పరిశీలించి వ్రాసిన మంచి విమర్శన గ్రంథం. రచయిత పాండిత్యానికి అద్దొక మచ్చుతునక.

బంకిమబాబు బాంగ్లా గద్య సాహిత్యంలో నవయుగ ప్రతిష్ఠాపకుడని ముందే చెప్పాను. గతానుగతికంగా సంస్కృత శబ్దాడంబరానికీ, అలంకార బాహుళ్యానికీ

బానిసగావుండిన బాంగ్లాభాషా దేవిని స్వతంత్ర మూర్తి తీర్చి దిద్దాడతను. సహజ సుందరమైన అతని గద్య పాఠకలోకాన్ని పరవశపరిచింది. మధుర మంజులమైన పదాలు, చిన్న చిన్న వాక్యాలు చిత్రించడంలో బంకిమబాబు సిద్ధహస్తుడు. అతని తొలి రచనలలో అవుపడే సమాసాలు రానురాను చివరి రచనలలో మాయమైనాయి. బంకిమచంద్రుడంతటి అసాధారణ ప్రతిభావంతుడు అవతరించక పోయివుంటే బాంగ్లా గద్య సాహిత్యం ఇంత త్వరలో ఇంత ఔన్నత్యం పొంది వుండేది కాదు. గద్య ఎలా వుండాలో తెలుపుతూ అతను వ్రాసిన వాక్యాలు రచయితలందరూ గమనించ దగినవి.

"గద్య ఎంత సుబోధ్యమైతే సాహిత్యం అంతఉన్నతికి వస్తుంది. ఏ సాహిత్యం అయిదారుగురి కోసం మాత్రం వ్రాయబడుతుందో ఆ సాహిత్యం జగత్తులో ఎందుకూ పనికి రాదు."

చిన్న చిన్న వాక్యాలు సృష్టించడంలో బంకిమబాబు నైపుణ్యం పరికించ దగింది.

"వర్షాకాల బడ దుర్దిన. సమస్తదిన వృష్టి హయి యాఛె. ఎక బారవు సూర్యోదయ హయనాయి, ఆకాశ మేఘఢాకా. కాశీ జాయిబార పాకా రస్తార ఘటింగేర ఊపరె ఏకటు ఏకటు పిఛల హయి యాఛె. పధే ప్రాయ లోక నాయి. భిజియా భిజియాకే పథచాలె? ఏక జన మాత్ర పథిక జాయితె ఛిల. పథికేర బ్రహ్మచారి వేశ. గైరి వర్ణేర వస్త్ర పరా, గలాయ రుద్రాక్ష. కపోలె చందన రేఖా. జటార ఆడంబర కిఛానాయి."—విషవృక్ష.

"బంకిమ చంద్రుని నవీన ప్రతిభాలక్ష్మి సుధాభాండము బుజాన పెట్టుకుని బాంగ్లా దేశంలో అవతరించింది. అప్పుడు ప్రాచీనపండితులు పలువురుండే వారు. కాని వారు బంకిమ చంద్రుని రచనలను ఆనంద సమ్మానాలతో అభ్యర్థించ లేకపోయినారు. పైగా ఉదారులవలె ఉపేక్షించలేదు. అందుచే బంకిమ చంద్రుడు ఆనాడు పరిహాసమూ, విద్రూపమూ, గ్లానీ సహించవలిసి వచ్చింది. ఆయన మీద కొంత మందికి తీవ్రమైన విద్వేష మంకురించి ఉద్రేకించింది. ఆయన ననుకరించ వలెనని వ్యర్థప్రయత్నం చేశారు క్షుద్ర రచయితలు, భంగ పడ్డారు. కాగా తమ చర్య గోప్యము చేసుకోడానికై అందరి కంటె ఎక్కువగా దుమ్మెత్తి పోశారు.

"బంకిమచంద్రుడు వంగ సాహిత్య ప్రభావములో సూర్యుడివలె భాసించాడు."

"రామమోహనరాయలు వంగసాహిత్యం ఏ ముంపులోనూ పడకుండా ఆ విషమ స్థాయిలో స్థాపించాడు. బంకిమచంద్రుని ప్రతిభాప్రవాహం ఆ భూమిమీద నిండార వెల్లి విరిసి ఒండుమట్టి పేరబెట్టి బలపరిచి పోయింది. ఈవేళ బాంగ్లాక్షేత్రం కేవలమూ వ్యవసాయ యోగ్యం కావడమే కాదు, బహుసారవంతమై ఫలసస్య శ్యామలంగా ప్రకాశిస్తున్నది. నివాసభూమి నిజమైన మాతృభూమి అయింది.

"మాతృభాషకు ప్రాప్తించిన వంధ్యాదశను తప్పించి సఫల గౌరవశాలినిగా చేశాడు బంకిమచంద్రుడు."

"ఒకప్పుడు వంగభాష ఏకతార వాద్యములాగా వొంటి తీగతో వుండేది. అది సహజ స్వరావళితో కేవలం ధర్మసంకీర్తనకు మాత్రం పనికివచ్చేది. బంకిమబాబు స్వహస్తాలతో దానికి ఒక్కటొక్కటిగా తీగెలు సవరించి వీణాయంత్రంగా సిద్ధం చేశాడు. పూర్వం స్థానిక పదాలు వాయించడానికే సరిపోయింది అది. ఇప్పుడు విశ్వ సభలో వినవగిన ధ్రువపదాంగ కలావతీ రాగాలు ఆలపించడానికి సమర్థమయింది. అదే ఆయన స్వహస్త పూర్ణస్నేహపాలిత క్రోడ సంగిని" అన్నాడు విశ్వకవి రవీంద్రుడు.

ఆనాటి చిన్నపెద్ద రచయిత లందరిమీదా బంకిమచంద్రుడి ప్రభావం ఇంతో అంతో పడింది. రమేశచంద్ర దత్తు, సంజీవచంద్ర చట్టోపాధ్యాయ, స్వర్ణకుమారీదేవి, అక్షయచంద్ర సర్కారు, యోగీంద్రనాథ విద్యాభూషణ, చంద్రశేఖర ముఖోపాధ్యాయ, చంద్రనాథ వసు, మీర్ మశారఫ్ హుసేను మొదలైన వారు స్పష్టంగా ఆయన ననుసరించారు. బంకిమబాబు అనంతరం కూడా హరప్రసాదశాస్త్రి, ప్రభాతకుమార ముఖోపాధ్యాయ, రాఖాలదాస వంద్యోపాధ్యాయ ప్రభృతులు ఆయన ననుకరించారు.

### రమేశచంద్ర దత్తు (1448-1909)

బంకిమ యుగ గద్య రచయితలలో ముఖ్యంగా పేర్కొనదగిన వ్యక్తి రమేశ చంద్ర దత్తు. కలకత్తా రామబాగాన్ ఈయన జన్మస్థానం. తండ్రి ఈశానచంద్ర దత్తు.

రమేశచంద్ర దత్తు ఐ. సి. యస్. పరీక్షలో ఉత్తీర్ణుడై శాసన విభాగంలో పని చేశాడు. ఇతని నవలలు బాంగ్లాసాహిత్యంలో ప్రసిద్ధమైనవి ఇతని ఇంగ్లీషు గ్రంథం 'Civilisation of Ancient India' ఉత్కృష్టగ్రంథం.

ఉద్యోగం విరమించాక కొన్నాళ్ళు లండను యూనివర్సిటీ కళాశాలలో భారతీయ చారిత్రకాధ్యాపకుడుగా పనిచేశాడు దత్తు. 'వంగీయ సాహిత్య పరిషత్తు' ప్రథమాధ్యక్షుడుగా వున్నాడు. చివరి దినాల్లో బరోడా ప్రధానమంత్రిగా పనిచేశాడు.

రమేశచంద్రుడు మొదట ఇంగ్లీషులోనే రచన లారంభించాడు. ఆనాడు ఇంగ్లీషులో కవిత్వం వ్రాయడమూ, ఇంగ్లీషులోనే మాట్లాడడమూ 'సభ్యత'గా వుండేది. బాంగ్లాలో వ్రాయడం అనాగరికత అని ఆంగ్ల విద్యాధికులు భావించేవారు. ఇలాగే బాంగ్లాభాష 'గ్రామ్యం' అని నిరసించేవారు సంస్కృత పండితులు. ఈ దుస్థితి తొలిగించిన సాహిత్యయోధుడు బంకిమచంద్రుడు. బంకిమచంద్రుడే రమేశచంద్రుని బాంగ్లాలో రచన సాగించమని ప్రోత్సహించాడు (1872). అతని ప్రోత్సాహం వల్లే రమేశబాబు బాంగ్లాలో ప్రతిభావంతమైన గద్యరచనలు చేశాడు. నాలుగు చారిత్రక నవలలు వ్రాశాడు. రెండు సాంఘిక నవలలు వ్రాశాడు. ఋగ్వేదం బాంగ్లా గద్యలో (1885 - 1887) అనువదించాడు. 'హిందూశాస్త్ర సంకలనం' వ్రాశాడు. 'యూరోపే తీన్ వత్సర' యాత్రా గ్రంథం వ్రాశాడు. ఇది తన "Three years in Europe" రచనకు బాంగ్లానువాదం. రామాయణ మహాభారతాలు ఇతను సంగ్రహంగా ఇంగ్లీషులోకి అనువదించాడు.

## సంజీవచంద్ర చట్టోపాధ్యాయ (1834-1889)

ఈయన బంకిమచంద్రుడి నడిమి అన్న, తమ్ముడి కేమాత్రమూ తీసిపోని ప్రతిభాశాలి. అయితే చేసిన రచనలు మాత్రం తక్కువ. రెండు నవలలూ, రెండు చిన్న కథలూ, ఒక చారిత్రక కథా, యాత్రా వృత్తాంతమూ, కొన్ని వ్యాసాలూ - ఇంతే అతని రచనలు. అలా అని బాంగ్లా గద్య సాహిత్యంలో వీటిస్థానం తక్కువకాదు. ఆధునిక బాంగ్లా సాహిత్యంలో 'వాత్సల్య రసం' పోషించిన రచయిత సంజీవ చంద్రుడు. ఇతని అనంతరం రవీంద్రుడు తప్ప ఇంకెవ్వరూ ఈ రసంపోషించిన వారు లేరు. ఆధునిక బాంగ్లా సాహిత్యంలో రవీంద్రుడు రవి అయితే సంజీవచంద్రుడు వేగు చుక్క అన్నారు విమర్శకులు.

## కాలీ ప్రసన్నఘోషు (1843-1910)

వ్యాసరచనలో సమర్థుడితను. 'నారీజీవిత విషయక ప్రస్తావన', 'సమాజ శోధనీ', ప్రభాత చింతా', 'నిశీథచింతా', 'మానామహాశక్తి', 'భ్రాంతి వినోద', 'ప్రమోదలహరి' మొదలైన గ్రంథాలు వ్రాశాడు.

### రజనీకాంత గుప్త ( (1845-1887)

అల్పవయస్సులో పేరు సంపాదించిన రచయిత ఇతను. 'ఐతిహాసిక రహస్య' మొదలైనవి ఇతని గ్రంథాలు.

### అక్షయచంద్ర సర్కారు (1846–1917)

బంకిమచంద్రుడి గద్యరచనాపద్ధతి పుణికి తెచ్చుకున్న రచయిత అక్షయచంద్రుడు. 'సమాజ సమాలోచన', 'సనాతనీ', 'రూపక ఓ రహస్య' మొదలైన గ్రంథాలు వ్రాశాడు.

### ప్రఫుల్లచంద్ర వంద్యోపాధ్యాయ (1864-1900)

'గ్రీకు ఓ హిందూ', 'వాల్మీకి ఓ తత్సామయిక వృత్తాంతే' మొదలైన గ్రంథాలు వ్రాశాడితను.

### పూర్ణచంద్ర వసు

సాహిత్య విమర్శకు డితను. 'కావ్యసుందరీ,' 'వేదసుందరీ' 'కావ్యచింతా' 'సాహిత్యచింతా' మొదలైన విమర్శగ్రంథాలు వ్రాశాడు. కావ్యసుందరిలో బంకిమ చంద్రుడి నవలలోని స్త్రీ పాత్రల చరిత్రలు వివరించాడు.

### చంద్రశేఖర ముఖోపాధ్యాయ (1849-1922)

అద్భుతమైన గద్యకావ్యం 'ఉద్భ్రాంత ప్రేమ' రచయిత ఇతను. నదియా ఇతని నివాసం. తండ్రి విశ్వేశ్వర ముఖోపాధ్యాయ. సాహిత్య కృషిలో బంకిమబాబు సహయోగి చంద్రశేఖరుడు. 'వంగదర్శని'లో ఎన్నో వ్యాసాలు వ్రాశాడు. 'ఉద్భ్రాంత ప్రేమ', మశలా బాంధా కాగజ్', 'స్త్రీ చరిత్ర', 'కుంజలతార మనేర కథా' మొదలైన గ్రంథాలు వ్రాశాడు. ఇతని 'ఉద్భ్రాంత ప్రేమ' వంటి గద్య కావ్యం అంతకు ముందు బాంగ్లాలో లేదు. భార్యా వియోగంతో ఉద్భ్రాంతుడై రచయిత ఈ కావ్యం వ్రాశాడు. దీనిలోని 'స్మశానెప్రస్తావ' (అధ్యాయం) ఆనాటి బాంగ్లా గద్య రచనలో శ్రేష్ఠమైంది.

> "ఎయి ఖానె ఆసిలె, సకలెయి సమాన హయ. పండిత, మూర్ఖ; ధనీ, దరిద్ర; సుంచర, కుత్సిత; మహత్, క్షుద్ర; బ్రాహ్మణ, శూద్ర;

ఇంరేజ, బాంగాలీ; ఎయిఖానె సకలెయి సమాన. నైసర్గిక, అనైసర్గిక సకలవైషమ్య ఎయిఖానె తిరోహిత హాయ. శాక్యసింహబల, శంకరాచార్యబల, ఈశాబల, రూషాబల, రామమోహన బల; కింతు ఎమన సామ్యసంస్థాపక ఏ జగతె ఆర్ నాయి. ఏ బాజారె సబ్ ఏకదర - అతిమహత్ ఏవం అతి క్షుద్ర, మహాకవి కాళిదాస ఏవం బటతలార నాటకలేఖక, ఏకయి మూల్య బహనకరె. తాయిబలి, ఏస్థాన ధర్మభావ పూర్ణ - ఏస్థాన సదుపదేశపూర్ణ - ఏ స్థానపవిత్ర."

(ఇక్కడికివస్తే- అంతా సమానమవుతారు. పండితుడూ, మూర్ఖుడూ; ధనవంతుడూ, దరిద్రుడూ, సుందరుడూ, కుత్సితుడూ; గొప్పవాడూ, క్షుద్రుడూ; బ్రాహ్మడూ, శూద్రుడూ; ఇంగ్లీషువాడూ, బంగాలీ; ఇక్కడ అంతా సమానం. నైసర్గిక అనైసర్గిక వైషమ్యాలన్నీ ఇక్కడ తిరోహితమయిపోతాయి. శాక్యసింహుడనండి, శంకరాచార్యుడనండి, ఏసనండి, రూషా అనండి, రామమోహనుడే అనండి - ఎవ్వరూ ఇలాటీ సామ్యం స్థాపించలేదు జగత్తులో. ఈ బాజారులో అంతా వొకటే ధర - అతిమహత్తయినా, అతిక్షుద్రమైనా. మహాకవి కాళిదాసైనా, బట్టతల నాటక రచయిత అయినా వొకేమూల్యం వహిస్తారు. అందుకే అంటున్నాను. ఈ స్థానం ధర్మభావపూర్ణమైంది — ఈ స్థానం సదుపదేశపూర్ణమైంది — ఈ స్థానం పవిత్రమైంది) ఇలా ఆరంభమవుతుంది ఈ ప్రస్తావం.

'సెయి ముఖఖాని', 'జాహ్నవీతీరె', 'ప్రాణేర్వ్యవసాయ', 'పూర్ణిమార శశీ', 'స్మశానె', 'నవవసంత సమాగమె', 'శయనమందిరె' అని ఏడు ప్రస్తావాలున్నాయి గ్రంథంలో, ఉత్తమ కోటికి చెందిన గ్రంథమిది.

## మీర మశార్రఫ్ హోసేను (1847 - 1911)

నదియా జిల్లా లాహినీపాడా ఇతని జన్మస్థానం. తండ్రి ముయాసుఫ్ హోసేను. బాల్యం నుంచీ సాహిత్యానురాగి, కాంగాల హరినాథుడు ఇతని సాహిత్య గురువు. పందొమ్మిదో శతాబ్దం ముసల్మాను రచయితలలో సర్వశ్రేష్ఠ గద్య రచయిత ఇతను. 'విషాదసింధు', 'జమీదార దర్పణ' (నాటకం), ఉదాసీన పథికేర మనేర కథా' (నవల) మొదలైనవి ఇతని గ్రంథాలు, 'విషాద సింధు' ఇతని రచనలో ఉత్తమ రచన. మహరము మూల కథ ఇందలి కథా వస్తువు. మహమ్మదు ప్రవక్త దౌహిత్రులు హాసాను, హోసేనుల కలహం కన్నుల కట్టినట్టు చిత్రించాడు రచయిత.

### రచయిత్రులు

ఈ కాలంలో ఎంతోమంది రచయిత్రులు కూడా మంచి గద్యరచనలు చేశారు. వాటిలో స్వర్ణకుమారీదేవి (1855-1932) నవలలూ, అన్నదా సుందరీదేవి 'అబలా విలాప' (1872), ఇందుమతిదాసి 'దుఃఖమాలా' (1874), విరాజమోహిని దాసి 'కవితాహార' (1876), నవీనకాలీదేవి 'స్మశానభ్రమణ' (1879), కామినీసుందరిదాసి 'కల్పనాకుసుమ' (1881) మొదలైనవి చెప్పదగినవి.

### రవీంద్రనాథ ఠాకూరు (1861-1941)

రవీంద్రుడు బాంగ్లా సాహిత్యాకాశంమీద ఉదయించడంతోనే గద్య సాహిత్యంలో స్వర్ణయుగం ఆరంభమైంది. కవిత్వం కట్టడంతోపాటు ఆయన రచనకు కూడా శ్రీకారం చుట్టాడు. కలకత్తా జోడాసంక ఇతని జన్మస్థానం. తండ్రి మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు.

రవీంద్రుడు మొదటి గద్యరచన తన పదిహేనో యేట వెలువడింది. బంకిమ చంద్రుడివలె మొదట సాధుభాషలోనే రచన ఆరంభించి, అనతికాలంలో అది సరికాదని గ్రహించి చలితభాషలో (వాడుక భాషలో) రచన సాగించాడు రవీంద్రుడు. రచన సుస్పష్టమూ, బోధగమ్యమూ కావాలంటే వాడుక భాష అనివార్యమని ఆయన సిద్ధాంతం. వాడుక భాషలో గద్య వొక కళగా నిరూపించాడాయన.

గద్యరచనా శిల్పంలో రవీంద్రుడు కల్పించిన పరివర్తనం అపూర్వమైంది; అద్భుతమైంది. అతని కవితలాగే అతని గద్య లలితమైంది; రసవంతమైంది. దీర్ఘ సమాసాలు విడిచి పెట్టడమూ, మధురశబ్దాలు ప్రయోగించడమూ, నవనవోన్మేషమైన శబ్దాలు సృష్టించడమూ, వాక్యాలలో తూగు చెడకుండా చూడడమూ రవీంద్రుడు వుగ్గుపాలతోనే అలవరుచుకున్నాడు. ఆయన గద్యలో పాండిత్యప్రకర్ష కనపరిచే ఆడంబరముండదు. నాలుగు పదాల పొడుగు సమాసాలు ఎక్కడో కాని మచ్చుకైనా కనపడవు. పదాలు ఏరుకోడంలో అతని కౌశలం అసాధారణమైంది. గద్య కాని పద్యమే కాని అతని ప్రతివాక్యమూ రసాత్మకమైన కావ్యం; సందేహము లేదు. గద్యలో భావభరితమైన మధురశబ్దాలతోపాటు విశేషణాలు ప్రయోగించడంలోనూ సిద్ధహస్తుడాయన. అలాగే అలంకార ప్రయోగంలో కూడ అతని కలం ఆశ్చర్యమైంది. అయితే అలంకారం కోసం ఆయన ప్రయత్నించడు. సహజంగా అప్రయత్నంగా తమంతట

వచ్చి పడతాయి అలంకారాలు అవసరానికి మించకుండా. వాటిలో కృత్రిమత్వం వుండదు. అలంకారాలలో ఆయన ఉత్ప్రేక్ష, ఉపమా, రూపకం, శ్లేషా తరుచు వాడుతాడు. అందులోనూ ఉత్ప్రేక్ష అంటే ఆయనకు ప్రీతి. ఇందులో కాళిదాసు, బాణభట్టులకంటే కూడా ఆయనది పైచేయి.

రవీంద్రుడు గద్యలో కొన్ని పెద్దవాక్యాల తుదిని వొక చిన్నవాక్యం ప్రయోగిస్తాడు. అనిర్దేశక సర్వనామానికి బదులు మధ్యమపురుష సర్వనామం ప్రయోగిస్తాడు. విస్మయాత్మక వాక్యానికి బదులు వర్ణనాత్మక వాక్యం ప్రయోగిస్తాడు. హేతువాచక శబ్దాలతో తరుచు స్వతంత్రవాక్యాలు ఆరంభిస్తాడు. భూతకాల క్రియాపదాలతో భూత కాలార్థంలో భవిష్యత్కాల క్రియాపదం జోడిస్తాడు. (వాడుకభాష మూలంగా వచ్చిన ప్రయోగమిది.) విశేషణ పదం విశేష్యపదంగా ప్రయోగిస్తాడు. బాంగ్లా, సంస్కృత సమ్మేళనంచేసి విచిత్రమైన సమాసాలు సృష్టిస్తాడు. బాంగ్లా కావ్య జగత్తులో నవయుగం సృష్టించినట్టే బాంగ్లా గద్యసాహిత్యంలో కూడా రవీంద్రుడు నవయుగం సృష్టించాడు.

రవీంద్రుడి మొదటి వ్యాసం 1876 లో వెలువడింది. కాళిదాసు కవిత మీదా, బాణభట్టు కాదంబరి మీదా ఆయన వ్రాసిన విమర్శనాత్మక వ్యాసాలు బాంగ్లా గద్య సాహిత్యానికి అలంకారంగా నిలిచాయి. ఆయన 'పంచభూత' (1897), 'స్వదేశీసమాజ' (1904) 'శబ్దతత్వ' (1909), 'భారత వర్షేర ఇతిహాస దార' (1911), 'బాంగ్లా భాషా పరిచయ' (1939) మొదలైన వ్యాస సంపుటాలు భారతీయ సాహిత్యానికే తలమానికాలు. 'యూరపు ప్రవాసీరపత్ర' (1881), 'భానుసింహేర పత్రావళి' (1912), 'భిన్నపత్ర' (1912), మొదలైనవి అతని ఉత్తరాల సంపుటాలు, 'ఛేలేబేలా' (1940), 'జీవన స్మృతి' (1912) ఆత్మ చరిత్రలు, 'గల్పసల్ప' (1941) 'విచిత్ర ప్రబంధ' మొదలైనవి బాంగ్లాలో 'రమ్య రచనలు.'

రాజకీయ, సాంఘిక, సాహిత్యక, చారిత్రక, దార్శనిక, వైజ్ఞానిక విషయాల మీద – ఒక విషయం మీదేమిటి అన్ని విషయాల మీద ఉత్తమమైన వ్యాసాలు వ్రాశాడు రవీంద్రనాథుడు. గద్య శిల్ప పంచాననుడాయన.

రవీంద్రనాథుడి ఉత్తరాలు బాంగ్లా గద్య సాహిత్యంలో ప్రత్యేకస్థానం సృష్టించుకున్నాయి.

"పత్రావళిని విడిచిపెట్టి రవీంద్ర నాథుని సాహిత్య విషయం సంభావించడానికే వీలులేదంటాను. ఏమంటే, అవి కేవల పరిమాణ విస్తృతితో మాత్రమే లెక్కకు వచ్చేవి కావు అంతటంతట సాహిత్య సౌరభంతో వాసితములైనవి. అంతే కాదు, అవి ఆయనచేత స్వభావ స్నిగ్ధరుచులు అంటిన పత్రాలు. సుస్మరణీయములైన కావ్య చరణాలు, అన్నీ నిండు యౌవనములో రచించిన రమణీయ పంక్తులు. ఏనాడైతే ఆయన శాంతినికేతనములో గురుదేవుడైనాడో, ఎప్పుడైతే జగత్కవీంద్రుడయ్యే దుర్భాగ్యం పట్టిందో, ఆనాడే ఇటువంటి లేఖలు వ్రాసే సాహిత్య సుయోగం పోగొట్టుకున్నాడు రవీంద్ర నాథుడు" అన్నాడు బుద్ధదేవ వసు.

గద్య విషయంలో రవీంద్ర నాథుడు చెప్పిన వాక్యాలు ఇక్కడ ఉదహరించడం అప్రస్తుతం కాదనుకుంటాను.

"శైశవకాలమునుంచీ మనము మాటాడేది గద్య రూపమె. కాని గద్య కావ్యం ఎంత దురూహ నిర్వహణమో మన ప్రథమ గద్య కారుడి రచన చూస్తే తెలుస్తుంది. పద్యములో ప్రతిపాదానికీ విశ్రాంతి స్థానమున్నది. ప్రతిరెండు పంక్తుల తర్వాతనో నాలుగు పంక్తుల తర్వాతనో అపుదలకు నియత విరామ ముంటుంది. కాని గద్యలో వొక వాక్యంతో మరొక వాక్యం బంధించవలసి వస్తుంది. మధ్య వెలితి వుంచాడానికి వల్లకాదు. వాక్యం మధ్య కర్తా, కర్మా, క్రియా నిలపాలి; వాక్యాలుపరస్పరం కలిసినట్టు సవరించి గద్య ప్రబంధ ఆది మధ్యాంతాలు గొలుసు లాగ సుసంగతమయినట్టు చూడాలి. ఛందస్సులో అనివార్యమైన ప్రవాహ ధర్మమున్నది. ఆ ప్రవాహధారను చదరమైన వాటములో నెరప గలిగితే సహజంగానే ఆడుతూ, పాడుతూ తేలి తేలి సాగిపోతుంది కవిత; కాని గద్యలో స్వయంగా దారి చూస్తూ అడుగులు వేసి భావసామంజస్యంతో దాని గతి గమకాలు నడపాలి. ఈ చరణ చారణ విద్య సరిగా అభ్యసించక పోతే గతి వంకరటింకరగా అల్లి బిల్లిగా వ్యత్యస్త మవుతుంది. ఈ గద్య ప్రణాళీ బద్ధ నియమము ఈనాడే మనకు అలవాటయింది. కాని కొద్ది కాలానికి ముందు ఇలా లేదు." - రవీంద్ర వ్యాసావళి, సం. 2. పు. 299.

నాటకాలలో మైకేలు మధుసూదన దత్తు. నవలలు మొదలైన వాటిలో బంకిమ చంద్ర చట్టోపాధ్యాయ ఏర్పరచిన గద్య మార్గాలు రవీంద్రనాథ ఠాకూరు ఆవిర్భావంతో సన్నగిల్లి, పాతవడిపోయాయి. రవీంద్ర యుగంలో కొత్తరచయిత లందరూ 'రవీంద్ర మార్గమే' పట్టారు. వారిలో ముఖ్యంగా నవలా చక్రవర్తి శరత్చంద్ర చట్టోపాధ్యాయ

తనంతవాడు తాను అనిపించుకున్నాడు. ఈయనతో పాటు సుప్రసిద్ధులైన గద్య రచయితలు ఎందరో వున్నారు.

రామేంద్ర సుందర త్రివేది (1864 - 1919).

పురాతన ఆధునిక సాహిత్యాలూ, సంస్కృతులూ మధించిన పండితు డితను. 'ప్రకృతి' (1896), 'జిజ్ఞాస' (1903), 'కర్మకథ' (1913), 'శబ్దకథ' (1917) మొదలైన వ్యాససంపుటాలు వ్రాశాడు. 'ఐతరేయ బ్రాహ్మణం' బాంగ్లాలో అనువదించాడు. రవీంద్రుడు నెలకొల్పిన 'సాధన' పత్రికలో ఎన్నో వ్యాసాలు వ్రాశాడు.

ఉమేశచంద్ర వటవ్యాల (1852 - 1898).

పండితుడూ, విమర్శకుడున్నూ ఇతను. దర్శన శాస్త్రం మీదా, వేద చరిత్ర మీదా 'సాధన' పత్రికలో మంచి వ్యాసాలు వ్రాశాడు. ఇతని 'సాంఖ్య దర్శన' వ్యాసావళి (1899) ప్రసిద్ధమైంది.

యోగేశచంద్ర విద్యానిధి (1859 - 1956)

సరళమైన గద్యలో వ్యాస రచన చెయ్యగలిగిన రచయిత ఇతను. 'అమాదేర జ్యోతిషీ ఓ జ్యోతిష' (1903) ఇతని సుప్రసిద్ధ గ్రంథం.

అక్షయకుమార మైత్రేయ (1861 - 1930)

'సాధన'లో మంచి చారిత్రక వ్యాసాలు వ్రాశాడితను. 'సిరాజుద్దౌలా' (1897), 'మీర్ఖాసిమ్' (1904), 'ఫిరింగి వణీక' (1922) మొదలైన గ్రంథాలు వ్రాశాడు. ఇతని గ్రంథాలు ముఖ్యంగా బాంగ్లాలో జాతీయోద్యమ ప్రబోధానికి తోడ్పడ్డాయి.

సఖారామ గణేశ దేవోస్కరు (1869 - 1916)

ఈయన బాంగ్లాలో స్థిరపడిన మహారాష్ట్రుడు బాంగ్లా రచయితగా ప్రసిద్ధుడు. లోకమాన్యతిలకు నాయకత్వం కింద బాంగ్లాలో రాజకీయోద్యమంలో పాల్గొన్నాడు. బాంగ్లాలో శివాజీ ఉత్సవం నెలకొల్పాడు. బాంగ్లా గద్యలో ఇతను 'బాజీరావు' (1899), 'ఝాన్సీర రాజకుమార్' (1901), 'ఆనందబాయి' (1903), 'కృషకేర సర్వనాశ' (1904), 'దేశేర కథ' (1904) మొదలైన గ్రంథాలు వ్రాశాడు.

## వివేకానందస్వామి (1862 - 1907)

వివేకానందస్వామి మహాపురుషుడని లోక మెరుగును. కాని ఆయన బాంగ్లా సాహిత్యానికి చేసిన సేవ ఎరిగిన వారు తక్కువ. ఉజ్వలమైన సాధుభాషలోనూ, చలిత భాషలోనూ గ్రంథాలు వ్రాశాడాయన. 'ప్రాచ్యపాశ్చాత్య', 'పరివ్రాజక', 'వర్తమాన భారత' మొదలైన గ్రంధాలు ఆయన బాంగ్లాలోనే వ్రాశాడు. రవీంద్రనాథుడు వాడుక భాషలో రచనలు ఆరంభించక ముందే వివేకానందస్వామి వాడుక భాషలో రచనలు చేయండని తన అనుయాయులకు ఉపదేశించాడు. ఆయన చేసిన ఉపదేశం ఈ కింది రచన సాహితీపరులకు శిరోధార్యమైంది.

"బుద్ధుడు మొదలుకుని రామకృష్ణుడి దాకా లోకహితంకోసం అవతరించిన మహాపురుషులందరూ సామాన్యుల భాషలోనే జనసామాన్యానికి శిక్షణగరిపారు. పాండిత్యం ఉత్కృష్టమైందే, కాదనను కాని; అప్రాకృతమైన, కల్పితమైన, కఠినమైన భాషలోనే కాని పాండిత్యం లేదా? వాడుక భాషలో శిల్ప నైపుణ్యం సాగదా? స్వాభావికమైన భాష వొదిలి పెట్టి, అస్వాభావికమైన భాష ఆశ్రయించడం వల్ల ఏమవుతుంది? ఏ భాష ఇంట మాట్లాడతామో, ఆ భాషలోనే కదా మనస్సులో గవేషణ సాగిస్తాం; మరి, వ్రాసేటప్పుడు మాత్రం అయోమయమైన భాష ఎందుకు వాడతారు? ఏ భాషలో దర్శన విజ్ఞానాలు ఆలోచిస్తామో, పదిమందిమి కలిసి చర్చిస్తామో – ఆ భాష దర్శన విజ్ఞానాల రచనకు పనికి రాదా? స్వాభావికంగా ఏ భాషలో మనసులోని మాట వెల్లడిస్తామో, ఏ భాషలో క్రోధం, దుఃఖం, ప్రేమ ప్రకటిస్తామో ఆ భాషను మించిన భాష లేనేలేదు."

## బలేంద్రనాథ ఠాకూరు (1870-1899)

విమర్శాత్మక వ్యాసాలు వ్రాయడంలో సమర్థుడితను. ముచ్చటగా ముప్ఫయ్యేళ్ళయినా నిండకుండా ఇతను అకాలమృత్యువు పాలు కావడం బాంగ్లా సాహిత్యానికి ఎంతయినా నష్టం కలిగింది. 'చిత్ర ఓ వ్యాస' అని ఇతని వ్యాసాలు సంపుటంగా వెలువడ్డాయి.

## ప్రమథ చౌధురి (1868-1948)

"భాష మనిషినోటి ద్వారా కలం నోటికి వస్తుంది. కలంనోటి ద్వారా మనిషి నోటికి రాదు. ఈ పని ఉల్టాగా చెయ్యబోతే మనిషి నోట వొట్టి సిరా పడుతుంది" అని

గ్రాంథికవాదుల నోళ్ళు మూయించిన సాహిత్యయోధుడు ప్రమథచౌధురి. పావన జిల్లా హరిపురం ఇతని జన్మస్థానం.

రవీంద్రుడు నోబెలు బహుమానం పొందిన తరవాత 1914 లో చౌధురి 'సబూజ పత్ర' మాసపత్రిక స్థాపించి వాడుకభాష ప్రచారం చేశాడు. అంతకుముందు ప్యారీచాంద మొదలైనవారు వాడుకభాషలో రచనలు చేశారు. కాని రవీంద్రుడు కలం పట్టాకే వాడుకభాషకు బాంగ్లాలో పూలకారు వచ్చింది.

ప్రమథ చౌధురి వాడుకభాషలో ప్రత్యేకశైలి ప్రవేశపెట్టాడు. ఆ శైలిని బాంగ్లాలో 'వీరబలి' అన్నారు, చౌధురి 'వీరబల' అన్న పేర రచనలు చెయ్యడమే దీనికి కారణం.

చౌధురి బారిష్టరు పరీక్ష ప్యాసయి, లాకాలేజీలో కొంతకాలం అధ్యాపకుడుగా పనిచేశాడు. సాహిత్యంలో సమాలోచకుడుగానూ, సున్నితమైన వ్యంగ్యరచయితగానూ ప్రసిద్ధుడితను. 'నానాకథా', 'పదచారణ', 'చార్ ఇయారీ కథా', 'ఆహుతి' మొదలైనవి ఇతని గ్రంథాలు. వీటిలో 'చార్ ఇ యారీ కథ' ఉత్కృష్ట రచన.

## శరత్చంద్ర చటోపాధ్యాయ (1876-1938)

కథాసామ్రాట్టు ఈయన; నవలా చక్రవర్తి. హుగ్లీ జిల్లా దేవానందపురం ఇతని జన్మస్థానం. తండ్రి మతిలాల చట్టోపాధ్యాయ తల్లి భువనమోహినీదేవి. బాల్యకాలం చదువుసంధ్యలకంటే ఆటపాటలతోనే గడిపాడు. ఎఫ్. ఏ వరకు మాత్రం చదివాడు. పొట్టపోసుకుందికి బర్మా వెళ్ళిపోయాడు (1903). బర్మాలోవుండే గొప్పరచయితగా పేరుపడ్డాడు. కౌమారంలోనే సాహిత్యసాధన ఆరంభించినా ముప్పది అయిదేళ్ళు వచ్చే దాకా తన రచనలు పత్రికలకు పంపలేదతను. మొదట అనుకరణలతో రచన లారంభించాడు. అనంతరం స్వతంత్ర రచనలుచేసి పేరు సంపాదించాడు. ముందుముందు కొన్ని అనువాదాలు చేశాడు. మిసెస్ హెన్రీవుడ్ నవల 'ఈస్టలిన్' ఆధారంగా 'అభిమాన' నవల వ్రాశాడు.

రవీంద్రుడి రచనలు శరత్బాబును ఎంతయినా ఆకర్షించాయి. "నేను ఆయనకు ఏకలవ్యుడి వంటి శిష్యుణ్ణి" అని చెప్పుకున్నాడు. పేరు మరుగుపరిచి ఆయన ప్రకటించిన రచనలు చూసి అవి రవీంద్రుడే వ్రాశాడనుకునేవారు ఆనాటి సాహితీపరులు కొందరు.

పద్నాలుగేళ్ళ వయస్సులోనే నవలలు వ్రాయడం ప్రారంభించాడు శరత్చంద్రుడు. 'అప్పుడు వ్రాసినవే కాశీనాథ', బడదీది', 'దేవదాసు' మొదలైన నవలలు. 'యమున', 'సాహిత్య' పత్రికలు వీటిని ముద్రించాయి.

శరత్బాబు బంకిమచంద్ర, రవీంద్రనాథులతో సమానుడైన గద్య రచయిత. ఎన్నో నవలలూ, కథలూ, వ్యాసాలూ, 'నారీరమూల్య' వంటి విమర్శకరచనలూ వ్రాసి బాంగ్లా సాహిత్యంలో అమరజీవి అయాడితను.

"As for Bengalı we have had Bankim have still Tagore and Saratchandra That is achivement enough for a single century, అన్నాడు అరవిందుడు.

రవీంద్రుడి రచనలో అక్కడక్కడ ఎంతటి వారికైనా తికమకపరిచే వ్యాస ఘట్టాలు ఎదురు కావచ్చు. కాని శరత్చంద్రుడిలో అలాటిది లేదు. ఇతని భాషలో ఏ శబ్దమైనా నిఘంటువు తడవవలిసిన అవసరం కల్పించదు.

అవనీంద్రనాథ ఠాకూరు (1871-1951)

శిల్పాచార్యుడైన ఈయన చెప్పుకోతగిన మంచి గద్యరచయితకూడా. జోడాసంఖ ఇతని జన్మస్థానం. తండ్రి గుణేంద్రనాథ ఠాకూరు. (రవీంద్రుడి పినతండ్రి.) 'శకుంతలా', 'క్షీరేరపుతులా', 'రాజకాహినీ', 'నాలక', 'బూడోఆంలా', 'భారత శిల్ప', భారతశిల్పే ర షడంగ', 'వాగేశ్వరీశిల్ప ప్రబంధావళీ' మొదలైనవి ఇతని గ్రంథాలు. రవీంద్రనాథుడి వలెనే అవనీంద్రనాథుడు చక్కని వాడుక భాషలో గద్య రచన చేశాడు. అతని 'శకుంతలా', 'రాజకాహినీ', 'క్షీరేరపుతలా', 'నాలక' పిల్లల కోసం వ్రాసినవి. అవనీంద్రనాథుడి చిత్రాలవలె అతని గ్రంథాలుకూడా ఆకర్షవంతమైనవి. బాంగ్లాగద్యలో ఇతని దొక ప్రత్యేకశైలి.

బాంగ్లా సాహిత్యంలో అత్యాధునిక యుగం ఏర్పడిన అనంతరం గద్య సాహిత్యానికే హెచ్చు ప్రాముఖ్యం వచ్చింది. ముఖ్యంగా ఈనాడు చిన్నకథ బాగా ప్రాముఖ్యానికి వచ్చింది. కవితలో 'గద్య కవిత' ప్రముఖ పాత్ర వహించింది.

## నాటకాలు

ప్రాచీన కాలంలో బాంగ్లాలో మన యక్షగానాల వంటి నాటకాలుండేవి. వాటికి 'యాత్రల'ని పేరు.

పందొమ్మిదో శతాబ్దంలో మైకేలు మధుసూదన దత్తుకు పూర్వం కొంతమంది బాంగ్లాలో నాటకాలు వ్రాశారు. అయితే అవి చదవడానికే కాని ప్రదర్శనానికి అంత అనుకూలంగా వుండలేదు. ముందు ముందు కొన్ని ప్రహసనాలు బయలుదేరాయి. భవానీ చరణుడి 'నవబాబు విలాస', 'నవ బిబి విలాస', విశ్వనాథ మిత్రుడి 'కవిరాజేర మాహాత్మ్య', రామధనరాయి 'కవి చరిత', నారాయణ భట్టరాజ గుణనిధి 'కవి కుతూహల' మొదలైనవి ఈ తరగతికి చెందినవి.

పద్దెనిమిదో శతాబ్దాంతంలో హెరాసిమ్ లెబెడెఫ్ అని వొక రష్యా కళాకారుడు కలకత్తా వచ్చి పాశ్చాత్య పద్ధతి రంగస్థలంలో బాంగ్లా నాటకం ప్రదర్శించాడు ఏదో ఇంగ్లీషు నాటకం బాంగ్లా చేయించి, భారత చంద్రుడి విద్యాసుందరి నుంచి పాటలు చేర్చి ప్రదర్శించాడతడు. అతడు ప్రదర్శించిన నాటకం అచ్చులోకి మాత్రం రాలేదు.

ఇది జరిగిన ఎన్నో దినాల తరవాత 1835 లో నవీన చంద్రవసు కలకత్తా శామ బజారులో తన ఇంట రంగస్థలం నిర్మించి 'విద్యా సుందరి' నాటకం వేయించాడు. ఇది కూడా అచ్చు కాలేదు.

నాటకాలు అన్న పేర కొన్ని రచనలు మొదట వెలువడ్డాయి. అవి మినహాయిస్తే కృష్ణమిశ్రుడి సంస్కృత నాటకానికి 1840లో విశ్వనాథన్యాయరత్న చేసిన అనువాదమే బాంగ్లాలో సరైన నాటకం అని చెప్పవచ్చు. కవి కాలం చేశాక 1871 లో అచ్చయింది. దీని తరువాత నీలమణి పాలు 'రత్నావళి' నాటకం అనువదించాడు. ఇది 1849 లో వెలువడింది. నందకుమారరాయి అనువదించిన 'అభిజ్ఞాన శాకుంతలం' 1855 లోనూ, నారాయణ తర్క రత్న అనువదించిన 'వేణీసంహారం' 1856 లోనూ, 'రత్నావళి' 1849 లోనూ 'అభిజ్ఞాన శాకుంతలం' 1860 లోనూ, 'మాలతీ మాధవం' 1867 లోనూ, కాళీప్రసన్న సింహా అనువదించిన 'విక్రమోర్వశీయం' 1857 లోనూ 'మాలతీమాధవం' 1859 లోనూ, శౌరీంద్ర మోహన ఠాకూరు అనువదించిన 'మాళవికాగ్నిమిత్ర' 1860 లోనూ, గణేంద్రనాథఠాకూరు వ్రాసిన 'విక్రమోర్వశీయం' 1869 లోనూ వెలువడ్డాయి.

బాంగ్లాలో మొట్టమొదట స్వతంత్ర నాటకం వ్రాసిన కవి యోగేశచంద్ర గుప్త. ఇతవి 'కీర్తి విలాస నాటకం' 1852 లో వెలువడింది. ఇది విషాదాంత నాటకం. బాంగ్లా తొలి విషాద నాటకం అన్న కీర్తి కీర్తివిలాసానికి దక్కింది. పీఠికలో ఆనాటి బాంగ్లా నాటకాల స్థితి వివరించాడు రచయిత.

'కీర్తి విలాస' వెలువడిన సంవత్సరమే తారాచరణశీకదారు వ్రాసిన 'భద్రార్జున నాటకం' వెలువడింది. "ఇది నూతన ప్రణాళికలో వ్రాసిన నాటకం" అని పీఠికలో వ్రాసుకున్నాడు రచయిత. 1852 లో హరచంద్ర ఘోషు వ్రాసిన 'భానుమతి చిత్త విలాస' వెలువడింది. ఇది షేక్స్పియరు 'మర్చంటు ఆఫ్ వెన్నిసు' నాటకానికి అనువాదం. అనంతరం 'కౌరవ వియోగ', 'చారుముఖ చిత్తహరా', 'రజతగిరినందినీ' అని మరి మూడు స్వతంత్ర నాటకాలు వ్రాశాడు ఘోషు.

1867లో శ్యామాచరణదాసు ఇంగ్లీషులో Rowe వ్రాసిన 'The fair penitent బాంగ్లా చేశాడు. బాంగ్లా రచనకు ఇంగ్లీషు పేరే పెట్టాడు. యువతుల కోసం ఇది అనువదించాడు అని వ్రాశాడు రచయిత. ఇంగ్లీషు నుంచి బాంగ్లాలో అనువాదమైన నాటకాలలో ఇది రెండోది. దీని తరవాత షేక్స్పియరు ' Cymbeline ' నాటకం సత్యేంద్రనాథ ఠాకూరు 'సుశీలావీరసింహ' అనీ చంద్రకాలీ ఘోషు 'కుసుమ కుమారీ' అనీ బాంగ్లా చేశారు.

ఈ సమయంలోనే కొన్ని సాంఘిక నాటకాలూ, ప్రహసనాలూ వెలువడ్డాయి. వీటిలో రామనారాయణ తర్క రత్న వ్రాసిన 'కులీనకుల సర్వస్వ నాటకం' ప్రసిద్ధమైంది.

## రామనాయణ తర్క రత్న (1822 - 1886)

బాంగ్లాలో మొదట పేరుపడ్డ నాటక కర్త ఇతను. 'నాటుకె రామనారాయణ' అని ఇతని ప్రసిద్ధ నామం. ఛబ్బీస పరగణా హరినాభి ఇతని జన్మస్థానం. తండ్రి రామధన శిరోమణి. మెట్రోపాలిటను కలాశాలలో ప్రధానపండితుడుగా కొంతకాలం పని చేశాడు. అనంతరం పాతికేళ్ళు సంస్కృత కలాశాలలో అధ్యాపకుడుగా పనిచేశాడు. 'కులీనకుల సర్వస్వ' నాటకమే ఇతని మొదటి నాటకం. ఇది 1854 లో వెలువడింది. బాంగ్లాలో ఇదే సరైన స్వతంత్ర నాటకం అన్నారు కొందరు. సంస్కృతం నుంచి 'వేణీ సంహారం', 'రత్నావళి', 'అభిజ్ఞాన శాకుంతలం', 'మాలతీ మాధవం' మొదలైన నాటకాలు అనువదించాడు తర్క రత్న. సంస్కృతంలో 'ఆర్యాం శతకమ్', 'దక్ష

యజ్ఞమ్' మొదలైన గ్రంథాలు వ్రాశాడు. రుక్మిణీహరణ,' 'కంసవధ', 'ధర్మవిజయ' మొదలైన పౌరాణిక నాటకాలూ 'బూఝువేకినా,' 'ఉభయసంకట', 'చక్షుదాన', 'జెమన కర్మ తెమని ఫల' మొదలైన ప్రహసనాలూ వ్రాశాడు.

'కులీనకుల సర్వస్వ' ఒక పోటీలో ఏబది రూపాయలు బహుమతి సంపాదించింది. 'రత్నావళి' నాటకం పాయికపడా రాజ మందిరలో (1858) ప్రదర్శింపబడడంతోనే బాంగ్లా నాటక రంగంలో కొత్తశకం ఆరంభమైంది. ఈ ప్రదర్శన చూశాకే మైకేలు మధుసూదన దత్తు నాటక రచనకు పూనుకున్నాడు.

తర్కరత్నుడి 'కులీనకుల సర్వస్వ' అనుకరించి కొన్ని నాటకాలు వెలువడ్డాయి. వాటిలో 'కులీనీ వైదికకుల కాలీన కరాల కరవాల ఘాత సంబంధ సమాధి నాటకం', 'సపత్నీ నాటకం' ముఖ్యమైనవి. మొదటి నాటకానికి కుదింపుపేరు 'సంబంధ సమాధి నాటక'. దీని రచయిత పేరులేదు. రామనారాయణ తర్క రత్న అన్న ప్రాణ కృష్ణ విద్యా సాగరుడు ఇది వ్రాశాడని ప్రతీతి. దీనికి ముందు శ్రీ పతి ముఖోధ్యాయ, శ్యామాచరణ శ్రీమాలి బాల్య వివాహం ఖండిస్తూ రెండు నాటకాలు వ్రాశారు. 'సపత్ని' నాటకకర్త తారకచంద్ర చూడామణి. దీని మొదటి భాగం మాత్రం వెలువడింది.

ఈశ్వరచంద్ర విద్యాసాగరుడి ఉద్యమఫలితంగా 1856 లో విధవావివాహ చట్టం ప్రభుత్వం ఆమోదించింది. అదే యేడు ఉమేశచంద్ర మిత్ర 'విధవా వివాహ నాటకం' వెలువడింది. విద్యాసాగరుడి ఉద్యమానికి అనుకూలంగానూ, వ్యతిరేకంగానూ కొన్ని నాటకాలు వచ్చాయి. వాటిలో ఉమాచంద్రచట్టోపాధ్యాయ 'విధవా వివాహ నాటకమూ', రాధామాధవమిత్ర 'విధవామనోరంజన నాటకమూ', యదుగోపాల చట్టోపాధ్యాయ 'చపలాచిత్త చాపల్యనాటకమూ', విహారీలాలు నంది 'విధవాపరిణామోత్సవ నాటకమూ', నారాయణభట్టరాజ గుణనిధి 'కవికౌతుక నాటకమూ' హారానచంద్ర ముఖోపాధ్యాయ 'దలభంజక నాటకమూ', హరిశ్చంద్రమిత్ర 'శుభస్యశీఘ్రం', 'మ్యావ్ ఘరేరకే', యదునాథచట్టోపాధ్యాయ 'విధవావిలాస నాటకమూ', విపినవిహారీ దే 'ఏకాదశీపారణ' మొదలైనవి ఆనాడు ప్రజానీకాన్ని ఆకర్షించాయి. ముఖ్యంగా ఉమేశ చంద్రమిత్ర 'విధవా వివాహ నాటకం' అంటే వేలాది ప్రేక్షకులు విరగబడేవారట! ఇది అచ్చయిన కొద్ది దినాలలోనే మొదటి కూర్పు ప్రతులు పూర్తిగా అమ్ముడు పోయాయి.

దీనిని అనుసరించి అస్సాం భాషలో గుణాభిరామ బారువా 1857 లో 'రామ నవమి' నాటకం వ్రాశాడు. అస్సాం భాషలో అదే తొలి నాటకం. ఉమేశచంద్రమిత్ర రెండో నాటకం 'సీతావనవాసం'. 'యాత్రాదళం' స్థాపించి ఈ నాటకం ఎన్నో మార్లు ప్రదర్శించాడు కవి.

ఆ దినాల్లో బాంగ్లాదేశంలో మద్యపానం వొక సభ్యతగా వుండేది, ధనిక కుటుంబాలలో స్త్రీలు కూడా స్వేచ్ఛగా మద్యపానం చేసేవారు. ఈ కలంకచరిత్ర చిత్రించి క్షేత్రమోహన ఘటక 'కామినీ నాటకం' వ్రాశాడు. ఇలాగే ప్రసన్నకుమార పాలు వేశ్యావృత్తి నిరసించి 'వేశ్యాసక్త నివర్తక నాటకం' వ్రాశాడు.

రామనారాయణ తర్కరత్న, ఉమేశచంద్ర మిత్రుల తరవాత చెప్పదగిన నాటక కర్త కాళీప్రసన్నసింహ (1840-1870). మహాభారత గద్యానువాదకుడుగా సుప్రసిద్ధుడితను. 'విద్యోత్సాహినీ సభ' స్థాపించి బాంగ్లా నాటకరంగాభివృద్ధికి ఎంతైనా పాటుపడ్డాడు. ఇతని 'బాబూనాటక' స్వతంత్ర రచన. 'విక్రమోర్వశీయ' (1857), 'సావిత్రీసత్యవాన' (1856), 'మాలతీమాధవ' (1859) నాటకాలు అనువాదాలు.

మధుసూదన దత్తు నాటకాలు :

మైకేలు మధుసూదన దత్తు నాటక రచనకు ఉపక్రమించిన తరవాత బాంగ్లా నాటక సాహిత్యంలో కొత్తయుగం ప్రారంభమైంది. 1859 లో అతని 'శర్మిష్ఠ' వెలువడింది; బాంగ్లా నాటక సాహిత్యం కొత్త పుంత తొక్కింది. 'శర్మిష్ఠ' వెలువడిన వొకటి రెండు మాసాలలోనే అతని 'ఏకేయి బలే సభ్యత' (దీనినే నా సభ్యత అంటారు?) 'బుడసాలికేర ఘాడేరోఁ' అని రెండు ప్రహసనాలు వెలువడ్డాయి. 1860 లో 'పద్మావతి' నాటకం వెలువడింది. తరవాత 'సుభద్రనాటకం' రెండంకాలు మాత్రం రాసి అసంపూర్తిగా వొదిలిపెట్టాడు దత్తు. 1861 లో అతని 'కృష్ణకుమారి' వెలువడింది. దత్తు నాటకా లన్నిటిలోకీ మిన్న 'కృష్ణకుమారి'. ఇతని చివరి నాటకం 'మాయాకాననం.' కవి కాలంచేశాక ఇది అచ్చయింది. 'కృష్ణకుమారి' ఆధునిక బాంగ్లా నాటకాలలో మొదటి నాటకమన్నారు విమర్శకులు. ఇది వొక్కనెలలో పూర్తిచేశాడు కవి. ఇది పూర్తిగా గద్యనాటకం. నాటకమంతటిలోనూ అయిదు పాటలు మాత్ర మున్నాయి. దేశభక్తి ఈ నాటకంలో ఉదారంగా, ఉజ్వలంగా పోషించాడు రచయిత. 'కృష్ణకుమారి' తరవాత 'రజియా' నాటకం వ్రాయాలని ప్రయత్నించాడు. మద్రాసులో వుండి దీనికోసం చిన్న నాట్యకావ్యం కూడా తయారు చేశాడు. 1860 లో వొక వుత్తరం ఇలా వ్రాశాడు ;

"I am quite ready to undertake another drama, but this must be acted first. We ought to take up Indo-Mussulman subjects. The Mohommadens are a fiercer race than ourselves, and would afford splendid opportunity for the display of passion. Their women are more cut out for intrigue than ours. ............After this, we must look to "Razia". I hope that will be a drama after your own heart! The prejudice againist Moslem names must be given up."

మధుసూదన దత్తు నాటకాల వలెనే అతని ప్రహసనాలు కూడా ప్రతిభాపూర్ణ మైనవి. 'ఎకెయిబలె సభ్యత' లో రచయిత పెడదారి తొక్కిన నవయువకుల నవనాగ రికత మీద దండెత్తాడు. ఈ విధంగా తన్నుతానే విమర్శించుకున్నాడు పరోక్షంగా. 'బుడ సాలికేర ఘాడె రోఁ' లో వృద్ధ రసికులలాంపట్యం వ్యంగ్యంగా చిత్రించాడు.

## నీలదర్పణ నాటకం

బాంగ్లాలో నీలదర్పణ నాటకం కలిగించినంత కదలిక ఏ నాటకమూ కలిగించ లేదు. దీనబంధు మిత్ర దీని రచయిత (1830-1873). నీలిమందు దొరల దౌర్జన్యాలు ఇందులో నగ్నంగా చిత్రించాడు రచయిత.

స్వరపురంలో గోలోక చంద్రవసు అని వొక గృహస్థు వుంటాడు. అతని భార్య సావిత్రి. నవీనమాధవుడూ, బిందు మాధవుడూ అని అతనికి ఇద్దరు కుమాళ్ళు. నీలిమందు దొరలు ప్రజల్ని నానాహింసలూ పెడుతూవుంటారు. గోలోక చంద్రుడి కుమాళ్ళు ప్రజల్ని రక్షిస్తూవుంటారు సాయపడి. అందుకని మండిపడి నీలిమందు పెద్ద దొర ఉడ్డు నవీనచంద్రుడి మీద తప్పుడు కేసు తెచ్చి అతణ్ణి జైల్లో పెట్టిస్తాడు. జైల్లో గోలోక చంద్రుడు ఆత్మహత్య చేసుకుంటాడు. చిన్నదొర పి. పి. రోగ్ సాధుచరణుడనే వొకని కూతుర్ని క్షేత్రమణిని ఇంటికి పిలిచి బలిమి చెరపడతాడు. నవీనమాధవుడు మహమ్మదీయులసాయంతో ఆమెని రక్షిస్తాడు. గర్భవతి అయిన క్షేత్రమణి కడుపుమీద రోగ్ దొర గుద్దుతాడు. గర్భస్రావమై ఆమెచచ్చిపోతుంది. నవీనమాధవుణ్ణి అవమానించి ఉడ్డు దొర అతని తలమీద బాదుతాడు. అతడు చచ్చిపోతాడు. భర్తా కుమాళ్ళ మరణం వల్ల దుఃఖం భరించ లేక సావిత్రి పిచ్చిదైపోతుంది. ఆ పిచ్చిలో చిన్న కోడల్ని పీక తొక్కి చంపేస్తుంది. తరువాత తెలివి వచ్చి, దుఃఖపడి, ఆత్మహత్య చేసుకుంటుంది. ఇదీ 'నీలిదర్పణ' నాటకంలో కథ. రచయిత సామర్థ్యంతో నాటక రచన సాగించాడు.

దీనిని మైకేలు మధుసూదన దత్తు ఇంగ్లీషు చేశాడు. దాంతో యూరపులో కూడ 'నీలిదర్పణం' అల్లకల్లోలం రేపింది. ఇతర యూరోపియభాషలలో కూడా ఇది అను వాదమైంది. ఇంగ్లీషులో ప్రచురించినందుకు పాద్రీలంగ్ దొరకు కారాగృహవాసం, జరిమానా విధించారు. బాంగ్లా రచయిత పేరూ, ఇంగ్లీషు అనువాదకుడి పేరూ గ్రంథంలో లేక వారికేమీ జరగలేదు.

"నీలదర్పణకు లభించిన సౌభాగ్యం బాంగ్లాలో మరి ఏ గ్రంథానికీ లభించలేదు" అన్నాడు బంకిమ చంద్రుడు.

'నీలదర్పణ' దీనబంధు మిత్ర తొలి నాటకం. అనంతరం 'నవీనతపస్వినీ', 'లీలావతీ'' 'కమలే కామినీ', 'జమాయి బారిక', సధవార ఏకాదశీ' 'బియే పాగలా బుడో' మొదలైనవి వ్రాశాడు. తపాలాశాఖలో పనిచేసి ఇతను 'రావు సాహెబు, బిరుదు సంపాదించాడు. మధుసూదనదత్తు ప్రభావం ఇతని మీద బాగా కనిపిస్తుంది. "మధుసూదన దత్తు 'ఎకెయి బలె సభ్యత' సూత్రమైతే దీనబంధు మిత్ర 'సధవార ఏకాదశీ' మహాభాష్యం" అన్నాడు వొకాయన.

దీన బంధు మిత్ర తరువాత బాంగ్లా నాటకాలలో కొత్తపుట తిప్పిన వాడు మనమోహనవసు (1831-1912). పౌరాణిక నాటకాలలో ఇతను ప్రవీణుడు. 'రామా భిషేక', 'సతీ', 'హరపార్వతీ మిలన', 'ప్రణయ పరీక్ష', 'పార్థపరాజయ' మొద లైన నాటకాలు వ్రాశాడు. అనేక మారులు ఈ నాటకాలు ప్రదర్శింపబడి ప్రేక్షకుల ప్రసంశకు పాత్రమైనాయి. 'సతీ' నాటకం అన్నిటికంటే జనాదరణ పొందింది.

ఈ కాలంలో నాటకాలు ముమ్మరంగా వెలువడ్డాయి. వాటిలో శౌరీంద్ర మోహ నుడి 'మాళవికాగ్నిమిత్ర', 'రసావిష్కార', కాళిదాస శర్మ 'ముక్తావళి', కాళిదాస సన్యాల 'నలదమయంతి', యతీంద్రమోహన ఠాకూరు 'విద్యా సుందర', విజయ సుం దర వసు 'అవకాశ గథ', నవీనచంద్రసేను 'ఆమార జీవన', మహేంద్ర నాథుడి 'ఈయారే తీర్థయాత్ర', మణిమోహన సర్కారు 'మహాశ్వేతా', 'ఉషా' 'అనిరుద్ధా', యదునాథమిత్ర 'విశ్వవినోద' ముఖ్యమైనవి.

పైన తెల్పిన నాటకాలే కాక హరిశ్చంద్రమిత్ర 'జానకీ', 'జయద్రథవధా', 'ప్రహ్లాద', 'హతభాగ్య శిక్షక'. 'శుభస్య శీఘ్రం', 'ఘర థాక్తె బాబుయి భేజే' మొద

లైనవి నిమాయిచాంద శీల (1835 - 1893) 'కామినీ గోపన ఓయామినే యాపన', మహేశచంద్రదాసదే 'కులప్రదీప', మణిమోహన సర్కారు 'మహాశ్వేత'. ఉమా చంద్ర మిత్ర 'సీతార వనవాస', వేణీమాధవఘోషు 'భ్రాంతి రహస్య', పూర్ణచంద్ర శర్మ 'కీచకవధ' గౌరీసుందర చౌధురి, నందలాలరాయి, తినికడి విశ్వాస, కేదారనాథ గంగోపాధ్యాయ, శిరీశచంద్రఘోషు, త్రైలోక్యనాథ ముఖోపాధ్యాయ మొదలైన వారి నాటకాలూ, పనోయారిలాలు 'కుముద్వతి', విహారీలాలునంది 'మేఘమాల' విహారి లాల సింహ 'రసరంజన', శ్రీనాథముఖోపాధ్యాయ 'మధుమతి', సిద్ధేశ్వర చట్టో పాధ్యాయ 'కిన్నరకామిని' కూడ పేర్కొనదగినవి.

## ముస్లిము నాటక కర్తలు

బాంగ్లా ముస్లిము కవులు కూడా కొన్ని నాటకాలు వ్రాశారు. వారిలో మొదటి నాటక రచయిత మీర్‌మసర్రఫ్‌హోసేను. ఇతని పరిచయం వెనక తెలిపాను. 'జమీందారదర్పణ', 'వసంతకుమారి' అని రెండు నాటకాలు వ్రాశాడితను. 'జమీందార దర్పణ' లో మధుసూదన దత్తు 'బుడసాలికేర ఘాడేరోఁ' ముద్ర కనిపిస్తుంది స్పష్టంగా. ఈ నాటకంలోని భాషా, కథాసంవిధానమూ బంకిమబాబు ప్రశంసించాడు. మశార్రఫ్ హోసేను తరవాత చెప్పదగిన నాటక రచయిత. మహమ్మద్ అబ్దుల్ కరీము ఇతని 'జగన్మోహిని నాటకం' 1875 లో వెలువడింది. ఇతని అనంతరం కాదేర్ అలీ 'ప్రేమ పాశ' 1881 లో వెలువడింది.

## కొత్త 'యాత్ర'

ప్రాచీన 'యాత్రా' నాటకాలు కొత్త అభిరుచికి తగినట్టు మలిచి గేయ నాటకాలు కొందరు వ్రాశారు. వారిలో కేదారనాథ గంగోపాధ్యాయ, కవివాలా మనోమోహనవసు మొదలైనవారు ముఖ్యులు. గంగోపాధ్యాయ ఎన్నో గేయనాటకాలు వ్రాశాడు. ఇతని 'విద్యాసుందర' యాత్రా, 'గులేబకావళి' యాత్రా, 'చిత్రాగిని' యాత్రా మంచి ప్రసిద్ధి లోకి వచ్చాయి.

## మనోమోహన వసు (1831-1912)

'యాత్ర' లు కొత్త దారిని పట్టించిన కీర్తి ముఖ్యంగా ఇతనికి దక్కింది. ఇతని 'సతీర అభిమాన' బాగా జనాదరణ పొందింది. యశోహరజిల్లా నిశ్చింతపురం ఇతని జన్మస్థానం. తండ్రి దేవనారాయణవసు. 'తత్వబోధిని'లో మొదట వ్యాసాలు వ్రాశాడు.

అనంతరం 'సంవాద విభాకర' పత్రికస్థాపించాడు. 'మధ్యాహ్న' అని వార పత్రిక నెల కొల్పాడు. 'దులీన' (రంజిత సింగు జీవితం), 'రామాభిషేక', 'ప్రణయ పరీక్ష', 'హరిశ్చంద్ర' మొదలైన నాటకాలు వ్రాశాడు. ఎన్నో కీర్తనలు, 'యాత్ర' లూ వ్రాశాడు.

## జోడా సంఖ పబ్లికు థియేటరు

కలకత్తా జోడా సంఖలో 1874 లో పబ్లికు థియేటరు ఏర్పడింది. దీంతో బాంగ్లా నాటకాలలో రెండో రంగం ఆరంభమైంది. ఈ థియేటరులో దీనబంధు, మధు సూదన, రామనారాయణుల నాటకాలు ప్రేక్షకుల్ని ఆకర్షించాయి. ఈ థియేటరుకోసం సాంఘిక నాటకాలూ, ప్రహసనాలూ అవసరమైనాయి; తయారయాయి. అలా తయారైన వాటిలో శిశిరకుమారఘోష వ్రాసిన 'నయసో రుపెయా', 'బాజారేర లడాయీ' మంచి ప్రచారంలోకి వచ్చాయి. ఈ సమయంలోనే బంకిమచంద్రుడి నవలలు కొన్ని నాటకాలుగా మార్చబడ్డాయి. మధుసూదన దత్తు 'తిలోత్తమ సంభవ', 'మేఘనాథవధ' హేమచంద్రుడి 'వృత్రసంహార', నవీన చంద్రరాయి 'పలాశీర యుద్ధ' కావ్యాలు కూడా నాటక రూపాలుగావెలువడ్డాయి. ఇలాగే ఆ మధ్య లక్ష్మీకాంతరాయి ప్రభృతులు కలకత్తాలో 'ఆనంద పరిషత్తు' స్థాపించి శరశ్చంద్రుడి నవలలకు నాటకరూపాలు ఏర్పరిచారు. స్టారు థియేటరు' కోసం భూపేంద్రనాథ వంద్యోపాధ్యాయ శరత్బాబు 'విరాజబహు' నాటకం చేశాడు.

పబ్లికు థియేటరు కాలంలోనే కిరణచంద్రవంద్యోపాధ్యాయ 'భారతమాత' (1873), 'భారతయవన' (1874), 'గోపనచుంబన' (1875), హారాన చంద్రఘోష 'భారతీ దుఃఖిని', నరేంద్రనాథ ఠాకూరు 'ఏయికిసెయి భారత' (1875), 'మాల్య ప్రదాన' (1876), కుంజ విహారవసు 'భారత ఆధీన', 'దర్మక్షేత్ర', హరలాలరాయి 'హేమలత' (1873), 'శత్రు సంహార' (1874), 'వంగేర సుఖావసాన, (1874), రుద్రపాల (1874) 'కనకపద్మ' (1875), మదన మోహన మిత్ర'మనోరమ' (1872) 'బృహన్నల' (1874) 'విచిత్ర మిలన' (1875), 'శరద ప్రతిమ' (1875). లక్ష్మీనారాయణ చక్రవర్తి 'నందవంశోచ్ఛేద' (1873), 'నవాబు సెరాజుద్దౌలా' (1876), 'కులీన కన్య' (1874) మొదలైనవి వెలువడ్డాయి.

## జ్యోతిరీంద్రనాథ ఠాకూరు (1848 - 1927)

రవీంద్రనాథ ఠాకూరు అన్నగారీయన. నటుడు; నాటక రచయిత; సంగీతజ్ఞుడు. 'కించిత జలయోగ', 'పురువిక్రమ', 'సరోజిని', 'అశ్రుమతి', 'స్వప్నమయి

'స్వప్నమయి' మొదలైన నాటకాలూ, 'ఏమొన్ కర్మ ఆర్ కరిబనా'. 'ఆలీక బాబూ', 'హటాత్ నవాబు' మొదలైన ప్రహసనాలూ వ్రాశాడితను. సంస్కృతం నుంచి 'అభిజ్ఞాన శాకుంతలం', 'మాలవికాగ్నిమిత్రం', 'విక్రమోర్వశీయం', 'ఉత్తరరామచరిత', 'మాలతీమాధవం', 'మహావీర చరిత', 'రత్నావళి', 'మృచ్ఛ కటిక', 'ప్రబోధ చంద్రోదయం', 'విద్ధసాల భంజిక', 'ప్రియదర్శిక', 'కర్పూర మంజరి', ధనంజయ విజయం', ఇంగ్లీషు నుంచి 'జూలియసు సీజరు', మహారాష్ట్రం నుంచి లోకమాన్య తిలకుగారి 'గీతారహస్యం' ఫ్రెంచినుంచి మోలియరు రచనలు బాంగ్లాలోకి అనువదించాడు.

భారత దేశం మీద మహమ్మదీయుల దండయాత్రలు పురస్కరించుకుని అన్ని ప్రాంతాలలో వలెనే బాంగ్లాలో కూడా కొన్ని నాటకాలు వెలువడ్డాయి. వాటిలో హరమోహన భట్టాచార్య 'సమరే కామిని', 'మహేంద్రలాలు వసు 'చిత్తూరు రాజసతి పద్మిని', రాజేంద్రనాథ చక్రవర్తి 'భారత విజయ', నలినీ చంద్ర విద్యారత్న 'భారతేర సుఖ శశి యననేర కబళె', ప్రమథనాథ మిత్ర 'జయపాల', గోపాల చంద్ర ముఖోపాధ్యాయ 'యావనే యోగిని', కుంజ విహారవసుదే 'భారత అధీన', మనోరంజన గుహ 'భారత బందిని' మొదలైనవి పేర్కొనదగినవి.

సాంఘిక నాటకాలలో కృష్ణచంద్రరాయ చౌధురి 'అమరనాథ', 'ప్రణయ ప్రమాద', 'చాకర దర్పణ', ప్రసన్న చంద్ర ముఖోపాధ్యాయ 'పల్లీగ్రామ దర్పణ', రాధానాథ వర్ధన 'సరోజిని', నిమి చంద్ర మిత్ర 'శరత్కుమారి' మొదలైనవి ముఖ్యమైనవి.

### ఒకే దురంతానికి పాతిక నాటకాలు

తారకేశ్వర మఠం మహంతు మాధవగిరి, ఎలోకేశి అనే వొక యువతిని బలిమి చెరపట్టి అత్యాచారం చేశాడు. అందుకని కోర్టులో కేసయింది. మాధవగిరి శిక్ష పొందాడు. ఈ ఉదంతంతో బాంగ్లా అట్టుడికినట్టు వుడికి పోయింది. దీనిని పురస్కరించుకుని వొక్క మొగిని 'భండతపస్వి', 'మహంతేర ఎయి కి కాజ్?', 'మహంతేర జైసాకీ తైసా', మహంతేర శేష కాన్నా', 'మహంతేర జెమన కర్మ తెమనఫల', 'మహంత పక్షేభూతోనంది', 'మహంతేర ఏకిదశా', 'మహంతేర ఏయికాజ', 'మహంతేర కీ దురక్షా', మహంతేర కీ సాజా', 'మహంతేర చక్రభమణ', 'యమలోకే

ఏలోకేర విచార' 'మహంతేర దఫారఫా', 'మహంతేర కారవాస', మహంత ఎలో కేశీ', నవీన మహంత', 'నవీనగేద', 'నవీన మహంత', 'నవీన నాటక' - ఇలా సుమారు పాతిక నాటకాలు వెలువడ్డాయి.

## నాటక రచయిత్రులు

బాంగ్లాలో మొదటి నాటక రచయిత్రి కామినీ సుందరి దాసి. (1900). ఈమె 'ఊర్వశి' (1866), 'రామేర అధివాస' (1877), 'ఉషా' - ఇలా మూడు పౌరాణిక నాటకాలు వ్రాసింది. ఈమె తరవాత లక్ష్మీమణీదేవి 'చిరసన్యాసిని' (1872) నితంబినీ దేవి 'అనూఢా యువతి', స్వర్ణలతాదేవి 'శూరబాల' (1878) నయన తారాదేవి 'మణి మోహిని', మణిమోహినీదేవి 'వినోద కానన' (1880), ప్రఫుల్ల నలినీ దాసి 'షష్టి బాంటా', తరంగిణీ దాసి 'సుగ్రీవమిలన', యాత్రా (1879) వ్రాశారు.

## గేయ నాటకాలు

గేయనాటక రచయితలలో రామతారణ సన్యాలు పేరు ముందు చెప్పాలి. 'అదర్శసతి' (1876), 'ఆనంద కానన' (1877), 'ప్రభాత కమల', 'నిశాకుసుమ' (1877), 'ప్రమోద కానన' (1878)' 'రాసలీల' (1880), 'శివేర వివాహ' (1881) ప్రణయ పారిజాత' (1881), మొదలైన గేయ నాటకాలు వ్రాశాడితను.

గిరీశచంద్రఘోషు, వినోద విహారదత్తు, కుంజ విహారవసు, అతుల కృష్ణ మిత్ర, యదుపాలవసు, కాళీప్రసన్న వంద్యోపాధ్యాయ, యోగేంద్రనాథ వంద్యో పాధ్యాయ, మహేంద్రలాలఖాను, లాలవిహారిదే, రాజకృష్ణరాయి, అమృతలాలవసు, వైకుంఠనాథవసు, కుమారకృష్ణమిశ్ర, మనమోహనవసు, వ్రజమోహనరాయి, మతి లాలరాయి, ఈశ్వరచంద్ర సర్కారు, శశిభూషణ వంద్యోపాధ్యాయ, హరనాథ మజుం దారు, అన్నదా ప్రసాద వంద్యో పాధ్యాయ, వేణీమాధవఘోషు, నగేంద్ర కృష్ణఘోషు, కృష్ణధన చట్టోపాధ్యాయ, వినోద విహారి మల్లికు, ప్రఫుల్ల చంద్రముఖోపాధ్యాయ, రాజకృష్ణరాయి మొదలైన వారు ఎంతో మంది చక్కనీ గేయనాటకాలు వ్రాశారు.

## గిరీశచంద్రఘోషు (1844 - 1911)

నటుడుగా, నాటక రచయితగా మిక్కిలి సుప్రసిద్ధుడీయన. జన్మస్థానం కలకత్తా. తండ్రి నీలకమలఘోషు.

ముందు నటుడుగా అనుభవం సంపాదించిన తరవాత నాటక రచనకు పూను కున్నాడు గిరీశచంద్రుడు. ఓం ప్రథమంగా బంకిమబాబు నవలలు 'కపాలకుండల', 'మృణాళిని' నాటకాలుగా మార్చి వ్రాశాడు ఘోషు. అనంతరం 'ఆగమనీ' 'అకాల బోధన', 'డోలలీల (1878), 'మాయాతరు' (1881), 'మోహినీ ప్రతిమ (1881) మొదలైన గేయనాటికలు వ్రాశాడు. ఈలోగా బంకిమబాబు 'విషవృక్ష', 'దుర్గేశనందినీ', మధుసూదన దత్తు 'మేఘనాథవధ', నవీనచంద్రుడి 'పలాసీర యుద్ధ, నాటకాలుగా తయారుచేశాడు. ఇది గిరీశచంద్రుడి సాహిత్య సాధనలో మొదటి రంగం.

తరవాత అతను 'వ్రజవిహార', 'హోటు మంగళ', 'మలినమాల', 'హీరార ఫూల్' మొదలైన ప్రహసనాలూ, గేయనాటకాలు వ్రాసి, పౌరాణిక నాటక రచనకి పూనుకున్నాడు. అతని మొదటి నాటకం 'ఆనందరహో' గ్రేట్ నేషనల్ థియేటరులో ప్రదర్శించారు.

గిరీశచంద్రుడి ప్రథమ పౌరాణిక నాటకం 'రావణవధ', అనంతరం ఆయన క్రమంగా 'సీతారవనవాస', 'అభిమన్యవధ', 'లక్ష్మణవర్జన', 'సీతార వివాహ', 'రామేర వనవాస', 'సీతాహరణ', 'వ్రజవిహార', 'మలిన మాల', 'హోట మంగళ', 'పాండవేర అజ్ఞాతవాస', 'దక్షయజ్ఞ', 'ధ్రువచరిత్ర' 'నలదమయంతి', 'కమల కామిని', 'శ్రీవత్సచింత'. 'బేల్లిక బాజార', 'చైతన్య లీల', 'నిమాయి సన్యాస', 'ప్రహ్లాద చరిత్ర', 'ప్రభాసయజ్ఞ', 'బుద్ధదేవ చరిత్ర' (1885), బిల్వ మంగళ ఠాకూర్', 'రూపసనాతన', 'పూర్ణచంద్ర', 'విషాద', 'నసీరామ', 'ప్రఫుల్ల' (1891), 'హారా నిధి', (1890), 'చండ', మలినా వికాస', 'మహాపూజ', 'మిలనాంత', 'ముకుల ముంజర', 'అబు హోసేన్', 'సప్తమీతే విసర్జన', 'జనతా', 'పంజరేర', 'బడదినేర బక్సిస్', 'సభ్యతార పాండా', 'పంచకోనే', 'స్వప్నేర ఫూల్', 'ఫణిరమణి', కరమేతి బాయి', 'నిత్యానంద విలాస', 'కాలాపహాడ్' (1896) హీరక జూబిలీ', 'పారస్య ప్రసూన', 'మాయావసాన', 'దౌలతార', 'పాండవ గౌరవ', 'మణిహరణ', 'నందదు లాల', 'అశ్రుధార', 'మనేరమతన', 'అభిశాప', 'శాంతి', 'భ్రాంతి', 'ఆయనా', 'సత్నామ', 'వైష్ణవి', 'హరగౌరి', 'బలిదాన', సిరాజుద్దౌలా', 'మీర్ ఖాసిమ్', 'ఛత్రపతి', 'ఆర్యరాజ' జ్యాసీకి తైసా', 'శాస్తికి శాంతి', 'శంకరాచార్య', 'అశోక' 'తపోబల' మొదలైన నాటకాలూ గేయనాటికలూ వ్రాశాడు. వ్రాసినవన్నీ ప్రదర్శించాడు. కొన్ని నాటకాలు అసంపూర్తిగా విడిచి పెట్టాడు.

గిరీశచంద్రఘోష నాటకాలు ముఖ్యంగా పౌరాణికాలనీ, మహాపురుషాలనీ, సాంఘికాలనీ మూడు భాగాలుగా విభజించవచ్చు. ఇతని ప్రతి నాటకంలోనూ ప్రత్యేక ప్రతిభవ్యక్తమవుతుంది. ఈయన తన నాటకాలలో మిత్ర - అమిత్రాక్షర ఛందస్సు ప్రయోగించి కృతకృత్యుడయాడు. ఈ ఛందస్సులో ఈయన చూపిన సామర్థ్య కారణంగా దీనిని 'గైరిశ ఛందస్సు' అన్నారు. తపోబల గిరీశబాబు చివరి నాటకం. 'జనా' సర్వశ్రేష్ఠ నాటకం.

ఈయన నాటకాలూ, ప్రహసనాలూ గ్రేట్ నేషనల్ థియేటరులోను, స్టార్, మినర్వా, ఎమరెల్డు, క్లాసిక్కు థియేటర్లలోనూ అభినయించారు. ప్రతి ప్రదర్శనానికి వేలాది ప్రేక్షకులు విరగబడే వారు. గిరీశబాబు స్వయంగా 'నిమచాంద', 'యోగీశ', 'కరుణామయ', 'కరీమ్ బాబా' మొదలైన పాత్రలు అభినయించే వాడు ఆయనను 'బాంగ్లా గ్యారిక్కు' అనే వారు.

## అమృతలాలు వసు (1853 - 1929)

గిరీశబాబు తరవాత చెప్పదగిన నాటక రచయిత ఇతను. ఇతను కూడా రంగస్థలంతో చివరిదాకా సంబంధం కల రచయిత. 'హీరకచూర' (1875), 'తరుబాల', 'విజయవసంత', 'హరిశ్చంద్ర', 'ఆదర్శబంధు' 'ఖాన్‌దఖల్', 'నవయౌవన', 'యాజ్ఞసేని' మొదలైన నాటకాలూ, 'డిస్‌మిస్' 'కృపణేరధన' మొదలైన ప్రహసనాలూ రచించాడు.

## రవీంద్రనాథ ఠాకూరు

గిరీశచంద్రుడూ, అమృతలాలూ నాటకరంగంలో ఉజ్వలంగా ప్రకాశిస్తున్న దినాల్లోనే రవీంద్రనాథుడు నాటక రచయితగా, నటుడుగా అవతరించాడు. ఇంగ్లాండు నుంచి తిరిగి వచ్చాక రవీంద్రుడు మొదటి నాటకం 'వాల్మీకి ప్రతిభ' (1881) వ్రాశాడు. ఇది గేయ నాటకం. ఆ సంవత్సరమే అది తమ ఇంట్లోని రంగస్థలం మీద అభినయించారు. రవీంద్రుడు స్వయంగా వాల్మీకి పాత్ర అభినయించాడు. గేయనాటకాలలో 'వాల్మీకి ప్రతిభ' కొత్త రేకు విప్పింది. ప్రేక్షకులలో బంకిమచంద్రుడు మొదలైన ప్రముఖులుండి నాటకం మెచ్చుకున్నారు.

రవీంద్రుడి రెండో నాటకం 'కాలమృగయ' (1882) 'మాడోది' ప్రాకృత పరిశోధ' (1884), ఇది రంగస్థలం మీద ఎన్నడూ ప్రదర్శించలేదు. అనంతరం వరు

సగా రవీంద్రుడు 'నలిని' (1884), 'రాజా ఓ రానీ' (1889), 'ప్రాయశ్చిత్త' (1909), 'విసర్జను (1890), 'చిత్రాంగద' (1892), 'బిదాయ అభిశాప' (1894) 'మాలిని', (1895) 'రాజా' (1910), 'అచలా యతన' (1911), 'డాక్‌ఘర్' (1912), 'ముక్తా ధార' (1922), 'తపతి' (1923), 'రక్తకరబి' (1924), 'గృహప్రవేశ' (1933), 'భాంసరి' (1933) మొదలైన నాటకాలు వ్రాశాడు.

1885 – 1892 సంవత్సరాల మధ్య 'గోదాయ గలాద్', వైకుంఠేరఖాతా', 'చిరకుమారసభ', 'సోధజోధ' మొదలైన ప్రహసనాలు వ్రాశాడు. 'శరదోత్సవ' (1908), 'ఫాల్గుని' (1915), 'వసంత' (1923), మొదలైనవి అతని గేయ నాటకాలు. 'చిత్రాంగద' (1936), 'చండాలిక' (1938), 'శ్యామా' (1938) – ఈ మూడూ నృత్య నాటకాలు, రవీంద్రుడి కవిత వలెనే నాటకాలు కూడా అతని ప్రత్యేక ప్రతిభ చాటు తున్నాడు.

## ద్విజేంద్ర లాలు రాయి (1867 – 1913)

బాంగ్లా మొదటి తరగతి నాటక రచయితలలో ద్విజేంద్రలాలురాయి వొకడు. కృష్ణనగరం ఈయన జన్మస్థానం. తండ్రి కార్తికేయ చంద్రరాయి. మంచి కవి, విమర్శకుడున్నూ ద్విజేంద్రుడు.

ఈయన మొదట ప్రహసనాలతో నాటక రంగంలో అడుగు పెట్టాడు. మొదటి ప్రహసనం 'కల్కి అవతార' 1895 వెలువడింది. తరవాత 'విరహ' (1897), 'సుఖీ పరివార' (1900) 'ఆనంద విదాయ' 'ప్రాయశ్చిత్త' (1901) మొదలైనవి వ్రాశాడు.

'ఆనంద విదాయ' లో రవీంద్రనాథుడి మీద ధ్వజమెత్తాడు రచయిత. ఇది ప్రదర్శించినప్పుడల్లా ప్రేక్షకులలో గందరగోళం రేగేది.

'పాషాణి' (1900), 'సీత' (1902) 'తారాబాయి' (1903), 'సోరాబ్ ఓ రుస్తుమ్' (1908) 'భీష్మ' (1913) మొదలైనవి ద్విజేంద్రుడి తొలి నాటకాలు. అనంతరం అతను 'సింహాల విజయ', 'చంద్రగుప్త', 'ప్రతాపసింహ', 'దుర్గాదాస' 'నూర్జహాన్', 'మేవాడ పతన' 'సాజహాన్' మొదలైన చారిత్రక నాటకాలు వ్రాశాడు. ఇవన్నీ అతని కీర్తి ఇనుమడింప జేసిన గద్యనాటకాలు. వీటిలో 'సాజహాను' సర్వోత్తమమైన నాటకం. రాయి 'వంగనారి' అని మరొక నాటకం వ్రాశాడు. అది అతని

మరణానంతరం అచ్చయింది. కాళిదాస భవభూతుల నాటక సాహిత్యం మీద రాయి వ్రాసిన రచన బాంగ్లా విమర్శాత్మక సాహిత్యంలో శ్రేష్ఠమైంది.

ఈనాటి నాటక రచయితలలో క్షీరోదప్రసాద విద్యావినోద (1863 - 1927). అమరేంద్రనాథదత్తు (1876–1916). రామలాలు వంద్యోపాధ్యాయలపేర్లు కూడా పేర్కొన దగినవి.

క్షీరోదప్రసాదు 'పులశయ్య', 'ప్రేమాంజలి', 'ఆలిబాబా', 'ఆలాదిన్', 'దావ్‌సాజాద్' మొదలైన నాటకాలు వ్రాశాడు. రచనలో ఇతను రవీంద్ర, గిరీశ చంద్రుల్ని అనుకరించాడు.

అమరేంద్రనాథుడు అల్పవయసులోనే నాటకరంగంలో ప్రవేశించాడు. నటుడుగా, నాటక రచయితగా పేరు పొందాడు. 'రంగాలయ' పత్రిక నడిపి నాటకరంగానికి సేవచేశాడు. 'నిర్మల', 'పాటికజల', 'దలితఫణినీ' మొదలైన నాటకాలు వ్రాశాడు.

రామలాలు 'అశ్రుపుంజ', 'కమల', 'కాలపరిణయ' మొదలైన నాటకాలు వ్రాశాడు.

గిరీశచంద్రఘోషు కాలం చేశాక బాంగ్లా నాటకాలలో చెప్పదగిన మార్పేదీ రాలేదు. అపరేశచంద్ర ముఖోపాధ్యాయ (1875 - 1931), నిశాకాంతవసురేవంటివారు కొందరు మాత్రం కొన్ని నాటకాలు వ్రాశారు. కొంత మంది ఏకాంకికలు వ్రాశారు.

## ఆధునిక కవిత్వం

పాశ్చాత్య ప్రభావం మూలంగా ఆధునికత బాంగ్లా గద్యలో త్వరితగతిని స్థానమేర్పరుచుకుంది. కాని కవితలో మాత్రం పందొమ్మిదో శతాబ్దంలో నాలుగు పుష్కరాలు దాటాక కాని ప్రవేశించలేదు భారత చంద్రుడి పేరు చలామణీ అవుతూనేవుంది. కవివాలాలు 'లడాయి' సాగిస్తూనే వున్నారు. అయితే క్రమ క్రమంగా నవ్య కవిత తీసుకు వచ్చిన వారు ఆనాడు కాలేజీ ఇంగ్లీషు చదివిన యువ రచయితలు. బైరను, షెల్లీ, కీట్సు, వర్డ్సు వర్తు మొదలైన ఆంగ్ల కవుల కావ్యాలు వీరిని కొత్తపుంతలు

పట్టించాయి. అప్పటికి ప్రాచీన కవుల కోవకు చెందిన కవులలో చివరికవి ఈశ్వర చంద్రగుప్త. ఈయన ప్రసిద్ధి పందొమ్మిదో శతాబ్దం చివరి వరకూ వుండేది.

## ఈశ్వర చంద్రగుప్త (1812 - 1859)

కంచదాపడా ఇతని జన్మస్థానం. తండ్రి హరినారాయణగుప్త. తల్లి శ్రీమతి దేవి. ఈశ్వరచంద్ర విద్యాసాగరుడి విధవా వివాహోద్యమం ప్రతిఘటించిన వాడితను. ఆధునికుల్ని ఇతనే 'ఫరంగి వేషంతో వాల్మీకి దేశాన పులుగు పిట్ట మొహాలతో తిరుగుతున్నారు' అని హేళన చేసిన కవి. భారత చంద్రుడి కవిత్వమూ, కవివాలాల గేయాలూ అంటే మాత్రం చెవికోసుకునే వాడు. అయితే యువకవుల రచనలకు తన 'సంవాద ప్రభాకర' పత్రికలో అవకాశమిచ్చే వాడు. ఈ విధంగా ఆధునిక కవిత్వానికి పరోక్షంగా సాయపడినవాడయాడు. 'ప్రబోధ ప్రభాకర', 'హిత ప్రభాకర' 'బోధేం దువికాస' మొదలైన గ్రంథాలు వ్రాశాడితను. భారత చంద్ర, రామప్రసాద ప్రభృతుల జీవిత చరిత్రలూ, వారి ప్రాచీన కావ్యాలూ ప్రకటించాడు.

ఇతని శిష్యులు అనేకులు గురువు ననుసరించి గద్య పద్యాలలో కావ్యాలు వ్రాశారు. ఈ రకం కావ్యాలలో ఆనంద చంద్రవర్మ 'పదార్థప్రబోధ', ద్వారకానాథ అధికారి 'సుధీరంజన' రసిక చంద్రరాయి 'విజ్ఞాన సాధురంజన', బంకిమచంద చట్టోపాధ్యాయ 'లలితా ఏవం మానస', కృష్ణ కామినీదేవి 'చిత్త విలాసినీ' ముఖ్యమైనది.

ఇంగ్లీషు కావ్యాలు కూడ కొందరు అనువదించీ, అనుకరించీ గద్య పద్యాలలో కావ్య రచన చేశారు. వారిలో గిరీశచంద్ర వంద్యోపాధ్యాయ, నీలమణి బసాక, హేమ చంద్ర మిత్ర, హరిమోహన కర్మకార, ద్వారకానాథకుండు, కాలీకృష్ణదేవు, రంగ లాల వంద్యోపాధ్యాయ, హరిమోహనగుప్త, యదునాథచట్టోపాధ్యాయ ప్రధానులు.

సంస్కృత కావ్యాలు కూడా ఈ కాలంలో అనువాదమైనాయి. వాటిలో లాల మోహనగుప్త, ఈశ్వర చంద్రఘోషులు అమవదించిన 'మేఘదూతలు', మాధవ చంద్రశర్మ అనువదించిన 'రుతుసంహార', ప్యారీమోహనసేనుగుప్త అనువదించిన 'కుమారసంభవ', హరిమోహన గుప్త అనువదించిన 'శాకుంతల', రంగలాలు వంద్యోపాధ్యాయ అనువదించిన 'కుమారసంభవ' చెప్పదగినవి.

అయితే రంగలాలు వంద్యోపాధ్యాయ 'పద్మినీ ఉపాఖ్యాన (1858) కావ్యంలో మొదట ఆధునికత మనకు దర్శన మిస్తుంది.

## రంగలాలు (1826 - 1886)

వర్ధమాన జిల్లా బాకులియా ఇతని జన్మస్థానం. తండ్రి రామనారాయణ వంద్యోపాధ్యాయ. ఈశ్వరచంద్రగుప్త ప్రియశిష్యులలో వొకడితను. 'పద్మినీ ఉపాఖ్యానమూ', 'కర్మదేవీ', 'కంచికావేరీ', 'సురసుందరీ' కావ్యాలు వ్రాశాడు. 'విరహవిలాపం' అనివొక ఇంగ్లీషు కావ్యం అనువదించాడు. 'కాశీయాత్రా', 'బాంగ్లా కవితా విషయక ప్రబంధ', 'శరీరసాధనీ విద్యార గుణోత్కీర్తన', 'భేక మూషికయుద్ధ' మొదలైన ఇతర గ్రంథాలు కూడా వ్రాశాడు.

రంగలాలు 'పద్మినీ ఉపాఖ్యాన' సరిగ్గా మొదటి స్వాతంత్ర్య యుద్ధం జరిగిన మరుచటి సంవత్సరం వెలువడింది. ఆధునిక బాంగ్లా సాహిత్యంలో ఇదే మొదటి కావ్యం. ఇందులోని ఛందస్సూ, భాషా, అలంకారాలూ పురాతనమైనవే; కావ్య పద్ధతి మాత్రం ఆధునికం. ఇంగ్లీషు ఆధునిక కావ్యాలు చదివినా భారత చంద్ర, ఈశ్వర గుప్తులనే కావ్యగురువులుగా చేసుకున్నాడు కవి.

రంగలాలు రెండో కావ్యం కర్మదేవి 1862 లో వెలువడింది. ఇందులో Walter Scott అనుకరణ స్పష్టంగా అవుపిస్తుంది. అంతకి తప్ప భాషలో కాని, భంగిమలో కాని ఆధునికత అవుపడదు. ఇది వెలువడే సరికి బాంగ్లా సాహిత్య రంగంలో మైకేలు మధుసూదన దత్తు విప్లవశంఖం మేఘనాదంతో ప్రతిధ్వనిస్తూ వుంది. ఆ ప్రతిధ్వని రంగలాలులో కూడా ధ్వనించడం సహజం. మధుసూదనదత్తు రంగలాలు బాల్య స్నేహితుడు. అలా అని మధుసూదనుడి విప్లవ శక్తి రంగలాలులో ద్యోతకం కాలేదు.

## మైకేలు మధుసూదనదత్తు (1824 - 1873)

బాంగ్లా సాహిత్యంలో ప్రాచీన ఆధునిక యుగాల మహాసంధిలో జన్మించాడు మధుసూదనదత్తు. అప్పటికి గొంరైతోకలాగ పెరగకండా తరగకండా సాగిపోతూ వుంది బాంగ్లా కావ్యధార. నలిగిన దారినే నడిచి పోతున్నారు కవులు. కవితలో కొత్తదనం లేదు; మార్పున్నూ లేదు. అనుప్రాసబాహుళ్యమే కావ్యంలో గొప్ప. ఈశ్వర గుప్త ప్రతిభావంతుడైన కవే. అయితే ప్రాచీన కోవకే చెందిన కవి అతను. పాశ్చాత్య ప్రభావం అతణ్ణి మార్చలేదు. మధుసూదనుడే బాంగ్లా కవితలో యుగపరివర్తనం కలి

గించిన మహాకవి; రామమోహన, బంకించంద్ర, రవీంద్రనాథులతో చెప్పవలసిన సాహిత్య మహారథి.

యశోహర జిల్లా సాగరదండి ఇతని జన్మస్థానం. తండ్రి రాజనారాయణదత్తు. కలకత్తాలో వకీలు. తల్లి జాహ్నవి.

మధుసూదనదత్తు 1837 లో హిందూ కాలేజీలో చేరాడు. కాలేజీ విద్యార్థులందరిలో అతడే తెలివైన వాడు, ఇంగ్లీషులో అతని ప్రజ్ఞ సాధారణంగా వుండేది. విద్యార్థిదశలోనే మంచి ఇంగ్లీషు పద్యాలు వ్రాసేవాడు.

సీమదేశం వెళ్ళాలనీ, దొరసానిని పెళ్ళిచేసుకోవాలనీ, ఇంగ్లీషులో గొప్పకవి కావాలనీ చిన్నప్పటినుంచీ అతను కలలు కనేవాడు. కుమారుడి ఈ అభిలాష కనిపెట్టాడు తండ్రి రాజనారాయణదత్తు. అతనికి వివాహం తలపెట్టాడు జాతి పిల్లను. అన్నీ సిద్ధమయాయి. పెళ్ళినాడు మధుసూదనుడు పారిపోయాడు. పాదిరీల సాయంతో ఫోర్టు విలియంలో దాక్కున్నాడు. 1843 లో అతను క్రైస్తవ మతం పుచ్చుకున్నాడు. అవాళనుంచి తన పేరు ముందు 'మైకేలు' అని చేర్చుకున్నాడు. అనంతరం అతను హిందూ కాలేజి వొదిలిపెట్టి బిషప్సు కాలేజిలో ప్రవేశించాడు. కుమారుడు క్రయిస్తవుడైపోయినా అతని చదువుకోసం తండ్రి ధనసహాయం మానలేదు. నాలుగేళ్ళు బిషప్సు కాలేజీలో చదివాడు మధుసూదనుడు. గ్రీకు, లాటిన్, హిబ్రూ, పార్సీ, ఇంగ్లీషు భాషలు కూలంకషంగా నేర్చుకున్నాడు. కాలేజీ మద్రాసు పండితుడు కుమారస్వామి దగ్గిర సంస్కృతం చదువుకున్నాడు. 1848 లో కాలేజీ విద్య పూర్తిచేసి మద్రాసు వెళ్ళాడు. అక్కడ మద్రాసు 'సర్క్యులేటర్', 'అథేనియం', 'హిందూ', 'మద్రాస్ స్పెక్టేటర్' ప్రతికలలో సంపాదకుడుగా పనిచేశాడు. మంచి 'ఇండో ఇంగ్లీషు కవి' అని పేరు పడ్డాడు. కొన్నాళ్ళు మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఇంగ్లీషు అధ్యాపకుడుగా పనిచేశాడు. ఈ సమయంలోనే రెబెకా మాక్టవిస్ అనే ఆంగ్ల యువతిని వివాహం చేసుకున్నాడు. కాని ఏడేళ్ళ తరువాత ఆమెను విడిచి పెట్టేశాడు. అనంతరం ఎమిలియా హెన్రీ ఎటా అని మరొకామెను పెళ్ళి చేసుకున్నాడు. ఈమెతో అనుకూల మేర్పడింది. కొంతకాలం మద్రాసులో వుండి ఆమెతో కలకత్తా తిరిగి వచ్చాడు.

ఇంగ్లీషులో మధుసూదనదత్తు మంచి కవిత్వమే వ్రాశాడు. కానైతే అతని అభిలాష మాత్రం పూర్తి కాలేదు. చివరకు బాంగ్లాలో కవిత్వం వ్రాసి యుగ ప్రవర్తకుడయాడు.

పాయకపాడా రాజు కోరిక మీద మధుసూదనుడు రత్నావళి నాటకం ఇంగ్లీషు చేశాడు. ఈ అనువాదం బాంగ్లాలోని పెద్ద దొరల అందరి ప్రశంసలు అందుకుంది. ఇది 1858 లో మాట. అంతవరకు అతను బాంగ్లాలో గ్రంథ రచన చేసిన పాపాన పోలేదు. రత్నావళి ఇంగ్లీషు రచన చూశాక తన స్నేహితులు బాంగ్లాలో గ్రంథరచన చెయ్యమని ప్రోత్సహించారు. అప్పుడే అతను 'శర్మిష్ఠ' నాటకం వ్రాశాడు. అది పాయకపడారాజుగారి బేలగాఛియా నాటకశాలలో ప్రదర్శించారు. తన 'శర్మిష్ఠ' కూడా ఇంగ్లీషులో అనావదించాడు మైకేలు, 'శర్మిష్ఠా' బాంగ్లాలో వ్రాశాకే మాతృభాష మీద గాఢానురాగం కుదిరింది అతనికి,మూడేళ్ళస్వల్పకాలంలో 'పద్మావతి' నాటకం, 'తిలోత్తమ సంభవ' కావ్యం, 'ఏకయీకి బలె సభత,' 'బుడశాలికేర ఘాడేరోఁ' ప్రహసనాలూ, 'మేఘనాథవధ' కావ్యం, 'వ్రజాంగన' కావ్యం, 'కృష్ణకుమారి' 'వీరాంగన' కావ్యాలు వ్రాసి ప్రకటించాడు. ఈ మూడేళ్ళలో అతని కీర్తి ఖండాంతరాలు వ్యాపించింది. బాంగ్లా సాహిత్య రాజ్యంలో సార్వభౌమత్వమే అతనికి లభించింది. కలం పట్టిన మూడేళ్ళలో ఇంతటి కీర్తి ఎవరికీ వచ్చి వుండ దంటే అతిశయోక్తి కాదు. ఈ సందర్భంలో వొక స్నేహితుడి ఉత్తరంలో తానే ఇలా వ్రాశాడు దత్తు.

> "You may take my for it friend Raj that I shall come out like a tromendaus comet and no mistake."

దత్తు బాంగ్లా కవితలో అమిత్రాక్షర ఛందస్సు ప్రవేశ పెట్టాడు. 'వ్రజాంగన' మినహాయిస్తే తక్కిన అతని కావ్యాలన్నీ అమిత్రాక్షర ఛందస్సులోనే నడిచాయి.

బాంగ్లా గద్య మహాభారత రచయిత కాళీ ప్రసన్న సింహ 1861 లో జోడా సంఖలో మధుసూదనదత్తును ఘనంగా సన్మానించాడు. బాంగ్లా కవిని సన్మానించడం చరిత్రలో అదే మొదటి సారి. ఆ సంవత్సరమే మధుసూదనుడు దీన బంధు మిత్ర 'నీలదర్పణ' వొక్క రాత్రిలో ఇంగ్లీషు చేశాడు.

1862 లో దత్తు ఇంగ్లాండు వెళ్ళాడు. వెళ్ళే ముందు 'వంగభూమీర ప్రతి' కవిత వ్రాసి మాతృభూమి దగ్గిర సెలవు తీసుకున్నాడు. లండనులో బారిస్టర్ చదివాడు. 1863 లో ఫ్రాన్సు వెళ్ళాడు. Versailles నగరంలో వుండి 'చతుర్దశపది కవితావళి' వ్రాశాడు. బాంగ్లాలో 'చతుర్దశపది' (సానెట్సు) కవిత అతనే మొదట ప్రవేశ పెట్టాడు.

ఫ్రాన్సులో ధనాభావంతో బాధపడ్డాడు దత్తు. అది తెలిసి ఒకమారు ఈశ్వర చంద్ర విద్యాసాగరుడు ధనం పంపి సాయపడ్డాడు. అయినా అక్కడ భార్యా బిడ్డలతో ఉపవాసాలు కూడా చేశాడతను. ఇరుగు పొరుగు ఉదారులు అది తెలిసి, అతడెరగకుండా తినుబండారాలు అతని గుమ్మంలో పెట్టి దయతో స్వీకరించండి, అని వ్రాసి పోయారు. ఇది పురస్కరించుకుని తన 'సంసారికజ్ఞాన' అనే కవితలో ఇలా వ్రాశాడు దత్తు.

"కి కాజె బజాయె బీనా, కికాజ జాగాయే.
సుమధుర ప్రతిధ్వని కావ్యేర కాననే ?
కి కాజ గరజే ఘన కావ్యేర గగనే
మేఘరూపే, మనరూప మయూర నాచాయే ?
స్వతరీతె తులితోరె బెడాబేకి బాయే
సంసార సాగర జలె, స్నేహకలి మనె
కోన జన దెబె అన్న అర్ధమాత్ర ఖేయె
క్షుదాయ్ కాతర తోరె దేఖిరె తో రణే ?"

మధుసూదనదత్తు పారిసులో వున్నప్పుడు ఇటలీలో దాంతే త్రిశతి వార్షిక మహోత్సవం జరిగింది. యూరపులో పేరు పడ్డ కవులందరూ దానికి కవిత లల్లి పంపారు. మధుసూదనదత్తు కూడా పంపాడు. ఆ కవితను మెచ్చుకుని ఇటలీరాజు విక్టర్ ఇమానియేల్ ఇలా వ్రాశాడు.

"It will be a ring wich will connect the Orient with the Occident"

(మీ కవిత ప్రాక్పశ్చిమాలను ముడిలా కలుపుతుంది.)

బారిష్టరు పరీక్ష పూర్తి చేసుకుని మధుసూదనదత్తు 1867 లో బాంగ్లా తిరిగి వచ్చాడు. అయితే కవి అయిన తాను కలకత్తా హైకోర్టులో బారిష్టరుగా పనిచెయ్యలేదు. ప్రి వీ కౌన్సిలులో రికార్డుల పరీక్షకుడుగా నియమితుడయాడు, అనారోగ్య కారణంగా ఆ పని కూడా చెయ్యలేక పోయాడు. ఈ సమయంలో అతను 'మాయాకానన' నాటకమూ, హెక్టరు కథ గద్య కావ్యమూ, నీతి కవితా మాలా వ్రాశాడు.

1862 లో మధుసూదనుడు పంచకోట మహారాజు దగ్గిర మానేజరుగానూ. లీగలు అడ్వయిజరుగానూ ప్రవేశించాడు; ఏదెనిమిదేళ్ళు పనిచేశాడు. మహారాజు చపల బుద్ధి నచ్చక ఆ పని వొదిలి పెట్టి కలకత్తా వచ్చేశాడు. కలకత్తాలో మంచం పట్టాడు. దారిద్ర్యం పైన పడింది. గంగానది వొడ్డున ఉత్తర పడా గ్రంథాలయ మందిరంలో నివసించాడు. మూడు మాసాలు మాత్ర మక్కడ వున్నాడు. 1873 జూను నెలలో ప్రెసిడెన్సీ జనరల్ ఆస్పత్రిలో చేరాడు. అదే నెల 29 దీని స్వర్గస్థుడయాడు.

మహాకవి మధుసూదనదత్తు ధనాభావంతో మరణించాడు. క్రయిస్తవుడు కావడం చేత అతని మృతదేహం వెంట స్నేహితులు కాని, బంధువులు కాని వెళ్ళలేదు. తన కావ్యాలు చదివి మెచ్చుకునే జనం కూడా వెళ్ళలేదు. అనంతరం మాత్రం ఆ మహా కవి సమాధి దేశీయులకు యాత్రాస్థలమైంది.

మహాకవి సమాధి కలకత్తా సర్క్యులరు రోడ్డులో వుంది. మరణానికి ముందు అతను వ్రాసుకు పెట్టిన గేయం సమాధి బలపపురాతి మీద ఇలా వుంది.

"దాండావ్ పథికవర ! జన్మయది తీవ
వంగే ! తిష్ఠ క్షణకాల ! ఏ సమాధి స్థలె,
జననీర కోలె శిశులభయే యెమతి
విరామ మహీర పదె మహానిద్రావృత
దత్తకులోద్భవ కవి శ్రీ మధుసూదన !
యశోరె సాగర దాండీ కపోతాక్ష తీరె
జన్మభూమి, జన్మదాతా దత్త మహామతి
రాజనారాయణ నామే జననీ జాహ్నవి !"

(నిలు, పథికవరా ! నీ పుట్టుక వంగదేశమే అయితే ఒక క్షణం ఈ సమాధి దగ్గిర ఆగు. తల్లి వొడిలో శిశువు విశ్రాంతి పొందుతున్నట్టు భూదేవి వొడిలో దత్త కులోద్భవుడు కవి శ్రీ మధుసూదను డిక్కడ మహానిద్రావృతుడై వున్నాడు. కపోతాఖ్య నదీతీరం యశోరసాగర దాండి జన్మభూమి. తండ్రి మహామతి రాజనారాయణ దత్తు, తల్లి జాహ్నవి).

ఆధునిక బాంగ్లా కావ్యకాననంలో తొలి తలుపులు తీసిన మాలి మధుసూదనదత్తు. పాశ్చాత్య వాయువులే విప్లవం రేపాయి. నిజమే. అయితే ఆ విప్లవంలో మహా నాయకుడు మధుసూదనదత్తు. అతని ప్రతిభ అసాధారణమైంది. అతని సాహసం అనితరసాధ్యమైంది. వ్యాస, వాల్మీకులతోను; హోమరు, డాంటేలతోను; కాళిదాస, భవభూతులతోను అతను సమానుడు కాకపోవచ్చు; కాని పెట్రార్కా, మిల్టను వంటి కవులకు అతను ఏ మాత్రమూ తీసిపోడు.

"మధుసూదనదత్తు ప్రతిభతో ఆనాటి బాంగ్లా కాలిబాట నవీనయాత్రకు యోగ్యమైన మహారథపథంగా మారింది. తన శక్తిని తాను విశ్వసించినవాడు కనుకనే మాతృభాష మీద ఆ కవి శ్రద్ధచూపాడు. నిర్భీక భావంతో బాంగ్లాభాషకు ఆధునిక దీక్షను ఇచ్చాడు. ఆ సాధనలో పూర్వాను వృత్తికంటే అది అధిక సంపూర్ణంగా, స్వతంత్రంగా విరిసి వర్ధిల్లింది. వంగవాణిని గంభీర స్వరతరంగ భంగీముద్రితం చెయ్యడానికై సంస్కృత భాండారం నుంచి నిస్సంకోచంగా అభీష్టానుసారంగా దోచుకునిరావడం కూడా ఆ మహాకవి చూపిన మార్గమే. ప్రాచీన పాయర్ వృత్త సమద్విభక్త వేలా బంధం తెగగొట్టి దాని మీద ఆయన ప్రవహింప చేసిన అమిత్రాక్షర ప్రవంతి కూడా నూతనమైనదే. మహాకావ్య, ఖండకావ్యాల రచనా రీతులలో అతను అవలంబించిన రీతి కూడా బాంగ్లా భాషకు కొత్తదే. ఇలా క్రమ క్రమంగా పాఠకుల హృదయాలను నచ్చించి మెప్పించడంతో వూరుకోలేదు. శాస్త్రీయమైన మంగళాచరణం కూడా మానివేసి కవితను కొనిపోయి తుఫాను వీపు మీద ఎక్కించాడు. దాంతో ప్రాచీన సింహద్వారం గడియలు సళ్ళి పడిపోయాయి." *.

### మేఘనాథ వధ

మహాకావ్యం వ్రాయాలని మొదటినుంచి మధుసూదనదత్తు అభిలాష. ఆ అభిలాషతోనే అతను మొదట 'తిలోత్తమ సంభవ' వ్రాశాడు. కాని 'మేఘనాథ వధ' వ్రాశాకే అతని అభిలాష పూర్తయింది. 'మేఘనాథ వధ' తోనే అతను మహాకవిగా ప్రసిద్ధి పొందాడు. 'మేఘనాథ వధ' బాంగ్లా సాహిత్యంలోనే కాదు, భారతీయ సాహిత్యంలోనే మహాకావ్యం.

---

* రవీంద్రుడు.

రామాయణంలోని కథే తీసుకున్నాడు కవి. కాని దానిని వొక అద్భుతమైన మయసభగా చిత్రించాడు. అదొక అపూర్వ సృష్టి: నవీన సృష్టి: మహా సృష్టి.

మేఘనాథ వధలో కథానాయకుడు రాముడు కాడు; లక్ష్మణుడున్నూ కాడు. మేఘనాథుడే కథా నాయకుడు. కవి రాముడి పక్షం వహించలేదు; రాక్షసుల పక్షం వహించాడు. ఇదే ఈ కావ్య కథలో అపూర్వం. కావ్య రచన సాగిస్తూ కవి వొక స్నేహితుడికి ఇలా వ్రాశాడు; ".... the glorious son of Ravana was a fine fellow. Ravana was a grand fellow. The idea of Ravana elevates and kindles my imagination. I hate Rama and his rabble."

మేఘనాథ వధలో వాల్మీకి, హోమరుల ప్రభావం అమితంగా అవుపడుతుంది. అలా అని అంధాను కరణతో జాతీయత మరుగు పరచలేదు కవి.

కథ రామాయణంలోదే అయినా పాత్రలు ఇలియడ్‌ను తనుపుకు తెస్తాయి. మేఘనాథ వధలోని శివపార్వతులు ఇలియడ్‌లోని జీవుస్ (Zeus), హేరా (Hera) లనూ, దుర్గ అథేనా (Athena) నూ, స్కందుడు ఆరెస్ (Ares) నూ, తలపుకు తెస్తారు. మేఘనాథుడి వధ తరువాత రావణుడి వైఖరి పాత్రోక్లాస్ (Patro-klos) మృతి తరవాత అఖిల్లెవోస్ (Akhilleos) వైఖరిని తలపిస్తుంది. మేఘనాథ వధలో ప్రమిల పాత్ర ఇలియడ్‌లోని ఆంద్రొమాఖే (Andromakhe) నూ, క్లోరిందా (Clorinda) నూ తనుపుకు తెస్తుంది. మేఘనాథ వధలో కొన్ని సన్నివేశాలు కూడా ఇలియడ్‌ను జ్ఞాపకం చేస్తాయి.

మేఘనాథ వధలో ఇంద్రజిత్తు వధార్థం దేవేంద్రుడు దేవదూత చిత్ర రథుడి చేత లక్ష్మణుడి దగ్గిరికి దివ్యాస్త్రాలు పంపుతాడు. ఇలాగే ఇలియడ్‌లో హెక్తోర్ వధార్థం థేతిస్ (Thetis) దేవశిల్పి హెఫాయిస్తోస్ (Hephaistos) చేత అఖిల్లెవోస్ దగ్గిరికి దివ్యాస్త్రాలు పంపుతాడు.

ఇలియడ్‌లో హెక్తోర్ అంత్య సంస్కారమూ, మేఘనాథ వధలో ఇంద్రజిత్తు అంత్యేష్టి వొక్కలాటి సన్నివేశాలే అనేక చోట్ల అలంకారాలూ, వాక్యాలూ కూడా యథాతథంగా ఇలియడ్‌లోంచి మేఘనాథ వధలోకి తీసుకున్నాడు కవి.

మేఘనాథ వధ కథ

సమ్ముఖ యుద్ధంలో పడి వీరచూడామణి వీరబాహు యమపురం చేరిన వార్త విని, రాజకులమణి రావణుడు శోకాకులుడై మూర్ఛపోతాడు. తెలివుకుని 'ఎవడి భుజ

బలం విని అమరులు కాతరులవుతారో అతడి ముందు ఈ బికారి రాముడా కోదండ మెత్తాడు!' అని నిట్టూరుస్తాడు. యుద్ధసన్నద్ధుడవుతాడు. వీర బాహు తల్లి చిత్రాంగద విలపిస్తుంది. లక్ష్మీదేవి మారువేషంతో ప్రమోదకాననానికి వెళ్ళి వీరబాహు మరణ వార్త మేఘనాదుడితో చెపుతుంది. అతడు వచ్చి తండ్రిని వారిస్తాడు. తానే యుద్ధ సన్నద్ధుడవుతాడు. కొడుకును సేనాధిపతిగా అభిషేకిస్తాడు రావణుడు. వీరధాత్రి. స్వర్ణ లంకలో జయ జయ ధ్వనులు ప్రతిధ్వనిస్తాయి.

లక్ష్మి ఇంద్ర సభకు వెళ్ళి ఇంద్రజిత్తు రణయాత్ర వినిపిస్తుంది. నికుంభిలలో ఇంద్రజిత్తు యజ్ఞం పూర్తిచేస్తే అతణ్ణి జయించడం అసాధ్యం. శచీ ఇంద్రులు కైలాసం వెళతారు, శివుడితో విన్నవిస్తారు. దివ్యాస్త్రాలు పుచ్చుకుని దేవేంద్రుడు చిత్ర రథుణ్ణి లక్ష్మణుడి దగ్గిరికి పంపుతాడు. లక్ష్మణుడు మహామాయని పూజించి వరం పొందుతాడు. ఆమె సాయంతో, విభీషణుణ్ణి వెంట పెట్టుకుని అదృశ్యంగా నికుంభిల యజ్ఞాగారంలో ప్రవేశిస్తాడు. ఇంద్రజిత్తును వధిస్తాడు.

పుత్రశోకంతో రావణుడు రాముడి మీద దండెత్తి వస్తాడు. అతడి శక్తి తగిలి లక్ష్మణుడు పడిపోతాడు. రాముడు మాయాదేవి సాయంతో యమలోకానికి వెళతాడు. అక్కడ దశరథుణ్ణి చూస్తాడు. అతని వల్ల లక్ష్మణుడు బతికే ఉపాయం తెలుసుకుంటాడు. హనుమంతుడు సంజీవి తేవడంతో లక్ష్మణుడు బతుకుతాడు' లక్ష్మణుడు లేచిన వార్తవిని రావణుడు కుంగిపోతాడు. ఇంద్రజిత్తు అంత్యక్రియల కోసము రాముడి దగ్గిర ఏడు దినాలు యుద్ధ విరమణ కోరుతాడు.

సముద్రతీరంలో ఇంద్రజిత్తు అంత్యక్రియలు ఘనంగా జరుగుతాయి. లావణ్యామయి, పతిభక్తి పరాయణ ఇంద్రజిత్తు భార్య ప్రమీల సహగమనం చేస్తుంది.

"హామాతః రాక్షసలక్ష్మి ! కి పాపె లిఖిలా
ఏ పీడా దారుణ విధి రావణేర భాలె !"

(హామాతా రాక్షసలక్ష్మి! ఏ పాపం వల్ల ఈ దుఃఖం రావణుడి నొసట వ్రాశాడు విధి!) అని రాక్షసరాజు రావణుడు వాపోస్తాడు.

కైలాసంలో శివుడు కంపర మెత్తుతాడు. అతని జటా జూటం వూగిపోతుంది. మెడలోని నాగులు బుసకొట్టి గర్జిస్తాయి. నుదుటి కన్ను ధగ ధగ మండుతుంది. త్రిపథగ

సురనది జటా జూటంలో వుప్పొంగుతుంది; పర్వత కందరాల వెల్లువలై పారుతుంది. కైలాసగిరి శిఖరాలు జవ జవ లాడతాయి. విశ్వం ఆతంకంతో కంపిస్తుంది.

సభయంతో అభయ పార్వతి అంజలి బంధంతో శివుణ్ణి శాంత పరుస్తుంది.

ఎత్తి పోతలు జరిపి రాక్షసులు కన్నీళ్ళతో ఇళ్ళకు మళ్ళుతారు.

"సప్త దివా నిశి లంకా కాందిలా."

(ఏడు పగళ్ళు, ఏడు రాత్రిళ్ళు ఏడ్చింది లంక.)

మేఘనాథ వధలో ఛందస్సు అమిత్రాక్షరి (Blank verse). ఈ కావ్యంలో భాష కూడ సరికొత్తది. ఛందో బంధాలే కాదు, వ్యాకరణ శృంఖలాలు కూడా ఛటా ఫట్ మనిపించాడు కవి. కొత్తశబ్దాలు సృష్టించాడు. కొత్తతెన్నులు చూపాడు. స్వర్గ నరకాల వింత దృశ్యాలు చిత్రించాడు. సజీవమైన పాత్రలు సృజించాడు. మేఘనాథుడి నోటవీరోచిత మైన భాష పలికించాడు ప్రమీల వంటి అద్భుత పాత్రను బాంగ్లా కాదు భారతీయసాహిత్యానికి ప్రసాదించాడు.

ప్రమీల వీరాంగన. ఆమె వీరవాక్యాలు వినండి:

"........జని భుజబలె<br>
రఘుశ్రేష్ట; ఏ ప్రతిజ్ఞ, వీరాంగనా మమ;<br>
నతుబా మరిబ రణె, జాధా కె కపాలె;<br>
దానవకుల సంభవా అమరా, దానవి!<br>
దానవకులేర విధి వధితె సమరె,<br>
ద్విషత్ శోణిత నదె, నతుబాడుబితె!<br>
అధరె ధరిలో మధు, గరళలోచనె<br>
అమరా; నహికి బల ఏ భుజ మృణాళె?<br>
చల సబె; రాఘవేర హేరి వీరపణా,<br>
దెఖిబ, జేరూప దెఖి సూర్పణఖా పిసీ<br>
మాతిల మదన మదె పంచ వటీ వనె;

దెఖిబ లక్ష్మణశూరె; నాగ పాశదియా
బాంధిలబ విభీషణె, రాక్షకులాంగారా!
దలిబ విపక్ష దలె, మాతంగినీ యథా
నలవన. తోమరాలో విద్యుత్ ఆకృతి,
విద్యుతేర గతి చల, పడి అరి మాఝె.''

(రఘు శ్రేష్ఠుణ్ణి భుజబలంతో జయిస్తాను. లేదా సమరంలో ప్రాణాలర్పిస్తాను. వీరాంగన నేను ఇదే నా ప్రతిజ్ఞ. ఏముంటే అదవుతుంది నుదుట. దానవకులసంభవను నేను. దానవీ! సమరంలో వధించడమే దానవుల విధి. రక్తనదులు పారించడమో, రక్తనదంలో మునిగి పోడమో మనవిధి. మాఅధరంలో మధువూ, కళ్ళలోగరళమూ వుంటుంది. మా మృణాలభుజాలలో బలం లేదా? రాక్షసాంగనలారా పదండి రాఘవుణ్ణి చుట్టముట్టండి; వీరత్వంతో చూద్దాం అతణ్ణి – ఏరూపం చూసి మేనత్త శూర్పణఖ పంచవటి వనంలో కామాతుర అయిందో ఆ రాఘవుణ్ణిచూద్దాం యుద్ధంలో. శూర లక్ష్మణుణ్ణి చూద్దాం. రాక్షసకులాంగారుడు విభీషణుణ్ణి నాగపాశాలతో బంధించి తెస్తాను. కమలవనం తొక్కేసిన మాతంగిని లాగ శత్రువుల్ని తొక్కేస్తాను. మీరంతా విద్యుత్తుల లాటి ఆకారం కలవారు. విద్యుద్వేగంతో పదండి రాఘవుల మీద విరుచుకు పడదాం.)

మేఘనాథవధ అమరకావ్యం. మైకేలు మధుసూదనదత్తు అమర కవి. ఇతని ఇతర కావ్యాలు 'తిలోత్తమ సంభవ', 'వీరాంగన', చతుర్దశపది', 'వ్రజాంగన' (రాధావిరహ) కూడా ఉత్తమ కావ్యాలు. చతుర్దశపది (సానెట్సు)లో మధుసూదనుడు చూపిన శిల్పం బాంగ్లా కవులలో రవీంద్ర నాథుడు తప్ప ఇంకెవ్వరూ చూపలేదు 'వ్రజాంగనా' కావ్యంలో కవి పక్కా వైష్ణవ కవిగా దర్శన మిస్తాడు. అతను క్రయిస్తవు డని తెలియని వారు ఆ కావ్యం చదివితే కవి వైష్ణవభక్తుడే అనుకుంటారు. అయితే వైష్ణవ కవుల ప్రభావం కంటే భారతచంద్రుడి ప్రభావమే ఇందులో తొంగిచూస్తుంది.

అనాటి బాంగ్లా కవులలో హెచ్చుమంది సంస్కృత పండితులు. వారికి పాశ్చాత్య వాసన కిట్టదు. ఇంగ్లీషు చదివి కవిత కోసం కలం పట్టిన నవయువకులకు బాంగ్లా బాగా రాదు. ఈ రెండు రకాల వారినీ ఉద్దేశించి మధుసూదన దత్తు వ్రాసిన వాక్యాలు మనం కూడా గమనించ దగినవి.

"…. farren rascals, nothing is poetry to them which is not an echo of Sanscrit – they have no notion of originality. …. the poor devils dont know Bengali enough to understand what they read !"

### దత్తు సమకాలిక కవులు

మైకేలు మధుసూధన దత్తు సమకాలికులైన ఆధునికులలో రంగలాల వంద్యోపాధ్యాయ, దీనబంధుమిత్ర, రసికచంద్రరాయి, ద్వారకానాథరాయి, హరినాథమజుందారు, కృష్ణచంద్రమజుందారు, హరిశ్చంద్రమిత్ర, రాధామాధవమిత్ర మొదలైనవారు ముఖ్యులు. రంగలాలు, దీనబంధుల విషయం వెనక తెలుసు కున్నాము.

### రసిక చంద్ర రాయి (1835–1900)

గేయకావ్య రచయితగా సుప్రసిద్ధుడితను. పాలడా గ్రామం ఇతని జన్మస్థానం. 'విజ్ఞాన సాధూర వచన', 'హరిభక్తి చంద్రిక', 'జీవనతార' మొదలైన పదకుండు పాంచాల (గేయ) గ్రంథాలు వ్రాశాడు. 'జీవనతార' శృంగార కావ్యం.

### ద్వారకానాథరాయి

కొత్త పాత దారులు రెండూ తొక్కిన కవి ఇతను. ఇతని 'బిల్వమంగళ' 'రాస రసామృత', 'ప్రకృతప్రేమ', 'సీతాహరణ' మొదలైన గ్రంథాలు పాతరకం గ్రంథాలు, 'ప్రకృతసుఖం', 'సుశీలమంత్రి' కొత్తరకం కావ్యాలు, 'ప్రకృత సుఖం' అమిత్రాక్షర ఛందస్సులో వ్రాసిన రూపక కావ్యం. 'సుశీల మంత్రి' గద్య కావ్యం 'మోహముద్గర', 'స్త్రీశిక్షా విద్యా విధాన', 'ఛాత్రబోధ', 'కవితా పాఠ' 'పాఠామృత', 'శిక్షావళి', 'పరమాద్భుత పదావళి' మొదలైనవి కూడా వ్రాశాడు ద్వారకానాథరాయి.

### హరినాథ మజుందారు (1833 – 1896)

'కంగాళ', 'పికిరిచాంద', అని ఇతని కవితానామాలు. అందుకని ఇతణ్ణి 'కంగాళ హరినాథ' అనేవారు. నదియాజిల్లా కుమారఖాలి గ్రామం ఇతని జన్మస్థానం. తండ్రి హలదర మజుందారు, 'మీర్ మశాఱ్రఫ్ హో సేను ఇతని శిష్యుడు. ఇతని గేయాలు దేశమంతటా ఆదరణ పొందాయి. ఇతని 'చారు చరిత్ర', 'పద్యపుండరీక'

పద్యకావ్యాలు, 'విజయ వసంత', గద్య కావ్యం. 'అకూౄర సంవాద' గేయనాటకం. ఇతను తన గ్రామంలోనే 'గ్రామవార్తా ప్రకాశిక' అని వొక పత్రిక స్థాపించి గ్రామ వాసుల మీద జరిగే అన్యాయాలు నిర్భయంగా ఖండించే వాడు.

## కృష్ణచంద్ర మజుందారు (1837 - 1906)

ఖులనార సేనహాటీ గ్రామం ఇతని జన్మస్థానం. సంస్కృత, పార్సీ భాషలలో మంచి పండితుడు. సహజ కవి. ఇతని రచనలలో సూఫీ కవులైన సాదీ, హాఫీజుల భావాలు కనపడతాయి తరుచు. 'సద్భావశతక', 'మహాభోగ', 'రాసర ఇతి వృత్త' (ఆత్మకథ), 'కైవల్య తత్వ' మొదలైన గ్రంథాలు వ్రాశాడితను, 'ఢాకాప్రకాశ', 'విజ్ఞాపనీ', 'ద్వైభాషికీ', పత్రికల సంపాదకుడుగా పనిచేశాడు. ఈశ్వరగుప్త పత్రిక 'సంవాద ప్రభాకరలో ఎన్నో కావ్యాలు ప్రకటించాడు.

## హరిశ్చంద్ర మిత్ర (1838 - 1872)

కవి, నాట్యకారుడున్నూ ఇతను. హవుడా జిల్లా సావిఖా గ్రామం జన్మస్థానం. ఢాకా నివాసం. తండ్రి అభయ చరణ మిత్ర. 'రామాయణం బాలకాండ', 'నిర్వాసిత సీత', 'కీచక వధ', 'కవితా కౌముది', 'విధవ వంగాంగన', 'వీరకావ్యావళి', 'కవితా రహస్య', 'కవితావళి' మొదలైనవి ఇతని గ్రంథాలు, ఢాకాలో వుండి 'కవితా కుసుమా వళి' అని వొక నెల పత్రిక నడిపాడితను. ఇతని రచనలలో మధుసూదనదత్తు ప్రభా వం బాగా కనిపిస్తుంది.

## రాధామాధవమిత్ర

ఈశ్వరచంద్రగుప్త శిష్యుడితను. జేబారుగ్రామం ఇతని జన్మస్థానం. 'జోధేం దూదయ', 'కవితావళి' అయిదు భాగాలు, 'స్త్రీ లోకేర దర్పచూర్ణ', 'ఆరబ్య ఉప న్యాస', 'విధవామనోరంజన నాటక' మొదలైన గ్రంథాలు వ్రాశాడు.

ఈ కాలంలోనే గోవింద రామదాసు 'సతీరంజన' కావ్యమూ, రామచంద్రవసు 'చేతన కౌముది', రామరత్నదాస సర్కారు 'రసికరతన', 'మానవ దేహరతన' వ్రాశారు, రంగలాలు ముఖోపాధ్యాయ ఎన్నో పదాలూ, 'హరిదాస సాధు', విజ్ఞాన దర్శక', 'చిత్త చైతన్యోదయ', 'వైరాగ్య విపిన విహార' మొదలైన గ్రంథాలూ వ్రాశాడు. చబ్బిసి పరగణా రామాలా గ్రామం ఇతని జన్మస్థానం. తండ్రి విశ్వంభర ముఖోపాధ్యాయ.

రంగలాలు వంద్యోపాధ్యాయ పద్మిని కావ్యం అనుసరించి కొందరు కవులు కావ్యాలు వ్రాశారు. వాటిలో వనోయారీలాలు వ్రాసిన 'జయావతి', లలితమోహన ఘోష వ్రాసిన 'అచల వాసిని', ముఖ్యమైనవి. వనోయారీలాలు 'ద్వారకాకేళి విలాస', 'కోకిల దూత', 'యోజనగంధ', 'కుముద్వతి నాటక' మొదలైన గ్రంథాలు కూడా వ్రాశాడు.

మధుసూదనదత్తు ననుసరించి దీననాథధర, మహేశచంద్రశర్మ, భోలానాథ చక్రవర్తి, బలదేవపాలిత, సూర్యకుమారసేనుగుప్త, విహారీలాల వంద్యోపాధ్యాయ, హరిచరణచక్రవర్తి, భారతచంద్ర సర్కారు, వ్రజనాథమిత్ర,గోపాలచంద్ర చక్రవర్తి, రామకుమారనంది, ప్రసన్నకుమారనాగ, రజనీనాథ చట్టోపాధ్యాయ, యాదవానందరాయి, గురునాథసేనుగుప్త, అంబికాచరణగుప్త, రాజకృష్ణ ముఖోపాధ్యాయ, హేమచంద్ర వంద్యోపాధ్యాయ, విహారీలాల చక్రవర్తి, గణేశచంద్ర వంద్యోపాధ్యాయ, శారదా ప్రసాదముఖోపాధ్యాయ, నరనారాయణరాయి, రామదాస సేను మొదలైన వారు ఎందరో కావ్యాలు వ్రాశారు.

## హేమచంద్ర వందోపాధ్యాయ (1838 - 1903)

'మేఘనాథవధ' రెండోకూర్పు (1863)కు విమర్శాత్మకమైన పీఠిక వ్రాశాడితను. హుగ్లీజిల్లా గులిటా ఇతని జన్మస్థానం. తండ్రి విలాసచంద్ర వంద్యోపాధ్యాయ. వకీలుగా ఎంతోధనం గడించాడు. అంతా బీదలకు దానం చేశాడు. చివరిదినాల్లో (1897) అంధుడై పోయాడు. దారిద్ర్యమనుభవించాడు. 'చింతా తరంగిణి', 'వృత్ర సంహార', 'వీరబాహు', 'ఛాయామయి', మొదలైన కావ్యాలు వ్రాశాడు. 'వృత్ర సంహార' కావ్యంలో మధుసూదనదత్తు ముద్రపడింది. అయితే ఛందస్సులో మాత్రం ఈశ్వరచంద్రగుప్తనే అనుసరించాడుకవి. షేక్స్పియరు 'టెంపెస్టు', రోమియో జూలియటుల ననుసరించి రెండు నాటకాలున్నూ వ్రాశాడు.

## నవీన చంద్ర సేను(1846-1909)

'ప్లాసీర యుద్ధ' కావ్యం వ్రాసి పేరుపడ్డ కవి ఇతను. చట్ట గ్రామజిల్లా నయాపాతా జన్మస్థానం. తండ్రి గోపీ మోహనసేను. బాల్యంనుంచీ కవిత్వమంటే ప్రీతి. ఇతని తొలి కావ్యం 'అవకాశ రంజని'. 1876లో 'ప్లాసీరయుద్ధ' వెలువడింది. దాంతో

అతని ఖ్యాతి కవిలోకంలో హెచ్చింది. 'కురుక్షేత్ర','రంగమతి','రైవతక','ప్రభాస', 'భానుమతి''అమితాభా','అమార జీవన''గీతాఓచండీర అనువాద' మొదలైనవి ఇతని ఇతర గ్రంథాలు.

## కొందరు కవయిత్రులు

ఈ కాలంలో కొందరు కవయిత్రులుకూడ కావ్యాలు వ్రాశారు. వాటిలో కైలాస వాసినీదేవి'విశ్వశోభా',అన్నదాసుందరిదేవి 'అబలా విలాప', ఇందుమతి దాసి 'దుఃఖ మాల', విరజామోహినిదాసి'వనితావిహార',భువనమోహినీదేవి 'స్వప్నదర్శనే అభిజ్ఞాన' నవీనకాలీదేవి 'స్మశానభ్రమణ', కామినీ సుందరీదేవి'కల్పనా కుసుమ' మొదలైనవి పేర్కొన దగినవి.

## మధుసూదనదత్త అనంతరం

"సాహిత్యసీమలో మహాకవి మధుసూదన దత్తు యుగం సమాప్తి అయిన తరవాత అనతి కాలానికే నా చిన్నతనంలో ఎంతోమంది యువకులు ఇంగ్లీషు సాహిత్య సౌందర్యభావ విహ్వలులై వుండేవారు. వారిని షేక్స్పియర్, మిల్టన్, బైరన్, మోలియర్ మొదలైనవారి రచనలు ఉర్రూతలూపి వదిలిపెట్టేవి. తమ సమకాలీన బాంగ్లా సాహిత్యంలో ఉదయించిన నూతన చైతన్య రుచులు నాటి యువకులు ముచ్చట్లలో కూడా ముట్టలేదు. అది అవధాన యోగ్యమని కూడా వారు తలచేవారు కారు. సాహిత్యంలో ప్రాతః కాలమైనా వారికి నిద్ర వదల లేదు." *

మధుసూదనదత్తు అనంతరం బాంగ్లా కవులలో రెండు మార్గాలేర్పడ్డాయి. మొదటిది గతానుగతికంగా వస్తున్న క్లాసిక్ మార్గం. రెండోది నవీనమైన రొమాంటిక్ మార్గం. మొదటి మార్గం అనుసరించిన కవులలో హేమచంద్ర వంద్యోపాధ్యాయ (1838–1907) నవీన చంద్రసేను (1846–1909), అక్షయ చంద్రచౌధురి, ఈశాన చంద్ర వంద్యోపాధ్యాయ(1856–1897),రామకృష్ణరాయి (1852–1894), శివనాథశాస్త్రి, హరిమోహన ముఖోపాధ్యాయ, అధరలాలసేను (1855–1885), ఆనందచంద్రమిత్ర, నవీన చంద్రముఖోపాధ్యాయ, దినేశచంద్రవసు (1851–1899) మొదలైనవారు ప్రసిద్ధులు.

---

* రవీంద్రుడు.

రెండో తెగ కవులలో మొదట కొత్తకంఠం వినిపించిన కవి బీహారీలాలు చక్రవర్తి (1834-1894) ఆధునిక గీతికావ్యజనకుడీతను, రవీంద్రనాథుడి కావ్య గురువు. చిన్నతనంలోనే కవిత్వం అలవరుచు కున్నాడు. అనతికాలంలోనే కొత్త మార్గం తొక్కాడు. ఆధునికసాహిత్యంలో 'కవిగురువు'అనిపించుకున్నాడు. వాల్మీకితో కాళిదాసు సంబంధం ఎలాటిదో బీహారీలాలుతో రవీంద్రనాథుడి సంబంధం అలాటిది అన్నాడు బాంగ్లాసాహిత్య చరిత్రకారుడు సుకుమార సేను.

'సంగీత శతక'.'స్వప్నదర్శన' (గద్య), 'బంధువియోగ' (1870), 'ప్రేమ ప్రవాహిని' (1870), 'వంగసుందరి' (1870).'నిసర్గసందర్శన'(1870),'శారదామంగళ (1879), 'సాదేర ఆసన' (1888-89)మొదలైనవి ఈయన వ్రాశాడు. ఇతనికవిత సరళమైంది; సరసమైంది; ప్రతిభాసంపన్నమైంది.ఇతని'హిమాలయ' ఖండకావ్యంచూడండి:

"అసీమ నీరద నయ
ఓయి గిరి హిమాలయ
ఉథవే ఉఠేఛె జెనొ అనంత జలధి
వ్యాపె దిక దిగంతర
తరంగియా ఘోరతర
ప్లాబియా గగనాంగనె జాగె నిరవధి
పదే పృథ్వీ, శిరే వ్యోమ,
తుచ్ఛతారా సూర్య, సోమ,
నక్షత్ర నరవాగ్రే జెనొ గినిబారె పారె
సముఖె సారాదాంబరా
ఛడియే రయెఛె ధారా,
కటాక్షే కరబన జెనొ హరిఛె తాహారె.
కత శత అభ్యుదయ
కతయా విలయ లయ
చక్షేర ఊపరె జెనొ ఘటె క్షణేక్షణే

హరహర హరహర
సున నర థర
ప్రళయ పినాకరావ బాజే నా శ్రవణే
ఝటికా దురంత మేయే
బుకే ఖేలా కరే ధేయే
ధరిత్రి గాసియా
సింధులోటే పదతలె.
జ్వలంత అనల ఛవి
ధ్వక ధ్వకజ్వలే రవి
కిరన జ్వలన జ్వాలా మాలా శోభేగవే.
కావేర కరాల హాసి
దమకె దామినీ రాశి
కక్కడ దంతే దంతే భీషణ ఘర్షణ
త్రిజగత త్రాహి త్రాహి
కిఛహలా భూక్షేప నాహి
కే యోగేంద్ర వ్యోమకేశ యోగే నిమగ్న"

(అసీమ నీరదం కాదీ హిమాలయ గిరి, అనంతజలధిలా నిలబడివుంది, దిగంతాలు వ్యాపించి ఘోరతర తరంగాలలో గగనాంగణం ముంచేస్తుందిలా వుంది. నిరవధి రూపంతో పైకిలేచింది! పాదాల మోల పుడమి, శిరస్సున ఆకాశం. సూర్యచంద్రనక్షత్రాలుతుచ్ఛంగా నక్షత్రాలు గోళ్ళతో లెక్కిస్తుందేమో! ఎదట సాగరాంబర భూదేవి పడుంది. అప్పుడప్పుడు దానిమీదకటాక్షం విసురుతుంది. క్షణక్షణం వందలువందలు అభ్యుత్థానాలు, పతనాలు దానికళ్ళముందుజరిగి పోతున్నాయి. హరహర హరహర విని గజగజ వణుకుతుంది. కాని ప్రళయ పినాకరావం దా చెవుల వినపడదు. తుఫాను కన్న కూతురై దానిగుండెలమీద క్రీడిస్తుంది. ధరిత్రినిగ్రసించి సముద్రం దానిపాదాలదగ్గిర వాల్తుంది. ధగధగ మండుతూ రవి కిరణజ్వాలా మాలకంఠానతొడుగుతాడుశోభగా. కాల

కరాళహాసంలా మెరుపురాసులు మెరుస్తాయి. కాలం పటపటపళ్ళు కొరికినట్లు ధ్వనిస్తాయి. ముజ్జగాలు త్రాహిత్రాహి మంటాయి. కాని దానికి రవంతాజంకులేదు. ఓ వ్యోమ వేళ యోగనిమగ్నుడవు ఎవరునువ్వు?)

బీహారీలాలుతో పాటు కొత్తరకం కావ్యాలు వ్రాసినకవులలో సురేంద్రనాథ మజుందారు(1838-1878) ద్విజేంద్రనాథఠాకూరు, దేవేంద్రనాథ సేను, గోవింద చంద్రదాసు, అక్షయ కుమార బడాల్, ద్విజేంద్రలాలరాయి, విజయచంద్రమజుందారు. నవకృష్ణభట్టాచార్య, నిత్యకృష్ణవసు, ప్రియనాథ సేను మొదలైన వారు ముఖ్యులు.

## సురేంద్రనాథ మజుందారు (1838 - 1878)

బీహారీలాలు వలెనే ఇతను కూడా ప్రేమకవి. యశోహరా జగన్నాథపురం ఇతని జన్మస్థానం. తండ్రి ప్రసన్ననాధసేను. సంస్కృతం, ఇంగ్లీషు, పార్సీభాషలలో స్వయం కృషి చేశాడు. ఇతని మొదటి కావ్యం 'షడృతు వర్ణన' 'మంగళ ఉషా' పత్రికలో వెలువడింది, 'సలితా సుదర్శన', 'వర్షవర్తన', 'మాదక మంగళ' 'ఫులరా'' 'మహిళ' మొదలైన కావ్యాలు వ్రాశాడు, టాడ్ రాజస్థాన కథావళి 'రాజస్థానేర ఇతివృత్త' అని అనువదించాడు. సంస్కృతం నుంచీ, ఇంగ్లీషు నుంచీ ఎన్నో రచనలు బాంగ్లా చేశాడు. 'విశ్వ రహస్య' మరి మరొక గ్రంథం కూడా వ్రాశాడు.

సురేంద్రనాథుడు ప్రాచీన రీతినే కవిత్వమారంభించినా బీహారీలాలు ప్రభావంతో ఆధునిక కవిగా మారాడు. ఇతని 'మహిళ' బిహారీలాలు 'వంగ సుందరి'లో వెలువడింది. ఇతని ఖండకావ్య మొకటి ఉదాహరణకు :

హే కవికల్పనా మాయా
సత్యేర సోనాలీ ఛాయా
కావ్య ఇంద్రజాల భానుమతీ,
సుఖేతుమి యథా ఇచ్ఛా
థాకో క్రీడావతీ.
ఛడియా పుష్పక రథే
భ్రమో గియా ఛాయా పథే

కర ఇంద్రచాప విరచన,
కింబా కరో పరీసనే
చంద్రికా భోజన,
ఆమి న కరిబో దేవీ తవ ఆవాహన.
విధాతార ఏ సంసారె
జారే నా తుషితా పారె—
జో కవిర మహతీ కామనా,
సే కవి కరిబే
దేవీ, తవ ఉపాసనా.
తోమార ముకుర ఫలే
హేరే సే హరషభరే
ఛాయా తార కాయా
నహీ జార
తతో లోకాతీత
నయవాసనా ఆమార
లక్ష్య మమ
సామాన్య ఏ సత్యేర సంసార.
—సురేంద్రనాథ మజుందారు

(ఓ కవికల్పనామాయా! ఓ సత్యస్వర్ణచ్ఛాయా! కావ్యేంద్రజాల భానుమతీ! క్రీడాపతీ! యధేచ్ఛగావుండు; సుఖంగావుండు. పుష్పక రథమెక్కి ఛాయాపథాన విహరించు. ఇంద్ర ధనుస్సులు సృష్టించు లేదా అప్సరసలతో కలిసి చంద్ర కిరణాలు భుజించు. దేవీ, నిన్ను నేను ఆవాహన చెయ్యను. విధాత సృజించిన ఈ సంసారం ఎవరిని తృప్తి పరచదు? ఇంతకంటే ఏ కవి వాంఛ గొప్పదో, ఆ కవి నిన్ను ఉపాసిస్తాడు. అతడే నీ అద్దంలో కాయం లేని ఛాయ తిలకించి కులుకుతాడు. ఈ లోకాతీత వాసన నాకులేదు. తల్లీ. ఈ సాధారణ సంసారమే నా లక్ష్యం.)

## ద్విజేంద్రనాథ ఠాకూరు (1840 - 1926)

రవీంద్రనాథుడి అన్న ఈయన. కవి మాత్రమే కాదీయ్యన. సంగీతము, చిత్ర కళ, గణితము, తత్వవిద్య. దర్శనశాస్త్రము - అన్నిటా సమర్ధుడు. గద్య పద్యాలు రెండిటా రచనసాగించాడు. బీహారీలాలు కావ్యాలతో ఇతని కావ్యాలకు సామంజస్యం కనిపిస్తుంది. ఇతని 'స్వప్నప్రయాణ', 'కావ్యమాల', 'రేఖాక్షర వర్ణమాల' 'జౌతు కనాకౌతుక' ప్రసిద్ధకావ్యాలు. 'స్వప్న ప్రయాణం' నుంచి చిన్నతునక :

కరియా జయె
మహా ప్రళయ
బాజియా ఉఠిల బాజనా నానా.
తాల వేతాల
దిచ్ఛేతాల
థెయి థెయి నాచే పిశాచదానా.
గాధాయ చడి
లాగాయ ఛడి
అదభుతరస కింపురుష.
దుటి అధరె
హాసి నా ధరె
లంబా ఉదర బేంటె మానుష.

(మహా ప్రళయం జయించి నానా వాద్యాలు మోగాయి. లయతోనూ, లయ తప్పి తాళాలు. రేగాయి, థెయి థెయి పిశాచాలు నాట్యం చేశాయి. గాడిద లెక్కి, చబుకువేసి, అద్భుంతగా కింపురుషులు - పెదవుల నవ్వులేదు. పెద్ద పొట్టల పొట్టి మనుషులు.

## దేవేంద్రనాథ సేను (1855 - 1920)

ఇతను కూడా ప్రేమ కవి. మధుసూదనదత్త, బీహారీలాలు, రవీంద్రనాథుల అనుకరణవుండినా ఇతని కవ్వితంలో నిజత్వం దెబ్బతినలేదు. ఆధునికులలో ఈయ

నను గార్హస్థ్యకవి అన్నారు. కలంకనీర ఆత్మకాహినీ' మొదలైన ఇతని ఖండ కావ్యాలు ప్రసిద్ధమైనవి. ఉత్తర ప్రదేశ గాజిపురం ఇతని జన్మస్థానం. తండ్రి లక్ష్మీ నారాయణ సేను. 'గోలాప గుచ్ఛ', 'అశోక గుచ్ఛ', 'శేపాలిగుచ్ఛ' 'పారిజాతగుచ్ఛ' మొదలైనవి ఇతని గ్రంథాలు. ప్రేమ కవితలో ఇతని దొాక ఖండ కావ్యం.

చిరదిన చిరదిన
రూపేర పూజారి అమి
రూపేర పూజారీ.
సారాసంధ్యా సారానిశి
రూపబృందా వనెబసి
హిందోలాయ్ దోవేనారీ
ఆనందే సెహారి.
అధరే రంగేర హాస
విద్యుత్తేర పరకాశ
కేశేర తరంగే నాచే
నాగేర కుమారీ.
వాసంతీ ఓఢనా సాజే
ప్రకృతి రాధికా నాచే.
చరణీ ఘంఘుర
బాజేఆనంద ఝుంకారి.
నగనా దోలనా కోలే
మగనా రాధికా దోలే
కవిచిత్తేర కల్పగార
అలా ఉధారి.
ఆమనే అమృత విష

పానకరి అహర్నిశ
సంసారేర వ్రజవనే
విపిన విహారీ.

—దేవేంద్ర నాథ సేను.

(చిరకాలం, చిరకాలం రూపపూజారిన్నేను, రూపపూజారిని. సాయంకాలమంతా రాత్రంతా రూపబృందావన డోలికల ఊయల లూగుతుంది నారి. ఆనందంతో తిలకిస్తాన్నేను. పెదవుల మీద రంగుల నవ్వు మనోవిద్యుత్తు మెరిసినట్టుంటుంది. కేశతరంగాల నాగకుమారి నాట్యమాడుతున్నట్టుంటుంది. వాసంతరంగుముసుగుతో ప్రకృతి రాధ నాట్యం చేస్తుంది. కవి చిత్తం ఉద్రేకిస్తుంది. ఈ అమృత విషం పదే పదే పానం చేస్తాను. సంసార వ్రజవనంలో విపిన విహారిన్నేను.)

## గోవింద చంద్రదాసు (1855 - 1918)

ఇతను కూడా ప్రణయకవి. జయదేవపురం ఇతని జన్మస్థానం. తండ్రి రామ నాథ దాసు. భావలా స్టేటులో అతనిమీద అక్రమంగా నేరారోపణచేసి రాజ్యంనుంచి వెళ్ళగొట్టారు. (జయదేవపురం భావలాలోది) ఇది పురస్కరించుకుని ఇతడు 'మగేర ములక్' అని వొక వ్యంగ్య కావ్యం వ్రాశాడు. ఆజీవనం దారిద్ర్య మనుభవించాడు, మధ్య మధ్య దేశబంధు, చిత్తరంజనదాసు ఆర్థిక సహాయం చేసి తోడ్పడ్డాడు. 'ప్రేమ ఓ ఫూల', 'కుంకుమ', 'కస్తూరీ', 'చందన', 'ఫులరేణు' మొదలైన కావ్యాలు వ్రాశాడు. తొలిభార్య వియోగం పురస్కరించుకు ఇతను ప్రణయ వియోగ కవిత ఆరంభించాడు. ఆధునిక కవులలో ఇంగ్లీషు ఎరగని కవి ఇతను. దేవేంద్రనాథసేను ప్రభావం ఇతని మీద ఎంతయినావుంది. ఇద్దరూ ఇంచు మించు వొక్క కోవకు చెందిన భావ కవులు. ఇతని వొక భావగీతం :

ఆమి తారె భాల బాసి
అస్థి మాంస సహః
ఆమి ఓ నారీర రూపె,
ఆమి ఓ మాంసేర స్తూపె,
కామనార కమనీయ

కేలీ కాలీ దహా.

ఓ కర్దమె-అయిపంకె,

అయిల్లేదె- ఓ కలంకె

కాలీయ నాగేర మత

సుఖీ అహరహా!

అమి తార భాల బాసె

అస్థి మాంస సహా!

(ఆమెను నేను ప్రేమిస్తున్నాను, అస్థిమాంసాలతో ప్రేమిస్తున్నాను. ఆనారీ రూపంలో, అమాంస స్థూపంలో కామనా కమనీయకేళి కాళీయదళనం. ఆ కర్దమంలో, ఆపంకంలో, క్లేదంలో, కలంకంలో కాళీయ నాగులాగ అహరహం సుఖిస్తాను. ఆమెన్నేను ప్రేమించాను, అస్థిమాంసాలతో ప్రేమించాను.)

గోవింద చంద్రదాసు వ్యంగ్య కావ్యం 'మగీరముటాక్' ప్రభుత్వం నిషేధించింది.

## అక్షయకుమార బడాల్ (1865 - 1918)

బీహారీలాలును అనుకరించినా తుదకి తన కవితా పద్ధతి తనదే అనిపించుకున్న ఆధునిక కవి అక్షయ కుమారబడాల్. కలకత్తా చోరబాగాన్ ఇతని జన్మస్థానం. తండ్రి కాలీచరణబడాల్. గురువు బీహారీలాల చక్రవర్తి. బాల్యంలో కవిత్వ మల్లడం అలవరుచుకున్నాడు బడాల్. ఇతని మొదటి కావ్యం 'పునర్మిలన', ఆనాటి పేరుపడ్డ బాంగ్లా పత్రికలన్నిటిలోను ఇతని రచనలు వెలువడ్డాయి. 'ప్రదీప', 'కనకాంజలి', 'భూల', 'శంఖ', 'ఏషా', మొదలైనవి ఇతని కావ్యాలు. 'ఏషా' తన భార్యా వియోగం పురస్కరించుకుని వ్రాసిన విషాద కావ్యం. గోవింద చంద్రదాసు కవితలో వలెనే ఇతని కవితలో కూడా తీవ్రమైన ఆవేశం అవుపిస్తుంది. అయితే రసస్పష్టిలో బడాల్‌దే పైచేయి. గోవిందచంద్రుడివలె అక్షయకుమారు కూడా నారీ ఉపాసకుడు. ఉభయులూ భార్యా వియోగంతో బాధపడిన కవులే. ఇద్దరూ విషాదస్మృతికావ్యాలువ్రాసిన వారే. అయితే ఉభయులలోనూ కావలిసినంత వ్యత్యాసం లేకపోలేదు.

రవీంద్రనాథుణ్ణి అక్షయకుమారుడు అనేక చోట్ల అనుకరించాడు. అయితే ఆ అనుకరణలో అందం చెడలేదు.

"కోథారె తరురఛాయా, వసేర శ్యామల స్నేహ" అని రవీంద్రుడంటే, "అక్షయ కుమారుడు" కోథాసే నికుంజ ఛాయా అలస పరసఖేలా?" అన్నాడు. రవీంద్రుడు "కఖన వసంతగెల ఏబార హాలనా గాన" అంటే అక్షయ కుమారుడు "ఆమారి హాల నాగాన, ఆమారి బాంశరీనాయి: వసంత పె ఎలగెల, బసె ఆఛిసూన్యేతాయి" అన్నాడు.

అక్షయకుమారుడు పద్యం నడపడంలో ఒక ప్రత్యేకత కనపరిచాడు. అనేక చోట్ల బ్రౌనింగునను సరించాడు. 'ప్రదీప' కావ్యంలో ఇది అధికంగా అవుపిస్తుంది.

బడాల్ 'కనకాంజలి' ఖండ కావ్యాల సంపుటం. మొదట ఇందులో రెండు డజన్ల కావ్యాలుండేవి. రెండో ముద్రణలో మరికొన్ని కొత్త కావ్యాలు చేరాయి. ఈ కావ్యసంపుటం కవిగురు బిహారీలాలు పేర అంకితం చేశాడు కవి. కనకాంజలి కావ్యాలు 'కిశోరకథ', బృందావనగాథ', 'వనలత' అని మూడు భాగాలుగా విభక్తమైనాయి.

ఉదాహరణకు అక్షయ కుమారుని దొక కావ్యఖండిక :

ఆమి జగతేర త్రాస,
విశ్వగ్రాసి మహోచ్ఛ్వాస,
మాథాయ్ మత్తలా స్రోత,
నేత్రే కాలానల;
శ్మశానే మశానేటాన,
గరలే అమృత జ్ఞాన,
విషకంఠ, శూలపాణి,
ప్రళయ పాగల.
తుమి హెసె బ'సె వామె,
సజాయియా ఫుల దామె,
కుత్సిత శిఖాలె,

శివె, హాయిత సుందర.
తోమారి ప్రణయస్నేహ,
బంధిల కైలాస గేహ,
పాగవె కరిల గృహీ
భూతే మహేశ్వర.

—అక్షయకుమార బడాల్.

(జగద్వ్యాప్ని నేను, విశ్వగ్రాసిమహోచ్ఛ్వాసాన్ని. నా తల మీద కల్లోల ప్రవాహం. నేత్రాన కాలానలం, స్మశానమే వాసం చేశాను. గరళమే అమృతమని భావించాను విషం కంఠంలో వుంది. శూలం చేతిలో వుంది, ప్రళయోన్మాదుణ్ణి నేను.

పూలదండ కూర్చినా వామభాగాన కూచున్నావునువ్వు నవ్వుతూ. శివే: కుత్సితుడికి సుందరుడు కావడం నేర్పావు. నీ ప్రణయస్నేహకారణంగా కైలాసంలో ఇల్లు కట్టాను. పిచ్చివాణ్ణి గృహస్థుచేశావు. భూతాన్ని మహేశ్వరుణ్ణిచేశావు.)

## ఆధునిక కవయిత్రులు

బాంగ్లాలో ఆధునిక కవయిత్రులు పందొమ్మిదో శతాబ్దం చివరి భాగంలోనే కనిపిస్తారు. వారిలో గిరీంద్ర మోహిని దాసి, స్వర్ణకుమారీదేవి, కామినీరాయి, మానకుమారి వసు, ప్రమీలానాగ, షోడశీబాలదాసి, జ్ఞానేంద్ర మెహినీదత్త, మృణాళినీదేవి, నాగేంద్రబాల, సురమాసుందరీ ఘోష, అంబుజాసుందరీ దాసగుప్త, కుసుమకుమారీ రాయ చౌధురి, నిస్తారిణీదేవి, అనంగ మోహినీ దేవి, వినయకుమారీ వసు, లజ్జావతీ వసు ముఖ్యులు. వీరందరూ ఛందోరీతులలోనూ, భావభంగిమలోనూ, భాషాశిల్పంలోనూ నవీనతసృష్టించ గలిగారు.

## గిరీంద్ర మోహినీదాసి (1858 - 1924)

ఆధునిక కవయిత్రులలో మొదటి ఆమె ఈమె. కలకత్తా భవానీపురం ఈమె జన్మస్థానం. తండ్రి హారానచంద్ర మిత్ర. భర్త నరేశచంద్రదత్తు, పాతికేళ్ళ ప్రాయంలో గిరీంద్రమోహినికి వైధవ్యం ప్రాప్తించింది. మిగిలిన జీవనం కావ్యరచనలో గడిపిందామె. 'అశ్రుకణ', 'అర్ఘ్య', 'సన్యాసినీ', 'సింధుగాథ', 'స్వదేశినీ',

'భారతకుసుమ' 'కవితాహార' 'అలక', 'శిఖ', 'ఆభాష' మొదలైన గ్రంథాలు వ్రాసింది. మూడేళ్ళ 'జాహ్నవి' పత్రిక నడిపింది. గ్రామ జీవనం చిత్రించడంలో ఈమె సిద్ధహస్త. అనేక కవులకు గురువు. ఒక పల్లె చిత్రం చూడండి:

పుకురె నిర్మలజల,
ఘేరాకలమీర దల,
హాంసి దుటి కరెసంతరణ,
పుతురేర పాడె వంశవన
శూన్యజన కోలా హల,
కిచిమిచి పాఖీ దల,
సాంయిసాంయి వాయుర స్వనన,
రోదటకు సోనార వరణ.
లుకాయ చూవేర గోఛా,
బాలాదుటి హాతె గోంజా,
ఏకాకినీ ఆపనార మనె
ధాననాడె బసియా ప్రాంగణె.
శాంత స్తబ్ద ద్విప్రహరె
గ్రామ్య దూరె గోరు చలె;
తరుతలె రాఖాల శయాన;
సరు మోటా రాస్తా దియె
పథిక చలెఛె గేయె,
మనపడె సెయి మితె తాన.—గ్రామ్యఛవి.

(చెరువులో నిర్మలంగావుంది నీరు. చుట్టూనాచు. హంసలు రెండు ఈదుతున్నాయి. కోనేటి పక్క వెదుళ్ళవనం. జనకోలాహల శూన్యం. పిట్టలు కిచిమిచి మంటున్నాయి, సాంయి సాంయి గాలిధ్వనిస్తూవుంది. ఎండ బంగారం రంగు. జుత్తుముడి చేతులతో సవరిస్తూ ఏకాకిని వాకిట ధాన్యమేరుతోంది కూచుని. శాంత స్తబ్ద మధ్యాహ్న వేళ. ఊరి పొలాల సొమ్ములు పశువులు మేస్తున్నాయి. చెట్టుకింద సొమ్ముల

కాపరి నిద్రపోతున్నాడు. సన్నపాటి ముతక దారిని పథికులు నడిచి పోతున్నారు. ఆ తియ్యనితనం తనువుకు వస్తుంది.)

## స్వర్ణకుమారీ దేవి

ఈమె పరిచయం ఇంకో చోట తెలుసుకున్నాము. అక్షయ చంద్రచౌధురి ననుసరించి కవిత్వమారంభించిందీమె. నాలుగు ఖండ కావ్యాలతో 'గాథా' కావ్యసంపుటి ప్రకటించింది. ఛందస్సులో బీహారీలాలు ననుకరించింది. ఈ వసంత ఉత్సవ (1880) గేయనాటకం. 'కవితా ఓగాన' కావ్యసంపుటం, 'బాల్యసఖి' ఈమె తొలి కవిత.

## కామినీరాయి (1868 - 1933)

ఎనిమిదేళ్ళ ప్రాయంలోనే కవిత్వం కట్టడ మారంభించిందీమె. తండ్రి చండీచరణసేను. ఈమె కవితలో స్త్రీ హృదయం కృత్రిమత లేకుండా ప్రస్ఫుటితమైంది. 'ఆలో ఓ ఛాయా' ఈమె తొలి కావ్య గ్రంథం. ఇది 1889 లో వెలువడింది. 'మహాశ్వేత', పుండరీక' (1886) ఈమె దీర్ఘకావ్యాలు. 'మాల్య ఓ నిర్మాల్య' (1880), పౌరాణికి', 'అశోక సంగీత' (1914), 'గుంజను' (1928), ధూప ఓ దీప' (1929), 'జీవన పథె' (1930) మొదలైనవి ఈమె ఇతర కావ్యాలు. ఈమె కవిత్వం సరళమైంది. నిష్కపటమైంది. ఉదాహరణకు వొక గేయం.

హాయహాోక్ ప్రియతమ,
 అనంత జీవన మమ
 అంధకారమయ,
తోమార పథేర పరె
 అనంత కావేర తరె
 ఆలో యది రయ -
తుమి పతి, తుమి ప్రభు,
మన, మాన మమ
 సకలి తోమార హాతె.
దలయది హోయ,
ఏయి రమణీర మన,

తాహో, ప్రియతమ
తోమారి చరణ ప్రాంతె
లుటాబె ధరాయ.

(ప్రియతమా, అనంత కాలం నీ పథాన వెలుగు కాగలిగితే, నా అనంత జీవనం అంధకారమయమైతే అవుగాక. నువ్వే పతివి, నువ్వే ప్రభువు. నా మనస్సూ, మానమూ అన్నీ నీ చేతిలోనే వున్నాయి. ఈ రమణి మనస్సు కుమ్మేసినా, ప్రియతమా, నీ పాదాల ముందే నేలమీద దొర్లిపోతాన్నేను.)

రవీంద్రనాథ ఠాకూరు (1861 - 1941)

బాంగ్లా సాహిత్యాకాశంలో మధ్యందిన మార్తాండుడు రవీంద్రనాథుడు. బాంగ్లాలో అంతటి మహాకవి ఏనాడూ పుట్టలేదు, ఇక ముందున్నూ పుట్టబోదేమో! అతనొక మహా యుగ పురుషుడు, మహామానవుడు. పద్యం, పాట; వ్యాసం, కథ; నాటకం, నవల - పట్టిందల్లా బంగారం పంట, వజ్రాల గని చేసిన బాంగ్లా కవి-విశ్వకవి అతను. కేవలం కవి మాత్రమే కాదు, నటుడు, గాయకుడు, చిత్రకారుడు, వైయాకరణి, భాషా వేత్త, దార్శనికుడు, తత్త్వవిదుడు ఒకటేమిటి విశ్వజనీనుడతను, సర్వతోముఖ ప్రతిభావంతుడు, విశ్వవిస్మయ మనీషి.

పుట్టుకతోనే కవి రవీంద్రనాథుడు. కవిత్వంలో తన ప్రవేశం తానే ఇలా చెప్పాడు:

"నా వయస్సు అప్పుడు ఏడెనిమిది సంవత్సరాల కంటే అధిక ముండదు. నామేనల్లుడు శ్రీజ్యోతిః ప్రకాశ నాకంటే వయస్సులో కొంచెం పెద్ద. అప్పటికే అతను ఇంగ్లీషు సాహిత్యంలో ప్రవేశించి 'హామ్లెట్' స్వగతం ఉత్సాహంతో వల్లించేవాడు. నా వంటి పిల్లవాడిచేత కవిత్వం వ్రాయించడానికి ఎందుకతనికి ఉత్సాహం కలిగిందో చెప్పలేను. ఒకనాడు మధ్యాహ్నం వారి యింటికి నన్ను పిలుచుకుని వెళ్ళి 'నువ్వు పద్యాలు వ్రాయాలి' అంటూ పయార్ ఛందస్సులో పదునాలుగు అక్షరాలు సంధించడం నాకు నేర్పించాడు.

పద్యాలు ఇంతవరకు నేను అచ్చు పుస్తకాలలోనే చూశాను. వాటిలో తుడుపులూ గిడుపులూ లేవు. భావచింతనా లేదు. ఎక్కడా మానవ సహజమైన దౌర్బల్య చిహ్నం

లేదు. అలాటి పద్యాలు స్వయంగా ప్రయత్నించి వ్రాయగలనని ఊహించడానికయినా నాకు సాహసం కలగలేదు. ఒకనాడు మా యింటిలో వొక దొంగ పడ్డాడు. ఎంతో భయంతోనూ, పట్టరాని కుతూహలంతోనూ దొంగను చూడడానికి వెళ్ళాను, చూశాను. కేవలం సాధారణమైన మనిషిలాగే వున్నాడు వాడు. ఆ అవస్థలో మా దర్వాను వాణ్ణి కొట్టడం చూసి నా మనస్సు చాలా బాధపడింది. పద్యరచన విషయంలో కూడా ఆనాటి దశ తటస్థించి నట్టయింది నాకు. స్వహస్తాలతో కొన్ని శబ్దాలు కూర్చేసరికి అవి పయార్ ఛందస్సు కింద పరిణమించాయి. దాంతో పద్యరచన మీద మోహం పుట్టింది. ఆ మోహం ఆగింది కాదు. అయితే పద్యం మీద దెబ్బలు పడడం సహించ లేకపోయే వాణ్ణి. అనేక సమయాలలో జాలి కలిగేది, కాని దెబ్బలు ఆగవు చేతులూ దురద వేస్తాయి. దొంగ వీపుమీద కూడా ఇంత అధికంగా ఇన్ని చేతులు పడవేమో!

భయం తీరిపోయింది. ఇక ఎవ రడ్డుతారు? ఒక గుమాస్తా దయవల్ల నీలి కాగితాల పుస్తకం వొకటి సంపాదించాను దానిలో స్వహస్తాలతో పెనసలు పుచ్చుకొని వంకరటింకరగా రూళ్ళు వేశాను, పెద్దపెద్ద అక్షరాలతో పద్యరచన ప్రారంభమైంది.

జింక పిల్లకు మెత్తగా కొమ్ములు వచ్చేటప్పుడు తల కణతలతో కుమ్ముతూ చిమ్ముతూ ఇక్కడా అక్కడా ఎలా తిరుగుతుందో అలాగ నూతన కావ్యోద్గమంతో నేను కళ్ళిదుద్వేజనంతో మొదలు పెట్టాను. విశేషించి మా అన్నయ్య నాకవితకు సంతోషించడమేగాక శ్రోతలను సమకూర్చే ఉత్సాహంతో ప్రపంచం కిందా మీదా చేసే వాడు. జ్ఞాపకముంది, ఒకనాడు కింది అంతస్తులో మా కచేరి గుమాస్తాలకు నాకవిత వినిపించిన తరువాత మేమిద్దరమూ బయలుదేరాము. ఆ సమయంలోనే 'నేషనల్ పేపర్' పత్రికాసంపాదకుడు శ్రీ నవగోపాలమిత్ర మాయింట అడుగు పెట్టాడు. వెంటనే అన్నయ్య అతణ్ణి పట్టుకొని 'నవగోపాల బాబూ' రవి కవిత్వం వ్రాశాడు వినరూ?' అన్నాడు. వినిపించడానికి ఏమంత ఆలస్యం కాలేదు. కావ్య గ్రంథావళి అప్పటికి అధికం కాలేదు. కవి కీర్తి కవి లాల్చీ జేబులోనే వుంది. స్వయం ముద్రాపకుడు, స్వయం ప్రకాశకుడు ఈ ముగ్గురూ నేను వొక్కణ్ణే. వొక్కటే రూపం మూడు పేర్లు. ప్రకటనా కార్యంలో మాత్రం మా అన్నయ్య సాయముండేది. పద్మం మీద వొక కవిత వ్రాశాను, అది దేవిడీ దగ్గర నిలబడి ఉత్సాహంతో గొంతెత్తి నవగోపాల బాబుకు వినిపించాను. చిరునవ్వుతో అతడన్నాడు—'బాగుంది, కాని ఈ ద్విరేఫ శబ్దానికి అర్థమేమిటి?' అని.

ద్విరేఫ, భ్రమర శబ్దాలు రెండూ మూడక్షరాల మాటలే. భ్రమర శబ్దం ప్రయోగించినా ఛందస్సులో ఏమీ లోపంరాదు. అయితే ఆదూర దురూహ్య శబ్దం ఎక్కడి నుంచి సంగ్రహించానో జ్ఞాపకం లేదు.

పైగా పద్యమంతటిలోనూ ఆ శబ్దం మీదే అన్నిటికంటే కౌతుకం అధికంగా వుండేది. మా దఫ్తరుఖానా ఉద్యోగులలో నాకు పేరు వచ్చింది ఈ శబ్ద ప్రయోగం వల్లనే. కాని నవగోపాల బాబును మాత్రం కొంచెమైనా దీనితో మెప్పించ లేకపోయాను. పైగా అతడు నవ్వాడు. అంతటితో నవగోపాలబాబు శబ్దాల సౌరు తెలుసుకోగల మనిషి కాడనిపించింది. అతడి కెప్పుడూ మరి నా కవిత వినిపించలేదు. తరవాత నేను పెరిగి పెద్దవాణ్ణయాను. అప్పుడు ఎవరు కవిత తెలిసినవారో, ఎవరుకారో ఆ గీటురాయి గీసే ప్రణాళికలో అంతగా పరివర్తన జరిగిందనుకోను ఏమైతేనేమి! నవగోపాలబాబు నా కవిత విని నవ్వాడేకాని ఆద్విరేఫ శబ్దం మధుపానమత్త మదభ్రమరం లాగ వున్నచోటే కదలకుండా వుండి పోయింది", *

రవీంద్రుడు కలాశాలలో పట్టభద్రుడు కాలేదు. కొద్దికాలంమాత్రం స్కూలులో విద్యాభ్యాసం చేసి,ఇంటిదగ్గిరే సంస్కృతం, బాంగ్లా, ఇంగ్లీషు భాషలూ,సంస్కృతమూ కృషిచేశాడు. తనతల్లి పద్మాలుగో సంతాన మతను చిన్నప్పుడు సేవకుల అదుపులో పెరిగాడు. తల్లినోటా, ఇతరబంధువులనోటా రామాయణభారతాలువినే వాడు, ఊహలల్లేవాడు. మైకేలు మధుసూదనదత్తు నవ్యకవితా, కాళిదాసుమేఘదూతా మొదలైనవి కూడా శ్రద్ధతో వినేవాడు, కలలు కనేవాడు, చదవనేర్చిన తరవాత జయదేవుడి గీత గోవిందమూ, చండీదాస విద్యాపతుల వైష్ణవపదాలూ, మేఘనాదవధా మొదలైన ఇతరకావ్యాలూ, బంకిమ బాబు మొదలైన వారి నవ్యరచనలూ, ఇంగ్లీషు కావ్యాలూ కూలంకషంగా చదివాడు. చిన్ననాడే తన అన్నగారి 'స్వప్నసుందరీ', హేమచంద్ర వంద్యోపాధ్యాయ 'భారతసంగీత', బీహారీలాలు చక్రవర్తి 'వంగసుందరీ', 'శారదా మంగళ' అంటేచెవి కోసుకునే వాడు.

ఎనిమిదేళ్ళనుంచి అతను క్రమంగా కవిత్వ మల్లడ మారంభించాడు. తన పన్నెండో యేట (1873-75) వ్రాసిన కవితలలో అప్పటికి తాను చదివిన కవులప్రభావం చూచాయగా తొంగిచూస్తుంది. విద్యాపతి పదాలు చదివి రవీంద్రుడు వ్రాసిన 'భానుసింహ

---

* రవీంద్ర వ్యాసావళి

పదావళి' మొదట పత్రికలలో వెలువడినప్పుడు ఎంతోమంది ఆ పదాలు ఏ పదిహేడో శతాబ్దంనాటి వైష్ణవకవివో అని భావించారు.

రవీంద్రనాథుడి రెండో అన్న సత్యేంద్రనాథఠాకూరు అతణ్ణి బారిస్టరు పరీక్ష కోసం ఇంగ్లాండు పంపాడు. కాని ఆ చదువు అతనికి అబ్బలేదు. 1880లో ఇగ్లాండు నుంచి తిరిగి వచ్చేశాడు. అయితే ఈ ఇంగ్లాండుయాత్ర తన కవిత్వానికి దోహద మిచ్చింది. స్వదేశానికి వచ్చిన తరవాత తన కావ్య సంపుటి 'సంధ్యాసంగీత' 1882లో వెలువడింది. మొదటి ఈ సంస్కరణంలో ఇందులో పాతిక కావ్య ఖండిక లున్నాయి. అతని తరావాతి కావ్యం 'ప్రభాత సంగీత' 1883 లో వెలువడింది. ఈకావ్యసంపుటాలతో రవీంద్రనాథుడి కొత్తకంఠం కావ్య కాననంలో కిన్నెరలు మోగింది. అతని మరో కావ్యం 'ఛబీ ఓగాన' 1884లో బైట పడింది. అప్పటికి పాతికేళ్ళ యువకవి రవీంద్రుడు. అందుకని ఈకావ్యంలో మంచి ప్రేమగీతాలు మోగాయి.

అనంతరం వరసగా అతని కావ్యసంపుటాలు 'మానసి' (1890), 'సోనారతరీ' (1893), 'చిత్రా' (1896), 'చైతాలీ' (1896)వెల్తువడ్డాయి. 'మానసి' ప్రకటించే ముందు ఫ్రాన్సుమీదుగా ఇంగ్లాండు వెళ్ళాడతను. అతని గేయకథా సంపుటాలు 'కథా', 'కాహినీ'1900లో వెలువడ్డాయి. ఈ సంపుటాలగేయాలలో కవి రామాయణ భారతాల నుంచీ, బౌద్ధసిక్కు, మహారాష్ట్రగంథాల నుంచీ కథలు తీసుకుని తనస్వతంత్ర ప్రతిభతో కొత్త కొత్తగా చిత్రించాడు. తరవాత అతని 'కల్పన' 'క్షణిక' కావ్య సంపుటాలు వెలువడ్డాయి. వీటిలో కావ్యశిల్పము మంచి పాకానికి వచ్చింది. కవి రెండు నెలలలో అరవైకిపైగా కావ్యాలు అల్లగలిగాడు "ఈ గేయాలు సీతాకోకచిలకలవంటి రంగు రంగుల భావాలు కల ప్రేమ కావ్యాలు" అన్నాడొ కాయన. 'క్షణిక' తరవాత 'నైవేద్య' (1901) వెలువడింది.

1902 లో రవీంద్రుడి ధర్మపత్ని కాలం చేసింది. ఇది పురస్కరించుకొని మరుసటి ఏడు 'స్మరణ కావ్య సంపుటి ప్రకటించాడు. తల్లిలేని తన సంతానం చూసి కలిగిన వేదనతో వారికోసం 'శిశు' కావ్యసంపుటి (1903) వ్రాశాడు. 'శిశు' లోని కవితలు చాల వరకు శిశు సాహిత్యంలో చేర్చవచ్చు.

అప్పటికి వచ్చిన రవీంద్రుడి కావ్యాలూ, నాటకాలూ కలిపి 1903_1904 లో మోహినీ చంద్రసేను వొక సంపుటంగా ప్రకటించాడు.

## గీతాంజలి

చిన్ననాటి నుంచి రవీంద్రుడికి బాంగ్లావైష్ణవ పదాలతో పరిచయముంది. బాంగ్లా 'బౌలు గీతాలు'* కూడా ఆయన నాకర్షించాయి. కబీరుదాసు, మీరాబాయి, దాదు జ్ఞానదాసు మొదలైన మర్మకవులా, సూఫీకవులా కావ్యాలు చదివాడు. ఉపనిషత్తులు వొంట పట్టించుకున్నాడు వీటన్నిటి ఫలితంగా ఆ మహా కవిలో 'గీతాంజలి' (1907) వెలువడింది. 'గీతాంజలి' బాంగ్లా గేయాలు కొన్ని కవి తానే ఇంగ్లీషులోకి మార్చాడు. ఆ ఇంగ్లీషు '**గీతాంజలి**కే అతనికి 1913 లో నోబెలు బహుమానం లభించింది. ఈ అను వాద విషయంలో రవీంద్రుడు 7 మే, 1917 లో ఇందిరా దేవికి వ్రాసిన లేఖ గమనించదగింది.

"గీతాంజలి ఇంగ్లీషు తర్జుమా విషయం నీకు వ్రాశాను. అది ఎలా వ్రాశానో" ఎలా లోకానికి ఇంతగా నచ్చి ఇంపిత మయిందో ఇప్పటిదాకా నేను ఊహించ లేక పోతున్నాను. నేను ఇంగ్లీషులో గ్రంథరచనకు చాలను. ఈ మాట సాధారణ విషయం ఈ సందర్భంలో సిగ్గు పడవలసిన అవసరంకూడా నాకు ఎన్నడూ కలగలేదు. ఎవరైనా నన్ను 'తేనీటి' విందుకు ఆహ్వానిస్తూ ఇంగ్లీషులో పుత్తరం పంపితే దానికి జవాబు ఇంగ్లీషులో వ్రాయడానికి నాకు సాహసం చాలదు. ఇప్పుడైనా ఆమాయ నన్ను వొదిలి పెట్టి పోయిందను కుంటావేమో. ఉఁహూఁ, లేదు-ఇంగ్లీషులో వ్రాయడమే మాయ అని నేను అనుకుంటాను.

గతసారి నౌక ఎక్కిన నాడు తల తిరిగి పడిపోయాను. శియల్దాలో విశ్రాంతి కోసం వెళ్ళవలిసి వచ్చింది. నడుము కట్టి వ్రాయగల వోపిక లేదు. అందుకని నా గీతాంజలిలోని కవితలు ఒక్కొక్కటే ఇంగ్లీషులో అనువదిస్తూ కూచున్నాను. కూచున్నానుసరే, కాని స్వస్థతలేని శరీరంతో ఇలాటి దుస్సాహసం పూనాలని ఎందుకు బుద్ధిపుట్టిందీ తెలదు. అయితే నా గొప్ప చూపెట్టాలని మాత్రం ఈ పనికి నేను పూనుకో లేదు. ఒకనాడు ఏదో భావావేగం అంతస్సులో వుప్పొంగింది రసోత్సవం లాగ, అదే మరొకనాడు వేరొక భాషలో ప్రసరింప చెయ్యవలెననే యుడితి ప్రేరణగా తాకింది. వెంటనే ఒక చిన్న వ్రాతపుస్తకం జేబులో పెట్టుకుని ఓడ ఎక్కాను. జేబులో పెట్టుకుని వెళ్ళడ మెందు కంటే సముద్రం మీద మధ్య మధ్య మనస్సు రేకెత్తి నప్పు

---

* సన్యాసులు పాడే తత్వాలు.

డల్లా డెక్కుమీద కుర్చీలో కూచుని ఎప్పటికప్పుడు రెండు మూడు తర్జుమా చెయ్యడానికి. అదే జరిగింది కూడా. ఒకపుస్తకముని మరొక పుస్తకంలో ఆగేయాల అనువాదాలనే సాపు వ్రాశాను.

ఇంతకు ముందే వొక భారతీయుడు చెప్పగా 'రాథన్‌స్టయిన్' నా కవితా ప్రస్తావన విన్నాడట. ప్రసంగవశాత్తూ ఆయన నా కవితా రచన చూడకోరడమూ, వెంటనే జంకుతూ నా వ్రాతప్రతి ఆయన చేతిలో పెట్టడమూ జరిగింది. అందులో అక్కడక్కడ పరికించి ఆయన పలికిన అభిప్రాయం నేను నమ్మలేక పోయాను. ఆయన ఆ వ్రాతప్రతి 'ఏట్సు, కవికి పంపించి వేశారు; తరువాత ఏమి జరిగిందో ఆ చరిత్ర యావత్తూ నీకూ-జగానికీ - తెలుసు."

బాంగ్లా 'గీతాంజలి'లో నుంచి ఉదాహరణకు వొక కవిత:

తోమార సోనారథాలాయ్ సాజాబో ఆజ్
దుఃఖేర అశ్రుధార,
జననీ గో, గాంథ్‌బో తోమార
గలార ముక్తా హార.
చంద్రసూర్యపాయేర కాఛె
మాలాహయె ఒడియె ఆఛె,
తోమార బుకె శోభా పాఛె ఆమార
దుఃఖేర అలంకార.
ధనధాన్యతోమారి ధన,
కీ కర్బే తో కవా.
దితెచావో తో దియో ఆమాయ్
నితె చావా తోలవా.
దుఃఖ ఆమార ఘరేర జినిష్,
ఖంటి రతన తుయితో జానిస్,
తోర ప్రసాద దియె తారె కినిస్,
ఏ మోర అహంకార.

(నీ బంగారు పళ్ళెరం ఇవాళ దుఃఖాశ్రువులతో నవరిస్తాను. ఓ జననీ, నీ కంఠ ముక్తాహారంగా కూరుస్తాను. సూర్య చంద్రులు మాల గా నీ పాదాల మోలపడున్నారు. నీ గుండెల మీద నా దుఃఖాలంకారమే శోభ కలిగిస్తుంది. ధన ధాన్యం నీ ధనమే. ఏం చేసుకుంటావు చెప్పు? ఇవ్వాలంటే ఇయ్యి, కావాలంటే పుచ్చుకో. దుఃఖం మా ఇంటి వస్తువు, నీకు తెలుసు జాతి రత్నం అది. నీ ప్రసాద మిచ్చి అది కొంటావు. ఇదే నా అహంకారం.)

'గీతాంజలి' మాత్రమే రవీంద్రుడి గొప్ప కావ్యం కాదు. అంతకంటే మంచి కావ్యాలే, గొప్ప కావ్యాలే వ్రాశాడతను. అయితే అది ఇంగ్లీషు కావడం వల్ల దానికే నోబెలు బహుమానం వచ్చింది. అసలు ఇంగ్లీషు 'గీతాంజలి' కంటే బాంగ్లా 'గీతాంజలి'లో ఇంకా మంచి కవితలున్నాయి. ఇంగ్లీషులో 103 కవితలుంటే బాంగ్లాలో 157 కవితలున్నాయి.

రవీంద్రనాథ ఠాకూరు నోబెలు బహుమానం బాంగ్లాకే కాదు భారతదేశానికే గర్వకారణమైంది. 'గీతాంజలి' తెగలోవే మరొక రెండు కావ్య సంపుటాలు 'గీతమాల్య', 'గీతాలి' (1914) వ్రాశాడాయన. అయితే 'గీతాంజలి' ఖ్యాతి వీటికి రాలేదు.

అతని 'బలాకా' కావ్యసంపుటి 1916 లో వెలువడింది. ఇందులో కొత్త శిల్పం చిత్రించాడు కవి. అతని 'ఊర్వశి' కంటే కూడా 'బలాకా'లో శిల్పం ఉదారమైంది. ఇలాగే 'పలాతక (1918) లో కూడా ఆయన నవ్యత చిత్రించాడు. అతని 'శిశుభోలానాథ' 1922 లోనూ, 'పూరబీ' 1925లోనూ వెలువడ్డాయి. 'పూరబి'లో వొక కవిత 'ముక్తి' చూడండి. అనుదినం జరిగే సామాన్య విషయమే కవి ఎలా మార్చ గలిగాడో అనిపిస్తుంది.

ఢాక్తోర జా బలె బలుక నాకో
రాఖో రాఖో ఖువె రాఖో
శివారేర ఓయి జానలా దుటో, గాయేలాగూకహావా.
ఓషుధ? ఆమార పురియెగేచె అషుధ ఖావా.
తితో కడా కతో ఓషుధ ఖేలామ ఏజీవనె,
దినే దినే క్షణెక్షణె.

బెంచే థాకా, సెన్సీ జెనో ఏక రోగ;
కతోరకవా కవిరాజీ, కతోయిముష్టియోగ!

(డాక్టరు ఏమంటే అననీ, తలవేపు కిటికీలు రెండూ తెరిచి వుండనీ, వొంటికి రవంత గాలి తగలనీ. మందు? నామందు తినడం ముగిసింది. ఈ బతుకులో ఎన్నో మందులు తిన్నాను, క్షనదినమూ క్షణకణమూ కూడా. ఎన్ని యోగాలు ఎన్ని ఆయుర్వేద మందులు: బతికి వుండడమే వొక రోగం!)

రవీంద్రుడి మరోకావ్యం 'మహుయా' 1929 లో వెలువడింది. 'వనరాణి' 1931 లోనూ, 'పరిశేష'. 'పునశ్చ' 1932 లోనూ 'శేషస ప్తక' 1935 లోనూ 'పత్ర పుట', 'శ్యామలీ' 1936 లోనూ వెలువడ్డాయి. 'శ్యామలి' గద్య కవిత.

అతని 'ఖాపఛాడా' పిల్లలకివిత 1937లో వెలువడింది. 'చాదచాబీ' 1937లోనూ 'ప్రాంతిక', 'సెంజూతీ' 1938 లోనూ, ప్రహాసినీ', 'ఆకాశప్రదీప' 1939 లోనూ వెలువడ్డాయి.

ఈ సమయంలోనే తూర్పు బాంగ్లా యువకవులు కొంచరు రవీంద్రుడి కవితల మీద ఎదురు తిరిగారు. వారికి ప్రత్యుత్తరంగా 'సమయహారా' కవిత వ్రాశాడతను.

రవీంద్రుడి చివరి కావ్య సంపుటి 'జన్మదినే' 1941 లో వెలువడింది. ఆ సంవత్సరమే ఆయన ఈలోకం విడిచి వెళ్ళాడు. 'జన్మదినే' ముందు 'నవజాతక' 'సానాయి', 'రోగశయ్యాయ' (1940), 'ఆరోగ్య' (1941) కావ్యాలు వెలువడ్డాయి. ఎనిమిదేళ్ళనుంచి మరణించిన వరకూ, చివరకు చివరి యూర్పు వొదులుతూ కూడా కవితాగానం చేశాడు రవీంద్ర కవీంద్రుడు. కావ్యాలూ, నాటకాలూ, నవలలూ, చిన్న కథలూ, వ్యాసాలూ అన్నీ మొత్తం మూడు వందల గ్రంథాలు వ్రాశాడాయన. భారత దేశంలో ప్రాదేశిక సాహిత్యాలన్నిటి మీదా, ఇతర దేశాలలోనూ ఇంతో అంతో ఆయన ప్రభావం గాఢంగా పడింది.

రవీంద్రుడు 1891 లో 'సాధన' పత్రిక స్థాపించాడు. అంతకు ముందుటేడే సురేంద్రనాథ సమాజపతి (1870-1927) 'సాహిత్య' పత్రిక స్థాపించాడు. 1899 నుంచి కలకత్తా బాంగ్లా రచయితలలో రెండు తెగలు ఏర్పడ్డాయి. ఒకటి రవీంద్రనాథుడి తెగ. రెండోది సమాజపతి తెగ. సమాజపతి తెగలో పలువురు యువకులు చేరారు.

వీరంతా రవీంద్ర నాథుడికి వ్యతిరేకంగా 'సాహిత్య' పత్రికలో రచన లారంభించారు. 1905 లో ఈ పత్రిక ద్విజేంద్రలాలురాయి సంపాదకత్వం కిందికి వచ్చింది. దాంతో రవీంద్రుడి మీద మరింత తీవ్రంగా ధ్వజమెత్తింది. అయితే 1908 లో రామానంద చటోపాధ్యాయ సంపాదకత్వంతో వెలువడిన 'ప్రవాసి', 'మాడరన్ రివ్యూ' పత్రికలు రవీంద్రనాథుణ్ణి సమర్థిస్తూ వచ్చాయి. 1913 లో రవీంద్రనాథుడికి నోబెలుబహుమానం వచ్చాక అతని ప్రతుపక్షుల ప్రభావం సన్న గిల్లింది. అయితే వామ పక్షం వొకటి ఎప్పుడూ వుంటూనే వుంది.

రవీంద్రనాథఠాకూరు సమకాలికు లెందరో ప్రతిభావంతులైన కవు లున్నారు. అయితే వారు చంద్రుడి ముందు చుక్కల్లాగ అయిపోయారు. వారిలో ముఖ్యులు.

### ద్విజేంద్రలాలురాయి :

ఈయన పరిచయం నాటకాలలో తెలుసుకున్నాము రవీంద్రుడి శైలి ప్రభావం నుంచి సంపూర్ణంగా బయట వుండి కావ్యరచన చేసిన కవి ఇతను. 'ఆర్యగాథ' రెండు భాగాలు, 'ఆషాఢె', 'హాసిరగాన', 'మంద్ర', 'ఆలేఖ్య', 'త్రివేణి' మొదలైనవి ఇతని కావ్యసంపుటాలు. 'ఆషాఢె' హాస్య కవిత. 'మంద్ర' జాతీయ కవిత. ఇతని కవిత ఛందోబద్ధమైనా అప్పుడప్పుడు గద్యననుసరిస్తుంది. ఇతని 'మంద్ర' కావ్యం రవీంద్రుడు మెచ్చుకున్నాడు. హాస్య కవితలో ఇతనికి ప్రత్యేక స్థాన ముంది. ఇతని 'నందలాలు, ఖండకావ్యం 'గిరీశం' వంటి దేశభక్తుల మీద సెటైరు.

### విజయచంద్రమజుందారు (1861 - 1942)

ఛందోనైపుణ్యంలో సమర్థు డితను. ఫరీదపుర జిల్లా ఖానాకుల ఇతని జన్మ స్థానం. తెలుగు తమిళ, ఒడియా భాషలలో మంచి కృషిచేశాడు. కంటి జబ్బుతో సీమ దేశం వెళ్ళాడు. అక్కడ కూడా నయం కాక చివరి దినాల్లో అంధుడైపోయాడు. ఇతనిలో ద్విజేంద్రలాలు అనుసరణ కనిపిస్తుంది. 'యజ్ఞ ఓతపస్వేరఫల', 'కవిత', 'యుగపూజ' (1892), 'యజ్ఞ భస్మ' 'ఫులశర', 'పంచకమాల', 'హేఁయాలి', 'గీత గోవింద' (అనువాదం) మొదలైనవి ఇతని కావ్యాలు.

### శశాంక మోహన సేనుఁ

'సింధుసంగీత', (1895), 'శైలసంగీతి' (1907), 'సావిత్రి', 'స్వర్గే ఓమర్త్యే', 'విమానిక' మొదలైన కావ్యాలూ, 'వంగవాణి', 'మధుసూదన' మొదలైన విమర్శన గ్రంథాలూ వ్రాశాడితను.

## నవకృష్ణ భట్టాచార్య (1859-1939)

హవుడా జిల్లా నారిట గ్రామం ఇతని జన్మస్థానం. తండ్రి రాజనారాయణతర్క వాచస్పతి. 'సోమప్రకాశ', 'ఎడ్యుకేషన్ గెజెట్','నవవిభాకర', 'పాక్షిక సమాలోచక' మొదలైన పత్రికలలో మొదట కవితలు ప్రకటించాడు. ఇతని తొలి కవిత 'భారతి'లో చూసి రవీంద్రుడు ప్రశంసించాడు. శిశు సాహిత్యంలో సిద్ధహస్తు డితను. 'ఖేలేఖేలా', 'టుకటుకె రామాయణ', 'ఛవిరఛడా', 'పుష్పాంజలి' మొదలైనవి ఇతని కావ్య సంపుటాలు.

నిత్యకృష్ణవసు, ప్రియనాథసేను, దిజేంద్రనారాయణ బాగ్చీ (1873-1927), యతీంద్ర మోహన బాగ్చీ (1877-1955), కుసుమ రంజన మల్లిక్, కాళిదాసరాయ, కిరంధన చట్టోపాధ్యాయ, సుకుమారరాయచౌధురి మొదలైన వారినికూడా ఈ సందర్భంలో పేర్కొనాలి.

## చిత్తరంజన దాసు(1870-1925)

దేశబంధు చిత్తరంజన దాసు సుప్రసిద్ధ దేశనాయకుడు. గాంధిమహాత్ముని అసహాయోద్యమంలో పాల్గొన్న యోధుడు. ఢాకా తెవిర బాగ జన్మస్థానం. తండ్రి భువన మోహన దాసు.

చిత్తరంజనుడు 'నారాయణి' మాసపత్రిక స్థాపించికొన్నాళ్ళు నడిపాడు, సాగర సంగీత', మాలంచ', 'మాల', అంతర్యామి'. 'కిశోర కిశోరి', కావ్యాలు వ్రాశాడు. 'సాగరసంగీత' అరవిందఘోషు ఇంగ్లీషులోకి తర్జుమా చేశాడు. ఇది మొదట హిందూరివ్యూలోను,తరవాత గ్రంథరూపంగానూ వెలువడింది. సరళమూ, సుగమ్యమూ, గంభీరమూ అయిన కవిత చిత్తరంజన దాసుది. సాగర సంగీతంలో వొక ఖండిక:

ఒపారె కిఆలో జ్వలె రహస్యేర మత, -
జె ఆలో దేదెఖెని కెహ ప్రభాతె సంధ్యాయ?
ఒపారె కి గీతధ్వని జాగె అవరత, -
జె గాన సునెని కెహ దివసె నిశాయ?
ఒపావె కి బసె కెహ తృష్ణార్త అకుల,

పరాణ పరశ తరె అమారి మతన?
ఒపారె కి దెఖా జాయ, అనంత అతుల.
తోమార అంతర ఛాయా పరాణస్వపన?
ఆమిజే తృషిత ఐడ ఒగో మహాపాణ!
ఆమిజే తృషార్త అతి పరాణమాఝూరె!
ఆమారె డుబాయదావ్. ఒగో మహాప్రాణ!
ఆమారె భాసాయె లవ్, తోమార ఒపారె!
తబెకి మిలిబె హోర ఆశార స్వపన?
కాంగాల పరాణ హబె రాజార మతన?

(ఆవలి వొడ్డున ఏమిటా వెల్గుతుంది రహస్యంలా? ప్రభాతాన సంధ్యలో ఎవరూ చూడని వెలుగది. అవిరతం ఆవల ఏమిగీత మరి ధ్వనిస్తోంది? రేయింబగళ్ళు ఎవరూ వినని గీతమది. అవతల ఎవరా తృషార్తుకులుడు కూచున్నాడు నాకుమల్లే? ఆవల ఏంకనపడుతుంది, అనంతమై, అతులమై? నీఅంతర ఛాయా ప్రాణ స్వప్నమా! ఓ మహాప్రాణ! నేను తృషితుణ్ణి, మహా తృషార్తుణ్ణి. ఓ మహాప్రాణ! నన్నుముంచెయ్యి. నన్నుతేల్చేసి తీసుకుపో, నీ అవతలి తీరానికి! అప్పుడైనా నా ఆశాస్వప్నం ఫలించేనా? నా దరిద్ర ప్రాణం రాజులా అయేనా!)

## యతీంద్ర నాథసేనుగుప్త (1887-1954)

యువకవిగా 1910 నుంచి కవిత్వమారంభించాడీయన. ఇతని మొదటి కవితా సంపుటి 'మరీచిక' (1923). 'మరుశిఖా' (1927), 'మరుమాయా' (1930), 'సాయం' (1940), 'త్రియామ' (1948), 'నిశాంతిక' (1957) మొదలైనవి ఇతని కావ్యాలు. 'కావ్యపరిమితి' (1930) ఇతని గద్యగ్రంథం. ఇతని కవిత 'హాట' ఉదాహరణకు :

దూరె దూరె గ్రామ దశబారోఖాని
మాఝూ ఏకఖాని హాట
సంధ్యాయ సెథా జ్వలె నాప్రదీప
ప్రభాతె పడెనా ఝాంట.

బెచా కేన సెరె వికాలవేలాయ్
జే జాహార సబెఘరె ఫిరె జాయ్
బకేర పాఖాయ్ ఆలోక లుకాయ్
ఛాడయె పుబేర మాఠ
దూరె దూరె గ్రామె జ్వలె ఉఠె దీప—
ఆంధారెతె థాకె హాట.

(దూరదూరంగా పదివూళ్లు, మధ్య వొక సంత. సాయంకాలం అక్కడ దీపం వెలగదు, ఉదయం చీపురు నడవదు. కొనుగోలూ అమ్మకాలూ ముగించి ఎర్రపొద్దువేళ ఎవరి మానాన వారు వెళ్ళిపోతారు. పక్కపక్కల నడిచి వూరిపొలాల అవతల దాగిపోతాయి దీపాలు. దూరగ్రామాల దీపాలు వెలుగుతాయి. చీకట్లో పడుంటుంది సంత.)

## ప్రియంవదాదేవి (1871—1935)

రవీంద్రనాథుడు సంపాదకత్వం నెరపిన 'వంగదర్శిని' లో కవితలు వ్రాసిందీమె. ఈమె తల్లి ప్రసన్నమయీదేవి కూడ మంచి కవయిత్రి. ప్రియంవదాదేవి 'రేణు' (1900), 'పత్రలేఖ' (1910), 'అంశు' (1927), 'చంపా ఓ పాతల్' (1939) కావ్యాలు వ్రాసింది. 'రేణు' పలువుర ప్రశంసలందుకున్న కావ్యం.

## సత్యేంద్రనాథ దత్తు (1882-1922)

అక్షయకుమారదత్తు మనుమ డీయన, వర్ధమాన జిల్లా చూడీ నివాసస్థానం. కవి; మంచి గద్య రచయిత'. ఇతని మొదటి కవితా గ్రంథం 'సవిత' తన పద్దెనిమిదో ఏట వెలువడింది. 'తీర్థసలిల', 'అభ్రఆబీర' (1916), 'కుహూ ఓ కేకా' (1912) మొదలైనవి అతని ప్రసిద్ధ కావ్యాలు, ఆధునిక బాంగ్లా కావ్యాలలో రకారకాల ఛందస్సులు ప్రయోగించాడితను. 'జన్మదుఃఖి' మొదలైన నవలలూ, చీనేరధూప' వ్యాసావళీ, 'రంగమల్లి' నాటక సంపుటి 'ధూపేర్ ధోఁయాయ్' నాటికా మొదలైనవి వ్రాశాడు. 'తీర్థసలిల', 'తీర్థరేణు' మణిమంజూష' (1915) అనువాద కావ్యసంపుటాలు.

రవీంద్రనాథుడి ప్రియశిష్యులలో వొకడు సత్యేంద్రనాథదత్తు. ఇతని అకాల మృతి నుద్దేశించి రవీంద్రు డీకింది కవిత వ్రాశాడు.

వర్షాఃపీనమేఘు ఎలో ధరణీర పూర్వద్వారె
బజాయిలో వజ్రభేరీ, హేకవి,దివెనాసాడాతారె
తోమార నవీనఛందె? ఆజికార రాజరీగాథాయ్
ఝులనేర దోలాలాగెడావెడావె పాతాయ్ పాతాయ్
వర్షే వర్షే ఏదోలాయ్ దితౌతాల తోమారజావణీ
విద్యుత నాచన గానేసేఆజిలలాటేవర హాని
విధవారవేశే కెనో నిశ్శబ్ద లుటాయ ధూలిపరె?

(నవీన వర్షామేఘం పుడమి తూరుపు ద్వారాన వజ్రభేరీ మోగించింది. వచ్చి, ఓ కవీ! నీ నవీన ఛందస్సులో దానికి ప్రత్యుత్తర మియ్యవో? నేటి కజ్జల గాథలలో ఆకు ఆకునా, కొమ్మకొమ్మనా దోలా యాత్ర. ప్రతియేడు దోళాయాత్ర నీ వాణి విద్యున్నృత్య గానంతో పల్లవి పట్టేది. అది ఇవాళ విధవావేషంతో తలవాల్చి ధూళిలో పడుందేమీ నిశ్శబ్దంగా?)

## సరయుబాల దాస గుప్త (1889-1949)

గద్య కవిత వ్రాసిన కవయిత్రి ఈమె. 'వసంతప్రయాణ' (1914), 'త్రివేణి' (1915), 'దేవోత్తర విశ్వనాట్య' (1916) ఈమె రచనలు. వసంతప్రయాణ' కు రవీంద్ర నాథుడు పీఠిక వ్రాశాడు.

## కాజీ నజరుల్ ఇస్లాము(జ 1899-)

విద్రోహకవి ఇతను. వర్ధమాన జిల్లా చురులియాఇతని జన్మస్థానం. ఆనాడు రవీంద్రనాథుడి తరవాత హిందువులలోనూ, మహమ్మదీయులలోనూ ఇంతటిప్రసిద్ధి పొందిన కవి మరొకరులేరు. రవీంద్రుడు తన 'వసంత' నాటకం ఇతనికి అంకిత మిచ్చాడు.

నజరుల్ ఇస్లాము విద్యార్థిగా వుండి బాంగ్లా రెజిమెంటులో చేరాడు (1916). క్రమంగా హవల్దారయాడు. పటాలంలో వుండి కవిత్వం వ్రాశాడు. 1918 లో ఉద్యోగం విడిచిపెట్టాడు. దేశానికి తిరిగివచ్చి 'నవయుగ', ధూమకేతు', 'లాంగల' పత్రికలు కొన్నాళ్లు నడిపాడు. రాజద్రోహరచనలు చేశాడని నేరం మోపి వొక యేడు

అతనికి కఠిన శిక్ష విధించింది అప్పటి తెల్లదొరతనం. తన గ్రంథాలలో వొకటి రాజ ద్రోహకరమైందని మరో ఆరు మాసాలు జైల్లో పెట్టింది.

'అగ్నివీణ', 'బుల్‌బుల్'. 'సంచిత', 'దోలనచాంపా', 'ఛాయానట', 'ఝుంగెఫూల్', 'పరయుగవాణి' 'విషేరవాంశీ', 'భాంగారగాన్' (1928) మొదలైన ఇరవై కవితా సంపుటాలు వ్రాశాడు నజరుల్. 'అగ్నివీణ బాంగ్లాలో చిచ్చుల పిడుగులు ఉరిమింది. అన్ని విధాలా పేరుకి తగిన కావ్యమిది. ఛందోవైచిత్ర్యమూ, శబ్దఝంకారమూ, భావోద్వేగమూ - అన్నీ దీనికి అగ్ని శిఖల్లా అమిరాయి. 'అగ్నివీణ' లోని, 'ప్రళయోల్లాస', 'విద్రోహి', 'రక్తాంబరధారిణీమా', 'ఆగమనీ', 'ధూమకేతు' కావ్యాలు చదివినా, విన్నా భాష తెలియనివారికి కూడా ఉద్రేకం కలుగుతుంది.

ఏకి రణ బాజా బాజె ఘన ఘన-
ఝన రణరణరణ ఝనఝన!
గేకి దమకి దమకి
ధమకి ధమకి
దామాద్రిమిద్రిమి గమకి గమకి
ఛిఠే చోటె చోటె,
ఛోటే లోటె ఫోటె!
వహ్ని ఫిణికి చమకి టమకి
టాల తలొ యారె ఖనకనీ!
ఏకి రణబాజా బాజే ఘనఘనీ!
రణఝనఝన ఝన రణరణ!

'ఆగమని' ఆరంభం ఇలా నడుస్తుంది.

ఇతని 'పరయుగవాణి', విషేరవాంశీ', 'భాంగారగాన్' కావ్యాలు ఆనాటి ప్రభుత్వం బజ్యాప్తు చేసింది.

'బంధనహారా', 'మృత్యుక్షుదా' అని రెండు నవలలూ, 'ఆలేయా', 'ఝిలిమిలి' అని రెండు నాటకాలూ 'వ్యథారదాన' మొదలైన కథలూ ఎన్నో సంగీత గేయాలూ

వ్రాశాడు నజరుల్. తూర్పు పాకిస్తాను ప్రభుత్వం ఇతనికి సాహిత్యభృతి ఏర్పరిచింది. చివరి దినాల్లో శిరోరోగంతో బాధపడ్డాడు.

రవీంద్రయుగంలోనే — రవీంద్రుని జీవితకాలంలోనే బాంగ్లా కవితలో అత్యాధునిక యుగం ఆరంభమైంది. పెంపొందు. ఇలియట్ల ప్రభావం నవకవులమీద పడింది. రష్యా సాహిత్యచ్ఛాయతో అభ్యుదయ కవిత్వం తలయెత్తింది. కవిత్వవస్తువు విస్తృతమయింది. అయినా సాహిత్యరంగం మీద రవీంద్రనాథ ఠాకూరు నీడ వుండనే వుంది. ఆయన సంగీతం పల్లెపల్లెల మూలమూలల వినిపిస్తూనే వుంది.

## నవల

పందొమ్మిదో శతాబ్దారంభలోనే బాంగ్లాలో గద్యం ఆరంభమయింది. అయినా అరవయ్యేళ్ళ అనంతరం కాని నవలా రచనకు విఘ్నేశ్వర పూజకాలేదు. 1858 లో ప్యారీచాంద 'అలాలేర ఘరేర దులాల' వెలువడింది. అంతకు ముందు భూదేవ వసు 'అంగురీయ వినిమయ' నవలిక వెలువడింది బాంగ్లా నవలా సాహిత్యంలో తొలి మొలక లివి. 1865 లో బంకిమచంద్రుడి 'దుర్గేశనందిని' వెలువడింది. దాంతో బాంగ్లా నవలకు అరుణోదయ మయింది.

దుర్గేశ నందినికి ముందు 1864 లో బంకిమబాబు ఇంగ్లీషులో 'Rajamohan's wife' అని వొక నవలవ్రాశాడు. అది 'Indian field' పత్రికలో ప్రకటించాడు. అంతకంటే ముందు విద్యార్థిదశలో ఆయన కవిత్వం వ్రాసేవాడు. కేవలం కవిత్వమే వ్రాసి వుంటే అతను రవీంద్రు డంతటి కవి అయివుండేవాడు. అతని 'సుజలాం సుఫలాం జాతీయగేయమే దీనికి నిదర్శనం కాని తన అమృతహస్తం నవలా రచనకు వినియోగించాడు; యుగపురుషు డయాడు. కథ నడపడంలో అతని శక్తి అపూర్వమైంది. సూటిగా, సుబోధంగా రచన సాగించడంలో అతడు పెట్టినదే వొరవడి. అతను వ్రాసిన నవలలూ, నవలికలూ మొత్తం పద్నాలుగు — దుర్గేశనందిని, కపాలకుండల, మృణాలిని, విషవృక్ష, ఇందిర, యుగళాంగురీయ, చంద్రశేఖర, రజని, కృష్ణకాంతేర ఉయిల్, రాధారాణి, రాజసింహ, ఆనందమఠ, దేవీచౌధురాణి సీతారామ.

బంకిమబాబు నవలలు అనురాగాత్మకమైనవీ, దేశభక్త్యాత్మకమైనవీ అని రెండు భాగాలుగా విభజించవచ్చు. ప్రతి నవలలోనూ అతని ప్రతిభ ఉజ్వలంగా అవుపడుతుంది, పాఠకుల్ని చకితపరుస్తుంది. దేశభక్త్యాత్మకమైన నవలలో 'ఆనందమఠ',

'దేవీచౌధురాణీ', 'సీతారామ' వుదహరించదగినవి. పరాధీన భారతభూమి ఎలాప్రతీకార దీక్ష పూనాలో పరోక్షంగా ఈ మూడు నవలలలోను బంకిమబాబు ఉద్బోధించాడు.

దుర్గేశనందిని' వెలువడడంతోనే బాంగ్లా పాఠకలోకంలో నవలలమీద అభిలాష హెచ్చింది. విక్రయశాలలలో నవలల గిరాకీ అధికమైంది. దాంతో రచయితల దృష్టి నవలవేపు తిరిగింది. దుర్గేశనందిని ననుసరించి, అనుకరించి ఎన్నోనవలలు వెలువడ్డాయి. ఈ వడిలోనే కాలీ కృష్ణలాహిడి 'రోషనార', రాజకృష్ణ ముఖోపాధ్యాయ 'రాజబాల', మహేశచంద్రకారశర్మ 'ప్రణయప్రవాహ' జయగోపాల గోస్వామి 'శైవలిని' హేమాంగిని 'మనోరమ' 'ప్రణయప్రతిమ'. ప్రతాపచంద్రఘోషు 'వంగాధిప పరాజయ', తారకానాధ గంగోపాధ్యాయ 'స్వర్ణలత', 'హరిషేవిషాద', 'అదృష్ట' మొదలైన నవలలు వెలువడ్డాయి.

హేమాంగిని బాంగ్లాలో తొలి నవలా రచయిత్రి. 'మనోరమ' నవల ఈమె 1865-'66 లో వ్రాసింది.

ప్రతాపచంద్రఘోషు 'వంగాధిప పరాజయ' బాంగ్లాలో మొదటి చారిత్రక నవల. దీని మొదటిభాగం 1869లోనూ, రెండో భాగం 1884 లోనూ వెలువడ్డాయి. రచయిత చరిత్ర తెలిసిన పండితుడు.

## రమేశచంద్రదత్తు నవలలు

రమేశచంద్రుడు 'వంగ విజేత' (1874), 'మాధవీ కంకణ' (1877), 'మహారాష్ట్రి జీవన ప్రభాత' (1870), 'రాజపుత్ర జీవన సంధ్య' (1879), 'సంసార', 'సమాజ', 'గార్హస్థ్య' (1894) నవలలు వ్రాశాడు, ఇందులో మొదటి నాలుగూ చారిత్రక నవలలు. చివరివి సాంఘిక నవలలు. 'మహారాష్ట్రి జీవనప్రభాత' లోనూ, 'రాజపుత్ర జీవన సంధ్య' లోనూ రచయిత దేశభక్తి వెల్లువలైపారింది. 'వంగవిజేత' లోనూ, 'మాధవీ కంకణ' లోనూ వీరరసం పరవళ్ళుతొక్కింది. సాంఘిక నవలలలో బాంగ్లా పల్లెజీవనం సజీవంగా చిత్రించాడు. రచయిత,

బంకిమబాబు అన్నగారు సంజీవచంద్ర చట్టోపాధ్యాయ 'కంఠమాల', 'మాధవీలత, అని రెండు నవలలు వ్రాశాడు. 'రామేశ్వరేర అదృష్ట', 'దామిని' అని రెండునవలికలు వ్రాశాడు. 'దామిని' బాంగ్లా చిన్న కథల తొలిరూపం అనవచ్చు. 'జాలప్రతాప చాంద' అని వొక పెద్ద కథ కూడా వ్రాశాడు.

బంకిమబాబు తమ్ముడు పూర్ణచంద్ర చట్టోపాధ్యాయ 'మధుమతి', 'శైశవ సహచరి' అని రెండు నవలలు వ్రాశాడు. ఇవి మొదట 'వంగ దర్శని' లో వెలువడ్డాయి.

ఈ కాలంలో ఇంకా ఎన్నో నవలలు పైకి వచ్చాయి. వాటిలో క్షేత్రపాల చక్రవర్తి 'చంద్రనాథ' (1873). 'మురలా' (1880). 'మధుయామిని', 'కృష్ణా' (1885). గంగాధరశర్మ 'రోజనామచా' (1883) దామోదర ముఖోపాధ్యాయ (1853-1907) 'నవాబు నందినీ', 'కమల కుమారి', 'శుక్లవసనాసుందరి', 'విమల', 'శాంతి', 'శోనార కమల', 'యోగేశ్వరి', 'అన్నపూర్ణ', 'లలితమోహన', 'సపత్ని', 'అమరావతి', 'విషవివాహ', 'ప్రతాపసింహ', 'నవీన', 'శంభురామ', ఈశ్వర చరణగుప్త 'కపట సన్యాసి', 'పురాన కాగజ'. హారానచంద్రరాహా 'రణచండి', దేవీప్రసన్న రాయచౌధురి (1854-1920) 'శరచ్చంద్ర', 'విరాజమోహన', 'భిఖారి', 'యోగజీవన', 'అపరాజిత', దేవీప్రసన్న 'సోపాన', శివనాథశాస్త్రి (1847-1919) 'మేజబౌ', 'యుగాంతర', 'నయనతార', తారకానాథ విశ్వాస 'గిరిజా' (1882), 'సుహాసిని' (1882), 'కమల' (1883), 'విరజా', 'వసంతబాల', 'చంద్రప్రభ', 'శాంతమణి', నగేంద్రనాథగుప్త 'పర్వతవాసిని' 'లీల', హరిదాస వంద్యోపాధ్యాయ 'రాయమహాశయ' (1892), చండీచరణసేను (1845-1906) అనువాదం 'టామకాకార కుటీర', 'అయోధ్యారబేగమ్', 'మహారాజనందకుమార', 'ఏయికిరామేరరాజ్య', 'దేవాన్ గోవిందసింహ', 'ఝాఁసీరాణి', శ్రీశచంద్ర మజుందారు 'శాంతికానన' (1881), 'ఫులజాని' (1894), 'కృతజ్ఞత', 'విశ్వనాథ' ముఖ్యమైనవి

## స్వర్ణకుమారీదేవి (1857 - 1932)

సుప్రసిద్ధరచయిత్రి ఈమె. మహర్షిదేవేంద్రనాథ ఠాకూరు ద్వితీయ పుత్రిక. రవీంద్రనాథుని అక్కగారు. జానీకనాథఘోషాలు భార్య. కావ్యం, నాటకం వ్యాసం, నవలా, చిన్నకథ - అన్నిటా అందెవేసిన చెయ్యి. ఈమె తొలి నవల 'దీపనిర్వాణ' (1878). రాణీ సంయుక్త చరిత్ర దీనిలో కథ. 'ఛిన్నముకళ', 'మాలతి', 'హుగ్లీర ఇమామ్ బాడి', 'కాహాకే', 'స్నేహలత' మొదలైన మంచి నవలలు వ్రాసింది స్వర్ణకుమారి. అన్నిటిలోకీ 'స్నేహలత' ఉత్తమ నవల. ఎన్నో చిన్న కథలు కూడా వ్రాసిందీమె.

## వ్యంగ్యాత్మక నవలలు

వ్యంగ్యాత్మక నవలలు కొన్ని వెలువడ్డాయి. వాటిలో ఇంద్రనాథ వంద్యోపాధ్యాయ (1844-1911) 'కల్పతరు', 'క్షుదీరామ', 'పాంచుతాకూరు', యోగేశచంద్రవసు 'మాడెల్ భగిని' (1886), 'కాలాచాంద' (1899), 'చినివాసచరితామృత', 'నెడా హరిదాస', 'బాంగాలీ చరిత', 'మహిరావణేర ఆత్మకథ' చెప్పదగినవి.

## 'దుర్గేశనందిని' అశ్లీల నవల

ఏ కొత్త వచ్చినా సనాతనులు కొందరు దుమ్మెత్తి పోస్తారు. వెలుగు విరోధులు వారు. అంతవరకు సాహిత్యంలో లేని నవల రావడం వారికి తేళ్ళూ జెర్రులూ పాకాయి. తిట్టిపోశారు రామగతి న్యాయరత్న 'బాంగ్లాభాష ఓ బాంగాలా సాహిత్య విషయక ప్రస్తావ'లో బంకిమబాబు 'దుర్గేశనందిని' నవలను మరి రెండు నవలలను తీవ్రంగా ఖండించాడు. 'దుర్గేశనందిని' అశ్లీల గ్రంథమన్నాడు 'పైగా సిగ్గుమాలి దానినిఅన్నగారికి అంకితం చేశాడు రచయిత' అనితిట్టి పోశాడు. ప్యారీమోహన కవిరత్న తిట్లతో కవిత్వమే కట్టి ప్రకటించాడు. 'సురలోకే వంగేర పరిచయ' అని వొక ప్రబుద్ధుడు వ్యంగ్య రచన చేశాడు స్వర్గం దాకా వెళ్ళి. గోపాలచంద్ర ముఖోపాధ్యాయ బంకిమబాబు మీద వొక ప్రహసనమే వ్రాసి దుగ్ధ తీర్చుకున్నాడు. 'సురలోకే వంగేర పరిచయ'లో ఆధునికులందరి మీదా ధ్వజమెత్తాడు రచయిత, అయితే తన పేరు మాత్రం చెప్పుకోలేదు గ్రంథంలో.

## రవీంద్రనాథుడి నవలలు

పందొమ్మిదో శతాబ్దం చివరి దశాబ్దంలో నవలా రచనకు పూనుకున్నాడు రవీంద్రుడు. అప్పటికి ఆయన వయస్సు ఇరవయ్యేళ్ళు. ఆయన మొదటి నవల 'బౌఠాకురాణీరహాట' 1883 లో వెలువడింది. దీనిలో కథ ప్రతాపచంద్రఘోషు నవల 'వంగాధిపతి పరాజయ' నుంచి గ్రహించాడు. రచయిత, ఆయన రెండో నవల 'రాజర్షి' 1885 లో వెలువడింది, కథ త్రిపుర రాజవంశ చరిత్ర. ఈ నవల ననుసరించే ఈయన 'విసర్జన' నాటకం వ్రాశాడు. తరవాత నవల 'చోఖేరబాలి' పదిహేనేళ్ళ తరువాత 1902లో వచ్చింది. ఇది సాంఘిక నవల దీని అనంతరం వెంటనే 'నౌకాడూబి' రచనకు పూనుకున్నాడు రవీంద్రుడు, అది 1905 లో వెలువడింది. 'చోఖేరబాలీ' 'నౌకాడూబీ'- ఈ రెండు నవలలూ వంగదర్శినిలో వరసగా వెలువడ్డాయి మొదట. వీటి తరవాత 1910 లో అతని 'గోరా' వెలువడింది. ఇతని నవలలో ఇది గొప్ప నవల.

గోరా ఐరిష్ బాలకుడు. చిన్నతనంలోనే ఇతని తల్లి చచ్చిపోతుంది. కృష్ణ దయాలదంపతులు గోరాను కన్నకొడుకులా పెంచుతారు. గోరా స్నేహితుడు వినయ పరేశబాబు కన్య లలితను వివాహమాడతాడు. పరేశబాబు బ్రహ్మసామాజికుడు. తాను ఐరిష మనిషినని తెలిశాక గోరా పరేశబాబు పెంపుడు కన్య రాధారాణిని పెళ్ళి చేసుకుంటాడు. ఆర్తరక్షణకు వెళ్ళి గోరా జైల్లో పడతాడు. ఇలా సాగుతుంది గోరాలో కథ వొక ప్రత్యేక పద్ధతిలో. గోరా తరవాత 'చతురంగ' నవల వ్రాశాడు రవీంద్రుడు. ఇది 1916 లో వెలువడింది. ఆ ముందటి యేడు ఇది ప్రమాథ చౌధురి 'సబూజపత్ర'లో ప్రకటిత మయింది. ఘరేబాయిరె' కూడా 1916 లోనే వెలువడింది. అనంతరం అతని సాంఘికనవల 'యోగాయోగ' 1920 లో వచ్చింది. ఇది మొదట 'విచిత్ర' లో 'తిన్ పురుష' అని వెలువడింది. 'శేషేర కవిత' 1929 లో వెలువడింది ఇది రొమాంటికు నవల. ఇందులోగద్యపద్యాలు రెండూ వాడాడు రవీంద్రుడు.

1933 లో రవీంద్రుడి 'దుయిబోన్' 1934 లో 'మాలంచా', 'చారఅధ్యాయ' వెలువడ్డాయి. మొత్తం పన్నెండు నవలలు వ్రాశాడీయన.

శరత్బాబు నవలలు

బంకిమబాబు, రవీంద్రనాథుల నవలలకంటే కూడా జనాదరణ పొందాయి శరత్బాబు నవలలు. మొదటమొదట బంకిమబాబు ననుసరించినా అనంతరం తనమార్గం తాను ఏర్పరచుకొని సుప్రసిద్ధుడైన నవలా చక్రవర్తి శరత్బాబు. 'కాశీనాధ' 'బడదీది' (1907), 'విరాజబహు' (1914), 'పల్లీసమాజ', (1916), 'చరిత్రన' (1917), 'శ్రీకాంత' 1 భా. (1917), 'దత్త' (1917-'19), 'శ్రీకాంత' 2 భా. (1918), 'గృహదాహ' (1919), 'చంద్రనాథ', 'దేవదాస', 'రామేరసుమతి', 'పథనిర్దేశ' 'నవవిధాన', 'శ్రీకాంత' 3 భా. (1827), 'దేనాపావునా' (1923), 'పథేరదాబి' (1926), 'శ్రీకాంత' భా. 4. (1933), 'శేషప్రశ్న' (1931), 'విప్రదాస' (193) 'బింధూర ఛేలే' మొదలైన ఎన్నో నవలలు, నవలికలు వ్రాశాడీయన. ఈయన నవలలకు కొత్త నీటికి ఎగబడిన చేపలలాగ ఎగబడ్డారు పాఠకులు. ఇతను'బడదీది'రంగంనుంచి రచయిత పేరులేకుండా 'భారతి' పత్రికలో ప్రకటించాడు శరచ్చంద్రుడు. అదిరవీంద్రుడే వ్రాశాడనుకున్నారు పాఠకులు. ఆ దినాల్లో 'వంగదర్శని' రవీంద్రు సంపాదకత్వాన వెలువడుతూ వుండేది. 'భారతి' లో బడదీది చూసి 'వంగదర్శని' మానేజింగు సంపాదకుడు రవీంద్రుని దగ్గిరికి వచ్చి, 'ఇంత మంచి నవల మన పత్రికకు ఇవ్వకుండా భారతి

కిచ్చారేమీ ?' అన్నాడట. నవల చదివి 'బాగుంది, కాని నేనిది వ్రాయలేదు' అన్నాడు రవీంద్రుడు. ఈ నవలతో శరచ్చంద్రుడి కీర్తి హెచ్చింది. తన రచనలకు రాబడి వచ్చింది. దాంతో అతను బర్మాలో ఉద్యోగం మానుకుని కలకత్తా వచ్చి రచనా వ్యాసం ఆరంభించాడు. శరచ్చంద్రుడి వలె కేవలం రచనల ఆదాయంతోనే జీవనము చేసిన బాంగ్లా రచయిత ఇంకొకడు లేడు.

శరత్బాబు నవలలలో 'దేవదాసు' మొదటి నవల. ఇది 1901 లో వ్రాసి, 1907 లో ప్రకటించాడు. ఇతని 'పథేరదాబి' అప్పటి ప్రభుత్వం నిషేధించింది.

శరచ్చంద్రుడి 'శేషప్రశ్న' తేలికరచనకాదు.. బుద్ధిజీవులు చదువదగిన గొప్ప రచన. శేషప్రశ్న అంటే చివరి ప్రశ్న అని కాదు, మిగిలిన ప్రశ్న అని అర్థం. నవలా సాహిత్యంలో యుగపరివర్తనం కలిగించిన నవల ఇది. అందుకనే 'దీనికి నోబెలు బహుమానం ఇవ్వాలి' అన్నాడు ఎం. ఎన్. రాయి. అమానిత, అవహేలిత, అవజ్ఞాత మానవుల దుఃఖ సుఖాలు, ముఖ్యంగా బాంగ్లా స్త్రీల దుఃఖ వేదన శరత్బాబు నవలలలో చిత్రించినట్టు ఏ రచయితా చిత్రించలేదు.

## ప్రభాతకుమారముఖోపాధ్యాయ

సుప్రసిద్ధ కథా రచయిత ఇతను. మొదట కవిత్వ మల్లడంతో సాహిత్య రంగంలో ప్రవేశించాడు. రవీంద్రుడి ప్రోత్సాహంతో గద్య రచనకు పూనుకున్నాడు. ఇతని తొలి గద్య రచన రవీంద్రుడి 'చిత్రకావ్య విమర్శ. ఇది 1896 లో వెలువడింది. రవీంద్రుడి ప్రతి పక్షుల నెదిర్చిన తొలి విమర్శ ఇది.

ప్రభాతకుమారుడు పన్నెండు కథా సంపుటాలూ, 'రమాసుందరి', (1907), 'నవీన సన్యాసి' (1912), 'రత్నదీప' (1915), 'జీవనేరమూల్య' (1916) 'సిందూర కోట' (1919) మొదలైన నవలలూ వ్రాశాడు.

## మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి (1853-1931)

సంస్కృతం, ఇంగ్లీషు, పాలీ, జర్మనీ, టిబ్బతు మొదలైన భాషలలో మంచి పండితుడితను. వ్యావహారిక భాషకు చేరువైన గద్య వ్రాశాడు. చబ్బీసపరగణానై హాటి నివాసస్థానం. తండ్రి కమలలోచన న్యాయరత్న. హరప్రసాదశాస్త్రి 'బేణేర మేయె' (1920) మంచిచారిత్రక నవల. బంకిమబాబు 'వంగదర్శని'లో వ్యాసాలు వ్రా సిఖ్యాతి

గడించాడితను. నేపాల దర్బారులో 'చర్యాపదాలు' ఆవిష్కరించి బాంగ్లా సాహిత్య పౌరాతన్యం నిరూపించిన డీయనే, 'వాల్మీకి విజయ' 'భారతమహిళ', 'మేఘమాల' (అనువాదం) మొదలైనవి ఇతని ఇతర గ్రంథాలు.

## రాఖాలదాస వంద్యోపాధ్యాయ (1884-1930)

హరప్రసాదశాస్త్రి శిష్యుడితను. చారిత్రక పండితుడు; పురాతత్వవేత్త; ముద్రా తత్వవిదుడు. ఎన్నో చారిత్రక వ్యాసాలు వ్రాసి విదేశాలలో కూడా పేరు పడ్డాడు. కనిష్కుడి మీద ఇతను వ్రాసిన వ్యాసం ప్రాక్పశ్చిమ పండితులందరూ ప్రమాణంగా స్వీకరించారు. మహేంజదరాలో, హరప్పాలో త్రవ్వకాలు చేయించి ఎన్నో పురాతన విషయాలు వెల్లడించాడు. మూడు సాంసారిక నవలలూ, ఏడు చారిత్రక నవలలూ వ్రాశాడీయన. 'పాషాణేరకథా' (1914), 'కరుణ' (1917), 'శశాంక' (1914), 'ధర్మపాల' (1915), 'మయూఖ' (1917), 'అసీమ' (1924) 'ఉత్ఫుల్ల' (1929), 'హేమకణ' (1930), 'ధ్రువ' మొదలైనవి ఇతని నవలలు. చివరి రెండు నవలలు అసంపూర్తులు.

ఈ కాలంలోనే యువరచయితల నవలలు కొన్ని వెలువడ్డాయి. వాటిలో మణి లాలు గంగూలి 'ముక్తి' చారుచంద్ర వంద్యోపాధ్యాయ 'పంకతిలక', మహేంద్ర కుమారరాయ 'ఝూదేర యాత్రి', చారుచంద్రవంద్యోపాధ్యాయ 'స్రోతేర ఫూల్', 'దుయితార', 'పరగాఛా', ఇందిరాదేవి 'స్పర్శమణి', అనురూపదేవి 'పోష్యపుత్ర', 'మా', 'మంత్రశక్తి', నిరుపమాదేవి 'దిదీ', శైలబాలాదేవి 'జన్మ అపరాధి', శాంతా సీతాదేవుల 'ఉద్యానలత', నారాయణభట్టాచార్య 'కులపురోహిత' ప్రసిద్ధమైనవి.

## చిన్నకథ

బాంగ్లా సాహిత్యంలో సరైన 'చిన్నకథ'కు రవీంద్రనాథుడు శ్రీకారం చుట్టాడు. అతని మొదటి కథ 'క్షుధితపాషాణ', రవీంద్రుడికి పూర్వం ప్రయత్న పూర్వకంగానో అప్రయత్నంగానో బాంగ్లాలో చిన్నకథ తలెత్తకపోలేదు. నవలతోనే చిన్న కథ కూడా పుట్టిందనవచ్చు. అయితే సరైన టెక్నిక్కు శిలప్పం పట్టిన చిన్న కథ రాలేదు. రవీంద్రుడితో కాని ఏ సాహిత్య చరిత్రచూసినా ఎంతో కాలానికి కాని గద్య పుట్టలేదు. గద్యలో మరింత కాలానికి కాని చిన్న కథ అవతరించలేదు. పాశ్చాత్యసాహిత్యంలో

కూడా పందొమ్మిదో శతాబ్దంలోనే పుట్టింది చిన్నకథ. ఎడ్గార్ ఎవెన్‌పో మొదటి కథా రచయిత.

రవీంద్రుడికి పూర్వం బాంగ్లాలో వెలువడిన కథలలో సంజీవచంద్ర చట్టోపాధ్యాయ వ్రాసిన 'దామిని' మాత్రం కొంతవరకు 'చిన్నకథ' అనవచ్చు. రవీంద్రుడు చిన్నతనంలో వ్రాసిన కథ 'భికారిణి'.

రవీంద్రనాథుడి చిన్న కథలు వెలువడడమే తడువుగా చిన్నకథ లారంభించిన వారిలో స్వర్ణకుమారీదేవీ, నగేంద్రనాథగుప్తా ముఖ్యులు.

స్వర్ణకుమారీదేవి పరిచయం వెనక నవలా రచయితలలో కొంత తెలుసుకున్నాం. ఈమె చిన్న కథలు 'నవకాహిని'లో సంకలన మయాయి.

నగేంద్రనాథగుప్త చిన్న కథలు 'సంగ్రహ' లో 1892 లో వెలువడ్డాయి. వీటిలో 'శ్యామేర కాహిని' శ్రేష్ఠమైంది.

రవీంద్రుడు వందకి పైగా చిన్న కథలు వ్రాశాడు. కథలు వ్రాయడానికి తనలో కొట్లాడిన సంకల్పం 'సోనారతరీ' కావ్యగుచ్ఛంలో ఇలాగానం చేశాడతను.

"ఇచ్ఛాకరే అవిరత
అపనార మనోమొత
గల్పలిఖి ఏకేక్టికరె."

(నా ఇచ్ఛానుసారం వొక్కొక్క కథ వ్రాయాలని అనవరతం అనుకుంటాను.)

కవిత్వంలో లాగానే చిన్న కథలలో కూడా రవీంద్రనాథుడు చూపిన శిల్పం అద్భుతమైంది; అపూర్వమైంది ఇంగ్లీషు, అమెరికను, ఫ్రాన్సు, రష్యను చిన్నకథలకు ఆయన చిన్నకథలు ఏ మాత్రం తీసిపోవు. ఇప్పుడవి అన్ని భాషలలోను అనువాదమైనాయి. ఇంగ్లీషులో సురేంద్రనాథ ఠాకూరు, అమియ చక్రవర్తి, సోమనాథ మిత్ర, సి. ఎఫ్. అండ్రూసు, ఇందిరాదేవి చౌధురాని, యదునాథ సర్కారు, పియర్సను, కృష్ణకృపలాని వంటి సమర్థులు సుప్రసిద్ధులు తర్జుమాచేశారు. కొన్నిరవీంద్రుడే స్వయంగా ఇంగ్లీషు చేశాడు.

రవీంద్రుడి అనంతరం చిన్న కథకు రూపు దిద్దిన వారు ప్రమథచౌధురి, శర చ్ఛంద్రచట్టోపాధ్యాయులు, తొలి దినాల్లో రవీంద్రునతో పాటు చిన్న కథను ఉత్తమ స్థాయికి తెచ్చారు వీరు. ప్రమథ చౌధురి 'వార ఇయారకథ' ప్రసిద్ధమైన కథా సంపుటి. ఇది ఇంగ్లీషులో కూడ అనువాదమైంది.

## శరత్బాబు కథలు

ఇతని మొదటి కథమంజరి. ఆ దినాల్లో 'కుంతలినీ' తలనూనె అధికారి H. బసు కథలకు పోటీ యేర్పరిచే వాడు. ఉత్తమ కథకు బహుమతులిచ్చేవాడు. ఈ బహు మానానికి 'కుంతలినీ బహుమానము' అని పేరు. శరచ్చంద్రుడు రంగూను వెళుతూ తన మేనమామ సురేంద్రనాథ గంగూలి పేర 'మందిర' కుంతలినీ పోటీకి పంపాడు. దానికి మొదటి బహుమానం వచ్చింది.

శరత్బాబు కథలు నవలికల వలె వుంటాయి. ఆయనే వ్రాసుకున్నాడు. "నేను చిన్న కథ వ్రాయాలని కూచుంటాను, అది పెద్దదై కూచుంటుంది" అవి.

ఎన్నో చిన్న కథలు వ్రాశాడితను. 'మహేశ', 'విలాసి', 'అభాగిని', స్వర్గ', 'హేమాంగిని' మొదలైన కథలు గొప్పవి. చిన్న పిల్లల కోసమున్నూ కొన్ని కథలు వ్రాశాడు శరచ్చంద్రుడు. 'ఛెలేబేలారగల్ప' అని సంపుటంగా వెలవడ్డాయవి. ఈ సం పుటం పీఠికలో తాను 'ఇది కమ్మరి కుమ్మరిపని చేసినట్టుంది' అన్నాడు. అయితే కథా రచయితగా కాక నవలా రచయితగానే శరత్బాబు కీర్తి వంగసాహిత్యంలో.

## శైలేంద్ర మజుందారు (మృ. 1919)

రవీంద్రుడి 'సాధన' పత్రికలలో చిన్న కథలు ప్రాలంభించా డితను. ఇతని సంపుటి. 'చిత్రవిచిత్ర' 1902 లో వెలువడింది.

## ప్రభాతకుమార ముఖోపాధ్యాయ (1873–1932)

రవీంద్రనాథుడి తరువాత చెప్పదగిన ప్రసిద్ధ కథా రచయిత ఇతను. వర్ధమాన జిల్లా ధాత్రి గ్రామం ఇతని జన్మస్థానం. తండ్రి జయగోపాల ముఖోపాధ్యాయ. బారిష్టరు పరీక్షలో ఉత్తీర్ణుడై, కలకత్తా విశ్వవిద్యాలయ కళాశాలలో అధ్యాపకుడుగా పనిచేశాడు. మొట్టమొదట కవితలల్లుతూ సాహిత్యరంగంలో దిగాడు. కాని రవీంద్రుడి ప్రోత్సాహంతో కథారచనకు కలంపట్టాడు. మొదటి కథ 1896 లో వ్రాశాడు. రెండేళ్ళ

తరవాత 'భారతి' లో వరసగా కథలు వ్రాసి ప్రచురించాడు. ఇతని కథలు 'నవకథ' (1900), 'షోడశి' (1916), 'ఓదేశీ ఓ విలాతీ' (1910), 'కల్పాంజ' (1913), 'గల్పవీధి' (1916) 'పత్రపుష్ప' (1917) 'గహనారబాక్స్ (1921) 'హతాశ ప్రేమిక' (1923), 'నూతన బౌ' (1928), 'జామాత బావాజీ' (1931) అనిఎన్నో సంపుటాలు వెలువడ్డాయి. 'రమాసుందరి' మొదలైన నవలలుకూడా వ్రాశాడీయన. అయితే కథా రచయితగానే పేరు సంపాదించాడు ముఖ్యంగా'.

## సుధీంద్రనాథ ఠాకూరు (1869-1929)

రవీంద్రనాథ ఠాకూరు మేనల్లు డితను. రవీంద్రుడు స్థాపించిన 'సాధన' పత్రిక మొదటి సంపాదకుడు 'మంజుషా' (1903), 'కలంక', (1912), 'చిత్రాలి' (1916) మొదలైన కథాసంపుటాలు వ్రాశాడు.

## సురేంద్రనాథ మజుందారు

కథారచనలో సొంత శైలి కుదుర్చుకున్నా డితను. 'చోటాఛోటాకల్ప' (1915), 'కర్మయోగేర టీక' (1918) అని రెండు కథా సంపుటాలు ప్రకటించాడు.

## సౌరీంద్ర మోహన ముఖోపాధ్యాయ

1903 నుంచి చిన్నకథలు మొదలుపెట్టిన యువరచయిత ఇతను. 'సేపాలి' (1909), 'నిర్ఝర' (1911), 'పుష్పక' (1913) మొదలైన కథాసంపుటాలు వ్రాశాడు. కొన్ని నవలలు, నాటకాలు కూడా వ్రాశాడు. అయితే అవి చాలవరకు అనువాదాలు.

## చారుచంద్ర వంధ్యోపాధ్యాయ (1876-1938)

పన్నెండు కథాసంపుటాలు ప్రకటించాడితను. ఇంగ్లీషునుంచి కొన్ని కథలు బాంగ్లా చేశాడు, 'వరణదాలా' (1910), 'పుష్పపత్ర' (1910), 'సౌగాత' (1911) వనజ్యోత్స్న' (1938) మొదలైనవి మంచి కథాసంపుటాలు.

## విభూతి భూషణభట్ట

కేవలం చిన్న కథలే వ్రాసి ప్రసిద్ధి పొందిన రచయిత ఇతను. 'స్వేచ్ఛాచారి' (1917), 'అకాజేరకాజ' (1920), 'సహజియా' (1922) 'సప్తపది' (1923) మొదలైనవి ఇతని కథాసంపుటాలు.

నిరుపమదేవి (1883-1951)

విభూతి భూషణభట్టు సోదరి ఈమె. ఎన్నో కథలూ, పది, పన్నెండు నవలలూ, వ్రాసింది.

శైలబాల ఘోషజాయ

ఏడెనిమిది కథాసంపుటాలు, రెండు డజన్ల నవలలూ వ్రాసిందీమె.

శాంతాదేవి, సీతాదేవి

రామానంద చట్టోపాధ్యాయ కుమార్తెలు వీరు. 'ప్రవాసి' లో చిన్న కథలూ, పిల్లల కథలూ వ్రాశారు.

విపిన చంద్రపాలు (1887 1952)

దేశనాయకుడు, తెలుగువారికి సుపరిచితుడు. ఇంగ్లీషు, బాంగ్లా భాషలలో మంచి పండితుడు. 'సబూజపత్ర' కు వ్యతిరేకంగా ఏర్పడిన 'నారాయణ' మాసపత్రికలోమంచి చిన్నకథలు వ్రాశాడు

నారాయణ చంద్ర భట్టాచార్య (-1927)

'నారాయణ' పత్రికలో ఎన్నో కథలు వ్రాశాడు. కథాసంపుటాలు,నవలు కలిపి ఏభైకి పైగా ప్రకటించాడు. మొదటి కథా సంపుటి 'కథాకుంజ' 1907లో వెలువడింది. హేమచంద్రుడి 'అభిదాన చింతామణి' అనువదించాడితను. హుగ్లీజిల్లా పాలా గ్రామం జన్మస్థానం. తండ్రి పీతాంబర భట్టాచార్య.

హరిదాస హల్దారు (1862-1934)

'నారాయణ'లో ఎన్నో చిన్న కథలు ప్రకటించాడితను. 'మదనప్రియాదా' 1918) ఇతని మొదటి కథాసంపుటం. ఇతని 'గోబర గణేశేర గవేషణ' (1916) ఎంతో మంది పాఠకుల్ని ఆకర్షించింది.

సురేంద్ర చంద్ర వేనుగుప్త

అభ్యుదయ రచయిత. మొదట 'నారాయణ' లో కథలు వ్రాశాడు కథా సంపుటాలూ, నవలలూ మొత్తం ఏభైకిపైగా ప్రకటించాడు

1922 లో 'ఝూదేర దోలా' అనివార కథాసంపుటం వెలువడింది. ఇందులో గోకుల చంద్ర నాగ, దినేశ చంద్ర దాస, సునీతి దేవి, మణీంద్ర లాలవసు- ఈ నలుగురి కథలు ప్రకటించారు. ఈ సంపుటం ఆ నాటి రచయితలలో బాగా సంచలనం కలిగించింది.

ఈ అనంతరం బాంగ్లా సాహిత్యంలో అత్యాధునిక యుగం అవతరించాక చిన్న కథ మరింత ప్రచారం లోకి వచ్చింది. గోకుల చంద్రనాగ, మణీంద్రలాల వసు, శైలజా నందముఖోపాధ్యాయ, జగదీశ చంద్రగుప్త, విభూతి భూషణ వంద్యోపాధ్యాయ, విభూతి భూషణ ముఖోపాధ్యాయ, రవీంద్రనాథ్ మిత్ర, కేదారనాథ వంద్యోపాధ్యాయ, రాజశేఖర వసు, ప్రబోధ కుమార సన్యాల, ప్రేమేంద్రనాథ మిత్ర మొదలైన రచయితలు ఎన్నో కథలు వ్రాశారు. కొత్త రచయితలు బయలుదేరుతున్నారు. రచయిత్రులున్నూ చిన్న కథలో సిద్ధహస్త లవుతున్నారు.

# అత్యాధునిక సాహిత్యం

క్రమంగా బాంగ్లా సాహిత్యంలో అత్యాధునిక ప్రక్రియలు ఆరంభమైనాయి. సరిగా ఈ అత్యాధునిక సాహిత్యం ఎప్పుడు ఆరంభమైందో నిరూపించి చెప్పడం కష్టం. 1923 లోనే దీని సూచనలు కనిపించాయి. రానురాను రవీంద్రనాథుడి అనుయాయులు వొక తెగగానూ, 'అగ్రగాము' లైన అత్యాధునికులు వొక తెగగానూ ఏర్పడుతూ వచ్చారు. డా. నరేశచంద్ర, మోహితలాలు మజుందారు నవీనులకు నాయకత్వం వహించారు. నజరుల్ ఇస్లాము నాయకత్వంతో కొందరు మహమ్మదీయ యువకులు "Kematists" అని వొక సంఘంగా ఏర్పడ్డారు. అభ్యుదయ సాహిత్యానికి రవీంద్ర అనుయాయులు అడ్డంకి అని వ్యతిరేకులు వాదం లేవదీశారు. ఈ రెండు తెగలకు సమాధానం కుదర్చడానికి రవీంద్రనాథుడి ఆధిపత్యం క్రింద కలకత్తాలో సమావేశం జరిగింది. మొదటి సమావేశం (1927, మార్చి) నాడు రవీంద్రుడు ఉపన్యసించాడు. ఈ ఉపన్యాసంలో ఆయన చెప్పిన తీర్పు అభ్యుదయ వాదులకు నచ్చలేదు. కాని మాటాడకుండా వూరుకున్నారు వారు. మొదటి సమావేశం జరిగిన మూనాళ్ళ తరవాత రెండో సమావేశం జరిగింది. ఆ వాళ ఉభయపక్షాల నుంచి చర్చలు జరిగాయి. కాని వొక సిద్ధాంతం కుదరలేదు. రవీంద్రుడు తొలినాడు చేసిన ఉపన్యాసం 1928 జూలైలో 'సాహిత్యేరధర్మ' అన్న శీర్షికతో వ్యాసరూపాన వెలువడింది. డా. నరేంద్రనాథసేను గుప్త ఆగస్టులో 'సాహిత్యధర్మేర సీమానా' అని రవీంద్రుడి వ్యాసానికి ప్రత్యుత్తరం ప్రకటించాడు. దానిమీద ద్విజేంద్ర నారాయణబాగ్చీ 'సాహిత్య ధర్మేర సీమానావిచార' అని గుప్త వ్యాసాన్ని ఖండించాడు. డా. గుప్త దానికీ వొక ప్రత్యుత్తర మిచ్చాడు. ఈ వాద ప్రతివాదాలు 'విచిత్ర' పత్రికలో వెలువడ్డాయి. రవీంద్రుడు 'శేషేర కవిత' వ్రాసి ఈ వాదం ముగించాడు. అయితే అత్యాధునిక పక్షం పెరుగుతూనే వచ్చింది.

అత్యాధునిక సాహిత్యాన్ని ప్రతిపక్షులు 'మేకల సాహిత్యం' అన్నారు ప్రాచీన సాహిత్యంలో రామాయణం అత్యానిధునిక సాహిత్యంలో 'కామాయనం' అన్నారు. అత్యాధునిక సాహిత్యమంతా 'అశ్లీలం' అన్నారు. నోటికి వచ్చినట్టు దుమ్మెత్తిపోశారు. అయితే అంత మాత్రాన ప్రగతివాదులు ఆగిపోలేదు. ఒక ప్రగతి వాది ఇలా వ్రాశాడు :

"రాజా రామమోహనరాయి, కేశవచంద్రసేను, ఈశ్వరచంద్ర విద్యానాగరుడు-వీరున్నూ వొకనాడు అర్వాచీనులుగా వుండేవారు. ఆధునికత అనే అపరాధంవల్ల ఆనాడు వారున్నూ నిందుకు పాత్రులయారు. అందాక సాంఘికంగా కష్టాలనుభవించ వలిసి వచ్చింది వారికి. బంకిమచంద్ర, మైకేలు, నవీనచంద్ర మొదలైనవారు సాంఘిక కష్టాలనుభవించారు. అయితే ఈ దుఃఖమనుభవించడం వేరు, ప్రాచీను లనిపించుకుని దుఃఖమనుభవించడం వేరు. ఇప్పుడు రవీంద్రనాథుడికి ఇలాటి శోకప్రదమైన సంఘటనే తటస్థించింది. కేకలు వెయ్యడం సరికాదు. నవీనుల జాబితానుంచి తన పేరు కొట్టి వెయ్యడం రవీంద్రనాథుడికి కష్టమనిపించి అతను అభిమానపడడం సహజమే. ఈ అభిమానం మాకు అర్థమవుతుంది. కాని రవీంద్రనాథ శిష్యుల పునర్జన్మోత్సవం మాకు అర్థం కాదు. రవీంద్రుడు నవీనుల విజయం గానం చేశాడు. అందుకని తిట్లుకూడా తిన్నాడు. అయితే ఆయన్ను ఇవాళ ప్రాచీనుల శిబిరంలో కప్పిపెడితే మాత్రం ఈ కొత్త కేకలు సత్యమైనవే అని అనకతీరదు. గొప్ప ఆధునికుడూ, విద్రోహీ అయిన శరచ్చంద్రుడు ప్రాచీనుల జట్టులోకి పోయి హతుడైతే అతనికి విప్రదాసుకు పట్టిన దశే పట్టిందనాలి. ఇందులో మొరపెట్టవలసిన పనేముందో అర్థం కావడంలేదు మాకు. పురాతనమే అంతా ఆవరిస్తే మరి నవీనతకు స్థలమెక్కడ? తండ్రే ఎల్లప్పుడూ వుంటే కుమారుడి అవసరమేముందిక? పైగా కొడుకు మూడుమూర్తులా తండ్రి లాగే వుండకపోతే నెత్తికొట్టుకోడ మెందుకో? మనుష్యావతార మెందుకూ, మత్స్యావతారమే వుండవలసింది!''

అయితే అత్యాధునిక బాంగ్లా సాహిత్యం పూర్ణదశకు రాలేదనే అంటున్నారు విమర్శకులు. అలా అని దాని పురోభివృద్ధికి అడ్డుపడడం అపరాధ మవుతుంది. రవీంద్రుడు, శరచ్చంద్రుడు వంటి ప్రతిభాశాలి రచయిత ఇందులో అవతరించే వరకు దీని స్థానం ఇలాగే వుంటుందేమో! దేశం మీద రవీంద్రుడి నీడ వుండనేవుంది ఎంత లేదన్నా, దీనినుంచి బయటపడడం కోసం అభ్యుదయ కవులు సోవియటు సాహిత్యం జపిస్తున్నారు. అయితే దాని మోజు కూడ సన్నగిల్లి ముందుముందు కొత్త వెలుగు వికసించే ఆశ లేక పోలేదు.

అత్యాధునిక యుగంలో వివిధశాఖలలో ప్రసిద్ధులైన రచయితలు అనేకమంది వున్నారు.

### శైలజానంద వంద్యోపాధ్యాయ

నజరుల్ ఇస్లాము స్నేహితు డితను. నజరుల్ కథలు వ్రాస్తున్నప్పుడు పద్యాలు వ్రాశాడితను. నజరుల్ పటాలంనుంచి తిరిగి వచ్చి కవిత లల్లినప్పుడు ఇతను కథలు

వ్రాశాడు. 'ఆమేర మంజరి' (1923) 'ఠయిలాకుతి' (1930). 'దినమజూర్' (1932). 'అతసీ' (1925). 'నారీమేధ' (1928). 'వధూవరణ' (1931). 'పౌషపార్వణ' (1931). 'సతీ అసతీ' (1933). 'నారీజన్మ' (1934) మొదలైన కథాసంపుటాలు వ్రాశాడితను ఇతని కథలు మంచి ప్రసిద్ధి పొందాయి పాఠక లోకంలో. 'మాటీఘర్' 'ఝడోహివా' మొదలైన నవలలు కూడా వ్రాశాడు.

## జగదీశ చంద్రగుప్త (1886-1957)

శైలజానందతో సమానుడైన కథారచయిత ఇతను. మొదట పద్యరచనకు ఉపక్రమించాడు. అనంతరం కథారచన చేసి పేరుసంపాదించాడు. 'వినోదిని' (1928). 'రూపేర బాహిరె' (1929). 'శ్రీపతి' (1930). 'గతిహారా జాహ్నవి' (1935). 'శశాంకకవిరాజేరస్త్రీ' (1935). 'పాయికి శ్రీ మిహిర 'ప్రామాణిక' (1940)' 'మేఘావృత అశని' (1947) మొదలైన కథాసంపుటాలు వ్రాశాడు. ఇతని మొదటి కథాసంపుటాలు 'బిజలి' (1925). 'కాలికలమ్' (1926). 'కల్లోల', వంగవాణి' పత్రికలలో వెలువడ్డాయి. 'అసాధు సిద్ధార్థ' (1929). 'మహిషి'. (1929) 'దులాలేర దోల' (1931) మొదలైన నవలికలు కూడా వ్రాశాడితను.

## విభూతి భూషణ వంద్యోపాధ్యాయ (1899-1950)

సుప్రసిద్ధ నవల 'పథేర పాంచాలి' రచయిత ఇతను. మురాతిపురం ఇతని జన్మస్థానం. తండ్రి మహానంద వంద్యోపాధ్యాయ. తల్లి మృణాలినీదేవి. పేదరికంలో ఇతని బాల్యకాలం గడిచింది.

ఇతని తొలికథ 'అపేక్షిత', 'పథేర పాంచాలి' 1929లో వెలువడింది. ఇది ఇతనికి ఖండాంతరఖ్యాతి తెచ్చింది.

'పథేర పాంచాలి', 'అపరాజిత' (1932), దృష్టిప్రదీప' (1933). 'ఆరణ్యక' (1938). 'అనువర్తన', ఆదర్శహిందు హోటేలు' (1940). 'విపినేర సంసార' (1941). 'దేవయాన' (1944). ఇచ్ఛామతి' (1949) మొదలైన నవలలూ; 'ఉమా రాణి' (1922). 'పుయిమాచా' (1925). 'మేఘ మల్లార' (1931). 'మవులీపుల్' (1932). 'జాత్రా బదాల్' (1934) మొదలైన కథాసంపుటాలు వ్రాశాడితను.

ఇతని 'ఆరణ్యక' నవల పీఠికలో "విభూతి భూషణవంద్యోపాధ్యాయ వ్రాసిన 'ఆరణ్యక' చిన్నదైనా గొప్పపుస్తకాలలో వొకటి- వంగసాహిత్యానికేకాదు, భారతీయ

సాహిత్యానికే కాదు, ఏసాహిత్యానికైనాసరే, ఇది చక్కని అలంకారమే. ఇదిగద్యలో వ్రాసిన ఖండకావ్యమని చెప్పాలి" అనివ్రాశాడు సునీతి కుమార చట్టోపాధ్యాయ.

## కేదారనాథ వంద్యోపాధ్యాయ (1863-1949)

'చిన్‌యాత్ర' యాత్రాపత్రాలు (1918). హాస్యకవిత 'కాశీర కించిత్' (1915), నవలలు 'కష్టీర ఫలాఫల' (1929), 'భాదుడీ మశాయ' (1931), 'ఐజ్' (1935), కథా సంపుటాలు 'ఆమ్రాకె ఓకే' (1927), 'కబ్లాతి' (1928), పాథేయ' (1930), 'దుఃఖేర దెవాలి' (1932) మొదలైన గ్రంథాలు వ్రాశాడితను.

## రాజశేఖరవసు (జ. 1880)

హాస్యకథక చక్రవర్తి ఇతను. పరశురామ ఇతని సాహిత్యనామం, యదునాథ సేను ఇతని కథలకు చిత్రాలు వేశాడు, మధ్య రకం సంఘాన్ని కథలలో వ్యంగ్యంగా చిత్రించాడు వసు. 'గద్దాలికా', (1924), 'కజ్జలీ' (1927) 'హనుమంతేర స్వప్న' (1937), 'కృష్ణకవి' (1953)మొదలైన హాస్యకథా సంపుటాలూ,లఘుగురు' (1939), 'విచిత్ర' (1956) అని రెండు వ్యాస సంపుటాలూ వ్రాశాడు.

## మోహితలాలు మజుందారు (1888 - 1952)

కవీ, విమర్శకుడున్నూ ఇతను. నజరుల్ ఇస్లాముతో కొంత కాలం అత్యాధునికు లలో చేరాడు. తరవాత అభ్యుదయ కవులతో కలిశాడు. 'బిస్మరని' (1929), 'సమర మంగల' (1936), 'హేమంత గోధూళి' (1941), 'చంద చతుర్దశి' (1944) మొదలైన కావ్య సంపుటాలూ, 'ఆధునిక బాంలా సాహిత్య', 'బాంలా సాహిత్యకథ', 'సాహిత్య వితాన' అని మూడు విమర్శ గ్రంథాలూ వ్రాశాడు. చివరి దినాల్లో ఢాకా విశ్వవిద్యాలయంలో బాంగ్లా అధ్యాపకుడుగా చేరిన తరవాత అభ్యుదయ రచయితల నుంచి విడిపోయాడు.

## గోకులచంద్రనాగ (1895 - 1928)

అత్యాధునికుల పత్రిక 'కల్లోల' స్థాపించిన యువ రచయిత ఇతను. 'రూపరేఖ' (1922), 'మాయాముకుల' (1927) అని రెండు కథా సంపుటాలు, 'పథిక' (1925) అని నవల వ్రాశాడు.

### విభూతి భూషణ ముఖోపాధ్యాయ (జ 1896)

నవీన కథా రచయిత. 'రానూర ప్రథమ భాగ (1937). రానూర ద్వితీయ భాగ' (1938). 'రానూర కథామాల' (1941). 'హాతెఖడి' (1947) మొదలైన కథా సంపుటాలు, కొన్ని నవలలు, నాటకాలు వ్రాశాడు.

### రవీంద్రనాథమిత్ర (1896 - 1933)

అతి చిన్న కథలు వ్రాయడంలో సమర్థుడితను. 'దివాకరశర్మ' ఇతని సాహిత్య నామం. మొదటికథ 'థర్డుక్లాసు' 1925లో ప్రకటించాడు. 'వాస్తవిక' (1931), 'ఉదాసీరమత (1931), 'దివాకరి' (1931). త్రిలోచన కవిరాజ' (1933) మొదలైన ఏడు చిన్న కథల సంపుటాలు వ్రాశాడు. 'మానమయి గర్ల్సుస్కూలు' అని వొక ప్రహసనం కూడా వ్రాశాడు.

### దాసు

నాగు కాలం చేశాక 'కల్లోల' పత్రిక నడిపాడితను. 'మాటిరనెసా' (1918), 'భుయిc చంపా' (1925) మొదలైన కథా సంపుటాలు వ్రాశాడు. 'కల్లోల' ఆగిపోయిన తరవాత సినిమారంగంలో చేరాడు

### మణీంద్రలాలవసు (జ 1897)

మంచి కథా రచయిత ఇతను; నవలా రచయిత. 'రమల' (1923), 'అజయ కుమార' (1932), 'జీవనయాన' (1936) అని మూడు నవలలూ, 'మాయాపురి' (1923), 'రక్తకమల' (1924), 'సోనారహరిణ' (1924), కల్పలత' (1935), మొదలైన కథా సంపుటాలూ వ్రాశాడు. 'రమల' నవీనులను బాగా మెప్పించింది. సహయాత్రిని (1941). మొదలైన కథా సంపుటాలు వ్రాశాడు. 'రమల' నవీనులను బాగా మెప్పించింది

### తారాశంకర వంద్యోపాధ్యాయ (జ 1898)

వీరభూరు జిల్లా లాభపురం ఇతని జన్మస్థానం. సుప్రసిద్ధ కథా రచయితా, నవలా కారుడున్నూ ఇతను. 'చలిసామయి' (1936), 'జల్సాఘర్' (1937), 'రానకలి' (1938), 'ప్రసాదమాల' (1945) మొదలైన కథా సంపుటాలూ, 'చైతాలి ఘూర్ని' (1929), 'నీలకంఠ' (1930), 'ఆగున్' (1937), 'ధాత్రీ దేవత' (1939), 'కాలింది' (1940), 'కలి' (1941), 'గణదేవత' (1942), 'పంచగ్రామ' (1943),

'హంసువిబాంకేర ఉప కథ (1947), 'ఆరోగ్య నికేతన' (1952), 'నాగినీ కన్యేర కాహిని' (1952) మొదలైన నవలలూ, 'ఆమారకాలేర కథ' (1951), 'ఆమార సాహిత్య జీవన' (1953) అని రెండు సంపుటాలు ఆత్మ చరిత్రలూ వ్రాశాడు.

## 'వనఫూల్' బలాయిచాంద ముఖోపాధ్యాయ (జ 1899)

కవి .కథకుడు, నవలాకారుడు, నాటక రచయిత ఇతను. 'వనఫూలేర కవిత' (1936), 'అంగారపర్ణ' (1940), 'ఆహవనీయ' (1943) మొదలైన కావ్యసంపుటాలూ 'వనఫూలేరగల్ప' (1936), 'వైతరిణీ తీరె' (1937), 'బాహుల్య' (1943), 'అదృశ్య లోకే' మొదలైన కథా సంపుటాలూ, 'తృణఖండ' (1935), 'కిఛుక్షణ' (1937), 'ద్వైరథ' (1937), 'నిర్మోక' (1940), 'జంగమ' (1943), 'స్థావర' (1951), 'దానా' (1948) 'పంచపర్వ' (1954) మొదలైన నవలలూ, శ్రీమధుసూదన' (1939) 'విద్యాసాగర' (1941) నాటకాలూ వ్రాశాడు. జీవిత చరిత్రలు నాటకాలుగా వ్రాయ డంలో ఇతనిదే శ్రీకారం. 'వనఫూలేర కలిత' హాస్య కావ్యసంపుటి. ఉదాహరణకు వొక ఖండిక :

ఛాత్రీ వో ఛాత్ర
ఛాత్రీ ఓ ఛాత్ర
చిరకాలయి హయ తారా
నిందార పాత్ర
పడాశోనా వ్యాపారెతె మననాయి కారు బా
వేశ విన్యాసె కెవు చకచక చారుబా
ఆధునిక మనా కేహ సినేమార భక్త
ఖద్దరధారీ కారో మతామత శక్త
కెవూ్ఛారీ భీతుభీతు, కేవూఛారీక్షాత్ర,
ఛాత్రీ ఓ ఛాత్ర.

(విద్యార్థులూ విద్యార్థినులూ పాపం చిరకాలం నిందా పాత్రులు వారు। చదువు సంధ్యల మీద ఎవరిమనస్సూ వుండదు. కొందరు కేశవిన్యాసంతో చకచకలాడతారు. కొందరు కొత్తఫ్యాషను మీద మోజు చూపుతారు. కొందరు సినిమా భక్తులు. కొందరు

ఖద్దరు ధారులు. వారి తీర్పు అగమ్యం. ఒకరు పిరికి పందలైతే, వొకరు మహా వీరులు; విద్యార్థులు వారు, విద్యార్థినులు!)

## జీవనానందదాసు (1899 - 1954)

సత్యేంద్రనాథదత్త నజరుల్ ఇస్లాముల అనుయాయి ఇతను. నవ్యకవి. 'ఝరా పాలక' (1928) ఇతని తొలి కావ్య సంపుటి. ఇతని రచనలను తరుచు వ్యంగ్య కవితలతో హేళనచేసే వారు వ్యతిరేకులు. ఇది కారణంగా కలకత్తా కాలేజీలో తన ఉద్యోగం పోగొట్టుకున్నాడితను. ఎజ్రాపౌండ్, టి ఎస్ ఇలియట్ మొదలైన కవుల ననుసరించి కొత్త కవిత్వం వ్రాశాడు. ఆ వూపులో వ్రాసిన 'ధూసర పాండులిపి' (1936) కావ్యాలు కొన్ని వరసగా 'ప్రగతి'లో వెలువడ్డాయి కొన్ని 'కల్లోల'లో వచ్చాయి. 'వనలతా సెన్' (1942) 'మహాపృథివి' (1944) 'సాత్తితారార తిమిర' (1948), 'శ్రేష్ఠకవిత' (1924) మొదలైన కావ్య సంపుటాలూ, 'కవితారకథ' వ్యాస సంపుటీ వ్రాశాడు. ఈ వ్యాససంపుటిలో ఆధునిక కవిత్వాన్ని సమర్థిస్తూ వాదించాడు.

## సజనీకాంతదాసు (జ 1900)

కలలతో కవితల్లని అత్యాధునిక కవి సజనీకాంతదాసు, 'పథచల్తె ఘాసేర ఫూల్' (1929), 'అంగుష్ఠ' (1931), 'మధుఓహాల' (1931) 'కవికాల' (1940) మొదలైన కావ్యసంపుటాలు వ్రాశాడితను. 'అజయ' (1931) అని వొక నవలా, 'రాజహంస' (1935), 'ఆలో అంధాలి' (1936) 'పంచిసె వైశాఖ' (1942) మొదలైన కావ్యాలూ వ్రాశాడు.

## ప్రమథనాథబిసి (జ. 1901)

శాంతినికేతనంలో విద్యాభ్యాసం చేశాడితను. 'ప్రాచీన ఆసామీహైతె' (1934). 'విద్యాసుందర' (1934), 'ప్రాచీనగీతికాహైతె, (1937) మొదలైన ఇతని తొలి రచనలు మరుగులో పడిపోయాయి, తరవాత రచనలు 'ఆకుంతల' (1946). 'యుక్త వేణి' (1948), 'ఉత్తర మేఘ' (1953) మొదలైన కావ్య సంపుటాలు మంచి ప్రచారంలోకి వచ్చాయి, ఇవేకాక, 'పద్మా' (1935), 'జొడాధి ఫింర చౌధురి' పరివార (1937), మొదలైన నవలలూ, 'శ్రీకాంతేర పంచమపర్వ' (1939), 'అశరీరి', 'గల్పేరమత' (1945), 'డాకిని' (1945), 'బ్రహ్మరహాసి' (1948) మొదలైన కథా సంపుటాలూ, 'రుణకృత్వా' (1935), 'ఘృతమ్ పిబేత్' (1936), 'మవుచాకేధిల'

(1948) 'పరిహాసవిజలపితమ్' మొదలైన నాటకాలూ 'రవీంద్రనాథఓ శాంతినికే తన (1944) మొదలైన విమర్శగ్రంథాలూ వ్రాశాడు.

### అమియ చక్రవర్తి (జ. 1901)

రవీంద్రనాథ ఠాకూరు ఆంతరంగిక కార్యదర్శులలో వొకడితను. 'ఖసడా' (1938), ఏకిముఖో' (1939), పరాపార' (1953), 'పాలాబదల్' (1955) మొదలైన ఏడు కావ్యసంపుటాలు వ్రాశాడు.

### సుధీంద్రనాథదత్తు (జ. 1901)

అత్యాధునికుల ముఖపత్రిక 'పరిచయ' (1931) స్థాపించాడితను. అప్పటికి 'కల్లోల' అణగారిపోయింది. 'పరిచయ'లో నిర్మాల్యవసు, జ్యోతిర్మయ గంగోపాధ్యాయ, సునీల కుమార గుప్త సులేఖా సన్యాల, మానిక వంద్యోపాధ్యాయ, సుశీలజానా, సరోజ వంద్యోపాధ్యాయ, అనిలాదేవి, దేవీప్రసాద చట్టోపాధ్యాయ, అనిలకాంచిలాల, విమల చంద్రఘోషు, ఆలోకాంచన దాసగుప్త, మణీంద్రరాయి, అబ్దుల్‌కరీము, బంధన దాసగుప్త, ధనంజయదాస మొదలైన అత్యాధునికులు రచనలు చేశారు.

'పరిచయ' స్థాపించాక సురేంద్రనాథ్ దత్తు 'అర్కెస్ట్రా' (1935), 'క్రందసి' (1937), 'ఉత్తరఫల్గుని' (1940), 'సంవర్త' (1953) అనినాలుగు కావ్య సంపుటాలు ప్రకటించాడు. 'స్వగత' (1948) అని వ్యాససంపుటి కూడా ప్రకటించాడు.

### సరోజకుమార రాయ చౌధురి (1902)

'బంధని' (1931), 'శృంఖల' (1932), 'ఆకాశ ఓ మృత్తిక' (1933), 'మయూరాక్షి' (1936), 'హరిస బలాక' (1937), 'సోమలత' (1938), 'కాలోఘోడా' (1946) మొదలైన గ్రంథాలు వ్రాశాడితను.

### అచింత్య కుమార సేనుగుప్త (జ. 1903)

"అమార పరానె బాయీ,
కోటి మానవేర అశ్రుజలేర జోయార సునితె పాయీ."

(నాప్రాణంలో తమ్ముడూ, కోటిమానవుల కన్నీటి వరద విన్నా నోయి;)

అని గంభీరంగా కంఠమెత్తిన నవకవి ఇతను, ఇతని తొలికావ్యం 'అమావాస్య' 1930లో వెలువడింది. నజరుల్ ఇస్లాము, రవీంద్రనాథఠాకూరు అప్పుడప్పుడు ఇతని

రచనలో తొంగిచూస్తారు. అయినా దృఢమైన వ్యక్తిత్వం కల రచయిత. 'ఆమరా' (1933), 'ప్రియా ఓ పృథివి' (1936), 'నీలఆకాశ' (1950) మొదలైన కావ్య సంపుటాలూ, 'బెడె' (1928), 'అకస్మిక' (1930), 'వివాహేరచెయె బడో' (1931), 'ప్రాచీర ఓ ప్రాంతర' (1932), 'ఊర్ణనాభ' (1933) 'ఇంద్రాణి' (1933), 'తుయి ఆర్ ఆయి' (1934) మొదలైన ముప్పయికి పైగా నవలలూ 'ఇతి' (1932), 'రుద్రేర ఆవిర్భావ' (1934), 'డబుల్ డెకర్' (1938), 'జితన్‌బిబి' (1944)' కాల కదకి రోసిన్' (1946), 'హాడిముచి డామ్' (1948) మొదలైన కథాసంపుటాలూ వ్రాశాడితను. చివరి దినాల్లో వేదాంతం మీద మనస్సు మళ్ళి రామకృష్ణ పరమహంస మతం మీద మంచిదొక గ్రంథం వ్రాశాడు. ఇతని 'వివాహేర చెయెబడో', 'ప్రాచీర ఓ ప్రాంతర' ప్రభుత్వం 1933లో నిషేధించింది.

## హుమాయును కబీరు (జ.1904)

మంత్రి హుమాయును కబీరు బాంగ్లాలో మంచి కవి అని తెలిసినవారు తక్కువ. తండ్రి కబీరు ఉద్దీన్ ఆమేద్. హుమాయును కబీరు కలకత్తా, ఆంధ్ర విశ్వవిద్యాలయాలలో అధ్యాపకుడుగా పనిచేశాడు. 'స్వప్నసాథ' (1927), సాథీ'(1932), ఇమాను యేక కాంట', ధారావాహిక'. 'బాంలార కావ్య మొదలైన గ్రంథాలు వ్రాశాడితను. 'స్వప్నసాథ', 'సాథీ' బాంగ్లాలో మంచి జనాదరణ పొందాయి. తన కవితలు కొన్ని ఇంగ్లీషులో అనువదించి ఇంగ్లాండులో ముద్రించాడు. ప్రకృతిమనోహర దృశ్యం చిత్రించడంలో సిద్ధహస్తుడు. ఇతని 'పద్మా'(నది) కవిత చూడండి:

దూరదేశే తోరె బహుదిన చిను భులె పద్మా మోర,
అబార శాంగనే తోర కూలే కూలే భాంగన లెగె ఛెజోర?
నెమెఛె వర్షా ఘోర.
చరేర చిహ్నధుయె ముఛె దియె
విపుల సలిల సంభార నియె
యౌవన తోర బోయె నియె జాన్ కాహార దోర్?
కే మనో చోర?
పద్మా మోర.
సబుజ మాయాయ భరేఛె దుకూల తటో

పద్మా మోర.
జలేర కినారె ఎసెఛె దుర్వాసవ
తెబు దయా నహీ తోర?
అతిథి శిశురె హాసిన కి కరి?
నిఠుర ప్రహారె ఉఠిఛె శిహాలీ
ఠికరి పడిఛె క్షురధారీ స్రోత నిరంతర
దెఖితె కోమల తబు ఎతొతోర
హియా కఠోర?

(నా పద్మా, దూరదేశాన ఎన్నాళ్ళో మరిచి వున్నావు. తిరిగి శ్రావణం రాగానే నీ వొడ్లు విరిగి పడుతున్నాయి. ఘోరమైన వర్షం దిగి వస్తోంది, పొడి పొడి గురుతులు తుడిచేసి, కడిగేసి, విపులసలిల సంబారం నీయవ్వనం పారించి ఎవరిద్వారానికి తర్లించుకు పోతుంది ? ఎవరే నీ మనసు దొంగిలించారు, నా పద్మా?

ఆకుపచ్చటి మాయ నీ ఉభయ తీరాలు దట్టంగా వున్నాయి. నాపద్మా! నీటి వొడ్డున కొత్తగరిక వచ్చింది. అయినా దయలేదే నీకు! అతిథి పైగా శిశువు ఇలా అనాదరణ తగునే! నీ నిష్ఠుర ప్రహారాలతో అది అనవరతం వొణికి పోతూవుంది. నీక్షుర ధారప్రవాహం నిరంతరం కోస్తూనేవుంది. చూసింది ఇంతకోమలవు, నీహృదయ మింత కఠోరమేమి, నాపద్మా!)

## అన్నదాశంకరరాయి (జ. 1904)

ఒడీశా దేశీయ రాజ్యం ఢెంకానాలలో జన్మించాడితను; ఒడిశాలోనే విద్యాభ్యాసం చేశాడు. బాంగ్లాలోనూ, ఒడియాలోనూ సమానంగా గద్యపద్యాలు వ్రాయగల సమర్థుడు. ఒడియా సబూజ సాహిత్యానమితి ఆధునిక కవులలో కూడా ఇతనికి ప్రత్యేకస్థానముంది. బాంగ్లాలో కావ్యాలూ, కథలూ, నవలలూ, వ్యాసాలూ అనేకం వ్రాశాడు. 'రాఖీ' (1929), 'ఏక్టి వసంత' (1932), 'కాలేర శాసన' (1933), 'కామనా పంచ వింశతి' (1934), 'ఉడ్కి ధానేర ముడ్కి' (1942) 'మూతనరాధ' (1942), మొదలైన కావ్యాలూ, 'తారుణ్య' (1928), 'ఆమ్రా' (1937), 'జీవనశిల్పి' (1941), 'ఇశార' (1943), 'బినరారబయి' (1944), 'జీవన కాఠి' (1949), 'ప్రత్యయ' (1951)

మొదలైన వ్యాససంపుటాలు, 'పథెప్రవాసె' (1931) యాత్రాగ్రంథం, 'యూర పేర చిఠి' (1943) పత్రసంపుటం, 'ప్రకృతి పరిహాస' (1934), 'మనపవన' (1946), 'యౌవన జ్వాల' (1950), 'కామినీ కాంచన' (1954) మొదలైన కథాసంపుటాలు, 'జారజెథాదేశ' (1932), 'అగున్ నియెఖేలా' (1930), 'అసమాపిక' (1931), 'పుతులనియెఖేలా' (1930), 'అజంతా దాస' (1933), 'కలంకవతి' (1934), 'దుఃఖ మోచన' (1936), 'మర్త్యేరస్వర్గ' (1940), 'అపసరస' (1942), సత్యాసత్య' అభాగాలు ((1930-1942), 'నా' (1951), 'కన్య' (1953) 'రత్న ఓ శ్రీమతి' (1955-1956) మొదలైన నవలలు ప్రకటించాడు. తన భార్య లీల (అమెరికా యువతి) తో కలిసి (Bengal Literature) (1942) వ్రాశాడు. ఇతని 'సత్యాసత్య' రెండువేల అయిదు వందల పుటల పెద్ద నవల.

## క్షేమేంద్రనాథ మిత్ర (జ. 1904)

ప్రతిభావంతుడైన కవీ, నవలాకారుడున్నూ ఇతను. అచింత్య కుమారసేను బుద్ధదేవ వసులతో కలిసి నవాభ్యుదయ సాహిత్యసంఘం స్థాపించాడు.

"అమీ కవి జతో కమారేర
అర్ కాంసారిర అర్ ఛుతో రేర
ముచె మిజురేర
ఆమి కవి జతో ఇతరేర"

(నేను కమ్మరుల కవిని. చమారుల, వడ్రంగుల కవిని. కూలీలందరి కవిని) అన్న అభ్యుదయ కవి. ఇతని కవిత్వం గురించి బుద్ధదేవ వసు "క్షేమేంద్రుడి కవిత అతని స్వకీయత మూలంగానే ఉజ్వలమైంది. అతని కవిత లోకంలో చిన్న వస్తువు మొదలు భగవంతుడి దాకా వ్యాపిస్తుంది. చింకి వార్తా పత్రికా, అద్దెకొంపా మొదలు కుని ఆకారం మీద గ్రహనక్షత్రాల దాకా పరిగిడుతుంది. అతని రచనారీతి ఓజశ్శీల మైంది. ప్రగాఢమైన భావాలతో తీక్ష్ణమై గమనిస్తుంది" అనివ్రాశాడు.

క్షేమేంద్ర మిత్ర 'ప్రథమ' (1932), 'సమ్రాట్' (1940), 'ఫెరారీ ఫౌజ్' (1948), 'సాగరథెకె ఫెరా' (1956) మొదలైన కావ్యసంపుటాలూ, కొన్ని పిల్లల కథలూ. 'వృష్టిఎలో' (1954) వ్యాససంపుటమూ వ్రాశాడు.

## ప్రబోధకుమార సన్యాల (జ. 1907)

'కల్లోల' పత్రికలోను, శైలజానంద ప్రభృతులు స్థాపించిన 'కాలీకలమ్' పత్రికలోను చిన్నకథలు వ్రాశాడు. వాటినే తరవాత 'నిశిపద్మ' (1931) అని సంపుటంగా ప్రకటించాడు. 'యజావర' (1928), 'కాజల్లత' (1931), 'కలరవ' (1932) అని నవలలూ, 'మహాప్రస్థానేరపథే' (1933) అని యాత్రాగ్రంథమూ వ్రాశాడు.

## అజితకుమారదత్తు (జ. 1907)

అభ్యుదయ పత్రిక 'ప్రగతి' సంపాదకు డితను ప్రగతి వాది అయినా ప్రేమ కవితకూడా వ్రాశాడు. పురాతన వాసనవుండినా శైలిలో సరికొత్త కవి. 'కుసుమేర మాస' (1930), 'పాతాళకన్య' (1938), 'నష్టచాంద' (1945), 'పునర్నవ' (1947) మొదలైన కావ్యాలూ, 'జనాంతికె' (1949), 'మనపవనేర నావా' (1950) వ్యాస సంపుటాలూ వ్రాశాడితను.

## బుద్ధదేవ వసు (జ. 1908)

నేటి బాంగ్లా రచయితలలో శక్తిశాలి అయిన రచయిత ఇతను. కవిత, కథ, నవల, నాటకం, విమర్శ — అన్నిటా చెయ్యి తిరిగిన రచయిత. నవాభ్యుదయ రచయితల నాయకుడు. 'మర్మవాణి' (1925), 'బందీర వందన' (1930), 'పృథ్వీర పథె' (1903), 'కంకావతి' (1937), 'దమయంతి' (1943), 'ద్రౌపదీరసాఢి' (1948) మొదలైన కావ్య సంపుటాలూ, 'సాదా' (1930), 'అక్రమన్య' (1931), 'ఆమార బంధు' (1933), ధూసరగోధూలి' (1933), 'జెదిన ఫుట్లా కమల' (1933) 'పరస్పర' (1934), ,కాలొహవుయా' (1942) మొదలైన నవలలూ, 'రేఖాచిత్ర' (1931), 'అభినయ అభినయనమ్' (1930), 'ఏరా ఓరా ఏవం ఆరొ అనేకె' (1932), 'ఘరెతె భ్రమెర ఎలొగున్‌గునియె' (1935), 'ఫేరీవాలా' (1940) మొదలైన కథాసంపుటాలూ, 'ఉత్తరతిరిశ' (1945). 'కాలేర పుతుల' (1946), సాహిత్యచర్చ' (1954) మొదలైన వ్యాససంపుటాలూ 'హఠాత్ ఆలోరఝులకాని' (1935), 'అమిచంచలహే' (1936), 'సముద్రతీర' (1937), 'పబ్ పెయెఛిర్ దేశీ' నాలుగు యాత్రాసంపుటాలు మొదలైనవి వ్రాశాడితను.

## మానికవంద్యోపాధ్యాయ (1908–1956)

ప్రగతివాది 'పరిచయ' మొదలైన పత్రికలలో వ్యాసాలు వ్రాశాడు. మంచి నవలా రచయితా, కథకుడున్నూ ఇతను. 'దివారాత్రీరకావ్య' ఇతని మొదటి నవల,

ఇది 'వంగశ్రీ' పత్రికలలో వెలువడి, తరవాత 1935 లో గ్రంథరూపంలో వచ్చింది. ఇదికాక ఇతను 'పుతులా నాచేర ఇతిహాస' (1936), 'జనని' (1935), 'అతసీమామీ' (1935), 'పద్మానదీర మాఝి' (1936), 'ప్రాగైతి హాసిక' (1937), 'మిహి ఓ మోటా కాహిని' (1938), 'సహరతవి' (1940-'41) 'హాలుద్ పడా' (1945), 'చతుష్కోణ (1948), 'సోనారచెయెదామీ' (1951-1952), 'హరఫ్'(1954), హాలుద్‌నదీ 'సబూజవన' (1956) మొదలైనవి వ్రాశాడు.

## విష్ణుదే (జ. 1909)

"నిర్విచారె నరనారీ ఛాత్రఛాత్రీ హత్యా
ఏయి యది హయ్ శిశు రాష్ట్రేర ఆయిన్ నిరాపత్తా
తబె ఆమి సభార మాఝె ఉచ్చకంఠె కహి
పాంచశో హాజార అసంఖ్యవార ఆమిరాజద్రోహీ"

(నిర్విచారంగా నరనారులను, విద్యార్థులను, విద్యార్థినులను హత్య చెయ్యడమే ఈ శిశురాష్ట్రంలో న్యాయమూ, రక్షణా అయితే ఉచ్చకంఠంతో సభలో చెపుతున్నాను. అయిదువందల మార్లు, వెయ్యి మార్లు లెక్క లేనన్ని మార్లు చెపుతున్నాను. నేను రాజద్రోహిని) అని పాడిన అభ్యుదయ కవి ఇతను.

'ఊర్వశీ ఓ ఆర్తయిన్' (1933), 'చోరాబాలి' (1937), 'పూర్వలేఖ' (1941), 'సంద్వీపేరచర' (1947), 'అన్విష్ట' (1950), నామరఖెచి కోమల గాంధార' (1953) మొదలైన కావ్యాలు వ్రాశాడు. దే. ఇతని పద్యాల నడకలో ఇలియట్ ప్రభావం కుంటుతుంది. 'రుచి ఓ ప్రగతి', 'సాహిత్యేర భవిష్యత్' అని రెండు వ్యాస సంపుటాలు కూడా వ్రాశాడితను. ఎలియట్ కవితలు కొన్ని బాంగ్లాలో అనువదించాడు.

## ఆశు చట్టోపాధ్యాయ

గుణదోషాల మాట అటుంచి అత్యాధునికులలో ఉదహరించ దగిన నవకవి ఇతను. ఇతని 'యౌవన ధర్మ' కవిత ఉదాహరణకు :

ఆమరా యౌవన ధర్మే ఏయి వింశో శతకేర తరుణతాపస
బాంచార సాధానా కోరి - శీక్మతొ బాంచా జాకెబలె -

రుఉనేరదాసనఈ, బాంధా పథెకౌభుపథ చలిబౌనా,
ప్రథాకెమానినా మోరా, యదిసెయి ప్రథార పాంచిలె,
మాంధాతార అమలేర సెప్రథార కఠిన పాథరె
మాథాఖుండె మం ఆత్మా అసహాయ, అసహ్యాఘదాయ.

(యౌవనధర్మిన్నేను. ఈ ఇరవయ్యో శతాబ్దతరుణతాపసిని. నిజమైన జీవన మంటే యేదో, అదిగో అలాజీవించాలని ప్రయత్నిస్తాను. 'రొటిన్' దాసుణ్ణి కాన్నేను. బంధనాల దారిలో ఎన్నడూ నడవను. పంథాకి తలవొగ్గను. మాంధాతల కాలం నాటి పాతరాతి గోడల్లో తల పగిలి చచ్చినా సరే.)

ఇంకా ఇలా అంటాడితను :

"యౌవన ధర్మిన్నేను. ఎవరంటారు, మా చేతులతోనే చేసిన ఇనుప యంత్రాలకు మేం బానిసలమని? యంత్రాల ప్రభువులం మేము. సర్వ ప్రపంచ ప్రభువులం. మా ఇష్టం వచ్చినట్టు మేం ధ్వంసం చేస్తాం; మాకు నచ్చినట్టు నిర్మిస్తాం. జీవన పదాలన్నిటిలోనూ అశ్రాంతం విహరిస్తాం. చలిలో, ఎండా వానల్లో మైదానాల అట్టహాసం చేస్తాం."

## సమరసేను (జ. 1916)

అత్యాధునికులలో యువకుడితను. 'కయేక్టి కవితా' (1937), 'గ్రహణ' (1940), 'నానాకథా' (1942), 'తిన్‌పురుష' (1944) మొదలైన కావ్యాలు వ్రాశాడు.

యువ కవులలో మహీఉద్దీన్, మణీంద్రరాయ, అలోకరంజన దాసగుప్త, అరుణకుమార మిత్ర, ధనంజయదాస, అమూల్య చట్టోపాధ్యాయ, బంధనా దాసగుప్త, విమలచంద్రఘోష, సంజయ భట్టాచార్య, సుభాషచంద్రముఖోపాధ్యాయ, నిర్మాల్యవసు, సరోజవంద్యోపాధ్యాయ మొదలైన వారు ఎందరో వున్నారు. పూతికపుల్ల నుంచి స్పుత్నిక్కుదాకా పుల్లాకు నుంచి ప్లూటో దాకా ఏదీ కవితకు అనర్హంకాదు వీరికి. ఇది సాహిత్యం వెర్రితలలు వెయ్యడమంటారు ప్రాచీనులు. కాదు విశ్వరూపమంటారు నవీనులు.

[ఈ రచనలో రచయితకు మణీంద్రమోహన వసు 'బంగాలా సాహిత్య' 1, 2 భాగాలు, సుకుమార సేను 'బాంగ్లా సాహిత్యేర ఇతిహాస' నాలుగు భాగాలు, మోహిత లాలు మజుందారు 'ఆధునికబాంలాసాహిత్య', ఖగేంద్రనాథమిత్ర 'వైష్ణవరససాహిత్య', హుమయూను కబీరు 'బాంలార కావ్య', సుకుమార సేను 'బాంగ్లా గద్య సాహిత్య', మన్మథనాథగుప్త 'బాంగ్లాకే ఆధునికకవి', చండీదాస విద్యాపతుల పదావళులు, రవీంద్ర, నజరులు ఇస్లాము, మధుసూదత్తా మొదలైన వారి గ్రంథాలు ప్రాచీన ఇతరకవులకొన్ని గ్రంథాలు, డా. సుకుమార సేను 'History of Bengal' అన్నదా శంకరలీలారాయల 'Bengali Literature', 'ప్రవాసి', 'పరిచయ' మొదలైన ప్రతికలు, సునీతి కుమార చట్టోపాధ్యాయ మొదలైన వారి వ్యాసాలూ తోడ్పడ్డాయి. ఈ రచయితలకూ, సంపాదకులకూ ఎన్నో సలహాలిచ్చి సాయం చేసిన మిత్రులు శ్రీ అశోక గుహకూ రచయిత కృతజ్ఞుడు.]

పురిపండా అప్పలస్వామి

---

# ఓఢ్ర సాహిత్య చరిత్ర

పండిత పెనుమెత్స సత్యనారాయణరాజు.

# ఓఢ్ర సాహిత్యము

**ఒడియా భాష – పర్యాయ పదములు :**

ఒడియా భాషకు ఓఢ్రము – ఒరియా – ఉత్కలము అను పర్యాయ పదములు కలవు.

**ఓఢ్రము :**

ఓఢ్రులు పరిపాలించుటచే ఈ దేశమునకు ఓఢ్రదేశమను పేరు వచ్చెనని విమర్శకులనుచున్నారు. ఓఢ్రులు, సవరలు అనువారు ఆదిమజాతి వారు. ఈ ఆదివాసులు ఒరిస్సాభూభాగ మందంతటను గలరు. ఓఢ్రుల ముఖ్యవృత్తి వ్యవసాయము. "ఒడిసి" శబ్దమునకు భూమిదున్ని బ్రతుకువాడని వ్యుత్పత్తి. 'ఒడిసి' శబ్దమునుండియే ఓఢో, ఒడిస శబ్దములు ఉద్భవించినవని భాషాతత్త్వవేత్తల భావన. కళింగ కోదుభాషలో ఒడెసి అనగా రాజు అనియు, ఒడి = ఒడిశా అనగా ఆదిమనివాసి అనియు కూడ అర్థములు కలవు. ఎనిమిది–తొమ్మిది శతాబ్దముల నాటికే ఓఢ్రభాష ఉన్నట్లు తార్కాణములు కానవచ్చుచున్నవి.

ఓఢ్ర శబ్దము భరతుని నాట్యశాస్త్రమున వాడబడిన ప్రాచీనమగు ప్రాకృతశబ్దమని ఓఢ్రభాషా ప్రాచీనతను తెల్పువారు వాకొనుచున్నారు.

ఆంధ్రులు నివసించిన దేశము ఆంధ్రదేశమైనట్లు, ఓఢ్రులు నివసించిన దేశము ఓఢ్రదేశమైనది. ఆంధ్రులు తెలుగువారిని జయించినట్లు ఓఢ్రులు సవరలను జయించిరి. సవరలు అడవులపాలయిరి. ఓఢ్రులు పట్టణముల నాక్రమించి నాగరికులైరి.

**ఉత్కళము :**

'ఉత్కళింగము' అనగా మీది కళింగమనియు, తల కళింగము అనగా క్రింది కళింగమనియు, ఉత్కళింగ శబ్దమునుండి ఉత్కళము, తలకళింగ శబ్దమునుండి

తెలుగు అను శబ్దములు, పుట్టెననియు జయపురమహారాజగు శ్రీవిక్రమదేవవర్మగారు నిర్ణయించిరి.

ఒడియా భాషకు లిపి యెప్పుడు పుట్టెనో తెలియవచ్చుట లేదు. ఒకప్పుడు ఆదివాసుల భాషయై ఉండిన ఒడియాభాష ఆర్యుల దండయాత్రచే ఆర్యభాషా కుటుంబమున చేరెను. ఈ భాష సంస్కృతము, పాళి, శౌరసేని, ప్రాకృతము, మాగధి, అస్సామి, బెంగాలీ, తెలుగు, కన్నడము, ద్రావిడము మున్నగు భాషల శబ్దములను గూడ తనలో నిముడ్చుకొని పరిపుష్టమైనది.

దక్షిణమునుండి, పడమరనుండి వచ్చిన దండయాత్రలచే ఒకప్పుడు ఒరిస్సా రాష్ట్రము తన నిజస్వరూపమును కోలుపోయినను నిజభాషా స్వరూపమును మాత్రము కోలుపోలేదు.

ఇంచుమించు మూడువందల యేండ్లు మహమ్మదీయులు ఈఒరిస్సా రాష్ట్రమును పరిపాలించిరి. కాని, వారు నూటికి ఏ యిద్దఱు ముగ్గురో మాత్రమే ఈ రాష్ట్రములో కాలూని యున్నారు. వీరైనను వర్తకము చేసికొని జీవించుటకై కతియవాడ మున్నగు ప్రాంతముల నుండి ఈ మధ్యనేవచ్చి స్థిరపడినవారు మాత్రమే. మహమ్మదీయ భాషా ప్రభావము ఒడియా భాషపై ప్రసరింపలేదు.

ఆర్యభాషలన్నింటిలోను సంస్కృతమునకు మిక్కిలి సన్నిహితమైన భాష ఒడియాభాష. ఒడియా భాషలో నూటికి తొంబది పదములు, సంస్కృత పదములే. చాల సంస్కృత క్రియాపదములు, తద్ధితలు యధాతధముగా ఒడియా భాషలో వాడబడుచున్నవి.

హిందీ, బెంగాలీ భాషలు మాట్లాడువారు రామ శబ్దమును 'రాం' అని పలుకుదురు. ఒడియావారు 'రామ' అనియే పలుకుదురు. కాగా అ కు బదులు ఒ పలుకుట ఒరియా భాషాసాంప్రదాయము. కావున రామాది శబ్దములు ఉచ్చరింపబడునపుడు రామొ, భీమొ, ఒర్జునొ ఇత్యాదిగా ఆయాశబ్దములు వినబడుచుండును.

ఆంధ్రదేశములో సర్కారు జిల్లాలవారు తత్రాపి ఉభయ గోదావరి జిల్లాలవారు తత్సమ పదములను ఎక్కువగా వాడినట్లు ఒరిస్సాలో కటక్ ప్రాంతమువారు తత్సమ పదములను ఎక్కువగా వాడుచుందురు. రాయలసీమ వారి తెలుగులో ఎక్కువగా

దేశీయపదములు వాడబడుచున్నట్లు గంజాం, కోరాపుట్టు జిల్లాలలో నివసించువారు మాట్లాడు ఓఢ్రములో దేశీయ పదములు అధికముగా వాడబడుచున్నవి.

కటక్‌వారు యువతి — — యువకశబ్దములను
జుబతి — — జుబకొ అని ఉచ్చరింతురు.
గంజాం, కోరాపుట్టి
వారు దంగిడి — — దంగడ అని ఉచ్చరింతురు.

తెలుగువైకృత పదములలో 'య' జగా మాఱినట్లే, ఒడియాలోను మాఱును. ఉదా:- యాత్ర - జాత్ర (ఒరియా) జాతర (తెలుగు) దంగిడి, దంగడ శబ్దములు కూడ తరుణీ తరుణశబ్దముల తద్భవములుగా కానవచ్చుచున్నవి. ఇట్టివి పెక్కు శబ్దములు కలవు.

తత్సమములు :

| సంస్కృతము | ఒడియా | అర్థము. |
|---|---|---|
| కదళి | కొదళి | అరటి |
| కుర్కురం | కుర్కుర | కుక్క |
| అశ్రుః | అశ్రు | కన్నీళ్ళు |
| స్వేదః | స్వేద్ | చెమట |
| ఉజ్వలః | ఉజ్వల్ | వెన్నెల |
| తారా | తార | నక్షత్రము |

తద్భవములు :

| సంస్కృతము | ఒడియా | అర్థము. |
|---|---|---|
| కుళత్థః | కొళతొ | ఉలవలు |
| వాలుకా | బల్లి | ఇసుక |
| మృత్తికా | మట్టి | మట్టి |
| తింత్రిణీ | తింతిలి | చింత |
| గల్లః | గాల్ | చెక్కిలి. |

కోనుజానే, బసంతు మున్నగు క్రియాపదములు, 'పార్థక్యరే' మున్నగు తద్ధితలు, కూడ సంస్కృతమను ఒక భాష ఉన్నదని గాని రామ భారత కథలు ఉన్నవని గాని ఎఱుంగని ఆటవికులగు గ్రామీణుల నోళ్లనుండి వెలువడుచున్నప్పుడు సంస్కృతభాషా ప్రభావము భారతదేశములోని వివిధ ప్రాంతములలో మూలమూలలకు ఎట్లు ప్రసరించి నదో అని ఆశ్చర్యచకితుల మగుదుము.

ఒరిస్సాలోని వివిధ ప్రాంతములలో భిన్నభిన్న ఆటవిక జాతులవారు, లిపిలేని వారివారి భాషలను మాటలాడుకొనుచున్నను, వ్యావహారిక భాషమాత్రము వారందఱకు ఓఢ్రమే. 'దయాకణ', 'క్షమాకణ' 'సునొ' (శృణు) మున్నగు వాక్యములు, విను చున్నప్పుడు ఎంతో ఆనందము కలుగుచుండును.

సామాన్య ప్రజలందఱు దేశీయమగు ఓఢ్రభాషను మాటలాడుచుందురు. కొలది మంది నాగరికులు మాత్రము గ్రాంథికమగు ఓఢ్రము మాట్లాడుచుందురు.

**ఒరియా మాటలాడు ప్రాంతములు : ఒరియా వారి ఆచారవ్యవహారములు :**

స్వతంత్ర భారతదేశీయములగు సింధి భాషతో కూడిన పదునైదు భాషలలోను ఒరియా ఒక్కటి. ఈ మధురభాషను సుమారు ఒకకోటి ఏబది లక్షల మంది ఓఢ్రులు మాట్లాడుచున్నారు.

ఒరియాభాష మాతృభాషగా కలవారు ఒరిస్సా భూభాగమునందే గాక, దీని పరి సర రాష్ట్రములలో గూడ కలరు. ఓఢ్రులు మధ్య ప్రదేశములోని తూర్పు జిల్లాల లోను, బీహారులోని దక్షిణ జిల్లాలలోను, బెంగాలులోని నైఋతి భాగమందును, ఆంధ్ర ప్రదేశ్‌లోని ఉత్తరప్రాంతమునందును కలరు. వీరందఱును తమసంప్రదాయాను గుణమైన ఆచారవ్యవహారములను పాటించుచునే ఉన్నారు. కాని ఆయా ప్రాంతముల లోని ఓఢ్రులు ఆయాప్రాంతీయ భాషలతో మిశ్రితమైన ఓఢ్రమును మాటలాడు చున్నారు. సరిహద్దులలోను, దండకారణ్య భూభాగములోను నివసించుచున్న ఓఢ్రులు సరియైన ఓఢ్రము మాట్లాడలేకున్నను, ఓఢ్ర భాగవతములోని పద్యములను, చైత్ర పర్వములోని గేయములను, తన్మయులై మధుర, మధురముగ గానము చేయుచుందురు.

ఒడియా సాహిత్యము గ్రాంథిక కవిత్వమునందు కంటె, చిన్నచిన్న పల్లెలలో, గూడెములలో నివసించు కర్షకులు, వీధి భాగవతులు, కథకులు మొదలగు వారు కుడి

చెవుల చెంత చేతులు చేర్చి ముక్తకంఠములతో గానముచేయు గేయములయందే సజీవమై, మధురమై, అనశ్వరమై నిల్చియున్నది. వెన్నెలలో, ఊడ్పులలో, కలుపుతీతలలో, వరికోతలలో, సంతలలో, పుంతలలో స్త్రీ పురుష లిద్దరేసి ఒక్కొక్క జంటగా నిలిచి ఆశువుగా శృంగారరస ముట్టిపడునట్లుగా చేయుగానమునకు దారినిపోవు వారందఱు తలలూపుచు వినవలసినదే.

ఒక్కొక్కప్పుడు పొలములలో పనిపాటలు తీర్చుకొని, ఇండ్లకు వచ్చు యువతీ యువకులు ఇద్దఱు చెటో చెట్టునకు చేరబడి హావభావములతో.

యువకు : కోటపాడు చిన్నదానా – కోరాచూపులదానా
గబ్బీ గుబ్బల దానా – దబ్బాన రావే – ఓ చిన్నదానా

యువతి : నవ్వూ మోమూవాడా – నాజెంపు వగకాడ
నీవూ తామలపాకు – నేనూ వక్కానౌచు
కలసీ పోతే యెంత – కమ్మాగ ఉండూనో.

యువకు : నీవూ వెన్నెలవైతే – నేనూ చంద్రుడనౌదు
వెన్నెల చంద్రూల విడని – స్నేహంబెంత
మధురము మధురము ఓ చిన్నదాన

యువతి : ఇంద్రావతి చెంత – ఇసుక తిన్నెల మీద
చేయి చేయి కలిపి – షికారు వెడదాము ఓ వన్నెకాడా
షికారు వెడదాము ఓ అందగాడా.

యువకు : ఇప్పసారా తెచ్చి – యిస్తాను రావే
కొప్పునిండాపూలు – కుడతాను రావే

యువతి : ఇప్పసారా కేను – ఒప్పుకుంటానా
కొప్పులోపూలాకే – కులికిపోతానా

యువకు : మోమూ మోమునబెట్టి – ముద్దాడుతానే
అక్కూ అక్కున చేర్చి – హాయిగ ఉందామే

(ఇది ఒరియా గేయమునకు తెలుగు అనువాదము)

అని ఈ రీతిగా అంతు బొంతు లేని సుదీర్ఘమైనపాట పాడుచుండెదరు. వచ్చే పోయే ప్రౌఢాంగనలు వృద్ధులు, జాణలు, ఆ పాటలు వినుచు ముసి ముసి నవ్వులు నవ్వుకొనుచు వెళ్ళుచుందురు.

అట్లు పాడి, పాడి ఆ జంటలు, చెట్టా, పట్టాలు పట్టుకొని, ఏమధువనములోనో, ఏ మామిడి తోటలోనో ప్రవేశింతురు.

ఒరియా ప్రజలు గాన ప్రియులగుట గమనించిన వారైన ఒరియా కవులు పెక్కు మంది సామాన్య జనులు పాడుకొని ఆనందించుటకు అనువైన చైత్ర పర్వాది గేయ ములు వ్రాసి ప్రసిద్ధులైనారు.

నేటి నాగరిక సాహిత్య ప్రభావము ప్రాచీన గేయ సాహిత్యమును త్రోసిపుచ్చ లేదు. గేయ కవితల చేతనే అక్షరాస్యులు కాని లక్షలాది ఓఢ్ర ప్రజలు పురాణ గాథ లను శ్రావ్యముగ పాడుకొనుచు తృప్తిగాంచుచున్నారు. రంగు రంగుల బట్టలు దాల్చి, చంగు చంగున గంతులువేయుచు, 'ఖంగ్' మను కంఠాలతో రాధాకృష్ణ ప్రేమగాథలను గానముచేయు ఓఢ్రుల గేయములు ఓఢ్రము రానివారికి గూడ ఆహ్లాదమును కలిగించు చుండును.

## ప్రజలు - ఆచారవ్యవహారములు :

ఒరిస్సాలో బ్రాహ్మణ క్షత్రియాది నాల్గు వర్ణముల వారే కాక వృత్తిని బట్టి యేర్పడిన జాతుల వారు కూడ కలరు. రణము ఒనర్చిన జాతి 'రణా' కత్తి పట్టిన జాతి 'ఖడ్గాయతీ' భూమిదున్ను జాతి 'భూమ్యా' మొదలగు జాతులు పెక్కులు కలవు.

ఒరిస్సాలోని ప్రజలు నూటికి తొంబది మంది పైగా వ్యవసాయమే, జీవన ముగా కలవారు. వారి ఆహార విహారములన్నియు చాల సామాన్యములైనవి. ఇప్పటి కిని పల్లె పట్టులు రమణీయములై భారతీయమగు ఒరిస్సా సంస్కృతిని మన కనులకు కట్టుచుండును. ప్రతి పల్లెలోను చిప్ప తట్టులు లేని చిన్న చిన్న పూరిండ్లు ఉండును. అవి రంగు రంగుల మట్టితో చిత్రముగా అలంకరింపబడి ఉండును. ప్రతి ఇంటి పెరటి లోను ఒక వెదురు పొద, ఒక చింతచెట్టు, ఒక రేగుచెట్టు, జొన్న, మొక్కజొన్న, చిక్కుడు, వంగ మొక్కలు, పూల మొక్కలు తులసికోట మొదలగునవి కనుల పండుగ చేయుచుండును. ఇంటి ముంగిట కొందఱకు చిన్న మొగసాల, అందొక వేదిక

ఉండును. అదియే పెద్దలను ఆహ్వానించి స్వాగతమిచ్చు వేదిక భాగవతమందిరమును. ప్రతి ఇంటికిచేరి ఒక పసులకొట్టముండును. దానికి ఇంటికిచేరి దంపుళ్ళగదియుండును. ప్రతిస్త్రీ 'ఢిక్కి' అను దంపుడు గొయ్యపై కాలుమోపి వడ్లుదంచును. స్త్రీపురుషులందఱు ఎవరి బట్టలను వారే ఉతికి కొందురు. పురుషులు ఎవరికి వారే క్షురకర్మ చేసికొందురు. ఇండ్లు కట్టుకొనుట, కలప చెక్కుకొనుట, నాగళ్ళు, బండ్లు తయారుచేసికొనుట మొద లగు పనులన్నియు ప్రతి రైతు నేర్చియుండును. నూలువడకుట, బట్టలు నేయుట బుట్టలు అల్లుట మొదలగు పనులు కూడ చేయుట వారికి అలవాటు.

ఒకప్పుడు జయపురము నేలిన సర్ విక్రమ దేవవర్మ తన దివాను అగు పూళ్ళ వెంకన్న పంతులను "మనప్రజలు ఎట్లున్నారు, సుఖముగా ఉన్నారుగదా" అని ప్రశ్నించె నట. అది విని వెంకన్న పంతులు "చిత్తము ! మహాప్రభో ! మన ప్రజలు, ఇంటింట మంగలి, ఇంటింట చాకలి, ఇంటింట సాలె, ఇంటింట వడ్రంగి కలిగి హాయిగా ఉన్నారు" అని జవాబు ఇచ్చెనట. కొన్నాళ్ళుపోయిన పిమ్మట మహారాజు ఒకనాడు దివానుతోకలసి జయపూరు చెంతనున్న ఒక పల్లెకు పోయిచూచెనట. ప్రజలు చిన్న చిన్న ఇండ్లలో నివసించుచు, మోకాళ్లు దిగని బట్టలు ధరించి అన్ని పనులు తమకు తామే చేసికొనుచుండుట కాంచి ఆశ్చర్య చకితుడై దివానుతో, ఏమి, పంతులుగారూ మన ప్రజలు భాగ్యవంతులని చెప్పినారే ఇదేమిటి యిట్లున్నారు"? అని ప్రశ్నించెనట. అది విని దివాను "చిత్తము ! ఎవరి పనులను వారే స్వయముగా చేసికొనుటలోనే ఆనందమున్నది. మన ప్రజలు అన్ని పనులలోను నేర్పరులు. ఏ పనికి ఇతరులపై ఆధారపడరు". అని సమాధానమిచ్చెనట. దివాను చమత్కారమునకు మహారాజు సంత సించెనట, నేటికి ఒరిస్సాలోని వ్యవసాయమే జీవనముగా గల ప్రజలందఱు స్వయం కృషితోనే జీవించుచున్నారు. అన్ని వర్ణముల వారు మాంసాహారులు, మత్స్యభుక్కులు; చింతకాయ, మామిడికాయ మున్నగు ఫలములను, ధాన్యాదులను 'క్రొత్తలు' అను పండుగ చేసికొని గాని భుజింపరు. పుట్టకొక్కులు, తంటిప ఆకులు, గుమ్మడి తీగలు, పూవులు, వెదురు బోడులు, ఎట్టిచీమలు (పుల్లిచీమలు) మొదలగు వానిని అన్నింటిని వారు కూరలుగా చేసికొందురు. సంతలలో వ్యాపారము చేయువారందరు స్త్రీలే. ద్విజాతులుగాని స్త్రీలలో మాఱుమనువు కలదు. మాఱుమనువుచేసికొను స్త్రీ మొదటి భర్తవల్ల కలిగిన సంతానమును వానికే విడచిపెట్టి కొత్తమగనిని చేరును.

ఆంధ్ర స్త్రీలకు శ్రావణ శుక్రవారమువలె ఉత్కళ స్త్రీలకు మార్గశిర లక్ష్మీవార ములు లక్ష్మీ ప్రదములు. లక్ష్మీపూజలుచేసికొని, నవకాయ పిండివంటలు లక్ష్మీదేవికి

నైవేద్యముంచి ఆ నైవేద్యము బంధు మిత్రులకు పంపుచుందురు. హోలి వారికి పెద్ద పండుగ. నాడు వసంతాలలో మునిగి తేలుదురు. మన పెద్ద పండుగ యగు సంక్రాంతి వారికి పెద్ద పండుగ కాదు. తాంబూల చర్వణము అగ్రవర్ణముల వారిలో అధికము. కూలినాలి జనము పొగాకు విస్తారముగా నమలుచుందురు. స్త్రీ పురుషులందరు చలి కాలములో గూడ చన్నీళ్ళ స్నానము చేయకుండ భోజనము చేయరు. ఎంత పేదవాని ఇంటికేగినను భారతీయ సంస్కృతి కన్నుల గట్టుచుండును. అతిథి పూజ అపారము. వారికి పూర్ణిమ నుండి పూర్ణిమకు నెల పూర్తియగును. మన కృష్ణ పక్షపు పాడ్యమితో వారికి నెలారంభమని యెఱుంగునది.

నిత్యసంతుష్టులు, చైత్ర పర్వాదిగీతానురక్తులు అగు ఒరిస్సా ప్రజల దైనందిన జీవిత విధానములతో ఒరిస్సా సాహిత్యము పెనవైచుకొని పెంపొందినది.

ఉత్కళ కవులు జమీందారులయు, మహారాజులయు, ధనవంతులయు, కేవల పండితులయు, మెప్పునకై గాక, సామాన్య ప్రజానీకము యొక్క క్షేమమునకై తమ సాహిత్యమును సర్వతోముఖముగా సాగించి ప్రజల మన్ననలకు పాత్రులైరి. కావుననే ఉత్కళ సాహిత్యము, సజీవమై భాసిల్లుచున్నది.

ఒడియా భాష - విశిష్టత :

ఒరిస్సా రాష్ట్రము 1-4-1936 లో ఏర్పడినది. అప్పటికి ఒరిస్సా ప్రజలు, మద్రాసు, మధ్యప్రదేశము, బీహారు, బెంగాలు రాష్ట్రములవారి ఒత్తుడులచే సతమతమగుచున్నారు. ఈ నాలుగు రాష్ట్రములవారు ఓఢ్రుల వాఙ్మయమును, జాతీయతను, సంస్కృతిని పైకితీసికొనివచ్చుటకు, తగిన ఉత్సాహప్రోత్సాహములను చూపలేదు. సొంతరాష్ట్రములేనివారికి స్వయంప్రకాశ మెట్లు కల్గును? పైపెచ్చు బెంగాలీవారు వంగభాషను ఒరిస్సాలో ప్రవేశపెట్టి, ఓఢ్రభాషా వికాసమును అణచిపెట్టుటకు కూడ యత్నించిరి. కాని వారి యత్నములు సఫలత కాంచలేదు. ఎందఱెన్ని విధముల అణచిపెట్ట యత్నించినను, ఓఢ్ర భాష అణగారుటకు బదులు వికాసముచెంది సజీవమై నిలిచి, పొలుచుటకు దాని విశిష్టతయే కారణము. ఓఢ్ర భాష ప్రాచీనమైనదియే గాక భారతీయ భాషలలో దేనికిని తీసిపోని విశిష్టత గలది.

ఒరియా భాష పరిపూర్ణత పొందునాటికి వంగభాష పుట్టనేలేదని కొందఱి మతము.

ఉపేంద్రభంజ్ కాలమునుండి నేటివరకు (ఓఢ్ర భాష) ఉత్కళ సాహిత్యము అవిచ్ఛిన్నముగా పెంపొందుచునే యున్నది. పదునాల్గవ శతాబ్దినాటికే ఓఢ్ర సాహిత్యము పరిపూర్ణత చెందినది.

ఒరిస్సా రాష్ట్రమునకు ఒక పైపున సముద్రము, మూడువైపుల సాంద్రారణ్య సంశోభితములగు పర్వతరాజములు కలవు. ఆంధ్ర ప్రదేశము ఒరిస్సా రాష్ట్రమునకు దక్షిణముగా ఉన్నది. ఇచ్చట తెలుగుభాష విజయనగరరాజులచేతను, చాళుక్యుల చేతను, రెడ్డిరాజుల చేతను, చిన్నచిన్న జమీందారులు సేనానాయకులు మున్నగువారి చేతను పోషింపబడినది. తెలుగు కవులు అనేకులు తమతమ కావ్యములను ఆయా రాజుల కంకితము చేసిరి.

పూర్వకాలములో ఒడియా కవులను ఏ మహారాజు పోషించినట్లు కానము. ఏ ఒరియా కవి తన కావ్యమును ఏ మహారాజునకు అంకితము చేసినట్లుకూడ కనుపించదు.

## మతములు - వ్యాప్తి :

యావద్భారత దేశమందు వలెనె ఒరిస్సాలో కూడ ఒకప్పుడు బౌద్ధమతము వ్యాపించినది. ఒరిస్సా భూభాగమంతటను నేటికిని బుద్ధ విగ్రహములు కాన్పించు చుండును. బౌద్ధ గాథలు ఒడియా భాషలో సకృత్తుగా లభించుచునే యున్నవి. పదుమూడవ శతాబ్దములో వ్రాయబడిన ఒరియాశాసనములు పెక్కులు దేవాలయకుడ్య భాగములపైని కాన్పించుచునే యున్నవి. అశోకుడు కళింగదేశమును జయించిన పిమ్మట ఒరిస్సా రాష్ట్రమంతటను బౌద్ధమతము వ్యాప్తి చెందెను. కొంత కాలము కడచిన పిమ్మట శైవమతమును, దానికి పిమ్మట వైష్ణవమతమును వ్యాప్తిలోనికి వచ్చెను. నేడు ఒరిస్సాలో రామ కృష్ణుల భక్తులే అత్యధిక సంఖ్యాకులు కలరు. కావుననే యిచ్చటి వాఙ్మయము చాల భాగము వైష్ణవమత ప్రబోధాత్మకమై పెంపొందినది.

## సాహిత్యయుగములు :

1. పురాణయుగము
2. కావ్యయుగము
3. నవీనయుగము

అని ఒడియా సాహిత్యమును మూడు విధములుగ విభజింపవచ్చును.

పురాణయుగము ;

పదునాలుగవ శతాబ్దము వఱకు ఒరియాభాషలో చెప్పదగిన మార్పేమియు రాలేదు.

1550_1700 లలో

1. సరళదాసు — భారతమును
2. బలరామదాసు — రామాయణమును
3. జగన్నాథదాసు — భాగవతమును

రచించిరి.

సరళాదాసు :

పూరీ వద్ద నున్న ఒక పల్లెటూరిలో 'సిద్ధేశ్వరి పిరిడియా' అను నొక రైతు కలడు. అతడు జాతిచే శూద్రుడు. సంఘములో అంతగా గౌరవ ప్రతిష్ఠలులేని కుటుంబమున వాడు దరిద్రుడు. భూమి దున్నుకొని కాయకష్టము చేసి జీవించెడు వాడు. ఏపూటకాపూట ఏపాట గడచునను దారిద్ర్యబాధ అతనిని వెంటాడి పీడించు చుండెడిది. అతడు సరళాదేవియను గ్రామదేవతను నిరంతర భక్తితో కొలుచుచుండెడి వాడు. ఏ గురువునొద్దను చదువుకొన్నవాడు కాడు. తీరిక కలిగినప్పుడెల్ల పండితుల సన్నిధికి చేరి వారు చెప్పు భారత గాథలను వినుచుండెడివాడు. విబుధజనుల వలన విన్నంత కన్నంత తనదిగా చేసికొని సరళాదేవీ కటాక్షమును ఊతగా తీసికొని ఒరియా భారతము వ్రాయ సమకట్టెను.

సిద్ధేశ్వరునకు ఒరియా భాషలో పాండిత్యము లేదు. సంస్కృతమురాదు. భారతము చదువలేదు. అంతా శ్రుత పాండిత్యము. అయిన నేమి ? అతడు ఒరియా భారత కర్త.

సరళాదేవీ కటాక్ష వీక్షణములకు పాత్రుడై అతడు భారతము వ్రాయుటచే ప్రజలు ఆతనిని సరళాదాసు అని పిలిచెడువారు.

అష్టాదశ పర్వ సంశోభితమగు సంస్కృత భారతము సంగతియే ఆతడు ఎఱుగడు. అంతా సొంత కవిత్వమే. సార్వజనీనమగు సరళాతి సరళ మధురభాషలో అతడు ఒరియా భారతము వ్రాసి గానము చేసెను.

ఒరిస్సాలోని ప్రతి సామాన్య పౌరుని జిహ్వాగ్రముపైని సరళ భారతము నాట్యము చేసినది, చేయుచున్నది, చేయగలదు.

ఈ భారతము ఆనాటి ఒరియా ప్రజల సాంఘిక రాజకీయ ఆర్థిక విషయముల కును మానసిక దైహిక దైవికాది విషయములకును ప్రతిబింబమై వెలయుచున్నది. కావుననే అది ఒరియా ప్రజలకు జాతీయ గ్రంథమైనది.

నేటికి, ఏనాటికి అది అనశ్వరమైన మహాకావ్యమని ఉత్కళుల విశ్వాసము.

సంస్కృత భారతమునకును, ఒరియా భారతమునకును ఏ విషయములోను ఏ మాత్రమును పోలిక లేదు. కథలో మార్పు. వర్ణనములలో మార్పు. అంతయు నిత్యనూతనము. సామాన్యప్రజలకై అది వ్రాయబడినది. సామాన్య ప్రజలను ఉద్ధరించుటయే తన కర్తవ్యమని, ధర్మమని సరళాదాసు తలంచెను. సామాన్య ప్రజలకు నీతి, ధర్మము, హితము బోధించు కావ్యముగా, తన భారతమును ప్రజాభాషలో రచించి దానిని పంచమ వేదము గావించెను. ఒరియా ప్రజలకు ఇంత ప్రియతమమైన భారతము మఱొకటి లేదు. ఇతని కాలములో కొందఱు పండితులు భారతమును యథాతథముగ ఒరియా భాషలోనికి అనువదించిరి. కాని ఏమి లాభము : అవి ప్రజాదరణమును పొందలేదు.

సరళాదాసు భారతము మూలానుసారి కాకపోయినను సరళమగుభాష, భావములు, శైలి, శయ్య, సున్నితమగు హాస్యము, మాధుర్యము కలది యగుటచే దీనినే పండిత పామరులందఱు పఠించుచున్నారు. పండితులు వ్రాసిన భారతమును ఎవ్వరును పఠింపక దీనినే అందఱు పఠించుచుండుటకు కారణము దీని సరళభావ భాసితమాధుర్యమే యనుట పునరుక్తికాదు. ఈ భారతము వంగ భాషలోనికి కూడ అనువదింపబడినది.

ఇతడు విలంకరామాయణము విచిత్రరామాయణములను కూడ రచించెను. ఈ రెండు కావ్యములు అతనికి భారతము తెచ్చిన కీర్తిని తేలేదు. ఇతని విచిత్ర రామాయణము డొంకాడ సీతారామ కవిచే ఆంధ్రీకరింప బడినది.

విలంక రామాయణములో సహస్రశీర్షుడగు మహీ (మై) రావణుడు సృష్టింపబడెను. ఇతడు రావణుని బంధువు. శక్తి స్వరూపిణియగు సీతాదేవి మహీరావణుని సంహరించెను.

చండీపురాణము-అను మఱియొక కావ్యము కూడ ఈతడు విరచించెను. ఈ కావ్యములో కూడ స్త్రీ శక్తిస్వరూపిణియని నిరూపించెను.

సరళాదాసు కాలమును స్వర్ణయుగమనియు-సరళాదాసు ఉత్కల వ్యాసుడనియు ఓఢ్రులు ప్రశంసించుచుందురు.

శూద్రొ ముని శారొళదాసొంకొ కృతొ సచిత్రొ మహాభారతొ బిరాటపొర్బొ.

ఉరియా : శొకుని బోఇలె ఆహో శుణొ ధృతొ రాష్ట్రొ
ఎబె ఆసి జ్ఞానొ తోరొ హో ఇలాఇ భ్రొష్టొ
సొకొళొ బ్యాధిమానొంకు ఒచి మొహొ షొధి
ప్రొకృతి ఒన్తొ నొరె నొహు కిఛి బుధి
కి ఎంఇ బిధాత హొరి నెతా తోరొ చొఖ్యొ
తొహొరొ ప్రొయోజొనొకు ఎసొనొతు దెఖు
ఒంధొ నొయొనొ జాహరొ పొంగుఒబెపాదె
పిఠిరె బొహిఛి కుజొ దొంన్తొ బొక్తొ హోదె
ఆజొనొముం బొధిరొ జే అబొరొ కుబొజా
కెఛె శుభొ నోహి మానె లొగ్నొబొంజె.

తెలుఁగు : వినుపించు శకునితా విను ధృతరాష్ట్ర!
ఇప్పుడు నీజ్ఞాన మెల్లయు 'భ్రష్టు'
అన్ని వ్యాధులకుండె నవని నౌషధము
నరుప్రకృతికే లేద అరయ నౌషధము
ఏల విధాత నీ దృష్టు హరించె
తత్ప్రియోజనముకై తగనీవు కాంచు
కానగా రానట్టి ఘనమైన కళ్ళు
అడుగై నయిడలేని యట్టియా కాళ్ళు
వీపుపై మోసిన పెద్దదౌ గూను
గొగ్గియౌపళ్ళులో గొనువదనమును

ఆజన్మ బధిరత్వమంతియే కాక
ఇంద్రియ విశృతియు ఎనగునెందాక
అందాక ఎప్పుడు అందదు శుభము
లగ్నభంగకరులురా వీరు నిజము.

ఒరియా కవిత్వమంతటను అంత్యాను ప్రాసము పాటింపబడును.

బలరామదాసు - రామాయణము :

సరళాదాసు భారత రచనానంతరము ఒడియాభాషలో వెలువడిన మహాకావ్యము రామాయణము. దీని కర్త బలరామదాసు. ఈతడు కూడ ఒరిస్సా ప్రజల ఆచార వ్యవహారములను పూర్తిగా తన రచనలో ప్రతిబింబింప జేసెను.

ఈతడు తన ఉత్కళాభిమానమునకు రామభక్తికి చిహ్నముగా ఉత్కళులు రామునితోపాటు దండకారణ్యమున కేగి రామచంద్రమూర్తిని సేవించి సాహాయ్య పడినట్లు తన రామాయణమున చిత్రించెను.

సంస్కృత భాషలో కల మంత్ర తంత్రములన్నియు పండితులైన బ్రాహ్మణు లకే కాని, సామాన్య జనులకు తెలియనివయ్యెను. ఆ మంత్ర తంత్రాదుల సత్యము లను, రహస్యములను ప్రజలు తెలిసికొనుటకు అనువైన సులభశైలిలో వాడుక భాషలో తేట తెల్లముగా వ్రాసెను. అంతేకాక సంహితలు, గీతలు, పురాణములు మొదలగు పదునాలుగ్రంథములను ఈతడు వ్రాసెను. ఈతని సాహిత్యసేవచే మూల మూలల నున్న ప్రజలు కూడ మత రహస్యములను తెలిసికొన గలిగిరి. ఈతని లక్ష్మీ పురాణము హరిజనులను ఉద్ధరించుటకై వ్రాయబడిన కల్పిత కావ్యము.

ఉరియా : స్త్రీరింకి బిశ్వాసొ కెబె నొజిబొ సొంసారె
స్త్రీరిసినా సుఖొదాని ఒటొన్తి బె భారె
స్త్రీరి కుటుంబొ శ్రీ జె ఒటోయి సాధొచి
స్త్రీరిసె పురుషొంకొరొ ఒటోయి బొంధొచి
స్త్రీరినొ థిల్లె పురుషమానె నొశో భొంతి
స్త్రీరి ఎ సొంసారె ఆడు జాతొజె కొరొంతి

స్త్రిరిహి సెధొర్మొ జాణొ స్త్రీ హి సెకర్మొ
స్త్రిరి సినా ఎ సొంసారె ఆది జొన్మొ బ్రొహ్మొ.

తెలుఁగు : స్త్రీకి సంసారాన చెడదు నమ్మకము
స్త్రీసుఖదాయిని ప్రియరతి సతము
స్త్రీ పురుషునకు కూర్చెడు బంధుజనము
స్త్రీ కుటుంబము విస్తరించెడు ధనము
స్త్రీలేని పురుషులు శ్రీచెందరెందు
స్త్రీవల్లనే పుట్టు చేటొందు నిందు
స్త్రీధర్మకర్మముల్ చెందించు మగని
స్త్రీ నాదినే బ్రహ్మ సృష్టించె భువిని.

జగన్నాథదాసు – భాగవతము :

జగన్నాథదాసు ఒరియా సాహిత్యయుగ ప్రముఖుడు. సంపన్నకులీన బ్రాహ్మణ కుటుంబమున జన్మించిన మహాపండితుడు.

ఇతడు సదాచార సంపన్న కుటుంబమున జన్మించిన వాడయ్యెను, బాల్యదశ నుండియు తన జీవితమును మానవ సేవకు మాధవసేవకు అంకితము చేయ నిశ్చయించు కొనెను.

భాగ్యవంతులగు బంధుజనులు వలదని వారించినను ఇతడు పూనికను విడనాడక భాగవతమును సులభతరమైన శైలిలో వ్రాసి ప్రజాదరణమునకు పాత్రుడయ్యెను. మన పోతన భాగవతము కంటె కూడ ఈతని ఒరియా భాగవతము విశ్వజనీనమైనది. పోతన భాగవతములో ప్రతి పద్యము గీతిగుణము కలిగి శ్రుతిలయ తాళానుగుణముగా ఉన్నట్లు జగన్నాథదాసు భాగవత గీతములు అన్నియు శ్రుతిలయతాళాను గుణములై యున్నవి. జగన్నాథదాసు తల్లిచదువుకొన్నది కాదు. ఒకనాడామె కవియగు తన కుమారుని పిలిచి 'నాయనా! కృష్ణలీలలు వర్ణించి గానము చేయుమని కోరెను. కన్నతల్లి ఉల్లము పల్లవింపజేయుటకై అతడు కృష్ణలీలలు కన్నులకు కట్టినట్లు వర్ణించి గానము చేసెను.

పూర్వులగు లాక్షణికుల ఛందస్సును ఆశ్రయింపక, రొమ్మిది అక్షరములుగల ఛందస్సును సృష్టించి, భాగవతమును గాన యోగ్యముగా రచించెను.

మన అన్నమాచార్యులు తన కీర్తనలు శ్రీవేంకటేశ్వరస్వామివారి సన్నిధిని గానముచేసినట్లు జగన్నాధదాసు తన భాగవత గేయములను పూరిలోని జగన్నాధస్వామి వారి ఆలయ ప్రాంగణమునగల వటవృక్షచ్ఛాయను కూర్చుండి గానము చేసెను. ప్రజలు తండోపతండములుగా పూరికి వచ్చి జగన్నాధదాసు రచించిన భాగవత గేయములను అతడు గానము చేయుచుండగా ఆలించి తనిసి వానిని వ్రాసికొని కంఠస్థము గావించుకొని గానము చేయదొడగిరి.

గ్రామ పురోహితులు సాయంసంధ్యల వేళల ఊరనూరను ఈ భాగవత గేయములను గానము చేయుచుండగా ప్రజలు భక్తిపూరితులై విని ఆనందించెడివారు. ఆ రోజులలోనే ప్రతిగ్రామములోను ప్రజలు భాగవత మందిరములను భాగవత విహార ములను నెలకొల్పిరి. అందు జగన్నాధ భాగవతము వ్యాసపీఠముపై ఉంచి పూజింప బడుచుండును. ఈ భాగవత మందిరములె పాఠశాలలుగా ప్రజాసమావేశ స్థలములుగా ఉపన్యాస వేదికలుగా పాఠాగారములుగా విలసిల్లినవి. పల్లెలలోను పట్టణములలోను నలుగురు రసజ్ఞులు కలిసినజాలు జగన్నాథదాసు భాగవతములోని గేయములు గానము చేయవలసినదే.

ఈ మహాకవి కాలమున నిర్మలదాసు, నందదాసు, యశోవంతదాసు, కృష్ణదాసు, రామదాసు మొదలగు వారెందరో పరమభాగవతోత్తములు అవతరించి భాగవత గేయములను గానము చేసిరి. సాలబేగు అను మహమ్మదీయుడు ఈ భాగవతమును గానముచేసి వైష్ణవు డయ్యెను.

పిమ్మట కొంత కాలమునకు ఒరిస్సారాష్ట్రమును, మొగలులు మహారాష్ట్రిలో జయించి పరిపాలించిరి. ఈ దండయాత్రలకు గుఱియై ఓఢ్ర దేశము తన స్వత్వమును కోలుపోయెను. అప్పుడు దేశమంతయు కఱవు కాటకములకు నిలయమాయెను. ప్రజలు అన్నవస్త్రములకు మొగమువాచిరి.

ఆ రోజులలో ఒరిస్సా రాష్ట్రములోని కొన్ని భూభాగములు పరిసర రాష్ట్రము లలో విలీనములయ్యెను. ఆ యా ప్రదేశములయందు స్థిరపడిపోయిన ఉత్కళ ప్రజలు తమకు ప్రాణప్రదమైన జగన్నాథదాస భాగవతమును అత్యంత ప్రీతితో గానము చేయుచు తమ మాతృభాషానురక్తిని నిలుపుకొనిరి. పిన్నలు పెద్దలు, పండితులు

పామరులు, పేదలు భాగ్యవంతులు అందఱుకూడ జగన్నాథదాసు భాగవతగేయములు నిరంతర మట్లు గానము చేయుటకు కారణము జగన్నాథదాసు కవితా మాధుర్యమే.

ఓఢ్రులకు దైవభక్తి, స్వభాషాను రక్తి, జాతీయతా సక్తి, ఆస్తిక్య భావాను రక్తి జగన్నాథదాసు భాగవతము మూలముననే కలిగెననుటలో అతిశయోక్తి లేదు,

ఓఢ్రులు నేటికిని తమ అంతరాత్మలకు శాంతిని, దాంతిని తుష్టిని, పుష్టిని ఈ భాగవత మందిరములందే పొందుచుందురు.

## జగన్నాథదాసు - భాగవతము

గోపికా ఉచూః

గోపికా వాచః

ఒరియా : అంభొరొ మనో బాంఛా జెతె
సొంకొల్పొ నిత్యో హృదొగొతె
సెసొర్బొ కృష్ణొ పాదె ధా ఉ
తానామొ ధొరి దినొ జా ఉ
అంభొ చైతొన్యొతాంకొపాదె
నిరతెధా ఉ ఒ ప్రమాదె
అంభొరె కొర్మొమార్గె భ్రొమి
పుటి వో ఇటాం పొధొ ద్రొమి
ఈశ్వర మాయాభ్రాతె పొఢి
జొన్మొమొరొణొపాధొ హుఢి
శుధొ బిబెకొ జ్ఞా నొ భెదె
గొతిసా ఇబుం కృష్ణొపాదె

తెలుఁగు : నామనో వాంఛలవి యెన్నొ
నా మది సంకల్పాల వెన్నొ
అన్ని కృష్ణాంఘ్రుల నుండుత

తన్నామాప్తిరోజుల్ వెళ్ళుత
మా చైతన్యం వాని పాదాల
పరాకు లేకుండు నే వేళ
మేమెు కర్మదారి భ్రమించి
పుట్టి జీవింతుము శ్రమించి
ఈశుమాయాక్షేత్రానపడి
పుట్టి గిట్టు చెగిరిపడి
శుద్ధవివేక జ్ఞానాప్తిని
కందుమజుపాద గతిని.

## మధ్యయుగము

ఒరియా సాహిత్య మధ్యయుగమును మన తెలుగు సాహిత్య ప్రబంధయుగముతో పోల్చవచ్చును. ఈ మధ్యయుగమును సాహితీరంగమున శృంగారము అలంకారములు వృద్ధిపొందిన కాలముగా భావించవచ్చును.

దాస కవిత్రయము కాలమునకు పిమ్మట పదోనాలవ శతాబ్దములో ఒరియా సారస్వతము బాగుగా వికసించినది.

### చైతన్య జయదేవుల ప్రభావము :

పదునాలుగవ శతాబ్దము మధ్యలో వంగదేశపు సన్యాసియగు చైతన్యుడు వంగదేశములో మహమ్మదీయులు పెట్టుబాధలు సహింపలేక, ఉత్కళ దేశమునకు యాత్రార్థియై వచ్చి పూరీ జగన్నాధములో స్థిరావాసము నేర్పఱచుకొనెను.

ఆ సమయములో ఎందఱెందఱో సన్యాసులు పూరికి వచ్చి చైతన్యుని సేవించుచుండెడివారు. చైతన్యుడు తన్ను దర్శింపవచ్చిన భక్తులందఱికి దాస కవిత్రయము వారు ప్రబోధించిన భక్తిభావములతో ఏకీభవించి తాను భక్తి ప్రబోధమును కావించుచు యోగాభ్యాసముచే దైవమును దర్శింప వచ్చునని ప్రబోధించెను.

ఆ ప్రబోధ ప్రభావముచే పెక్కుమంది ఉద్యోగులు ఉద్యోగములు త్యజించియు, ప్రజలు తమ దైనందిన కార్యకలాపములను కట్టిపెట్టియు చైతన్యుని చరణసన్నిధిని

చేరి తమ్ముగోపికలుగాను, చైతన్యుని శ్రీకృష్ణునిగాను భావించి పూజించి నృత్యగానము లలో మునిగి తేలసాగిరి.

గజపతి యను ఒరిస్సా చక్రవర్తి చైతన్యుని శిష్యుడై తన రాజ్యమునే కోలు పోయెను. దానితో ఏడవశతాబ్దమునుండి ఏకచ్ఛత్రాధిపత్యము వహించియున్న ఒరిస్సా సామ్రాజ్యము అంతరించినది. మహమ్మదీయుల దండయాత్రలకు గురియైనది. ఉత్కలదేశము నానాటికి తీసికట్టు నాగంబొట్టుగా మాఱిపోయెను.

ఈ చైతన్యమతము రాధా ప్రేమగా రూపొంది ఓఢ్రుల పౌరుష ప్రతాపములను రూపుమాపి ఓఢ్రజాతిని నిర్వీర్యజాతిగా చేసివేసినదని స్వామివివేకానందులు వచించిరి.

ఈ కాలములోనే జయదేవుని గీతగోవిందము ఒరిస్సా ప్రజలను మఱింత అధ్వాన స్థితికి తీసికొని పోయెను.

పూరీలో జగన్నాధస్వామివారి సన్నిధిలో గీతగోవిందమును ప్రతినిత్యము నృత్య గానము చేయవలసినదిగా గజపతిరాజు శాసించెను. నేటికిని జగన్నాధస్వామి సన్నిధిని గీప గోవిందము గానము చేయబడుచునేయున్నది. భక్తులు ఈ గానమును ఆలించుచు భక్తిపారవశ్యమున బాహ్యప్రపంచమునే మఱచి పోవుచుందురు.

దాస కవిత్రయ కాలమున ఒరియా సాహిత్య మెంత మహోన్నత దశను అందుకొన్నదో చైతన్య జయదేవుల కాలములో అంతక్షీణదశకు వచ్చెనని ఉత్కల సాహిత్యవేత్తలు తలంచుచున్నారు.

ఈ కాలమున పురుషులు విలాస పురుషులగుటచేతను స్త్రీలు విలాసవతులై అసూర్యం పశ్యలగుటచేతను ఒరియా ప్రజలలో సోమరితనము పెచ్చు పెరిగిపోయెను. దీనిచే ఒరిస్సా రాష్ట్రము తన రాజకీయ స్వాతంత్ర్యమును కోలుపోయెను. దేశము భిన్నాభిన్నమై చిన్న చిన్న ఖండములుగా మాఱిపోయెను. దీని కంతటికి కారణము ఈ మధ్యయుగములో రేకెత్తిన చైతన్యమత ప్రభావమని సాహిత్య చరిత్రజ్ఞుల నమ్మకము. చైతన్యునికి ఏబదియేండ్లకు ముందే ఆంధ్రదేశమున పోతన జన్మించి వైష్ణవ గీతము లను భాగవత మూలమున ఆంధ్రులకు ప్రసాదించెను. భాగవత పద్యగీతములచే ఆంధ్ర సాహిత్యమున కెట్టి హానియు కలుగలేదు. పోతన కవితచే ఆంధ్రసాహిత్యము తెలుగు వారికి నిత్యపారాయణ యోగ్యమై వన్నెకెక్కినది.

ఉపేంద్రభంజి :

ఉపేంద్రభంజి బహుకావ్యకర్త. ఈయనకు ముందు ఒరియాలో కావ్యరచన జరిగినను ఇంత పరిపూర్ణత యెన్నడును చెందలేదు.

ఇతడు గంజాము జిల్లాలోని ధరాకోట రాజగు ధనంజయభంజి అను మహా రాజు మనుమడు. ఇతని తాతతండ్రులుకూడ కవులు. ఈ రాజకుటుంబమున వారందరు భాషాపోషకులు, భాషా సేవకులు.

పురాణకవులలోను ప్రబంధకవులలోను కూడ ఉపేంద్రభంజిని మించిన కవి ఒరిస్సా రాష్ట్రములో ఉద్భవించలేదు.

రాజ్యసింహాసనమునకు బదులు ఈతడు కవితా సామ్రాజ్య సింహాసన మధిష్ఠించి 'కవిసమ్రాట్టు' అని ఖ్యాతి కాంచినాడు.

వైదేహీ విలాసము, లావణ్యవతి, ప్రేమాసుధానిధి, త్రైలోక్యమోహిని మొద లైన కావ్యములు సుమారు ఇరువది దాక ఈతడు రచించెను.

శబ్దాడంబరములకు అంత్యానుప్రాస వృత్త్యనుప్రాస ఛేకాను ప్రాసములకు ఈతని కవిత పేరు గాంచెను. ఈతని కవిత పచ్చి శృంగారమునకు ఆలవాలమైనది. నీతి నియమ రహిత పద్యములు కూడ ఈతని నోటినుండి వెలువడినవి. సాహిత్య రంగమున ఈతడొక ఐంద్రజాలికుడు. ఒక అక్షరమును కలిపియు ఒక అక్షరమును తీసియు శబ్దములగారడీ చేసి అర్థవిశేషమును కలిగించి కవితా చమత్కారములను చూపినాడు. తలచినప్పుడు నవరసభావ విలసితమగు కవనముకూడ ఈతడు రచింపక పోలేదు. శబ్దచిత్రణములో ఇతనికిగల సామర్థ్యము మరే ఒరియా కవికి లేదు. శృంగా రమును ఇతనివలె నగ్నముగాను మధురముగాను వర్ణించిన కవి మఱియొకడు లేడు. కావుననే ప్రజలీతనిని 'కవిసమ్రాట్టు' అని కీర్తించిరి.

ఆంధ్ర కవిసార్వభౌముడైన శ్రీనాథుని పద్యములకున్న బహుళ ప్రచారము ఉత్కళకవి సమ్రాట్టగు ఉపేంద్రభంజి శృంగారపద్యములకును కలదు.

ఉపేంద్రభంజి తరువాత ఎన్నదగిన కవి అభిమన్యసామంతసింహు. ఇతడు 'విదగ్ధచింతామణి' యను ప్రణయకావ్యమును, ప్రీతిచింతామణి ప్రేమతరంగిణి మున్నగు కావ్యములను రచించెను.

ఈ కాలములో భూపతి పండితుడు, గోపాలకవి, రఘునాధభంజు, పీతాంబర దాసు, విశ్వనాధబంటియా, కృష్ణసింహ, కన్హ్వాదాసు, జదుమణిమహాపాత్రో, గోపాల కృష్ణ పట్నాయక్ మొదలగు మఱికొందఱు కవులుకూడ పేరు కాంచిరి.

## చైతన్య మత ప్రభావము :

చైతన్యుని వైష్ణవమత ప్రభావము ఒరిస్సా భాషపై కూడ కొంతప్రసరించినది. దానితో ఒరియా భాషకు నష్టముతోపాటు కొంతలాభముకూడ చేకూరినది. పదునేడవ శతాబ్దములోని దినకృష్ణదాసు కాలమునుండి పందొమ్మిదవ శతాబ్దములోని గోపాల కృష్ణుని కాలమువఱకు ప్రజలు రాధాకృష్ణ మతములో మునిగి తేలుచుండిరి. ఆ సమయ ములో ఒరియా భాషలో మంచి కీర్తనలు పద్యములు కొన్ని వెలువడినవి. అందు కొన్ని గేయములు పద్యములు ప్రజలకు నూతన చైతన్యము కలిగించినవి లేకపోలేదు. ఆ పద్యముల బాగోగులను గూర్చి నేటికిని వాదోపవాదములు చెలరేగుచునే ఉన్నవి. కాని, వాని మూలతత్త్వము సరిగా గ్రహించినవారు లేరని చాలమంది ఉత్కల పండితుల విశ్వాసము.

## కవిసూర్య బలదేవరథొ

ఇతడు ఉపజ్ఞాన ప్రతిభా విలసితుడగు గేయకవి. కిషోరచంద్రాననచంపువు చంద్రకళ - అను నవి యితని కృతులు.

కిశోరచంద్రచంపువు సంస్కృతోత్కల భాషామిశ్రమ శ్రవ్యదృశ్యకావ్యము. దీనిని నృత్యగానములకు అనువైన నాటకము అనవచ్చును.

ఇందలి ఇతివృత్తము రాధాకృష్ణప్రేమ. ఇందు లలిత అనునామె దూతిక. ఈమె రాధాకృష్ణుల మధ్య ప్రణయకలహము రేకెత్తించి ఉభయులచేతను విరహమును అనుభవింపజేసి శృంగారసము పెంపొందింపజేయును.

చిన్న పిల్లలు ఆట పాటలచే ఆనందించునట్లు లలిత రాధాకృష్ణుల ప్రణయ కలహముచే ఆనందించును.

ఈ నాటకములోని లలిత పాత్ర ముక్కు తిమ్మన పారిజాతాపహరణములోని నారద పాత్రమును పోలినదన వచ్చును, గీత గోవిందములోని లలిత ముగ్ధ కిశోర చంద్రచంపువులోని లలిత ప్రౌఢ.

కవి సూర్యబలదేవరథా ఈ చంపూ నాటకమును ఓఢ్ర సంగీతమునకు అనువగు ఫక్కిలో వ్రాసెను.

ఇదే కాలమున అభిమన్యు - దినకుష అను ఇరువురు కవులు సీతారాముల గాథను భజన నాటకములుగా వ్రాసి పేరు గాంచిరి. వీరు ఒరియా భాషకు నవ చైతన్యము కలిగించిన నవ్యకవులు.

ప్రజనాథబడజీన :

ఇతడు మహారాష్ట్రులు ఒరిస్సా పై దాడిచేసినపుడు వారిని ఎదిర్చి పోరాడిన యోధుడు. ఆ యుద్ధ సమయములో ఒరిస్సా ప్రజలు యుద్ధోన్ముఖులై వైరివీరులను ఎదిర్చి పోరుటకు ఈతని గేయములు ఎంతో ప్రబోధము గావించెను. యుద్ధతంత్రములను యుద్ధవ్యూహములను తన గేయములలో మేళవించి యీతడు ప్రజలను ప్రబోధించెను. ఈతని కవిత వీర రస ప్రధానమై సైనికులను రణ రంగమున వీర విహారము చేయునట్లు ప్రోత్సహించును. భావ పుష్టికై యీతడు హిందూస్థానీ మరాఠాపదములను కూడ స్వీకరించి తన కవితను సాగించి ఒరియా సాహిత్యమున నూతన మార్గమును నెలకొలిపెను.

పదునెనిమిదవ శతాబ్దములోని ప్రజలకు శబ్దాలంకార భూయిష్ఠమైన కవితల పై విముఖత్వము పొడసూపెను. ప్రజల అభిరుచిని గమనించిన నాటి కవులు విశ్వజనీనమైన మృదు మధుర సరళ లలిత పదములతోడి కవితలల్లుట కారంభించిరి.

భక్తచరణదాసు :

ఇతడు మహాభక్తుడు. బలరామ కృష్ణులు బృందావనమునువీడి మధురకు వెడలు నప్పటి ప్రజల మనోభావములను తన భావనాశక్తితో ఊహించి వాడుక భాషలో 'మధుర మంగళము' అను కావ్యము మధురాతి మధురముగా రచించెను.

ఈ కావ్యములో ఉద్ధవుడు వార్తాహరుడై బృందావనమునకు వచ్చి బలరామ కృష్ణుల యెడబాటును సహింపనోపక వాపోవు గోపికలను అద్వైత భావముతో ఓదార్చుట ఇందు అభివర్ణితమయ్యెను. ఆ అద్వైతబోధ యశోదకు మాత్రము ఊరట కలిగింపలేదు. ఈ మధుర మంగళకావ్యము ఒరియా సాహిత్యమునకు శిరోమణి వంటిది. ఇతడు వ్రాసిన 'మన బోధ చౌతిస' అను మఱొక కావ్యము ముక్తి మార్గమును

బోధించును. ఇది శరీరము అనిత్యమను భావములను నిరూపించును. ఈతని రెండు కావ్యములు ఓఢ్రులకు శిరోధార్యములు.

శరీర మనిత్యమని యత డెట్లు వచించెనో చూడుడు.

సుగుణము లన్నియుంగలిగి శోభిలు విగ్రహమట్లు మానవా!
అగపడుచుంటి వంతె ఇది అంతయు చీకటిలోక మందులోన,
గడియలో గతించెద వణంగెడు పట్టున ఏది రాదు, నీ
విగతపు మేని మాంసమును ప్రీతిని కాకులు గ్రద్దలానురా!
(ఉరియాకు తెలుగు)

గోపాలకృష్ణదాసు :

ఇతడు జానపద గేయములలో రాధాకృష్ణుల లీలలను వర్ణించెను. ఇందు రాధ బాల్యమునుండియు శ్రీకృష్ణుని ఏ యే రీతుల ప్రేమించి తరించినదో వర్ణింపబడెను. ఇదే యిందలి ఇతివృత్తము. ఈతని కవితలో ఔత్తరాహ కవుల భావము లెన్నియో వెల్లివిరియుచుండును. ఈతడు పర్లాకిమిడిలో పుట్టి పెరిగిన కవి. ఇప్పటికి అచ్చటి ప్రజ లీతని ఆరాధించుచున్నారు. ఈతని వంశ మీనాటికి అవిచ్ఛిన్నమై తామర తంపరగా వెలయుచున్నది. గోపాలకృష్ణదాసు, రాధికా ప్రేమను ఎంత మనోహరముగా వర్ణించెనో చూడుడు.

రాధనౌ నా మీద రానిచో దయనీకు
తూలనాడరె నన్ను తోడివారు
నొప్పించి నీమది యెప్పుడు సుఖముగా
సంచరింపగలేదు క్షణము గూడ
ఏ నొక్కతనె నీదు ఎడ చూఱగొంటి నం
చాత్మలో గర్వంబు నందుచుంటి
ఇంటనో బయటనో ఏడనో ఒకచోట
తిలకించి నీరూపు పులకరింతు
మధురమంగళ త్వన్మూర్తి మానసమున
నిలిపి నిరతంబు మోదవార్నిధిని తేలు

నను గటాక్షించి రాధికానాధ ! యిమ్ము
దర్శనమదియె మోక్షపదంబు నాకు.

(ఒరియాకు తెలుగు)

భీమ బోయి :

ఇతడు ఒరిస్సాలోని పర్వతసానుభూములలో నివసించు ఆదివాసి, గోడు జాతి వాడు. పూర్వ మొకప్పుడు ఈ జాతివారు పసుపు తోటలలో పనిపాటలుచేసి బ్రతికెడి వారు. నరబలులయందు నమ్మకము గలవారు. ఇతడు సహజ కవి. మశూచిచే ఇతనికి చిన్నతనముననే కన్నులు పోయినవి. గ్రుడ్డివాడు అగుటచే ఇంటింట ముష్టి ఎత్తుకొని జీవించెడివాడు. తిరిపెము ఎత్తుకొను రోజులలో ఇతడు మహిమాగోసాయికి శిష్యు డాయెను. మహిమాగోసాయి మహిమా ధర్మమనుపేర రాజారామమోహనరాయల మతసారము విగ్రహారాధన, సహగమనము మొదలగు దురాచారములు పనికిమాలినవని ఖండించుచు ప్రచారముచేసెను. వర్ణాశ్రమ ధర్మములు వట్టి కల్పితములని చాటెను. వర్ణ వ్యవస్థను నిరసించెను. సృష్టికర్తయగు భగవంతునే ప్రార్థింపవలెనుగాని రాతికి రప్పకు మ్రొక్కరాదు అనెను.

వ్యభిచారము దూష్యము, సత్యము సర్వశ్రేయములకు మూలము. సర్వమానవ సౌభ్రాత్రము, శ్రేష్ఠము అను నివి మహిమా ధర్మములు. ఈ మతస్థులకు దేవునిపై గాఢ విశ్వాసము కలదు. మహిమగోసాయి ఒకప్పుడు పూరి వెళ్ళి సశిష్యుడై జగన్నాధ స్వామిని దర్శించి స్వామి బుద్ధావతారుడని వచించెను. అది విని జగన్నాధాలయ ధర్మ కర్తయగు మహారాజు వానిని నానాహింసలుబెట్టి గుడినుండి వెడలగొట్టెను.

మహిమాగోసాయి పండితుడుగాడు. విశేషముగా చదువుకొన్నవాడునుగాడు. గ్రంథాలుకూడ ఏమీ వ్రాయలేదు. కాని, తన మత సిద్ధాంతములన్నియు భీమబోయికి నూరిపోసి ప్రచారము చేయించెను.

సహజ కవియైన భీమబోయి వాడుక భాషలో గేయములు అల్లి ఒరిస్సా సంస్కృతికి ఉదాహరణ భూతుడయ్యెను. ఇతడు తన గేయములతోడను, భజనలతోడను మహిమాగోసాయి మతమును ప్రబోధించెను. ఒరియా ప్రజలందఱు తమతమ విభిన్న మతములను, భావములను విడిచిపుచ్చి భీమబోయి ననుసరింపసాగిరి. ఇతడు ఛందస్సు నెఱిగినవాడు కాదు. తాను పాడినదే మధుర కవితగా మహాకవియైనాడు. ఒరిస్సాలో ఆర్య సంప్రదాయములన్నియు ఆదివాసుల జీవితములో పడుచుపేళ్లుగా అలుకొని

పోయియున్నవి. వీరందరికి జగన్నాథస్వామి ఇష్టదైవము. ప్రతి సంవత్సరము ఆషాఢ మాసములో జరుగు జగన్నాథస్వామి రథయాత్రకు పూరీ వెళ్ళి వీరు నృత్య గానములతో స్వామిని కీర్తించి, పూజింతురు. ఆదివాసుల గేయములలో ఒరిస్సా దేశీయ సంస్కృతి అంతయు, సాక్షాత్కరించుచుండును.

మూర్తిభవించిన ఒరియా సంస్కృతియగు భీమబోయి ఆదివాసి, దరిద్రుడు, అంధుడు అయి గ్రామ గ్రామమునకువెళ్ళి తనకు గురువు బోధించిన నూతన మత సారమును గేయములుగా కూర్చి కోకిల కాకలీ ధ్వనితో గానము చేయసాగెను. ఆ మధుర గేయభావములను ఆలించి ప్రజలు ఈతని ఋషితుల్యునిగా భావించి గుంపులు గుంపులుగా వచ్చి శిష్యులు కాదొడగిరి. అది చూచి అసూయాపరులైన మతాచార్యులు కొందఱు ఈతనిని నానాబాధలు పెట్టిరి. నూతన మత స్థాపకులందరువలెనే భీమబోయి కూడ కష్టములను సహనముతో సహించెను. దైవమునెడల భక్తి విశ్వాసములు పరిపూర్ణముగా కలవాడగుటచే అతడు గిట్టనివారు బాధలుపెట్టు పట్టున యిట్టులు భగవంతుని ప్రార్థించెను.

"దైవమా నిన్నిదే ధ్యానించుచుంటి
నమ్మియుంటిని నిన్ను నెమ్మదిలోన
నా ఘతంబొల్లని నరుడు నన్నొక్క
నాస్తికుడనిచాటు నానా విధాల
వాదించుచున్నారు పాపాత్ముడనని
తలదాచుకొన చోటు దక్కంగనీక
కుక్కగొట్టినయట్లు కొట్టుచున్నారు
నిను నమ్మి నేనిట్లు నిఖిల బాధలను
ఆనందమయుడనై అనుభవించుచును
నీ మహత్వంబుల నే తెలిసికొందు"

అని వాపోయెను.

ఆతనికి దైవమునందు గల భక్తి విశ్వాసములను ఈ గేయము చెప్పక చెప్పుచున్నది. భగవంతుడు మోక్షప్రదాతయని అతడు త్రికరణశుద్ధిగా నమ్మెను. పాపాత్మ

లైన ప్రజలు దైవముచే శిక్షింపబడుదురనియు, వారు ఆది వ్యాధులచే బాధపడుదురనియు, వారిని ఉద్ధరింపవలెననియు అతడు ఆకాంక్షించెను.

అన్నెము, పున్నెము ఎఱుగని, ప్రజలపై అతనికి అపారమైన ప్రేమ, దయ, వారు రాళ్ళకు, రప్పలకు మ్రొక్కుచుండుటగాంచి జాలిపడి వారి అజ్ఞానమునకు వగచి ఇట్లు వచించెను.

"అరటిపండులు అగరువత్తులు
చరణసన్నిధిపెట్టి ఏటికి
రాతి బొమ్మకు మ్రొక్కుకొందురు
కఱ్ఱబొమ్మల గణుతిసేతురు
మాయ మిమ్ముల కప్పియుండుట
హేయముగ వర్తించుచుండిరి
ఈయగలవే వట్టిబొమ్మలు
చేయు పూజకు తగిన ఫలములు
మానవాళిని సృష్టిచేసిన
మాధవుం డిడకున్నచో"

భీమబోయి తాను విద్యావిహీనుడనని సర్వకాల సర్వావస్థలయందును తలంచుచు గర్వరహితుడై సర్వదా పరమేశ్వరునిగూర్చి

"ఊహాకందవు నీవు ఓ లోకరక్షకా
అప్రమేయుడ వీవు ఆనందమయమూర్తి
కర్మతూడవీవు కళ్యాణమయమూర్తి
నిర్మలుండవీవు నిఖిలాంతరాత్ముడ
ఈవులేనిచోటు ఇందెందులేదు
ఈవు భాసించదవెల్ల చోటులను"

అని ప్రార్థించి భీమబోయి మానవుడు కర్మతుడు కావలయునని అన్యాపదేశముగా బోధించెను.

భీమబోయి 1895 లో భగవంతునిలో లీనమయ్యెను. అప్పటికి ఒరిస్సా రాష్ట్రములో కాలూనియున్న ఆంగ్లేయులు, క్రైస్తవమత ప్రచారమునకై వచ్చిన వారనియు, వారివలలో చిక్కవలదనియు ప్రజలను హెచ్చరించెను.

కవి స్వార్యబలదేవు యొక్కయు, గోపాలకృష్ణునియొక్కయు, భీమబోయి యొక్కయు కవితాప్రభలు ఒరిస్సా సాహిత్యములో స్థిరస్థాయిగా వెలయుచునే ఉన్నవి.

# నవీన యుగము

ఆంగ్లేయుల పరిపాలనము ఆరంభమైన పిమ్మట భారతదేశములోని ఇతర రాష్ట్రములయందువలెనే ఒరిస్సా రాష్ట్రములోగూడ ఒరియా భాష అభివృద్ధికాంచ మొదలిడెను.

ఆంగ్ల సంస్కృతిలో, ఒరియా సంస్కృతి సంలీనమై నూత్న వికాసమును గాంచదొడగెను. ఒరియా వాఙ్మయము అతి త్వరితగతిని వృద్ధిచెందెను.

వ్యాసరచనలు, ఉపన్యాసములు, తర్కవితర్కములు, పూర్వపక్షసిద్ధాంతములు, పత్రికాపఠనము, నాటక ప్రదర్శనములు, నవలలు ప్రజాదరణమును చూరగొన్నవి.

ఛందస్సులో ప్రాతపద్ధతిపోయి, క్రొత్తపోకడ పొడచూపినది. అచ్చు పుస్తకములు అందుబాటు అగుటచే ప్రజలలో పఠనాసక్తి హెచ్చినది దానిచే విద్య అభివృద్ధి చెందినది. నవకవులు ఉద్భవించిరి.

పూర్వము విద్యావ్యాప్తి ఆనోట ఆనోట సాగినదే కాని అన్యమార్గము లేదుకదా! నేడో అచ్చైముచ్చటగొల్పు పుస్తకములుఅందరకు అందుబాటు అయినవి. ఒరిస్సాకు ప్రత్యేక రాష్ట్రము వచ్చువరకు, ఇరుగుపొరుగున ఉన్న వంగాది రాష్ట్రములలో ఆయా భాషలు వృద్ధిగాంచినట్లు ఒరియాభాష వృద్ధిగాంచలేదు. సొంత రాష్ట్రములేని వారి భాషకు స్వయంప్రకాశమెట్లు లభించును ? ఒరిస్సా భూభాగమంతయు చిన్నచిన్న పెద్ద పెద్ద జమీందారులచే పరిపాలింపబడుచుండుటచే నాటి ప్రజలు స్వేచ్ఛా స్వాతంత్ర్యము లేక విద్యాధనములలో చాల వెనుకబడి ఉండిరి. రైతులందరు జమీందారులకు వెట్టి చాకిరీ చేయవలసినదే. ధనవంతులు వడ్డీకి వడ్డీకట్టి (రీన్) మధ్యతరగతివారని పీల్చి పిప్పిచేసి వేసిరి. రైతు నిత్యదరిద్రుడై పోయెను. మధ్యతరగతులు వారు పైకి వచ్చు

దారి కనుపడదయ్యెను. చాలకాలము వరకు ఒరిస్సావారి వీరత్వము, స్వాతంత్ర్యవాంఛ అణగారియున్నది. అనేక కారణములచే ఒరిస్సా ప్రజలు, దానిసలై, తమ సంప్రదాయమును, సంస్కృతినికూడ కోలుపోయిరి. ఒరియా భాషాభివృద్ధి పూర్తిగాకుంటు పడిపోయినది. ఒరియా ప్రజలు, స్వస్థాన వేషాభివృద్ధిని కోలుపోయి ఉన్న ఆ తరుణములో —

పకీరు మోహన్

రాధానాథ్

మధుసూదన్

అను మగ్గురు నవయుగ కవులు ఉద్భవించి త్రిమూర్తులై త్రిపథగామియైన గంగానదివలె త్రివిధమార్గములను త్రొక్కి అణగిపోయి ఉన్న ఒరియాభాషకు ప్రాణ ప్రతిష్ఠచేసిరి. ఈ నవ కవిత్రయముచే ఒరియా భాష త్వరితగతిని నవ్యభవ్యరీతిని వృద్ధిగాంచి దేదీప్యమానముగ పూర్వవైభవమును మించిన వైభవముతో ప్రకాశింప జొచ్చెను.

## పకీరు మోహన్ సేనాపతి

పదునెనిమిది వందల నలువది యెనిమిదవ సంవత్సరములో సముద్రతీరమున నున్న బాలసోరు పట్నములో పకీరు మోహన్ జన్మించెను. ముక్కు పచ్చలారని చిన్న వయస్సులోనే తల్లిదండ్రులను కోలుపోయెను. అమ్మమ్మ ఈతనిని పెంచి పెద్దచేసెను.

పకీరు మోహనునకు చదువుకొనుటకు చేతిలో ఒక పైసకూడలేదు. ఎట్లో రెండేండ్లు మాత్రము వీధిబడిలో ఒరియా నేర్చుకొనెను. తినుటకుతిండి, కట్టుటకు బట్టకూడ కఱవుగా ఉండెను. పొట్టకై కష్టపడి పని చేయసాగెను. దారిద్ర్యములో పాటు అతనిని అనారోగ్యము కూడ వరించినది. చినిగిపోయిన తెరచాపలు కుట్టుచు అతుకుచు ఏదో మాదిరిగా పొట్ట పోసికొనుచుండెడి వాడు. చిన్ననాట ఇన్ని కష్టాలు పడిన నిఋపేద యగు పకీరు మోహన్ సేనాపతి కాలక్రమమున స్వశక్తిచే నవీనోత్కల భాషాపోషకుడు, రాజ్యాంగవేత్త, పండితకవి, నవలాకర్త, సంఘ సంస్కర్త, పుస్తక ప్రచురణ కర్త, సైనికుడు, దివాను, పత్రికాధిపతి, వర్తకుడు, దేశభక్తుడు అయి అనన్య సామాన్య కీర్తిగాంచెను.

ఇతడు ఒరియా రెండు తరగతులు మాత్రమే చదివినను స్వయంకృషిచే హిందీ, బెంగాలి, బేహారి, తెలుగు, ఇంగ్లీషు భాషలుకూడ నేర్చెను. ఎందఱో ఆంగ్లేయు లీతనికి మిత్రులైనారు. దశపలా, కియాన్ మున్నగు జమీందారుల వద్ద దివానుగిరీలుకూడ సమర్థతతో నిర్వహించినాడు.

ఇతడు తల యెత్తు నాటికి వంగదేశములో బ్రహ్మ సమాజమతము స్థాపింప బడెను. ఈతడా మతమును అనుసరించెను.

కులభేదములు కూడదనియు విగ్రహారాధన చేయరాదనియు చిన్నచిన్న కథలు వ్రాసి ప్రచారము చేసెను. కథానికల ద్వారా సంఘదురాచారములను మూఢవిశ్వాసములను చాలవఱకు పోగొట్టెను.

ఆంగ్లేయుల సాయముచే అతడు ప్రప్రథమముగా ఒరియా అచ్చు యంత్రమును బాలసోరు పట్టణములో స్థాపించెను.

ఉత్కల భాషను అణగద్రొక్కి దాని స్థానమున తమ వంగభాషను రుద్దవలెనని తలపెట్టిన బెంగాలీ బాబుల కది చాల బాధ కలిగించెను. కాని ఒరియా ప్రజలకది పర్వదినమైనది.

ఆ అచ్చు యంత్రము కలకత్తానుండి బాలసోరు పురమునకు ఎడ్ల బండిపై తీసికొనిరాబడినది.

నెలరోజులు ఎడ్లబండ్లపై నాటిమార్గమున ప్రయాణముచేసివచ్చిన ఆ యంత్రము బాలసోరుపురమున నెలకొల్పునప్పుడు ఆ నగరవాసులందఱు తమతమ పనులను కట్టిపెట్టి వచ్చి ఆ అచ్చు యంత్రము పనిచేయు తీరు తెన్నులు చూచి పరమానందము చెందిరి.

జమీందారులు తమ అహంకారములను విడిచిపుచ్చి దూరదూరములనుండి వచ్చి ఆ అచ్చు యంత్రమును చూచి సంతోషించి సేనాపతి సేవను ప్రశంసించిరి.

పకీరు మోహన సేనాపతి చేయు మాతృభాషా సేవను కాంచి బెంగాలీలు చకితులైనారు. ఒరియా భాషను అణచుటకై వారు చేసిన యత్నములన్నియు విఫలములైనవి. స్వస్థాన వేష భాషాభిరతుడైన సేనాపతి కార్యదీక్షనుచూచి ఆంగ్లేయులు సంతసించి, ఔచిత్యమును పాటించి ఒరియా భాష ప్రత్యేకముగా ఉండుటకు అంగీకరించిరి. వారు సేనాపతితో భుజము భుజము కలిపి అతని సలహాను అనుసరించి ఒరియా భాషాభివృద్ధికి కావలసిన ఏర్పాటులన్నియు కావించిరి.

సేనాపతి కావించిన ఒరియా భాషా సేవా ఫలముగా కోటి ఏభై లక్షలమంది ఓఢ్రులు మాట్లాడు ఒరియా భాష ఉద్ధరింపబడినది. ఈతడు కావించిన భాషాభివృద్ధియే ప్రత్యేకముగా ఒరియా రాష్ట్రము ఏర్పడుటకు కారణమయ్యెను. ఒరియా భాషోద్ధరణ మునకై కంకణము కట్టుకొనిన సేనాపతి ఒరియా పత్రికలు నెలకొలిపి స్త్రీలకు, బాల బాలికలకు, యువకులకు, వృద్ధులకు, ముముక్షువులకు, భక్తులకు, రక్తులకు, విరక్తులకు, జానపదులకు అనువగు రీతిని కథానికలు గేయములు వాడుకభాషలో రచించి ప్రకటించి ఒరియా ప్రజలకు విద్యాజ్ఞాన భిక్ష పెట్టెను.

భారత భాగవత రామాయణములను సులభతర భాషలో రచించి ఆబాలవృద్ధము చదువుకొని తరించునట్లు చేసెను. బుద్ధచరిత్ర వ్రాసి శాంతి–అహింసలను ప్రచారము చేసెను. స్వీయచరిత్రను కూడ ప్రకటించెను.

విద్యార్థులకు విజ్ఞానము కలిగించు వివిధశాస్త్ర గ్రంథములను అందఱకు అర్థ మగునట్లుగా ఒరియా భాషలో వ్రాసి ఒరిస్సా రాష్ట్రమంతటను విజ్ఞానము వెదజల్లెను.

గల్ప స్వల్పములను పేరుతో ఒరియాలో నీతిదాయకములగు నవలలు కథా నికలు, లక్ష్మీమానియా అను కథల పుస్తకమును ఆధునిక భావములతో వ్రాసి ప్రక టించెను. ఇతని ప్రతి నవల, ప్రతి కథానిక, ప్రతి గేయము ఆనాటి ఒరిస్సా దేశపు సాంఘిక జీవనము కనులకు గట్టినట్లు చూపును.

ఒక వడ్డీవ్యాపారి ఒక పల్లెటూరి సాలె దంపతులను పెట్టిన బాధలను చిత్రించుచు 'ఛౌమాణొ ఆఠొగుంఠొ' (ఆఱెకరాల ఎనిమిది కుంటలు) అను నవల వ్రాసెను.

ఈ నవలలో హృదయశూన్యుడైన రామచంద్ర మంగరాజు అను వడ్డీ వ్యాపా రస్థుడు చంప అను ఉంపుడుకత్తెతో కలిసి అమాయకులైన సాలె దంపతులను పెట్టిన అష్టకష్టములు ఆనాటి ఒరియా దేశపు ప్రజల జీవిత విధానములు వాడుక భాషలో వివరింపబడెను.

ఈ నవలలో హాస్యము వ్యంగ్యము వక్రోక్తి పద పదమునను గోచరించు చుండును.

దీనిని అనువాదమనుటకు వీలుకానంత స్వతంత్రముగా సహజమైన వాడుక భాషలో శ్రీ పురిపండ అప్పలస్వామిగారు తెలుగున రచించినారు. శ్రీ అద్దేపల్లి

నాగేశ్వరరావుగారు (రాజమండ్రి) తమ అద్దేపల్లి అండుకో గ్రంథమండలిలో ప్రకటించినారు. ప్రతి ఆంధ్రుడు చదువదగిన నవల యిది.

పకీరు మోహన సేనాపతి కథాకథనములోని చమత్కారము వ్యంగ్యము మొదలగునవి తెలుపు ఈ క్రింది వాక్యములు చదివినజాలు అతడెంతటి కవితాశిల్పమును చిత్రించినాడో తెలియును. వడ్డీ వ్యాపారి రామచంద్రమంగరాజు ద్వాదశినాడు బ్రాహ్మణులను భోజనానికి పిలిచి 'ఏమండీ చెప్పండి మీకింకా ఏమైనా కావాలేమో కావలసినంత ఫలహారమూ, కావలసినంత బెల్లమూ ఉంది. నాకు తెలుసు తమ కళ్ళు పెద్దవి. కడుపులు మాత్రం చిన్నవే అని. వడ్డించింది మీ కడుపులకు మించిపోతుంది'.

మంగరాజు ఈలా అన్న తరువాత కూడా కడుపు కక్కూర్తి బ్రాహ్మణుడెవడైనా ఫలహారం కావాలని అడిగాడా మంగరాజుగారు స్వయంగా మూడు ముని వేళ్ళతో అయిదు పుంజీల అటుకులు పట్టుకువచ్చి విస్తళ్ళలో పడవేసేవాడు.

మంగరాజుగారివంటి స్వార్థత్యాగుల్ని చాలా తక్కువమందిని చూస్తాం. ఆయన చేసిన ప్రతిపనీ పరోపకారంకోసమే. గోవిందపురంలో సంత జరగడానికి దాని అభివృద్ధికి మంగరాజుగారి పెద్ద తోటే మూలకారణం. ఈ తోటలోంచి కొబ్బరికాయలూ, అరటి గెలలూ, వంకాయలూ, గుమ్మడికాయలూ, తోటకూరా, పచ్చిమిరపకాయలూ వెళ్ళకపోతే సంతలో సందడే ఉండేది కాదన్నమాట. మంగరాజుగారి తోటలోని కూరగాయలు అమ్ముడైపోయేదాకా పై వాళ్ళెవరు అమ్మడానికి అధికారంలేదు. అది సబబేకూడాను. ఏమంటారా ? మంచి దినుసు అమ్ముడుపోకుండా చెడ్డ దినుసు ముందు అమ్ముడుపోవడం న్యాయం కాదుకదా ! సంత జమీందారుగారి స్వంత జమీందారీలో జరుగుతుందాయె. స్థలం పైవాళ్ళదైతే అది వేరే సంగతి. కొత్త సంవత్సరమని, దసరా అని పండుగలని పబ్బాలనీ నజరానాలనీ వచ్చే గుమ్మడిపళ్ళూ, వంకాయలు, అరటిగెలలు అన్నీ తిన్నగా సరాసరి సంతకి వెళ్ళిపోయేవి. ఆయన, పైవాళ్ళ కష్టం సహించలేడు. అంచేత ధాన్యమూ నగదూ అప్పిస్తూ ఉంటాడు. అంతేకాని ఆయనకు అందులో స్వలాభం ఏమీలేదు. పైగా నష్టమే అంటారా యేం ధాన్యం మూడు మానికలిస్తే మానెడు వడ్డీ. ఇందులో లాభమేముంది. ఇచ్చినప్పుడు పాత ధాన్యం పండిన ధాన్యం ఇస్తారు. పుచ్చుకొన్నప్పుడు కొత్త ధాన్యం పుచ్చుకొంటారు. అది పచ్చిగా ఉంటుంది. మీరు తడి బట్టా పొడి బట్టా తూకంవేసి చూడండి ఎంత తేడా ఉంటుందో అప్పుడు తెలుస్తుంది పచ్చివాటికి ఎండినవాటికి ఎంత తేడా ఉంటుందో.

మంగరాజుగారు తమ కంబార్లను (పాలేళ్ళ) కన్నకొడుకుల్లా చూసేవారు. తల్లిదండ్రులు స్వయంగా పిల్లల తిండీ తిప్పలు చూస్తేనేకాని వాళ్ళకి తృప్తి ఉండదు. కంబార్లు వరుసగా తిండికి కూర్చోగానే మంగరాజుగారు పెద్ద కేకవేసి వంటవాళ్ళని పిలిచేవారు. "తరవాణి పట్టుకరావోయి తరవాణి వీళ్ళ గొంతుకలు ఎండిపోతూ ఉన్నాయి"

వంటవాడు రివాజు ప్రకారం ప్రతి వొక్కడికీ రెండేసి కంచాల తరవాణి పోసేవాడు. ఎవడన్నా కంబారి అంత తరవాణి తాగడానికి ఇష్టపడకపోతే మంగరాజుగారు తరవాణి తాలూకు ఉపకారం గురించి అదిచేసే పుష్టిని గురించీ చిన్న ఉపన్యాసంచేసి వాడిచేత అది తాగించేసేవారు. తరవాణి అయిపోయాక వాళ్ళకి అన్నం వడ్డించమని చెప్పేసి ఆయన స్నానానికి వెళ్ళిపోయేవారు.

ఆయన తోట్లో పదిహేను మునగచెట్లుండేవి. మునగకూర జీర్ణానికి ప్రసిద్ధి. బలకరం, రోగనాశకం, రుచికరం. అంచేత ఆయన తోటలోంచి మునగకూర పిడికెడైనా సంతకి వెళ్ళేదికాదు. కంబార్ల బలవృద్ధికోసం పుష్టికోసం అంతా ఖర్చయిపోయేది. ఇది ఆయన త్యాగం.

మంగరాజు వ్యాపారంచేస్తూ ఎన్నో కొంపలుకూల్చి తన కొంప కట్టుకున్నాడు. ఆ ఘట్టంలో ఫకీరు మోహను దేమనుచున్నాడో తిలకించండి.

"వాణిజ్యం లక్ష్మీ నివాసం. అందులో సగం బి.ఎల్. ప్యాసవడం మంగరాజు గారి లోగిలి చూస్తే అది వొక బి.ఎల్. ప్యాసయిన అడ్వకేటుగారి ఇల్లనీ పదికొంపలు కూల్చి కట్టిందనీ అనుకుంటారు తెలియనివాళ్లు. అసలు సంగతి ఏమిటో మీకు తెలుసా? 'భాగ్యం ఫలతి సర్వత్ర' కచేరీ వరండాలమీద గబ్బిలాల్లా దేకుతున్నారే ఈ వకీళ్ళు. వీళ్ళలో వొక్కడైనా దొరుకుతాడా మంగరాజుగారిలాగ పదేసి పదేసి కొంపలు మాయేసి ఇల్లు కట్టగల మగాడు".

మంగరాజు గారి ఉంపుడుగత్తె సౌందర్య వర్ణనం :

"కాటుక పూసిన కళ్ళూ
కారాకిళ్ళీ నమిలే పళ్ళూ
పసుపూ నూనే రాసిన దేహం
కుక్కలా వేగం దూరును గేహం

కట్టిం దెనిమిది గజాల చీరా
సిగలో పువ్వుల హారం భళిరా
గబగబదబదబ చలితం తస్య
నడకో పరుగో విషమ సమస్య
కరముల గాజులు కంకణమ్ములూ
కాళ్ళకు పిల్లేళ్ళూ కడియాలూ
గోర్చి మధ్యలో అడుగులు వేస్తూ
నడుస్తూ పోవును దిక్కులు చూస్తూ
చూచిన గ్రామస్తులు త్రుళ్ళిపడీ
పారిపోదు రటు నిటు భయంపడీ
ఇతిరూప వర్ణనం విముక్త ఛందే
అతః గుణవర్ణ్యతే బహుప్రబంధే"

ఈ రీతిగా నడుస్తుందీ నవలలోని కథ అంతా.

పకీరు మోహనుని ఒడియా శైలీ పురిపండవారి తెలుగు శైలీ ఒకదానితో ఒకటి పోటీపడి పాఠకుణ్ణి చివరిదాకా ఏక్‌దమ్ లాగుకొనిపోతాయి.

పకీరు మోహనుని కాలంనాటికి ఒరిస్సాలో వడ్డీ వ్యాపారులు ఎలా రైతుల్ని పీల్చి పిప్పిచేశారో నేటికి ఒరిస్సాలో ఆలాగే పీలుస్తూ ఉన్నారు. ప్రతి రైతుకి 'రీనులు' (ఋణాలు - నాములు) ఇస్తారు సాహుకార్లు. పుట్టెకు (20 కుంచాలకు) ఏడాదికి పది కుంచాలు వడ్డీ. ఏ రైతుకు రీనులుపోను రెండు నెలలకు సరిపడ్డ ధాన్యమైనా ఉండదు పాపం తినడానికి. ఈ రీనుల బాధనుండి రైతులను గట్టెక్కించే దిక్కేలేదు కాబోలు వడ్డీ ఈ రీనులకు బలాదూరు.

పకీరు మోహనుడు భావకవులను ఉపేంద్రభంజి మొదలైన ప్రబంధ కవులను కూడ చంపా సౌందర్య వర్ణనము నెపముగా ఒక బాదు బాదినాడు.

"గురువుగారి దయవల్ల మేమూ కాసింత భావకవిత్వం కట్టగలం. కోతల రాయడు ఏమీ తెలీదని అనుకొనేరు మీరు కాదు వినండి.

భావకవిత్వం :

అర్ధవక్ష ఉల్లంఘినీ - మందహాసినీ
వస్త్రహూన్యా రిక్తహస్తా తురంగగామినీ
మార్జాలనయనా తామ్రకేశా
స్వాధీన భర్తృకా
అహోఅపరూప స్వర్గవిద్యాధరీ !

ఇక అభిరుచిలేని ఉపేంద్రభంట కవిత్వం వింటాగా !

'అవనిపై నుండుగా కనటి కంబము లెట్టు
లనటి కంబములపై అవని నిలిచె'

తన కాలమునాటి దంభాచారులైన వేదంరాని త్రిపాఠులను (మూడు వేదాలు చదివిన బ్రాహ్మణులు) ఏలా చిత్రించినాడో చూడుడు.

"అవధరింపు పరీక్షిన్మహారాజా !
ఎండు రొయ్యలతో చద్దన్నం మజా
పొట్టచీలిస్తే అక్షరం నాస్తి
విభూతి పెండెకట్లు జాస్తి
కలుపు తియ్యమంటే పిల్లి
అటుకులు బెల్లానికి పెద్దపులి
గాయత్రీ పేరంటే పరువు
పొలంమడిలో చేపలికి గురువు
పుస్తకం విప్పమంటే బెంగ
యజమాని ఇంట్లో బియ్యం దొంగ
సభలో మౌనం పరిపాటి
పేరు మాత్రం సుందర త్రిపాఠి"

ఈ విధముగా నడచినది నవలంతయు.

మఱియు ఇతడు పదునెనిమిదవ శతాబ్దములో మహారాష్ట్రులతోను పఠానులతోను జరిగిన గోరిల్లా యుద్ధమును 'లక్ష్మి' అను నవలగా వ్రాసెను. ఈ చారిత్రక నవలలో లక్ష్మియను నాయకురాలు పూరిలో జరుగు జగన్నాథస్వామి రథయాత్రకై వెడలు చుండగా ఈ యుద్ధజ్వాలలో చిక్కుకొనెను. అందు ఈమె కుటుంబమంతయు ఆహుతియైపోయెను. దానితో ఆమె సాహసము అతివేలమై విజృంభించినది. గోరిల్లా ముఠానాయకుడైన భాస్కర పండితుని తన కరవాలమునకు ఎరకావించెను. అంతతో ఆ పర్వత నాయకుని పితూరీ అణగిపోయెను.

పకీరు మహోను సేనాపతి కాలములో వంగదేశములో ఈశ్వరచంద్ర విద్యాసాగర్, బంకించంద్ర ఛటర్జీ అనువారు ఇరువురు సాంఘిక దురాచారములను రూపుమాపు నూత్న వాఙ్మయము వంగ భాషలో విశేషముగా సృష్టించిరి. ఆ మార్గము ననుసరించి సేనాపతియు ఒరియా ప్రజలను తీర్చిదిద్దుటకై బహుళ వాఙ్మయమును ఒరియాలో సృష్టించెను. ఒరియావారి నిత్యజీవిత సమస్యలను కష్ట సుఖములను బాగుగా ఆకళించుకొని యితడు నవలలు వ్రాసెను.

సంస్కృతములో వేంకటాధ్వరి అను మహాకవి విశ్వగుణాదర్శమను చంపువు వ్రాసే విశ్వావసువు, కృశానువు అను ఇద్దఱు పాత్రలను సృష్టించి భారతదేశములోని మంచి చెడ్డలను విమర్శించినట్లు సేనాపతి 'మము' అను నవలలో మంచి – చెడ్డ – అను రెండు పాత్రలను సృష్టించి మంచి చెడ్డలు చర్చించి పశ్చాత్తాపముచే పాపము పరిహారమై మోక్షము చేకూరునని నిరూపించెను.

ఇతని రచన సరళము; శైలి సులభము. శయ్య రమణీయము. పాత్రలు సజీవములు. సంభాషణములు హాస్యరస సమ్మిశ్రితములు. కావుననే నేడును ఈతని నవలలు ఒరియా ప్రజలచే నిత్యము పఠింపబడుచున్నవి.

ఇతని కుమారుడు ఆంగ్లభాష నేర్చి దైవచింతలేక నాస్తిక భావపూరితుడై అనేక కష్టములకు గుఱియై దుర్భర దౌర్భాగ్య నైచ్యజీవనమునకు పాలుపడెను. అది సేనాపతి హృదయమును ఎంతగానో కలచివైచెను. దాని ఫలితముగా అతడు ప్రాయశ్చిత్త అను విషాదాంతమగు నవల వ్రాసెను.

ఇతని పుస్తకములలో అతిలోక విషయములు అద్భుత కల్పనలు కానరావు. నిత్య సత్యములైన దైవచింత సోదరప్రేమ కానవచ్చును.

జాతీయతాభావము ఐకమత్యము దేశభక్తి రేకెత్తించి సంఘ దురాచారములను ఖండించుటచే పల్లె ప్రజల కీతనీ నవలలు ప్రీతిపాత్రములయ్యెను.

కొంతకాల మీతడు కియాన్ జమీందారువద్ద దివానుగా పనిచేసెను. ఇతని దివాన్‌గిరిలోనే 'బుయానులు' అనువారు ఆ రాజ్యముపై దాడిచేసిరి. రాజు కటకమునకు పాటిపోయి తలదాచుకొనెను.

కియాన్ రాజ్యము ధనవంతమైనది. పంటభూములు కలది కావుననే శత్రువుల కన్ను దానిపై పడినది.

సేనాపతి రాజు పాటిపోయినను అధైర్యముచెందక ధైర్య స్థైర్యములు ఊతగా కొని రాజకుటుంబమును కాపాడుచుండెను. అది తెలిసి శత్రువు లీతనిని బంధించి మన్య ప్రాంతములకు కొనిపోయిరి.

సేనాపతి విప్లవనాయకునితో నెయ్యము నెఱపి ఆ రాజ్యమును అతనికి ఇప్పింతు నని నమ్మించెను. ఆ బందిపోటు దొంగలనాయకుడు సేనాపతి చేసిన బాసను నమ్మి అతడు చెప్పిన చొప్పున మెలగుచుండెను. అతని సలహాలు శిరసావహించుచుండెను.

కొండ నాయకుడు సేనాపతి తనకు కొండవంటి అండయని నమ్మి గుండెలపై చేయివైచికొని హాయిగా నిద్రపోవుచుండెను. రాజద్రోహియగు ఆ దుండగీడు ఏమర పాటున ఉన్నప్పుడు, దండెత్తిరావలసినదిగా తన రాజునకు వార్త పంపెను. హఠాత్తుగా కొండనాయకుని సేనలతో చుట్టుముట్టించి మట్టుపెట్టించి విప్లవమును అణచివైచి తన రాజును స్వీయరాజ్యమునకు మహావైభవముతో పట్టాభిషిక్తునిజేసి తన రాజభక్తిని ప్రకటించుకొనెను. ఈతని ఆత్మకథలో ఆనాటి ఒరియా ప్రజల నిత్యజీవిత విధానములు ఆచార వ్యవహారములు ఉన్నవి ఉన్నట్లు వ్రాసెను.

ఇతని కాలము బస్తా బియ్యము ఖరీదు ఒక రూపాయి. నాలుగు కుంచాల పప్పు కూడ అంతే. ప్రజలందఱు ముతకబట్టలు జమీందారులు వారి ఉద్యోగులు సన్నని బట్టలు తాల్చెడువారట.

ఆర్య సంస్కృతి భారతదేశమంతటను భాసిల్లుచున్నట్లే ఒరిస్సాలోను భాసిల్లు చున్నది.

అఖిలోత్కల మహాసభ కాతడు ప్రప్రథమముగా అధ్యక్షతవహించి పేరు గాంచెను.

బాలసోరు పట్టణములో ఒక ఉద్యానవనములోని ఒక సుందర మందిరములో అతడు నివసించుచుండెడివాడు. సహస్రమాన జీవియైన అతడు 1918 లో కీర్తిశేషుడయ్యెను. ఆయన నివసించిన మందిరమొక కవితాకళామందిరమై యాత్రాస్థలమై నేడును విలసిల్లుచున్నది. ఒరిస్సానుండి ప్రతిదినము అనేకులు విద్యావంతులు వచ్చి ఆయన మందిరమును దర్శించి ఆయన రచించిన నానావిధ గ్రంథములను పఠించి ఒడియాభాష కాయన చేసిన అపారసేవను ప్రశంసించి విశ్రాంతిచెంది వెడలుచుందురు.

తన కవితా మాధుర్యములో ఒడియా ప్రజలను ఓలలాడించి ధన్యజీవుడైన పకీరు మోహను సేనాపతి చేసిన ఒరియాభాషా సేవను మానవ సేవను దేశ సేవను కొనియాడని ఓఢ్రు డుండడు అనుట సత్యదూరముకాదు.

తన కవితాశక్తిచే అజరామకీర్తిని గడించిన పకీరు మోహనసేనాపతిని పోలిన కవి భారతదేశమునకే ఒక అలంకారము.

## రాధానాధ కవి :

రాధానాధకవి బాలసోరు జిల్లా కేదారుపూరు అను గ్రామములో 1848 లో జన్మించినాడు.

ఒరిస్సాలో మొట్టమొదటిసారిగా మెట్రిక్యులేషను పరీక్షలో జయముకాంచిన వారిలో ఈతడొకడు. ఆ జిల్లా మొత్తమున కితడొక్కడే ఆ పరీక్షలో జయముగాంచెను. పిమ్మట ఈతడు కలకత్తావెళ్ళి అచ్చట కళాశాలలో విద్యాభ్యాసముచేయ మొదలిడెను. కళాశాల విద్య పూర్తి కాలేదు. అనారోగ్యవంతుడయ్యెను. జీవికకై ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించెను. బుద్ధికుశలతచే క్రమముగా విద్యాశాఖలో డివిజనల్ ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సు పదవిని అధిష్ఠించెను. మాతృభాషలోవలెనె అతడు హిందీ, బెంగాలీ, సంస్కృతము, ఆంగ్లములలో పండితుడు, కవి. జాతీయ భావవిలసితుడు.

ఇతడు తన ఉద్యోగ నిర్వహణలో తన మాతృభూమిలోని నలు చెలంగులను తిరిగి అచ్చటి సహజ సౌందర్యమును, సహజ సంపదను, ఖనిజ సంపదను కనుగొని ముగ్ధుడైపోయెను. పూరి శాంతిపూర్ జిల్లాలో సముద్రమును - గంజాము కోరాపుట్టి జిల్లాలలో సారసమయూర భృంగరాజాది నానావిధ పక్షిసంతానమును, గజశార్దూల వరహ హరిణాది మృగములను, గగ్గులాది వృక్షములను, గిరి నిర్ఝరంబులను, వేణుగానముచేయు ఖిల్లీ ఖిల్లులను, అంబరచుంచిత శిఖరాంచితములగు పర్వతరాజములను,

పర్వత శిఖరములతో దోబూచులాడు నీలనీరదపంక్తులను, మెఱపుల ఒఱపులను, వీక్షించి బ్రహ్మ సాక్షాత్కారము గాంచినట్లు ఆనందించెడివాడు. చిలుక సరస్సులో రెక్కలల్లార్చుచు ఎలుగు విప్పుచు విలాసముగా ఎగురు పలువిధములగు పక్షిరాజములను కాంచి తానును ఒక విహంగమమై వానితో కలిసి ఎగిరిపోజూచెడివాడు.

ఒరిస్సాలో ప్రకృతి సౌందర్యము వర్ణింపవలయుననినచో మన అల్లసానివారి అల్లిక జిగిబిగితో

తావుక క్రేవలజల్లు చెంగలున కేదారంపు తీరంబులన్
మావుక క్రోవులు అల్లిబిల్లిగొను కాంతారంబులున్ కొండలున్
పూవుందీవల ఒప్పు గేహములు సంపూర్ణంబుగాగల్గి యే
తావుంగాంచిన ఉత్కలావనిని ప్రత్యక్షంబులౌ నిత్యమున్

అని వర్ణింపవలెను. ఇట్టి ప్రకృతి సౌందర్యముగల తన ఒరిస్సా రాష్ట్రము కనులారగాంచి ఉప్పొంగి రాధానాధకవి ఎన్నియో ఇప్ప పూదేనెబోని పద్యకావ్యములు వ్రాసెను. ఇతడు వ్రాసిన పాండవుల మహాప్రస్థానము మహోన్నత కావ్యము. అందు హస్తినాపురవాసులగు పాండవులను తన మాతృభూమియగు ఒరిస్సాకు తీసికొని వచ్చెను. పాండవులు అచ్చట అగ్నిదేవు నారాధించిరి. అగ్నిదేవుడు పాండవులకు హిమాలయమునకు పోవు మార్గమును చూపించెను. అంతేకాదు. వీతిహోత్రుడు పాండవులను పడమటి కనుమలలో ఒక వివిక్త ప్రదేశములో ఆసీనులజేసి భవిష్యత్తులో భారత భూమిలో జరుగగల సంఘటనలను, సన్నివేశములను, పరిణామములను వారికి తెలియజెప్పెను. ఇది యిరువదియొక్క ప్రకరణముల కావ్యమని కవులనుచున్నారు. కాని అందు ఏడు ప్రకరణములు మాత్రమే యిప్పుడు ఉపలబ్ధమగుచున్నవి. ఈ కావ్యము ఒరియా సాహిత్యములో వాడిపోని మల్లెపూవు. ఇతని కథాకథనశక్తి అపూర్వమును రమణీయమును అయినది.

ఒరిస్సాలో మహారాజులు ఆంగ్లేయుల దర్బారులకేగి సమర్పించు కప్పములు పాదభేటులు మున్నగునవి కథావస్తువుగా కొని దర్బారు అను కావ్యము కూడ ఒకటి ఈతడు రచించెను.

హైందవ సంప్రదాయములను తీర్చిదిద్ది ఇతడు కావ్యరచన కావించి ఓఢ్ర భాషా పోషకుడై ఒరియా వాఙ్మయ చరిత్రలో తనకొక విశిష్ట స్థానమును సముపార్జించుకొనెను.

రాధానాధకవి వ్రాసిన ఒక పద్యము చదువగానే పాఠకుడు ముందు పద్యములో ఏమున్నదో అని ఉవ్విళ్ళూరవలసినదే. అతని శైలి అట్టిది. పదలాలిత్యమట్టిది.

ఇతని పాత్రోచితభాష కాళిదాసు భాషనుగూడ మఱపించును. కావుననే ఇతడు కాళిదాసు వ్రాసిన మేఘదూతను రసోచితముగా ఒరియాలో రచింపగల్గెను. పండితులచే సెబాసనిపించుకొనెను.

ప్రాచీన నవీనోత్కళ కవులు చూపిన అన్ని క్రొత్త పోకడలు ఈతని కవితలో ప్రస్ఫుటమగుచుండును. ఎన్నియో పురాణ గాధలను వ్రాసెను. దేవతలను ఉత్తమ మానవమూర్తులుగా చిత్రించి వారిచే ఒరిస్సా ప్రజలకు ధర్మోపదేశము చేయించెను.

ఇతడు వ్రాసిన 'చంద్రభాగ' అను పద్యకావ్యము చరిత్రాత్మకమైనది. కోణార్క లోని సూర్యభగవానుని ఆలయ శిధిలముల వర్ణనముతో ఈ కావ్య మారంభమైనది.

'చంద్రభాగ సుమన్యుడను ఋషిపుంగవుని గారాబు కూతురు. సుమన్యుడు కోణార్క సమీపమున ఒక ఆశ్రమమును నిర్మించుకొని అందు నివసించుచు జపతపములు కావించుకొనుచుండెను.

అది పూర్ణిమ దినము. పూరిలో జగన్నాధస్వామి ఆలయములో స్వామివారి తిరునాళ్ళు జరుగుచుండెను. ఆ సమయములో ఆకాశమునుండి దేవ, గంధర్వ, కిన్నర కింపురుష లచ్చటికి అరుదెంచి స్వామివారి పాదతీర్థములు ప్రసాదము స్వీకరించి వలసిన వరములు పొందిరి. అదే అదనున సుమారి - ఠాకురాణి - మావులి మొదలగు అనేక గ్రామదేవతలు అచ్చటికి విజయముచేసిరి. జగన్నాధస్వామిని సందర్శించు వారందఱు తొలుత ద్వారపాలకుడగు కామదేవునకు నమస్కరించి మఱి గర్భాలయమునకు పోవలయును.

భగవద్దర్శనార్థియై వచ్చిన సూర్యుడు కామదేవునకు మ్రొక్కకుండ తిన్నగా గర్భాలయములో ప్రవేశించి జగన్నాధస్వామిని దర్శించెను.

సూర్యుడు తనకు మ్రొక్కకుండ తిరస్కరించెనని తలచి కామదేవుడు సూర్యునకు శృంగభంగము చేయనెంచి, సమయము కొఱకు నిరీక్షించుచుండెను.

ఒకనాడు చంద్రభాగ సముద్రతీర భూమినిగల సైకతస్థలిపైని ఆడుకొనుచున్నది. అది కాంచి మోహనాకారుడు, యువకుడు, అగు సూర్యుడు ఆమెను తిలకించి పులకించి ప్రేమాతిరేకమున తన వశము చేసికొన ప్రయత్నించెను. కామదేవుని మహిమచే

సూర్యుడు మైమఱచి యుక్తాయుక్త వివేకములేక చంద్రభాగను వెంటాడి బాధింప దొడగెను.

చంద్రభాగ తన తండ్రిని తక్క అన్యపురుషుని చూచి యెఱుగదు. కావున సూర్యునిచూచి భయపడి పాఱిపోయి సముద్రతీరమునగల రెల్లు దుబ్బులలో ప్రవేశించి అదృశ్యమయ్యెను.

సూర్యుడు అందు ఆమెను వెదకివెదకి ఎందునుగానక నిరాశాపూరితుడై వెనుకకు తిరిగివచ్చెను. కామదేవుని తిరస్కరించుటచే తనకా పరాభవము కలిగెనని పశ్చాత్తప్తుడయ్యెను. తన దోషమును మన్నింపుమని కామదేవుని వేడుకొనుటకై జగన్నాథస్వామి ఆలయమునకు వచ్చెను. అంతయు మార్పే. ఆలయము శిథిలమైయుండెను.

చంద్రభాగ తండ్రియగు సుమన్యుడు దివ్యదృష్టిచే జరిగిన వృత్తాంతమంతయు తెలిసికొని చంద్రభాగను 'నదివి కమ్ము' అని శపించెను.

చంద్రాభాగా నది కోణార్కలో సూర్యభగవానుని ఆలయము నొద్ద సముద్రములో సంగమించుచున్నది. రాధానాథకవి ఈ యితివృత్తమును చంద్రభాగ కావ్యములో అత్యంతమనోహరముగా వర్ణించెను. ఒరియా పండితులు అందఱు ఈ మహాకావ్యమును పురాణ గ్రంథము గావించి నిరంతరభక్తితో శ్రద్ధాపూర్వకముగా పూజించి పఠించుచుందురు. ఒరియా కవితారచనలో సిద్ధహస్తుడైన రాధానాథ కవి 1908 సంవత్సరములో దివంగతుడయ్యెను. ఆతని కావ్యములు ఒరియా సాహిత్యములో సుస్థిరములై శివంకరములై సుందరములై విలసిల్లుచున్నవి.

మధుసూదనరావు :

ఇతడు 1853 లో పూరిలో జన్మించెను. మెట్రిక్యులేషనులో ఉత్తీర్ణుడై ఉపాధ్యాయుడై క్రమముగా డివిజనల్ ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సు కూడ ఆయెను.

ఒరిస్సా రాష్ట్రములో మనము ఏ పాఠశాల కేగినను ఉదయము సాయంకాలము విద్యార్థుల రసనాగ్రముల నుండి యీ క్రింది పద్యములు రెండు, మధుర మధురముగా వినిపించుచుండును.

ఉదయ ప్రార్థన :

తెలతెలవాఱుచుండె నదె, దేవుని ప్రేమను మానవాళికిఁ
తెలుపగ పక్షిరాజములు తియ్యగ తియ్యగ పాడుచుండె, ఆ

కలరవమందు మీ మధుర కంఠములన్ కలియంగ జేయుచున్
కులుకుచు పాడుడీ! హరిని గూరిచి బాలకులార! భక్తితోన్.

(ఒరియాకు తెలుగు)

సాయం ప్రార్థన:

నా శరీరము ఆత్మయు నళిననాభ!
నీ చరణ పద్మములనుంచి నెమ్మితోడ
శరణు సొచ్చితి ననుబుజు సత్యమార్గ
మందు నడుపుము, ముంచునీయమృత జలధి.

(ఒరియాకు తెలుగు)

మధుసూదనుని మధురభావముల కీ రెండు పద్యాలు తార్కాణములు. ఋషి తుల్యుడని అతనిని ఓఢ్రులు పూజించుటకు కారణము అతని కవిత్వము నిత్య సత్య భావవిలసిత మగుటయె. 'నాఽనృషిః కవిః' అను సూక్తి ఈతనికే చెల్లునని ఉత్కళ పండితుల యభిప్రాయము.

వేదాంతియు భక్తుడు నగు మధుసూధనరావు భక్తిగీతములను గానముచేయని ఓఢ్రుడులేడు. మహత్తరములైన భగవన్మహిమల నితడు మృదుమధురశైలిలో గేయ ములుగా రచించెను. ఇతడు బ్రహ్మసమాజ మతమును స్వీకరించి ఓఢ్రుల సాంఘిక దురాచారములను ఖండించెను. సాధారణోపాధ్యాయుడైయున్న మధుసూదనరావు, విద్యాశాఖాధికారిగా ఉన్న రాధానాధుడు' పత్త్రికా సంపాదకుడుగా ఉన్న పకిరు మోహనుడు — ఈ ముగ్గురు ఒకప్పుడు బాలసోరు పట్టణములో సమావేశమైరి.

మార్గములు వేరైనను వీరు ముగ్గురికి గమ్యస్థాన మొక్కటే. వారు కోరునది ఒరియా భాషాభివృద్ధి, ఏకమనస్కులై వారు ఒరియాభాషను భిన్నమార్గములలో వృద్ధిచేయ సంకల్పించిరి. ఒరియా ప్రజలను విజ్ఞానవంతులనుచేయు చరిత్రలను గణిత శాస్త్రములను విజ్ఞానశాస్త్రములను పకీరు మోహనుడు వ్రాసెను. రాధానాధుడు మధు సూదనుడు జానపదులకు ఉత్తేజము కలిగించు వీరగాథలను గేయములుగా, పద్య ములుగా వ్రాసి పల్లెపల్లెను గానము చేయించిరి. ఆ గేయపద్యములు ఒరిస్సా రాష్ట్రి మంతటను ఒక నూత్నవికాసమును నూతనోత్తేజమును కలిగించెను.

నేడును ఓడ్రు లీ పద్యములు కంఠస్థములుచేసి అనర్గళముగా గానముచేయు చున్నారు. ఈ పద్యరచనలో మధుసూదనునదే పయిచేయి.

ఆదర్శకవి, నిరాడంబర జీవి, పూర్వాచారాపరాయణుడు నిత్యసత్యవ్రతుడు విద్యావేత్త, విజ్ఞానఖనియైన మధుసూదనుడు కటకములో ట్రయినింగు స్కూలు ప్రిన్సిపాలుగా ఉండి తన పద్యములు ట్రయినింగునకై వచ్చిన ఉపాధ్యాయులచే వల్లింప జేసి వారిద్వారా పల్లెపల్లెలోను చదువుకొను విద్యార్థులచే కంఠస్థములుచేయించి చరితార్థు డయ్యెను. దైవభక్తిలో లీనమైనప్పు డీతడు బాహ్యప్రపంచమును పూర్తిగా మఱచి పోయి దైవమునుగూర్చి గానము చేసెడివాడు. ఆ భక్త్యావేశములో రచింపబడినదే హిమాలయ యాత్రాత్మకమగు కావ్యము. ఈ కావ్యము దైవమును తెలిసికొనుటకు ప్రకృతియే మూలాధారమని నిరూపించును.

శీలము, నియమము, పాండిత్యము, కవిత్వము, గురుత్వముకల మహాకవిగా మధుసూదనుడు పేరుగాంచెను. అతడు విశ్వమానవ సౌభ్రాత్రమును ఆకాంక్షించెను. విజ్ఞానార్జనమే మానవౌన్నత్యమునకు మూలమని అతని విశ్వాసము.

వేషభాషలు వేఱైన వివిధ దేశ
వాసు లందఱు దేవుని భావమందు
ఒక్కటే యని యెంచుడీ ఉర్వీజనులు
ప్రణయమైక్యము ప్రాచ్యుల ప్రాచ్యులనెడు
భేదభావంబులను మాన్చు విందులరయ.

(ఒరియాకు తెలుగు)

అను నీ పద్యమాతని ఆదర్శములకు ఆదర్శము. 1912 లో మధుసూదనుడు భగవదైక్యత పొందెను.

పకీరు మోహనసేనాపతి, రాధానాథ మధుసూదనరావు అను ముగ్గురు మహా కవులు ఎందఱో ఒరియా కవులకు మార్గదర్శకులైరి. వీరిని ఆదర్శకవులు గావించి వీరి మార్గము ననుసరించి కవనము చెప్పిన వారిలో ముఖ్యులు

1. గంగాధర మెహర్

2. నందకిశోర్ అనువారు.

గంగాధర మెహర్ :

ఇతడు సంబలపూరు దగ్గఱనున్న బారపల్లె అను గ్రామమున సాలె (మెహరు) కుటుంబమున జన్మించెను. అయిదవ తరగతి వఱకు వీధిబడిలో చదివెను. క్రమముగా సంస్కృతము, హిందీ, బెంగాలి భాషలలో పాండిత్యము గడించెను. ఇంగ్లీషులో కూడ పరిచయమున్నది. తాత తండ్రులవలె ఇతడును నేతవృత్తినే చేపట్టెను. ఇతడు గ్రాంధికభాషలో ఎన్నియో మధుర కావ్యములు వ్రాసి మహాకవియని ప్రసిద్ధికెక్కెను. ఈతని ప్రఖ్యాతివిని బోగ్రా సంబార్ పట్టణవాసియగు జమీందారు గంగాధర మెహరును తన యాస్థానమునకు రావించుకొని పోషించి గౌరవించెను. రాజాదరణముచే ఇతనికి దారిద్ర్యము తొలగిపోయెను. సిరిసంపదలు కలిగెను. స్తిమితము లభించెను. తపస్విని' అను మహోత్తమ కావ్యమును రచించెను. ఇందు వాల్మీకి ఆశ్రమములో ఉన్న సీతా దేవిని సుగుణాలవాలగా ఆదర్శస్త్రీగా చిత్రించెను. పద్యరచనలో ఈతనికి ఉన్న నైపుణ్యము మఱే ఒరియా కవికిలేదు. ఇతనికి ఉపజ్ఞకంటె ప్రతిభ హెచ్చు. పూర్వ కవుల కవితా రీతులన్నియు ఆకళించుకొని వాని నన్నింటిని తన సొంతములు చేసికొని రంగురంగుల చిత్రవస్త్రములు నేయుటలో తనకు గల నేర్పు అంతయు తన కవితా శిల్పములో చూపెను.

కాళిదాసు మహాకవి కావ్యములలోని - ఉపమరూపకము - ఉత్ప్రేక్ష - స్వభావోక్తి - మున్నగు అలంకారము లన్నియు ఔచిత్యానుసారముగా సందర్భోచితముగా ఈతని తపస్విని కావ్యములో వాడబడినవి. పదప్రయోగ నైపుణ్యములో ఇతని కితడే సాటి. ఈతని వర్ణనములు కూడ అపూర్వములు - రమణీయములు. విశిష్టములు. కొమ్ములు తిరిగిన మహాపండితులు ఈతని కావ్యములను అన్యభాషలలోనికి అనువదింపనెంచి సఫలత గాంచలేక తలలు వంచిరి. పద్యకావ్యములే కాక నీతిదాయకము లగు కీర్తనలు కూడ ఈతడు రచించెను.

రాజాశ్రయయము లభింపకపూర్వము నిత్యదారిద్ర్యము అనుభవించునపు డీతడు తన కష్టములను పాటింపక చక్కని చిక్కని భావములతో తియ్యని పద్యములు హృద్యముగా రచించెను.

"ఓయి జీవయాత్రా సహాధ్యాయులార !
సృష్టి సౌందర్య మెవరు వర్ణింపలేరు

చారుతరమైన యీ ప్రపంచంబులోన
తల్లిప్రేమయు, ప్రియురాలి చల్లనైన
ప్రణయరాగంబు, మిత్రుని నమవుఁ దనపు
భాషణంబును, జ్ఞాని సుభాషితంబు
మనుజు కష్టాలు తొలగించి మనుచుచుండు
మహిత నూత్నవికాసంపు మార్గమొసగు
సృష్టి మర్మము లన్నియు నెఱుకచేయు
నీళు లెగజిమ్ము పుష్కర నాళికలటు
ఉల్లమున కుల్లాసంబు పెల్లుగూర్చు.
ఓ పరాత్పరా ! విశ్వరూపోన్నతాత్మ !
నిన్ను ధ్యానింప రుద్రాక్ష లెన్నవలయు
చిత్ర చిత్రంపు రమ్యనక్షత్ర కోటి
భవ్యభవదీయ మహిమము నవ్యరీతి
కళ్ళకుం గట్టినట్టుగా వెల్లడించు.
నీ చరణధూళి సోకక నే తరింప
ఎల్లగోళాలు నీవు సృష్టించినట్టి
అమల పరమాణువులు ప్రపంచమున యందు
ఏదియును నీవులేనిది లేదులేదు
నీదికానిది ఏదియు లేదులేదు.
సర్వసర్వం సహా మహాచక్రవర్తి !
మ్రొక్కులిడుచుంటి నీకు సంపూర్ణభక్తి
కరములను మోడ్చి కైకొని కావుమయ్య !

(ఒరియాకు తెలుఁగు)

ఇతడు పూర్వకవులను అనుకరించినను సర్వత్ర ఇతని కవితలో నవ్యత గోచరించుచుండును. ఆంగ్లప్రభుత్వమువారు చేసిన అమానుష చర్యలను ఈతడు భారతి, బాబ్నా అను గ్రంథములో నిశితముగ ఖండించెను.

పల్లెటూరి రైతులకు విజ్ఞానము కలుగుటకై - కృషి - సస్యరోగనివారణ - గోపోషణ మొదలగు విషయములపై కూడ ఇతడు పద్యములు వ్రాసెను. వానిని రైతులు కంఠస్థములు చేసి అందు సూచించిన భావములను ఆచరణములోపెట్టి సస్యాభివృద్ధికావించుకొని సుఖపడెడివారు.

పురాణ భావములన్నియు ఒంటబట్టిన యీతడు చాల నిరాడంబరముగా జీవించెడివాడు. ఎల్లవారు ఈతని భక్తి ప్రపత్తులతో గౌరవించెడివారు.

ఆంగ్లేయులను ధిక్కరించి స్వరాజ్యము నార్జించి స్వాతంత్ర్యముతో జీవించుడని ప్రజలను ప్రబోధించుచు ఈతడు చాల పద్యములు వ్రాయుటయే కాక పరప్రభుత్వోద్యోగులు చేయు నిరంకుశ పరిపాలనా విధానములను కూడ నిర్భీతిగా ఖండించెను.

ఈతని యింటిలో ఏమూల చూచిన ఇతడు రచించిన వ్రాతపుస్తకములు కట్టలు కట్టలుగా పడియుండెడివి. నిరతము ఎందఱో యీతని యింటికి వచ్చి ఆయాయి పుస్తకములలోని పద్యాలు చదివించుకొని విని ఆనందించెడివారు. తన పుస్తకములు అచ్చు వేయించుడని ఎవరిని ఈతడు ప్రార్థింపలేదు.

ఆత్మ విశ్వాసము, ఆత్మగౌరవముగల ఈ మహాకవియెడ కవిత్వమునెడ కవులకు పండితులకు కృషికులకు జానపదులకు ముముక్షువులకు స్త్రీ బాల వృద్ధులకు అందఱకు అపారమగు గౌరవము - భక్తి.

ఒరిస్సాలోని మహాకవులలో ఇతడు కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసుగా గణుతింపబడుచున్నాడు. ఒరియా భాష ప్రాచీన సంప్రదాయమును కోలుపోకుండ నిలిపిన గంగాధర మెహరునకు ఒరిస్సా దేశములోని అన్ని వర్గములవారు జోహారు లర్పించుచున్నారు. గంగాధర మెహరు కావ్యములు అనశ్వరములు.

## నందకిశోర్ :

ఇతడు జానపద కవి. ఆంగ్ల సంస్కృత భాషలలో ఆఱితేఱిన పండితుడు. మాతృ భాషయగు ఒరియా భాషా పాండిత్య మతనికి వెన్నతో బెట్టినదే.

మహానగరములలో విద్యాశాఖోద్యోగియయ్యు ఇతడు తాను పుట్టి పెరిగిన పల్లెటూరి ప్రజలను, వారి అలవాట్లను, వారి ఆచార వ్యవహారములును, బాగుగా అవగాహన చేసికొని వీరరస ప్రధానములగు పద్యములు చాల వ్రాసెను.

తాను చిన్ననాట వీధిబడిలో చదువుకొనిననాటి తన అనుభూతులన్నింటిని జ్ఞప్తికి తెచ్చుకొని 'పల్లీ చరిత్ర' అను పద్య కావ్యము వ్రాసెను. ఇతని కవితలో రాధానాథుని కవిత్వపు ఛాయలు ప్రతి పదమునను ప్రతిబింబించుచుండును.

పల్లీ చరిత్రలో పాత్రలు ఒక 'వీధిబడి' అందు చదువురాని పిల్లలను వ్రేళ్ళు విఱుగగొట్టి గోడకుర్చీలు వేయించు కఠిన హృదయుడగు బడి పంతులు, ఆయనను పెనుభూతముగా చూచి భయభ్రాంతులగు అమాయకులగు పిల్లలు, సోమరాయడగు పల్లెటూరి మంగలి, కోకిలకాకలి కంఠములతో జానపద గీతములు పాడు ముష్టిబాలికలు నర్మగర్భముగాను – అమాయికముగాను మాటలాడు పల్లెపడుచులు తిరికగా గీత గోవిందములు గానముచేయు భక్తురాండ్రు, దంభాచారపరాయణులగు గ్రామ పురోహితులు, వారి దైనందిన చర్యలు కథావస్తువులుగా 'విశ్వశ్రేయః కావ్య'మ్మను నీతి కుదాహరణభూతముగా వ్రాసెను. ఇతని ప్రతి పద్యములోను నిత్యకళ్యాణము పచ్చ తోరణము అయి భాసిల్లు పల్లెటూళ్ళ వాతావరణము ప్రతిభాసింపుచుండును.

## మహారాజ శ్రీ విక్రమదేవవర్మ :

ఇతడు సంస్కృతాంధ్రములందును ఇంగ్లీషు, హిందీ, ఒరియా భాషలందును పండితుడు కవి.

ఈయన జన్మస్థానము గంజాము జిల్లాలోని ముఖలింగమువద్దగల నగరికటకము. తండ్రి కృష్ణచంద్రదేవు. విశాఖపట్టణము జిల్లా మాడుగల 'జమీందారిణి'కి దత్త పుత్రుడై విశాఖపట్టణములో నివసించుచు వార్ధకమున జయపుర సంస్థానమునకు మహారాజాయెను. సాహిత్య సమ్రాట్టు, కళాపూర్ణ, విశ్వదాత, బిరుదములు పొంది ఆంధ్ర విశ్వకళాపరిషత్తును, ఉత్కల విశ్వవిద్యాలయమును లక్షలు విరాళమిచ్చి పోషించెను.

కవియై కవితాపోషకుడైన ఈ మహారాజ కవికి ఉత్కలాంధ్ర సాహిత్య చరిత్రలయందు ఎన్నదగిన స్థానమున్నది. గ్రాంథిక భాషావాది. గ్రామ్య భాషా విముఖుడు. తెలుగులోను, ఒరియాలోను అనేక సారస్వత వ్యాసములు గద్య పద్య కావ్యములు వ్రాసిన ప్రౌఢ కవి. పింగళ సూరన్న కళాపూర్ణోదయమును ఒరియా భాషలో వచన కావ్యముగా వ్రాసి ఉత్కల విశ్వవిద్యాలయ విద్యార్థులకు ఆ కావ్యము పఠనీయ గ్రంథముగా చేసెను. బుద్ధ చరిత్రను ఒరియాభాషలో నాటకముగా రచించెను.

కవి, పండితుడు, నాటకకర్త, నటకుడు, విశ్వదాత, ఆంధ్రోత్కల విశ్వవిద్యాలయాధ్యక్షుడుగా శ్రీ విక్రమదేవవర్మ ఖ్యాతిగాంచెను.

సంస్కృతమునందును, తెలుగునందును, ఉత్కలమునందును కావ్యములు వ్రాసిన కవులు తమ కావ్యములకు శ్రీ విక్రమదేవవర్మగారి ఆమోదముద్రపడినచో తమ జన్మ తరించినట్లుగా తమ పాండిత్య కవిత్వములు సార్థకమైనట్లుగా ఆనందించెడివారు.

ఆంధ్రోత్కల పుంభావ సరస్వతియైన శ్రీ విక్రమదేవవర్మ సరసహాస్య సంభాషణ చతురుడు, నృత్త, నృత్య, నాట్య, సంగీతములు నేర్చిన రసికావతంసుడు, సంస్కృత శబ్దోచ్చారణములో యావద్భారతదేశములోను ఆంధ్రులదే పైచేయి అని వారి విశ్వాసము.

గోపాలచంద్ర ప్రహరరాజు :

ఇతడు గద్యపద్య కావ్యకర్త. ఇతడు వ్రాసిన ప్రతి వాక్యములోను హాస్యము తోడి దూషణ ద్యోతకమగుచుండును.

ఇతడు ప్లీడరీ వృత్తిచే జీవించువాడు. కావున తన కాలమునాటి సంఘటనలను ఉత్కల సాహిత్య అను పత్రికద్వారా ప్రకటించెను.

ఆ రోజులలో మాత్రమే వాటికి కొంత ప్రచారముండెడిది. నేటి ఒరియా పాఠకుల కది రుచించుటలేదు. ఇతని రచనలకు పకీరు మోహానుడు మార్గదర్శి. కటక్ జిల్లా వాడుక భాషలో తన వ్యాసములు వ్రాసెను. కోర్టు మజా అంతయు కోర్టుభాషలో వ్రాసెను. చమత్కారము, హాస్యము, మాటవిఱుపులు, పలుకుచురకలు ఈతని వ్యాస రచనలలో గోచరించును.

చరమదశలో ఇతడొక ఒరియా నిఘంటువును రచించెను. అందలి అర్థ నిర్ణయములు పండితామోదమును గాంచలేదు.

గోపబంధుదాసు :

సత్యవాది సంఘము, పల్లె కథలు, పల్లె నీతులు వ్రాసి యీతడు కొంత కీర్తి కాంచెను. అన్ని రంగములలోను నూతనత్వమును పెంపొందించుకొనిన ఉత్కల సాహిత్య వేదికపై ప్రకాశించిన వారిలో గోపబంధుదాసుకూడ ఎన్నదగినవాడు. ఇతడు సాక్షి (సఖి) గోపాల్ అను గ్రామములో సుందరారామస్థలిలో 'సత్యవాది సంఘము' స్థాపించెను. ఈ సత్యవాది కవి సంఘములోని వారందఱు ప్రత్యేకోత్కల రాష్ట్ర నిర్మాణమునకై ప్రబోధ వాఙ్మయమును వివిధ రీతులలో వెలయించిరి. వీరి ప్రతి

రచనయందు భారతీయ సంస్కృతీ పునఃప్రతిష్ఠ, భారతదేశ దాస్యవిముక్తి, ప్రాచీనోత్కళ భాషావికాస నిరతి గోచరమగును. వీరు ప్రాత వృత్తములను వీడి క్రొత్త ఛందస్సులను సృష్టించిరి. వ్యావహారిక భాష దేశాభివృద్ధికి జీవగఱ్ఱయని భావించిరి.

అంతలో గాంధి ఉద్యమము ఆరంభమయ్యెను. గోపబంధుదాసు అసహాయోద్యమములో చేరెను. దానికి ప్రతిఫలముగా హజారీబాగ్‌లో 1924-26 వఱకు జైలుశిక్ష అనుభవించెను.

లోకమాన్య బాలగంగాధరతిలక్ మాండలే జైలులో గీతా రహస్యమును వ్రాసెను. గోపబంధుదాసు 'బందిర్-ఆత్మకథ' 'ధర్మపాద' అను రెండు గ్రంథములు జైలులో వ్రాసెను.

'బందిరీ-ఆత్మకథ' గోపబంధుదాసుయొక్క ఆత్మకథ. కారాగారములో అతడు గడపిన ఏకాంతవాసము-పడినపాట్లు అనుభవపూర్వకముగా వ్రాసెను.

'ధర్మపాద' కోణార్క దేవాలయమును నిర్మించిన తాపీపనిచేయు కుఱ్ఱవాని చరిత్ర. ఈ పనివాడు తన జీవిత సరస్వమును కోణార్క దేవాలయ నిర్మాణమునకే అర్పించి యెట్లు ధన్యుడయ్యెనో గోపబంధుదాసు తీర్చిదిద్ది, కావ్యము వ్రాసెను. ఈ కావ్యము ఉత్కల సాహిత్య చరిత్రలో ఒక స్థానము నార్జించుకొన్నది. ఈతడు జైలులో ఉండుటతో ఇతని గురుకులము మూలబడెను. సాహిత్య ప్రచారము నిలిచిపోయెను.

## కృపాసింధు మిశ్రా :

ఇతడు గోపబంధుదాసునకు సహాధ్యాయి కోణార్క - బారబతి - ఉత్కలేతిహాసము - అను మూడు చారిత్రక గ్రంథము లీతడు వ్రాసెను. ఈ మూడును చరిత్ర పరిశోధకుల మన్ననకు పాత్రములయ్యెను.

## గోదావరి మిశ్రా :

చారిత్రకములగు వీరగాథలను సామాన్య ప్రజలు పఠించుటకు అనువగునట్లు బిలిబిలి పలుకులతో పద్యములు వ్రాసి, ఒరియా భాషా వికాసమునకు తోడుపడెను.

**నీలకంఠదాసు :**

ఈతడొక మహామహుండు. మహా పండితుడు, ఒరియాదేశ చరిత్ర, సంప్రదాయములు, ఆచార వ్యవహారములు, ఆహారవిహారములు పూర్తిగా పాటించువాడు. మాయాదేవి, కోణార్క, కరవేల అను మూడు గ్రంథములను క్రొత్త పదములతో క్రొత్త భావములతో, క్రొత్త ఉపమలతో, క్రొత్త ఛందస్సులో అంత్యానుప్రాస నియమముతో వ్రాసెను. పండిత బిరుదమును పొందెను.

వీరి వినూత్నకవితా ప్రభావము ఒరియా ప్రజలలో నూత్నవికాసము రేకెత్తించెను.

సత్యవాది సంఘములోని కృపాసింధు మిశ్రా, గోదావరి మిశ్రా, పండిత నీలకంఠదాసు మున్నగువారు పేరెన్నికగన్న ప్రబోధ కవులు; నూతనోద్యమ నిర్మాతలు.

రాజకీయార్థిక సాంఘికవిషయములలో ఓఢ్రులను ముందుకు తీసికొనిపోవుటయే యీ సత్యవాది సంఘ కవుల ధ్యేయము. వీరన్ని రంగములలోను అడుగుపెట్టి ఒరియా ప్రజలకు అండదండలై సారస్వతాలంబనముతో ఒరిస్సాదేశ స్వరూప స్వభావములను మార్చివైచి నూతన శకసృష్టికర్తలైరి. గోపబంధుదాసు పూర్తిగా రాజకీయ రంగములో మునిగిపోవుటచే మిగిలినవారు సాహితీరంగములో నిలిచి భాషాసేవ చేసిరి.

గోపబంధుదాసు మానవ సేవయే మాధవ సేవగా తలచి ఒరియా ప్రజలను ఉద్ధరించెను. ఒరియా ప్రజలు ఇతనిని కవిగా, ఋషిగా, దేశబంధువుగా విద్యావాచస్పతిగా తమ మనఃఫలకములపై చిత్రించుకొని పూజింతురు.

ఇతడు ఉపన్యాస వేదికపై నిలిచి అంబుద గంభీర స్వరముతో ఉపన్యసించునపుడు విని ఒరియా ప్రజలు ఉఱ్ఱూతలూగెడివారు, ఏడ్చెడువారు, నవ్వెడువారు, గంతులిడెడివారు, లేచెడువారు, కూర్చుండెడువారు అని కని వినిన పెద్దలు చెప్పుచున్నారు.

విద్యార్థి దశలోనే ఇతడు కవియై ప్రజల నుత్తేజపఱచి రాజకీయవేత్తయై సాక్షి (సఖి) గోపాలమువద్ద గురుకులము స్థాపించి ప్రజలు నీతినియమబద్ధులై జీవింపవలెనని బోధించెను.

ఈ గురుకులము ఇరువేదేండ్లు అవిచ్ఛిన్నముగా సాగెను. అందు విద్యాభ్యాసము చేసిన విద్యార్థులు కుశాగ్రబుద్ధులై, త్యాగులై, ఒరియా సంస్కృతికి ప్రతిబింబములై ప్రకాశించిరి.

గోపబంధుదాసు సమాజ్ పత్రిక స్థాపించి సంఘసేవయు, సత్యవాది సంఘము, నెలకొల్పి సాహిత్యసేవయుచేసి ఒరియా ప్రజల కన్ని రంగములలోను చైతన్యము కలిగించెను.

హరికృష్ణ మెహతాబ్ :

అసహాయోద్యమము, ఉప్పు సత్యాగ్రహము జరుగుచున్న రోజులలో కూడ హరికృష్ణ మెహతాబ్ సాహిత్యసేవ చేయుచునే ఉండెను. ఇతడు ఇంగ్లీషులో, సంస్కృతములో, ఒరియాలో, బెంగాలిలో, హిందిలో మహా పండితుడు. మహాకవి, మహా దేశభక్తుడు. ఇతడు నవలలేకాక ఉత్కలదేశ చరిత్ర, ఉత్కల సాహిత్య చరిత్ర. కూడ వ్రాసెను.

స్వతంత్ర భారతములో ఇతడు కాంగ్రెసు ప్రభుత్వములో ఒరిస్సా రాష్ట్ర ముఖ్య మంత్రిగాను, లోకసభా సభ్యుడుగాను, బొంబాయి రాష్ట్ర గవర్నరుగాను విఖ్యాతికాంచెను. రాజకీయ రంగములోను, సాహిత్య రంగములోను మహత్తర కీర్తి కాంచుచున్నవారిలో హరికృష్ణ మెహతాబు ముఖ్యుడు.

ఈ రోజులలో బాలకిశోరదాసు మున్నగు కవులు కూడ కొందఱు జాతీయ గీతాదులు వ్రాసిరి. మఱికొందరు ప్రత్యేకోత్కల రాష్ట్ర నిర్మాణమునకై ప్రబోధ గీతములు వ్రాసిరి. తాత్కాలిక ప్రయోజనము కలవగుటచే అవి యన్నియు అణగి పోయినని.

వఝ్ఝుల వేంకటేశ్వర్లు :

ఈయన తెలుగువాడు. ఆరామ ద్రావిడశాఖీయ బ్రాహ్మణుడు. బి.ఎ.బి.యిడి., పట్టభద్రుడు. ఆంధ్రోత్కల భాషలలో చక్కని కవిత్వము చెప్పగల దిట్ట. ఈతడు తెలుగులో వ్రాసిన నౌకా భంగము అను కావ్యమును ఒరియాలోకూడ వ్రాసి ఉత్కల ముఖ్య మంత్రుల మన్నన కాంచెను. నౌకా భంగము విశ్వవిద్యాలయ విద్యార్థులకు పఠనీయ గ్రంథమై పేరు గాంచెను.

ఈయన జయపురమున స్థిరావాస మేర్పఱచుకొనెను. కోరాపుట్టి జల్లాలోని ఒక హైస్కూలులో ప్రధానోపాధ్యాయుడుగా ప్రస్తుతము పనిచేయుచున్నాడు.

సబూజ సంఘము (నిత్యశ్యామల సంఘము) :

ఈ పేరుతో వెలసిన యీ సంఘములో కళాశాలా విద్యార్థులు అభ్యుదయ కవితావాదులు ఇందు సభ్యులుగా ఉండి వంగ కవితా ప్రభావము ఒరియా కవితపై ప్రసరింపకుండ అరికట్ట సమకట్టిరి. ఈ సంఘమువలన చెప్పుకోదగిన సాహిత్య సేవ యేమియు జరుగలేదు.

కళింగ సాహిత్య సమాజము :

ఇది గంజాము జిల్లాలో స్థాపింపబడినది. ఇందు సభ్యులైన కవులు ఉపేంద్ర భంజి మొదలగు ప్రబంధ కవుల మార్గము ననుసరించి కావ్యములు రచించిరి.

అభ్యుదయ కవిత :

కొందఱు ఉత్కల కవులు అభ్యుదయ కవిత పేరుతో పూర్వ సంప్రదాయములను కవి సమయములను ఛందోలంకారములను త్రోసి రాజని విదేశీయుల కవితా రీతులను అనుసరించి కవితలల్లుచున్నారు. తమ కవితా ప్రచారమునకై వీరు పత్రికలు కూడ కొన్ని ప్రచురించుచున్నారు.

ఆనంద శంకరరాయ :

ఇతడు ఒరిస్సాలో స్థిరనివాస మేర్పఱచుకొనిన బెంగాలి కవి. ఠాగూరు పంథా ననుసరించి కొన్ని ఒరియా పద్యాలు వ్రాసెను. ఇతని కవితా ప్రభావముచేతనైననేమి సరిహద్దుననే ఉన్న బెంగాలీ మహాకవి ఠాగూరు కవితా ప్రభావముచేతనేమి ఒరియా సాహిత్య చరిత్రలో నవశక మారంభమాయెను.

సొబిరౌతురాయి :

ఇత డీ శతాబ్దపు విప్లవాత్మక భావభాసితుడగు యువకవి యని కాళిదాసు నాగు మున్నగువా రీతనిని ప్రశంసించిరి.

ఇతని గేయకవితలో పేరెన్నిక గాంచినది 'ఛోటుమెన-బాయ్' అనునది.

1938 సంవత్సరములో ఒరిస్సాలోని జమీందారులు రైతులను నానా బాధలు పెట్టుచుండిరి. రైతులచే ఓరంత ప్రొద్దు వెట్టిచాకిరీ చేయించుకొనెడువారు. వారికి 'దిన వెచ్చమైన' ఇచ్చువారు కారు. పంటలు లేకపోయినను పన్నులు కట్టుడని నానాహింసలు

పెట్టెడివారు. తన పొలములోని చెట్టున పండిన పండుకోసికొని తినుటకు ఏ రైతుకు హక్కులేదు. దమ్మిడీ విలువచేయని జమీందారుగారి నౌకరుకు ప్రతి రైతు వంగి సలాము చేయవలసినదే.

జమీందారులు పెట్టు ఈ బాధలు పడలేక ప్రజలు 'ప్రజా మండలులు' స్థాపించి జమీందారుల దుర్న్యయములను బహిరంగముగ ఖండించుచు వారి యత్నములు సాగకుండ చేయుచుండిరి.

అది 1938 సంవత్సరము అక్టోబరు 10వ తేది బ్రాహ్మణీనది సహజవేగముగా ప్రవహించుచున్నది. ప్రజా మండలి సభ్యులను అణచుటకై జమీందారులు బ్రిటిషు దొరతనమువారిమద్దతును కోరిరి. వారు జమీందారులకు సాయపడవలసినదిగా హుకుము జారీ చేసిరి. పోలీసులు జమీందారులకు సాయపడి ప్రజోద్యమమును అణచుటకై తుపాకులు ధరించి యమకింకరులువలె బ్రాహ్మణీనది వద్దకు వచ్చిరి. ఆ నదిని దాటి వెళ్ళి వారు జమీందారునకు వాసట కావలెను. రేవులో ఉన్న పడవ ప్రజామండలివారిది. దానిపై పండ్రెండు ఏండ్ల బాలుడున్నాడు. పోలీసులు ఆ కుఱ్ఱవానినిగాంచి సాహంకారులై పడవను తమ కిమ్మని గద్దించిరి. ఆ కుఱ్ఱవాడు నిర్భీకుడై "మీరు ద్రోహులు, ప్రజా విరోధులు మీకీ పడవ ఈయవీలులేదు. పొండు. మరో పడవ తెచ్చుకొనుడు. ఇది మా సొంత 'నావ' అని సమాధానమిచ్చెను. అది విని పోలీసులు కోపోద్దీపితులై ఆ పిల్లవానిని తన్ని యీడ్చి పడవ స్వాధీనము చేసికొని నదిని దాటుచుండిరి. పడవ నదిలో కొంతదూరమేగెను. 'బాజీ రవుత్' అను ఈ కుఱ్ఱవాడు కేకలు పెట్టెను. ఆ కేకలు విని చుట్టుపట్టులనున్న పడవవాండ్రు పరుగుపరుగున వచ్చి 'పడవ ముందుకు పోరాదని' అడ్డగించినారు. పోలీసులు తుపాకులు ప్రేల్చినారు, అంతా భీభత్సము.

ఈ సన్నివేశమును సాబిరౌతరాయి గేయములుగా కూర్చి గానము చేసెను.

మొదటి కీర్తనలో సాబిరవుతురాయి ప్రజాపీడనచేయు నిర్దయాత్ముని సంబోధించుచు.

ప్రేల్చరా ! ప్రేల్చరా ! ప్రేల్చు తుపాకీ
గుఱిచూచి మఱి ప్రేల్చు గుండెలివిగోరా !
నీ గుండు బారులకు నీ లాఠి దెబ్బలకు
కొండలై నిల్చెరా మా గుండె లివిగో

ప్రేల్చరా! ప్రేల్చరా! ప్రేల్చు తుపాకీ
ఓ కర్కశాత్ముడా! ప్రేల్చు తుపాకీ!

అని ఉద్రేకముతో పాడెను. ఈ కీర్తన ప్రజా హృదయములలో కోపాగ్నిని రగులు కొల్పినది; వీరత్వమును రేకెత్తించినది. ఒళ్లు పులకింపజేసినది. ఓఢ్ర జాతికి స్వాతంత్ర్యోద్బోధ చేసినది.

పీడితప్రజానీకము హృదయాలలో సొబిశాతురాయి విలీనుడై నిస్తేజమై నిర్వీర్యమై యున్న ఓఢ్రజాతిని తన నవకవితాశక్తిచే వీరజాతిగా మలచినాడు. ఈతని కథానికలలో, పద్యములలో, గేయములలో సామ్యవాద సిద్ధాంతములు నవభావ విలసితములై వెల్లివిరియుచుండును. ఈతడు ప్రస్తుతము కలకత్తాలో నివసించుచున్నాడు. ఓఢ్రులందఱు ఈతనిని ప్రజాకవి యని అఖండముగా గౌరవించుచుందురు.

## గోపీనాథ మహంతి

## కానుచరణ మహంతి

వీరు సోదర కవులు. గోపీనాథ మహంతి అనాదినుండియు ఎదుగుబొదుగు లేకుండ అణగిపడియున్న ఆదివాసులనుగూర్చియు కొండ జాతులనుగూర్చియు పరజ-సవరలను గూర్చియు పెక్కు నవలలను వ్రాసెను. ఇతని కథాకథనశక్తి శైలి అంతయు వినూతనము. భాష అంత మృదుమధురమైనది కాదని కొందఱి తలంపు. ఇతడు వ్రాసిన 'అమృత కె సంతాన్' అను నవలకు కేంద్ర సాహిత్య అకాడెమీవారు అయిదువేల రూపాయలు బహుమానముగా ఇచ్చినారు. ఈ నవలలో నూట ఒక్క ప్రకరణములు కలవు. చిన్న సైపులో (ఇంగ్లీషు బాడి) డెమ్మీ సైజులో 599 పేజీల నవల యిది. దీనిని పురిపండ అప్పలస్వామిగారు 'అమృత సంతానం' అను పేరుతో తెనిగించిరి. అద్దేపల్లి అండుకో రాజమహేంద్రవరమువారు సాహిత్య అకాడెమీ పక్షమున ప్రకటించిరి. ఈ నవలనుగూర్చి ఒరిస్సా ముఖ్య మంత్రియగు హరిక్రృష్ణ మెహతాబ్‌గారు ఇట్లు తమ అభిప్రాయమును వెల్లడించిరి.

'భారత ప్రజానీకంలో కొండజాతి అని అంటున్న ఒక తెగ వుంది. ఆ తెగ ప్రజలు ఎంత నిరాడంబరులో, ఎంత శాంతమూర్తులో వాళ్ళమధ్య నివసించినవారే తెలిసికొనగలుగుతారు. వాళ్ళను అమృత సంతానం అనగలుగుతారు. అదిగో ఆ అమృత సంతానమే ఈ నవల పేరు. శ్రీ గోపీనాథ మహంతికి తన ఉద్యోగ జీవనంలో ఈ కొండజాతి ప్రాంతంలో ఎన్నోమాట్లు నివసించే అవకాశం దొరికింది. ఎన్నో

విధాల వాళ్ళతో కలిసి మెలిసి వాళ్ళ సంసర్గ సంపర్కాలు కలిగించుకోగలిగాడతడు. అందుకనే అతడికి ఈ అమృత సంతానం గురించి ప్రామాణికంగా రాయడానికి కావలసిన యోగ్యత ఉంది. నిజానికి ఈ నవల ఒడిశా దక్షిణ భారతంలోని కొండ జాతి జీవనమే వర్ణిస్తూంది, రకరకాల ఎగుడు దిగుళ్ళ సాంఘిక సభ్యత కారణంగా శతాబ్దులనుంచి తోడి సోదరులతో విడిపోయి వారి దృష్టికి మరుగైపోయి బ్రతుకుతున్న లక్షలాది ప్రజల సుఖ దుఃఖాలు అచ్చుగుద్దినట్లు బలీయంగా చిత్రించాడు రచయిత. కొండ జాతులమీద ప్రత్యేక శ్రద్ధ చూపించవలసిందని తన ప్రభుత్వోద్యోగుల్ని హెచ్చరిస్తూ అశోక చక్రవర్తి చెక్కించిన శిలా శాసనాలు ఒడిశాలో రెండు చోట్ల ఈ వేళ కూడా ఉన్నాయి. సభ్యతకు ఆవలపడివున్నవాళ్ళను సద్ధరం అంటే నిజమైన సభ్యత దారికి తీసుకురావడం కర్తవ్యం అని దీనికి సంబంధమున్న యావన్మందినీ హెచ్చరిస్తున్నాయి ఇవి. గోపీనాథ మహాంతి నవల నిజంగా అశోకుడి ఆ మహా సందేశంవేపు వేలు చూపుతూ ఉంది. సందేహంలేదు. భారతీయ పాఠకులు ఈ నవల మూలంగా తమ సోదరులలో వొక తెగ మనుషులు ఒడిశా అడవుల్లో ఎలా బతుకుతున్నారో తెలుసుకోగలుగుతారు.

ఇక నవలలోని సాహిత్య ప్రతిభ విషయం ఒడిశా సాహిత్యంలో ఇది సర్వోత్కృష్టమయిన రచన అని వేరే చెప్పనక్కరలేదు. ఇందులోని వస్తువూ, భాషా, రెండూ వొకదాన్ని వొకటి వొరుచుకుని నవలకు సాఫల్యం చేకూర్చాయి. వ్యతిరేకంగా విమర్శించాలంటే దీని కళేబరం పెద్దదయిందని మాత్రం అనాలి. నేటికాలం ఉద్వేగమయ జీవితానికి ఇంత పెద్ద నవలా? అనవచ్చు. ఆ విమర్శ సరైందే అని అంగీకరించినా, అమృత సంతానం భారతదేశంలోని నేటి ఉత్కృష్ట నవలల్లో వొక్కటి అనే నా అభిప్రాయం. సాహిత్య అకాడమీ మాన్యతకు ఇది ఎంతయినా తగివుంది. సాహిత్య అకాడమీ వల్లకాకపోతే ఈ నవల ఒడియా జనంనించి బైటికి వెళ్ళేదికాదు. ఒక ప్రాంతం ప్రజల విజ్ఞానం ఇతర ప్రాంతాల్లో వ్యాప్తిపొందించి జాతిసామూహిక ఐక్యత కోసం కృషిచేస్తూ ఉన్న సాహిత్య అకాడమీ ప్రయాసను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

**కానుచరణ మహాంతి :**

గోపీనాధ మహాంతి సోదరుడగు కానుచరణ మహాంతికూడ చాల నవలలు వ్రాసెను. ఇతడు ప్రతి నవలలోను పల్లెటూరి ప్రజల సాంఘిక జీవన చరిత్ర అంతయు కనులకు కట్టినట్లు చిత్రించెను.

గోదావరి మహాపాత్రో :

ఇతని కవిత్వము చిత్ర చమత్కారములతో పాఠకుల మనస్సుల ఆకర్షించి ఆనందము కలిగించును. ఇతడు చిత్ర చమత్కార చంద్రిక యగు పత్త్రికను కూడ నడపెను. దానిని ఆబాలగోపాలము చదివి ఆనందించెడి వారు.

తప్పుచేసిన వ్యక్తి ఎట్టి వాడయినను సరే యితని కలము పోటునకు గురికావల సినదే. దోషియగు వానిని ఇంత నిర్భయముగా ఖండించిన రచయిత మఱియొకడు ఒరియా రచయితలలో లేడు. ఇతడు గద్యకావ్యము, పద్యకావ్యము కూడ చమత్కార యుక్తముగా వ్రాయు నేర్పరి.

సంఘ దురాచారములు లంచగొండితనములు మున్నగు వానినిగూర్చి నిశితముగా విమర్శించెను. చిన్నారిపొన్నారి కథలు తేనెలూరునట్లు వ్రాసి వాసిగాంచెను. హాస్య మొలికించు రచనలో ఇతడు మేటి.

కుంజవిహారిదాసు :

సురేంద్ర మహంతి మొదలగువారు కూడ కొన్ని జాతీయగీతములు కథలు విమర్శనములు వ్రాసి ఒరియా సాహిత్యమును ప్రగతిమార్గములో దీపింప జేయు చున్నారు.

నేడు ఒరియా సాహిత్యము శరవేగముతో వృద్ధిగాంచుచున్నను, హిందీ, వంగ, ఆంధ్రాది సాహిత్యములతో పోల్చుకొన్నప్పుడు ఇంకను తగినంతముందుకు పోవలసి యున్నదని చెప్పక తప్పదు.

ఇది సాహిత్యవేత్తల దోషము కాదు. ఒరిస్సా భూభాగము చాలవఱకు సాంద్రా రణ్యపర్వతమయమయి. నది, కావుటచే అందలి పల్లెప్రజలకు 1936లో ప్రత్యేకరాష్ట్రి మేర్పడు వఱకు అక్షరజ్ఞానములేదు. భారతదేశము స్వాంత్ర్యము ఆర్జించిన పిమ్మట పల్లెపల్లెలోను పాఠశాలలు నెలకొల్పబడినవి. ఇప్పుడిప్పుడే పల్లెప్రజలు కొలదికొలదిగా చదువ నారంభించిరి.

దినపత్రికలు, మాస పత్రికలు, వారపత్రికలు సాహిత్య కృషి సాధించుచునే యున్నవి- ఆర్థిక రాజకీయ సాహిత్యాదులలో ఒకప్పుడు ఇండియాలో వెనుకబడిన ఒరిస్సా నేడు సర్వతోముఖాభివృద్ధి కాంచుచున్నది.

నాటకములు :

ఒరిస్సాలో పల్లెపట్టులలో మన కూచిపూడి నాటకాలు (యక్షగానాలు) వంటివి ప్రదర్శింపబడుచునే యున్నవి. రాత్రి ప్రారంభించిన నాటకము తెల్లవారినదాక ఆడబడుచునే ఉండును. ఎక్కువగా సంగీతరూపకములు, శ్రీవిక్రమదేవవర్మవంటి వారొకరిద్దరు నాటకములు వ్రాసినను చెప్పుకోదగిన గొప్ప నాటకమేదియు ఒరియాలో లేదు.

కాళీచరణ పట్నాయక్ :

ఒరిస్సా రాష్ట్రమంతటిలోను కాళీచరణ పట్నాయకు నేటి మేటినాటక కర్త. ఈయనకు సినీమాహాలు కలదు. నటీనటులకు ప్రోత్సాహమిచ్చి అందు నాటకాలాడించు చుండును. ఇతని నాటకాలు ఒరవడిగా మరికొందరు నాటకాలు వ్రాయుచున్నారు.

## కవయిత్రులు

బృణదావతి దాసి :

బృణదావతి దాసి ఈమె పండిత కుటుంబములో జన్మించి పూర్ణతను చంద్రో కావ్యము వ్రాసెను.

పద్మావతి :

ఈమె రాజా నిశ్శంకదేవు భార్య. రాణివాసపు స్త్రీయయ్యు అభిలాష అను కావ్యము వ్రాసి ప్రఖ్యాతికాంచెను.

కుంతల కుమారి సబత్తు :

ఈమె నవలలు, పద్యములు, జాతీయగీతములు వ్రాసెను. కాని అవి అంతగా ప్రజాదరణము కాంచలేదు.

విద్యుత్ప్రభాదేవి :

ఈమె లోకానుభవాదులు కలిగిన కవయిత్రి అయినను ప్రజాదరణమును పొందిన సాహిత్యమేమియు సృష్టింపలేదు.

**ఉపసంహారము :**

ఉత్కళ కవులు ఆదినుండియు సాహిత్య మనునది ఏ కొద్దిమందికో ఏ యొక వర్గమునకో ఉపకరించునది మాత్రమే కాదనియు సామాన్య ప్రజలందఱకు అందు బాటగు భాషాభావ విలసితమగునదియే సాహిత్యమనియు గుర్తించిరి. కావుననే మధ్య యుగములోని ఉపేంద్రభంజి వంటి యే యొకఱిద్దరో తక్క తక్కిన కవులందఱు పురాణయుగమునుండి నేటివఱకు పద్య కావ్యములు, గద్య కావ్యములు, నవలలు, నాటకములు, గేయములు, విజ్ఞాన శాస్త్రములు, సాంఘిక శాస్త్రములు, వ్యాసములు ఒకటేమిటి సమస్తమగు ఒరియా వాఙ్మయము సరళతమమైన ప్రజాహిత భాషలో వ్రాసి ప్రజల విజ్ఞాన వ్యాప్తికి తోడుపడుచున్నారు. నిరంతరము ప్రజల నోళ్ళలో నలుగు వాడుక భాషనే వారు తమతమ రచనలలో ఉపయోగించుచున్నారు. కాని, కృత కమగు ఒరియా భాషలోని మాఱుమూల పదములను ఉపయోగించటం లేదు.

ఒరియా రాష్ట్రము ఒకప్పుడు సాంఘిక, రాజకీయ, వైజ్ఞానికార్థిక విషయములో ఎంత వెనుకబడియున్నదో నేడు అంతకు వేయిరెట్లు ప్రగతి మార్గమున సాంఘిక, రాజకీయ, వైజ్ఞానికార్థిక విషయములలో సర్వతోముఖాభివృద్ధి కాంచుచున్నది. ఎక్కడ చూచిన మహానదుల కానకట్టలు, ఎక్కడ చూచిన పరిశ్రమలు, ఎక్కడ చూచిన కళా శాలలు, ఎక్కడ చూచిన సాహిత్య విమర్శలు, ఎక్కడ చూచిన పత్రికలు, ఎక్కడ చూచిన గ్రంథమాలలు వెలుగొందుచున్నవి. అయినను అరణ్య ప్రాంతములో ఇంకను చాల విద్యాభివృద్ధి కావలసియున్నది.

---

# పంజాబీ సాహిత్య చరిత్ర

శ్రీ గడియారం రామకృష్ణశర్మ.

# పంజాబీ సాహిత్య చరిత్ర

పంజాబీ సాహిత్య చరిత్రను వర్ణించుటకుముందు దాని క్షేత్ర వైశాల్యమును నిర్ధారించికొనుట అవసరము. పంజాబు భారత దేశమునకు ప్రవేశద్వారమైనందువలన దాని రాజకీయ సరిహద్దులు మారుచూ వచ్చినవి. ఋగ్వేదకాలమున పంజాబులో సప్త నదులు సింధు, వితస్తా (జీలమ్), అసిక్ని లేక చంద్రభాగా (చీనాబ్), పరుష్ణి (రావి), విపాశా (బియాస్), శతద్రూ (సత్‌లజ్), సరస్వతీ (ప్రస్తుతము అంతరించినది) అనునవి ప్రవహించుచుండినవి. ఆ కాలమున ఈ ప్రాంతమును సప్తసింధు అనియు, బ్రహ్మావర్తమనియు, పిలుచుచుండిరి. ఇచట అను, పురు, భరత, యదు, తుర్వసు, అనెడు సుప్రసిద్ధ రాజకులములు నివసించుచుండినవి. పాంచాలము గ్రీకుల ఆధిపత్యము క్రిందికి వచ్చినపుడు వారీ దేశమునకు 'పైంటా పొటామియా' అనగా పంచనదము అని పేరు పెట్టిరి. కన్నింగ్‌హామ్ పండితుడు తన 'Ancient Geography of India' అను గ్రంథమున కొన్ని శతాబ్దములు పంజాబును 'దగ్గు'లను శక్తివంతమైన జాతి పాలించుటవలన దానికి తక్కీ అను పేరు కూడా కలదని వ్రాసినారు. ఢిల్లీ సుల్తానుల రాజ్యకాలములో పంజాబు సరిహద్దు పెషావరు వరకు ఉండెను. మొగలుల కాలమున సాధారణముగా పంజాబులోని సింధు, సట్లజు నదులమధ్య భూమి మాత్రమే పరిగణింపబడుచుండెను. సిక్కుల ప్రభుశక్తి శిఖరాగ్రమును ముట్టినపుడు పంజాల దేశపు సరిహద్దులు మారిపోయెను. అప్పుడు సట్లజు నదినుండి కైబరు కనుమ వరకు పంజాబు విస్తరించినది. క్రీ. శ. 1849 సం. న. 'లార్డు డల్‌హౌసీ' ఈ ప్రాంతమును ఆంగ్ల సామ్రాజ్యమున విలీనము చేసికొనెను. కాని, 1857 సం. న జరిగిన మహా విప్లవానంతరము ఆంగ్లేయులు పంచనద దేశముతో హరియాన, ఢిల్లీ ప్రాంతములను కలిపి ఒక ప్రత్యేక రూపముతో నూతన పంజాబు రాష్ట్రమును స్థాపించిరి. 1901 లో 'లార్డు కర్జన్' సరిహద్దు రాష్ట్రమును ఏర్పరచి పంజాబునుండి దాదాపు 40 వేల చదరపు మైళ్ళ ప్రదేశమును తొలగించెను. మరల 10 సంవత్సరముల తరువాత పంజాబునుండి ఢిల్లీ ప్రాంతమును విడదీసిరి.

వేదయుగమునందలి సుదీర్ఘ కాలమున పంజాబునకు లభించిన స్థాయి చారిత్రిక కాలమున నిరంతర పరివర్తన శీలములగు రాజకీయ సరిహద్దులచే మరల లభింప

లేదనుట నిస్సందేహము. వేదకాలమునుండి 12 వ శతాబ్దము వరకు పంజాబీ ప్రతిభ సాహిత్య క్షేత్రములో చిరస్థాయిగా ప్రఖ్యాతినందలేక పోవుట కిదియే కారణము కావచ్చును. పంజాబులోని పంచనదీ మధ్యప్రదేశముయొక్క ప్రాదేశిక ఐక్యము మాత్రము సాధింపబడియుండెను. కాని, 1947 లో బ్రిటీషు సామ్రాజ్యము పంజాబు మధ్య భాగమున ఒక రేఖ గీచి చరిత్రలో మొదటిసారిగ ఒకే భాష, ఒకే సభ్యత, ఒకే కళాసాహిత్యములు కల పంజాబీ ప్రజలను నిర్దాక్షిణ్యముగ, కఠోరముగ, రెండు ముక్కలుగ చీల్చి పారవైచెను. దీనివలన పంజాబు తీవ్రమైన ఆఘాతమునకు గురి కావలసివచ్చెను. పైన పేర్కొన్న సీమా పరివర్తనములు, పంజాబీ సాహిత్యమును ఒక ప్రత్యేక దృష్టిచే ప్రభావిత మొనరించినవి. పంజాబీ సాహిత్యముయొక్క సంక్షిప్త చరిత్రను వర్ణించుచు మనము 10 వ శతాబ్దమునుండీ పంజాబీ భాషలో రచింపబడు చున్న సమస్త సాహిత్యమును గ్రహింపవలెను. ఈ సాహిత్య రచయిత ఏ లిపి నుపయోగించినను ఇప్పటి తూర్పు, పశ్చిమ భాగములలో నెచట నివసించుచుండినను మనము విచక్షణ చూపరాదనుట మనసున నుంచుకొనవలెను.

## 1. ఉదయ కాలము :

క్రీ.శ. 850_1520 : ఉదయ కాలమునాటి పంజాబు రాజకీయ స్థితి చాల అస్త వ్యస్తముగ నుండెను. క్రీ.శ. 648లో హర్షవర్ధనుడు మరణించినప్పటినుండి పంజాబులో శాంతికి భంగము కలుగజొచ్చెను. కేంద్ర ప్రభుత్వము అంతరించుటవలన భారతదేశ పూర్వ పశ్చిమ భాగములు చిన్న చిన్న రాజ్యములుగ సంస్థానములుగ, చీలుట కారంభ మయ్యెను. క్రీ.శ. 800_1206 నాటికి పంజాబీ సాహిత్య నిర్మాణమున రూపు రేఖలు ప్రారంభమయ్యెను. భారతదేశమునందలి బహు రాజ్యములమీద ప్రసిద్ధ రాజపుత్ర వంశములు చాలకాలము అధికారము వహించియుండెను. 10 నుండి 16 వ శతాబ్దా రంభము వరకు ఉత్తర భారతము ముస్లిం దండయాత్రలచే వేగిపోయెను. భారతముపై మొగలుల అధికారము ప్రతిష్ఠితమయ్యెను. ఈ రాజకీయ పృష్ఠభూమికతో పంజాబీ ప్రారంభిక సాహిత్యమునకు ఘనిష్ఠ సంబంధమున్నది. అది వ్యక్తా వ్యక్తరూపమున అప్పటి పంజాబీ సాహిత్యమును ప్రభావిత మొనరించెను.

ఈ అయిదు వందల సంవత్సరములలో కలిగిన రాజకీయ పరివర్తనముల పరిణామముగా హిందువుల రాజనైతిక సత్తా లాగుకొనబడినది. అరబ్బీ, పార్శీ, తుర్కీ భాషలు మాట్లాడు విభిన్న రీతుల ఆచార విచారములు, ఆహార విహారములు,

సభ్యత, మత విశ్వాసములు, అవలంబించిన ప్రజలు తుఫానువలె పైబడి పాంచాలమును ముంచివేసిరి. ప్రతియొక తుఫానునకు ఒక విశిష్టత కలదు. ఈ ఉప్పెనలు మొట్ట మొదట పంజాబులోని సామాజిక, సాంస్కృతిక జీవనమును సర్వనాశనము చేసిన తరువాత మెల్లమెల్లగా ఈ భూమిలో లీనమైపోయెను. దాని ఫలితముగ పంజాబు జన జీవనములో ఒక నూతనోత్పాదన శక్తి ఉదయించెను. ముస్లిములు పంజాబులో స్థిరపడి ఈ భాషను తమదిగా చేసికొని ఇందులో సాహిత్య నిర్మాణ మొనర్చుటలో నాటి రాజ కీయ పరివర్తనములు మహత్త్వ పూర్ణ కార్యమును చేసినవి. దాని ప్రభావము నేటికిని పంజాబీ సాహిత్యముపై ప్రసారితమగుచున్నది.

## ప్రారంభ కాలపు సాహిత్యము :

ఈ కాలమునకు చెందిన గద్యరచన ఒక్కటియు కానరాదు. ఎక్కువ సాహిత్యము కవితా రూపముననే కలదు. 'డాక్టరు మోహనసింహ' అమీరు ఖుస్రూ యొక్క 'పహిలీలు', తుగ్లఖ్, ఖుస్రూఖానులు వ్రాసిన 'వార్' మసూదు వ్రాసిన 'దీవాన్' అనురచనలు చంద్ బర్దాయీ వ్రాసిన 'పృథ్వీరాజ రాసో' అనునదియు ఈ కాలపు పంజాబీ సాహిత్యముగ పరిగణించినారు. కాని, అది ప్రమాణముగ మన్నింపబడలేదు. డాక్టరుగారు కబీరు మరియు జమాల్ రచనలు గూడ పంజాబీ సాహిత్యముగ చెప్పిరి. కాని ఈ అభిప్రాయమును కూడ ఎవరును ఆమోదింపలేదు.

చాలకాలము వరకు పంజాబీ సాహిత్య పరిశోధకులు ఫరీద్ షక్కర్‌గంజ్ (1183-1265) అను నతడే పంజాబీ సాహిత్య జన్మదాత అని అభిప్రాయపడియుండిరి. కాని, విశేష బరిశోధనల వలన ఇప్పుడిప్పుడు ఫరీదుకంటె రెండు శతాబ్దములు ముందు చర్పట్‌నాథ్, గోరఖ్‌నాథ్‌లు పంజాబీ సాహిత్యారంభము చేసిరను వాదము బలపడుచున్నది, వారి భాషపై నిర్దుష్టమైన 'కడిబోలీ' యొక్క విశేష ప్రభావము కానవచ్చినను ఈ వాదమే బహు సమ్మతమైనది.

## గోరఖ్‌నాథుడు :

గోరఖ్‌నాథుడు 10 వ శతాబ్దారంభమున రావల్పిండి జిల్లాలోని గోరఖ్‌పురమున జన్మించెను. యోగవాద సిద్ధాంతము మిక్కిలి ప్రాచీనమై దాని చర్చ ఉపనిషత్తులలో భగవద్గీతలో విశేషముగ చేయబడి నప్పటికిని 10 వ శతాబ్దములోని గోరఖ్‌నాథుడు యోగశాస్త్ర వ్యాఖ్యాతగ, ప్రచారకుడుగా, చెప్పదగిన వాడయ్యెను. గోరఖ్‌నాథుడు సకల

వర్ణముల వారికై యోగమార్గ ద్వారాలను తెరచివైచెను. హిందువులకే గాక మహమ్మదీయులకును తన పద్ధతిలో యోగ దీక్షనిచ్చి జాతిమత భేదములను రూపుమాప యత్నించెను. అతని భోజనశాలలో అన్ని జాతులకు ప్రవేశము కల్గించెను. ఆయన ఆత్మ సంయమమునకు, బ్రహ్మ చర్యమునకు, మితాహారమునకు విశేష ప్రాధాన్యము నొసగెను. ఇవి యోగసాధనకు మూలాధారములు. గోరఖ్‌నాథుడు - స్త్రీని ఆత్మోన్నతికి ప్రబలావరోధముగ తలచి ఆమెను అడుగడుగున నిందించి తిరస్కరించినాడు.

గోరఖ్‌నాథుడు తన సిద్ధాంతమును ప్రకటించుటలో కొన్ని విచిత్ర శబ్దములను ప్రయోగించి పంజాబీ సాహిత్యమునకు వింత శోభను కూర్చెను. అతడు వాడిన శబ్దములలో 'అలఖ్', 'నిరంజన్', ఆగం', పరా, అమూర్త, శూన్య, నిరాకార్, నాథ్, బిందు, జ్యోతి, నిర్వాణ పద, ధ్యాన్, సత్, గురు, జీవన్ముక్త మొదలయినవి భారతీయ తత్త్వశాస్త్ర పరిభాషలోనివి. ఇంచుమించు ఈ శబ్దములనే తరువాతి గురు దేవులును, భక్తియుగ సాధువులును ప్రయోగించిరి.

### చర్పటనాథుడు :

'డాక్టరు మోహనసింహ' ఇతని కాలమును 890 నుండి 990 వరకు అని వ్రాసినారు. కొందరితనిని గోరఖ్‌నాథుని శిష్యునిగను, మరికొందరు అతని గురు సోదరునిగను పరిగణించెదరు, చర్పట్‌నాథుడు చంబా సంస్థాన పాలకుని గురువై యుండెను. ఆ సంస్థానపు నాణెములపై 'కర్ణకుండలముల' చిహ్నములు కనపడు చున్నవి. గడచిన కొన్ని శతాబ్దములలో యోగుల ప్రవర్తనలు చాల పతనావస్థకు వచ్చి భిక్షుక వేషమే యోగమని భావించు దశకు దిగజారెను. చర్పటనాథుడు దానిని పూర్తిగ ఖండించెను. అతని రచనలలో బాహ్యవేషాడంబరము బాగుగా ఖండింపబడినది.

### లోక్‌వార్ :

ఈ కాలపు కఠోర రాజకీయములు వీరరసాత్మక గేయ రచనలను సృష్టించెను. ఆ విధమైన వానిని 'వార్' అందురు. ఇవి మన బొబ్బిలి యుద్ధము వంటి వీరగాథలు కావచ్చును. ఈ 'వార్' అను రచనలను వాని లయానుసారముగ పాడుకొను విధమును 'అర్జునదేవ్ గురుసాహెబ్' సూచించెను. ఈ విధమగు రచనలలో చాలవరకు ఈ కాలమున గురుసాహెబులు (సిక్కు గురువులను గురుసాహెబు లందురు) రచించిరి. కొన్ని రచనలు జహంగీర్ అగ్బరుల కాలమునకు చెందినవి. రాయ్‌కమల్

వ్రాసిన 'మౌజ్‌దీవార్' లల్లా వ్రాసిన 'బహలీమావార్' మొదలైన కొన్ని మొగలులకు పూర్వము వ్రాసినట్టివి. ఈ 'వాక్' రచనల మీద సాఫీ సంతుల వాక్ ప్రభావము కానరాదు. దీనిని పంజాబీలో రచింపబడిన ఆ కాలపు నమూనాలుగ భావించవచ్చును. ఇవన్నియు పూర్తిగ దొరుకలేదు. అక్కడక్కడ ఉదహరింపబడి కొన్ని కానవచ్చుచున్నవి.

## బాబా ఫరీద్ (1173-1255) :

ఫరీద్ ముల్తానులోని ఖోత్వాలు గ్రామమున పుట్టెను. అతడు అరబ్ దేశమునకు పోయి ఫకీరులను సూఫీలను కలసికొనివచ్చి ఢిల్లీలో కొంతకాలముండెను. ఢిల్లీలో ఒక ప్రసిద్ధ పఠాన్ జాతీయుడు 'కుతుబుద్దీన్ భక్తియార్ కాకి' అనువాడు రహస్యవాదియైయుండ అతనికి శిష్యుడై పాక్‌పటన్ అనుచోట పీఠమును పెట్టి అచటనుండి తన వాదమును ప్రచారము చేసెను. ఫరీదు గొప్ప ప్రచారకుడనుటలో సందేహము లేదు. అతని ప్రచార మార్గము ప్రేమ, నమ్రత, మధురతలను ఆశ్రయించినట్టిది. ఈ మధురతా కారణముననే అతనికి 'షక్కర్ గంజ్' అను పేరు పడినది. బాబా ఫరీద్ తన ఉదాత్త వ్యక్తిత్వ మధుర భావముల ప్రభావముచే లక్షలకొలది హిందువులను ఇస్లాం మతమున చేర్చెను.

పంజాబీ సాహిత్యములో ఆయన గొప్పతనమునకు వాస్తవముగ మూడు కారణము లున్నవి.

(1) ఫరీద్ సాహెబ్‌లోని మొదటి విశిష్టత అతడు మొదటిసారి పంజాబీ భాషలో గూఢ భావములచే నిండిన కవితలను రచించుట.

(2) సాధారణముగ ఉర్దూకవులు పార్శీ అరబ్బీలచే ప్రభావితులై తమ భావములను వ్యక్తము చేయుటకు కేవలము ఆ భాషల ఛందస్సులను గ్రహించుటయే గాక తమ రచనల నన్నింటిని విదేశీయ శబ్దజాలముతో పలుకుబడులతో నింపుచుండిరి. కాని, బాబా ఫరీద్ తన జ్ఞాన ప్రౌఢ బుద్ధితో ఆలోచించి పంజాబీప్రకృతికి పార్శీ అరబ్బీ ఛందస్సులు అనుకూలింపవని గ్రహించెను. ప్రాచీన భారతీయ ఛందస్సులను అధ్యయనముచేసి 'దోహా' మొదలైన దేశీయ ఛందస్సులను స్వీకరించెను.

అంతేకాదు, వైదేశిక శబ్దజాలమునకు బదులు పంజాబీ జీవనమున సాధారణములు సుపరిచితములు అయిన వస్తువులగు తిల్, కమాద్, ఘదీ, రసీ, హింగ్, కస్తూరి, ఇందర్, సరోవర్, హంస్, కాక్, బగ్లా, కార్తిక్‌కుంజ్, చైత్రకేఅగ్, మొదలైన పదములను, ఉపమా రూపకములను విశేషముగ గ్రహించెను. ఫరీద్ గీచిన ఈ రేఖాచిత్రము మహత్వపూర్ణమై తరువాతి కవులకు మార్గదర్శకమై పంజాబీ కవిత్వము ఒక అపరిచిత వస్తువుగా గాక సరళము, స్వాభావికము, సజీవము అయిన వస్తువుగా మారిపోయెను. దీని ప్రభావముననే 'శాహ్‌హుశేన్' 'బుల్‌హేషా' అనువారు 'గజల్' బదులు 'కాఫీ' ఛందస్సును, సుల్తాన్ బాహు మొదలైనవారు 'రుబాఈ' కి బదులు 'దోహా' ను వాడినారు.

(3) ఫరీద్ పంజాబీ సాహిత్యమున తొలిసారిగ సూఫీమత భావములను ప్రచారముచేసెను. అతడు 'షరియత్' విరోధికాడు. అతడు కేవలము ప్రేమచే పరమాత్మనందుకొను మార్గమును అనుసరింపక సూఫీమతములోని ప్రథమ దశయందలి సిద్ధాంతములగు పశ్చాత్తాపము, నియమపాలనము, తపస్సు, సేవ, నమ్రత మొదలైన వానిని ఎక్కువ సమర్థించును.

ఫరీద్ వ్రాసిన 112 శ్లోకములు 'గురుగ్రంథ సాహెబ్'లో సంకలితములై అతని మహత్తును చాటుచున్నవి.

## 2. మొగలుల ఉన్నతి కాలము (1520-1708)

ఈ కాలముయొక్క ప్రారంభమునందు రాజకీయ వికేంద్రీకరణ ప్రయత్నములు తీవ్రముగ నుండెను. పంజాబులో మూడు రాజసీ శక్తులు ముక్కోణ యుద్ధము కొనసాగించుచుండెను. ఆ శక్తులు ఢిల్లీ చక్రవర్తి ఇబ్రహీంలోధి, పంజాబులోని పఠాన్ సర్దారులు, మొగల్ చక్రవర్తి బాబర్ అనువారు. వీరిలో బాబరు విజయమునంది 1526 లో పంజాబు నాక్రమించెను. ఆ కాలమున పంజాబీలు ఎన్ని ఘోరదురంతరములకు గురియైరో గురునానక్‌దేవుడు తన 'బాబర్‌వాణి' శబ్దములచే వెల్లడించినారు.

16 వ శతాబ్ది ప్రథమభాగమున పంజాబులో తీవ్రతర పరిస్థితి ఏర్పడియుండెను. ఎవని ధన ప్రాణములు కూడ సురక్షితములు గాకుండెను. హిందువుల అవస్థ చాల దయ

నీయముగ నుండెను. వారిమీద 'జిజియా' పన్నుతోపాటు యాత్రాసుంకము కూడ పడు చుండెను. బలవంతముగ హిందువులు తురకలుగ చేయబడుచుండిరి. 'తారీఖె దావూదీ' రచయిత తన గ్రంథములో ఇట్లు వ్రాసినాడు. "సికిందర్ లోధీ దేవీదేవతల విగ్రహ ములను ముక్కలుచేసి వానిని కసాయి దుకాణములలో మాంసము నరుకు రాతి గద్దెలుగ చేయించెను" అని నాటి పరిస్థితులను వివరించినాడు. ఇట్టి రాజనైతిక సామాజిక పృష్ఠభూమిక యొక్క ప్రతిక్రియ కూడ అనుగుణముగనే యుండును. దాని పరిణామ ముగ భారతదేశమున ఒక ఆధ్యాత్మిక, సామాజిక, చైతన్యలహరి ఉత్పన్నమై నాటి ప్రజలను ప్రభావితుల జేసెను. భక్తిలహరితో పాటు సూఫీలహరి కూడా వికసించెను. మెల్లమెల్లగ రెండెటిలోని ధ్వనులు ఒకదానిలో నొకటి ప్రతి ధ్వనింపజొచ్చెను. భక్తి లహరి సూఫీ మతముపై 'శరీయత్' ప్రభావమును దిగజార్చినట్లే సూఫీలహరికూడ భక్తిలహరిపై తన ముద్రవేసెను. కావున ఆ కాలపు సాహిత్యమును తెలిసికొనుటకు ఈ రెండు లహరుల లక్ష్యవికాసములను గ్రహించుట లాభదాయకము.

సూఫీ మతము :

సూఫీమతము గూఢవాదముయొక్క ఒక అంశ కావున ఆ వాదస్వరూపము నెరుగుట ఆవశ్యకమై యున్నది. చరమ సత్యమును తెలిసికొనుటకు రెండు మార్గము లేర్పడినవి. ఒకటి తర్కముతేక బుద్ధి మార్గము. రెండవది జ్ఞానము అథవా ఆంతరిక ప్రకాశ మార్గము. ఈ రెండవ వాదమునే రహస్య వాదమందురు. భగవాన్ శంకరులు మొదటి మార్గమును అపరావిద్య లేక నిమ్నకోటి జ్ఞానమని, రెండవ మార్గమును పరావిద్య లేక ఉత్కృష్ట జ్ఞానమని తెల్పినారు. భౌతిక శాస్త్రజ్ఞులు మెల్లమెల్లగ ఒక్కొక్క అంగమునే విశేషించి వాని అన్ని పక్షములను అవగాహనము చేసికొని ఒక్కతరములోగాకున్న కొన్ని తరములకైన తథ్యమును తెలిసికొందురు. రహస్య వాది ఇందుకు విపరీతముగ తన ఆంతరంగిక జ్ఞానసహాయముచే నొక క్షణములోనే విద్యుద్వేగముతో సృష్టిని దాని వెనుక దాగియున్న సత్యమును దర్శింపగలడు.

గూఢ వాదముయొక్క పార్శిరూపమును సూఫీమత మందురు. ఆ మత ప్రాదుర్భావమును గూర్చి అభిప్రాయ భేదములున్నవి. సూఫీల భావములలో మహమ్మ దీయ, క్రైస్తవ, బౌద్ధ, అఫ్లాతూన్, హిందూవేదాంత ప్రభావములకు సంబంధించిన తత్వములు మిశ్రితములై యున్నట్లు గోచరించును. సూఫీమతము ఇస్లాముతో పాటు గానే పుట్టిన విషయము కూడా అంగీకరింపవలసి యుండును. మహమ్మదు ప్రవక్త అను

చరులై గృహాదులను పరిత్యజించి ఆయనతోబాటు మసీదులలో వసించుచుండిన ముస్లిములే ప్రారంభిక సూఫీ లనబడిరి. మహమ్మదు ప్రవక్త మరణానంతరము అల్ప కాలములోనే సూఫీమతము అస్తిత్వమునకు వచ్చెనని 'నికల్సన్' అభిప్రాయము. ఆరంభములోని సూఫీలు సంయములు, నిష్ఠావంతులు, కురాన్‌లోని ప్రతి అక్షరమును గౌరవించువారునై యుండిరి. కావున సూఫీమతమునకు అరేబియా దేశమే జన్మభూమి అనుట నిస్సందేహము. తరువాత నది ఇరాన్, ఇరాక్, ఈజిప్టు దేశములలో వ్యాపించెను. ప్రారంభిక సూఫీమతమున రెండు లక్షణములుండెను. ఒకటి పాపమునుగూర్చిన ఆందోళన, రెండవది మృత్యువును గూర్చి, ఈశ్వరుని దండనను గూర్చిన భయము. ఆ సూఫీలు భగవంతుని ప్రేమింపక అతనికి చాల భయపడుచుండిరి.

సూఫీ మతముపై మొదట క్రైస్తవ రహస్య వాద ప్రభావము పడెను. నమ్రత, వినయము, త్యాగము, దుఃఖమందును సుఖమును గ్రహించుట మొదలైనవి క్రైస్తవ వాదమునుండి వచ్చియుండును. ఆ తరువాత బౌద్ధుల ప్రభావము పడినది. మండలముల, పీఠముల ఆచారము బౌద్ధమతముల అనుకరణము కావచ్చును. మాలా జప విధానము కూడా బౌద్ధమత ప్రభావమే. సూఫీల ఆత్మోన్నత్య దశలుకూడ బౌద్ధుల పంచ భూమికలనే సూచించును. అఫ్లాతూన్ సిద్ధాంతమునుండి సూఫీలు స్వప్రకాశ, సౌందర్యప్రీతులను గ్రహించిరి. ఈ అన్ని ప్రభావములకంటె సూఫీమతముపై హిందూ వేదాంత ప్రభావము విశేషముగ ఉన్నదనుటలో సందేహములేదు. సూఫీల 'హమాఅజోస్త్' 'హమాఓస్త్' సిద్ధాంతములు మన వేదాంతప్రభావ పరిణామములే. నౌషేర్వా పాదుషాకాలములోనే హిందూ పారసీక తత్త్వవేత్తలలో భావవినిమయము ప్రారంభమైయుండెను. సూఫీలలో గురువు అనగ 'ముర్షద్' ప్రాధాన్యము వహించుట హిందూప్రభావ ఫలితమే. ఈశ్వరుని గూర్చి సన్మాన భయభావములను వదలి భగవంతునియందు భక్తిప్రేమ నలవరచికొనుట గూడ భారతీయ ప్రేమమార్గ ప్రభావమే. సూఫీలు 'హబ్‌సేదమ్' అని వ్యవహరించు ప్రాణాయామము భారతీయ యోగుల నుండి గ్రహించినదే. తరువాతి సూఫీల విచారధార శంకరాచార్యుల అద్వైతవాదమును చాలవరకు పోలియున్నది. శంకరుల మతములో ఆత్మసాక్షాత్కారమునకు శరీరము ప్రథమాతంకముగా నున్నది. దానిని వారు దేహాభిమానమనిరి. ఆచార్యుల సిద్ధాంతమున ఆత్మ-ఇంద్రియ, మనో, బుద్ధులకంటె అత్యంత గహన స్థలమున నున్నది. ఆత్మ యొక్క అత్యంతాభ్యంతరమున బ్రహ్మస్థానము కలదు. కాని, అహంకారము ఆత్మను చేరనీకున్నది. అహంకార నిరాసము చేతనే ఆత్మసాన్నిధ్యము చెందవీలగును. సూఫీల

ప్రసిద్ధ సిద్ధాంతమగు "మన్ అష్బా నఫ్సి, అర్ఫారబ్బీ" అను దాని భావమిదియే. శంకరుల మతములో ఆత్మను బాహ్య జగత్తునుండి మరలించి ఆంతరికమువైపు కొని పోవలెను. అప్పుడే ఆత్మ ప్రకాశించి, జ్ఞాతా. జ్ఞాన, జ్ఞేయములను త్రిత్వమునుండి విముక్తము కాగలదు. ఈ సితినిపొంది ఆత్మ కేవల జ్యోతిస్వరూపమును పొందుచున్నది. ఈ జీవబ్రహ్మైక్య దశను సూఫీలు "ఫనాఫిల్లాయాబ్ రాబిలా" అని అందురు. సూఫీ సిద్ధాంతములో జగత్తు దాని సర్వపదార్థములు వినాశశీలములు. మాయాసిద్ధాంత ప్రతి ధ్వనికూడ ఇందున్నది. శంకర మతానుసారముగ జగత్తు-దాని భిన్నతకు కారణము అవిద్య అనబడును. వారు దృశ్యజగత్తును ప్రపంచమనిరి. ఈ అభిప్రాయము నను సరించియే గురుసాహెబులు కూడ ''జ్యోం సుపనా అర్ పేఖ్నా ఐసే జగ్‌కోజాన్'' అన్నారు. ఇందు శంకరుల మాయకు సంబంధించిన ప్రసిద్ధ సూత్రమున్నది. సృష్టి యొక్క భిన్నత నామరూపములలో విద్యమానమై సత్యముగ గోచరించినను అంతర్య మున అసత్యమైయున్నది. ఈ విధముగ సూఫీమతము 9, 10 శతాబ్దములలో ప్రాథమిక దశను దాటి ఇరానీ, బౌద్ధ, హిందూ వేదాంతముల ప్రభావములకులోనై ఆత్మానురాగ ముల ఔన్నత్యస్థితి నందుకొనెను. 'బాయజీద్' అనునతడు ప్రప్రథమముగ 'ఫనాఫిల్లా' సిద్ధాంతమును అవలంబించెను. అతడు మొదటిసారి 'శరీయత్' పై తిరుగుబాటు చేసి "నా జ్ఞానము చాల గొప్పది" అన్నాడు. ఇదే మార్గము ననుసరించి 'మన్సూర్' "అనల్‌హక్" (అహంబ్రహ్మాస్మి) అను నినాదము నుచ్చరించెను. ఈ కారణమును పురస్కరించుకొని 'బాయజీదు' ను దేశమునుండి వెడలగొట్టిరి. మన్సూరును ఉరి దీసిరి. 'బాయజీద్' బాహాటముగ తాను మహమ్మదుతో సమానుడనని చాటుకొనుచు "ఖయామత్, బహిశ్త్," భావముల నవహేళనము చేసెను.

ఇస్లాం సూఫీమతముల మధ్యనున్న విరోధ సంఘర్షణములను చూచి 'అమ్మం గజాలీ' నను నతడు 11 వ శతాబ్దమున తన పాండిత్యబలముతో రెండిటికి సమన్వయము సాధింప యత్నించెను. 'ఖురాన్ షరీఫ్' లోని 'ఆయతు' లపై సూఫీలకు గౌరవము కల్గించి వారు ప్రవక్తను తమ ఆదర్శగురువుగా భావించునట్లు చేసెను.

పంజాబులోనికి సూఫీమతము ముస్లిం దురాక్రమణపరుల వెంటనే ప్రవేశించి నది. 'వాతాగంజ్ బరీఖా' అను నతడు మసూద్ సైన్యము వెంటవచ్చి లాహోరులో నిలచిపోయెను. రెండవ ప్రసిద్ధ సూఫీ బాబాషరీఫ్. వీరిద్దరును పంజాబు జీవనముపై అశేషప్రభావము నెఱపిరి. వీరు హిందూ వేదాంత ప్రభావమును స్వీకరింపలేదు. 17 వ

శతాబ్దమున ముల్తాన్‌బాహు, 18 వ శతాబ్దమున సయ్యద్‌బుల్లేశాహ్ అను వారు సూఫీ ప్రచారము చేసిరి. 18 వ శతాబ్దములో సూఫీ మతము శిఖరస్థాయికి పోయెనని చదివెదము.

**భక్తిలహరి :**

మే మిదివరలో చెప్పినట్లు మధ్యకాలమున హిందువుల స్థితి చాల దయనీయముగ నుండెను. 'సర్ గోకుల్‌చంద్ నారంగ్' అప్పటి పరిస్థితులను గూర్చి వ్రాయుచు "ధర్మ స్రవంతి దురాచారములు, అంధవిశ్వాసములు, పురోహితుల స్వార్థము, ప్రజల ఉదాసీనత మొదలైన వాని ప్రాబల్యము వలన ఇంకిపోయెను" అని చెప్పినారు. 'ధర్మము' గీతోపనిషత్తు స్థాయినుండి పతనమై వ్యర్థాడంబరముతో కూడి పాఖండ స్వరూపమును దాల్చెను. ఇట్టి భారత భూమిలోనికి ఇస్లాం మతము ప్రవేశించి హిందూ ధర్మమునకు క్రొత్త ఆపదను తెచ్చిపెట్టెను. ముస్లిం విజేతలు తమ వెంట కొన్ని సుగుణములను కూడ తెచ్చిరి. ఒకటి వారు సాంఘిక సమతపై విశ్వాసము కలవారై వర్ణవిభేదమునకు విరోధులై యుండిరి. రెండవది ముస్లిములు భారతదేశమున తమ మసీదులలో దర్గాలలో విద్య నభ్యసించుటకు అన్ని తరగతుల వారికి అవకాశమును కల్గించిరి. ఈ రెండు గుణములు భారతము నందలి లక్షలాది పతిత దళిత జాతులను సులభముగ తన వైపు ఆకర్షింప గల్గెను. ఈ పరిస్థితికి తగిన ప్రతీకారము కూడ జరిగెను. దేశమునందలి మేధావులు, సహృదయులు దురాచారములతో, అంధ విశ్వాసములతో నవయుచున్న హిందూసమాజము నుద్ధరించుటకు ఈ బంధములను ఛేదించి జాతికొక నవచైతన్యమును కలిగింపవలసిన ఆవశ్యకతను గుర్తించిరి. వారికి మన పూర్వగ్రంథములలో సమాజోద్ధరణకై జ్ఞాన, కర్మ, భక్తిమార్గములు గోచరించెను. వీనిలో భక్తిమార్గమొక్కటే విజృంభించుచున్న ఇస్లాం ప్రభావమును ప్రతిఘటింప జాలియుండెను. సంఘోద్ధారకులీ మార్గమునే అవలంబించిరి. భక్తి ఉద్యమ వికాసము నీ ద్విపద చెప్పుచున్నది.

"భక్తి ద్రావిడ ఊపజీ ఉత్తర రామానంద్
పర్గట్‌కియో కబీర్‌నే సప్తద్వీప్‌నవ్‌ఖండ్."

అనగా 'భక్తి దక్షిణమున పుట్టినది. రామానందుడు దానిని ఉత్తరమునకు తెచ్చెను. కబీరు దానిని సప్తద్వీపములలో, నవఖండలములలో వ్యాపింపజేసెను.' ఈ భక్తి

మార్గముయొక్క ముఖ్యసిద్ధాంతము లివి. (1) ప్రభుభక్తి, (2) గురుభక్తి, (3) ఆత్మ సమర్పణము, (4) మానవత (జాతిభేదములు ఉచ్చనీచముల ఖండన), (5) విగ్రహారాధన నిషేధము, (6) శుష్కకర్మకాండ - వ్యర్థాచారముల పరిత్యాగము. (7) స్మరణ ప్రాధాన్యము, (8) ఏ భాషయు దేవవాణికాదు. అన్నీ పవిత్రములే అనునవి.

# (క) గురు సాహిత్యము

గురునానక్ (1469-1539) :

గురు సాహిత్యమనుటలో మా ఉద్దేశ్యము సిక్కు గురు పరంపరలోని పదిమందిలో ఏడుగురు రచించినది. ఈ సాహిత్యమునందలి విచారధార సహజమార్గమనుసరించినట్టిది. గురునానక్ దేవుడు తన కాలమునందు ప్రచురములై ఉన్న యోగమార్గమును, భక్తిమార్గమును, కర్మమార్గమును, పడమటినుండి వచ్చిన ఇస్లాం సూఫీ మతములను తన అనుభవ భాండమునవేసి శతాబ్దములనుండి వానిలో కలయుచు వచ్చిన మైలను శోధించి సారభూతమగు సహజమార్గమును ప్రసాదించెను. వేల యేండ్లకు ముందే శ్రీకృష్ణభగవానుడు తన భగవద్గీతలో జ్ఞాన, కర్మ, ప్రేమ మార్గములను సమన్వయముచేసి సహజమార్గమునకు బీజావాపనము చేసెననుటలో సందేహము లేదు. గురుదేవుడు సహజమార్గమునకు ఒక స్పష్టము భిన్నము అయిన రూపము నిచ్చెను. ఆయనయు ఆ పరంపరలో తర్వాతి గురువులును ఆ సత్యములను అనుపమచ్ఛంద ప్రబంధరూపమున, విచిత్ర కావ్యరూపమున సామాన్య జనులకు అందజేసిరి.

గురుదేవుడు సమకాలికులలో మహామనీషియై యుండెను. ఆయన తన కాలములో ప్రచారమందుండిన సకల మతములలోని వ్యత్యాసములను తొలగించి సర్వసమము ఉదాత్తము అయిన జీవనదర్శనమును మనకు కలిగించెను. ఈ ప్రౌఢత ఆయన ప్రాచీన గ్రంథముల నభ్యసించుటవలన పొందినదికాదు. విరక్తులతో దేశ దేశాంతరములు పర్యటించి అన్నిరకముల సత్పురుషులు, సాధువులు, సిద్ధులు, యోగులు, విరాగులు, సూఫీలు, పండితులు, ముల్లాలు, బౌద్ధులు, జైనులు, ఐంద్రజాలికులు, రాజులు, కర్షకులు, కార్మికులు, మొదలైనవారి మధ్య నివసించి, గ్రహించి సమాజము

నందలి ఉచ్ఛ నీచ శ్రేణుల జీవన విధానములను పరిశీలించి సంపాదించినట్టిది. నానక్ దేవుడు రాజయోగము నాచరణలోపెట్టి చూపెను.

గురునానక్ దేవుడు ఇంచుమించు 19 రాగములలో నలభై వేల 'తుక్' అను ఛందములో కవితలను రచించెను. సిద్ధగోష్ఠులు, జపుజీ అనువానిని ఆయన 'ప్రతినిధి వాణి' అందురు. ఆయన కవితలలో 'జమాలీ, జలాలీ' అను రెండు విధము లున్నవి. వానిలో కేవలము ఆధ్యాత్మిక ఔన్నత్య వర్ణనలేగాక సాహస పూర్ణము, శక్తివంతము, గంభీరము అయిన సామాజిక ప్రగతికూడ ఉన్నది. 'ఆసాదీవార్'లో నింద్యములైన ఆచార విచారములను, సంశయ భ్రమలనుగూర్చిన ఖండన కలదు. 'బాబర్‌వాణీ'లో ఆతతాయులగు మొగల్ ప్రభువులకు విరుద్ధముగ బహిరంగ విప్లవమును భక్తుల గృహములనుండి లేవదీసి కొనసాగించిన విప్లవనాయకుడుగా ఆయన మనకు గోచరించును. నామజపము, కష్టించిపనిజేయుట, ఫలమును సమానముగ అనుభవించుట అనునవి గురుదేవుని ఉపదేశసారములు.

## గురు అర్జునదేవ్ (1563-1606) :

గురు సాహిత్యములో ఈయన భాగము చాల కలదు. వీరు దాదాపు 60,000 'తుక్'లు మనకు ప్రసాదించినారు. వీరు ఖండికలనేగాక గొప్ప కావ్యములనుగూడ వ్రాసిరి. వానిలో 'సుఖమని' అనునది ప్రసిద్ధ రచన. వారు ప్రసాదించిన వానిలో 'రామసర్' తటమున గూర్చుండి సంగ్రథనము చేసిన 'ఆది గ్రంథసాహెబ్' సర్వోత్తమమైనది. ఇది 1604 లో తయారుచేయబడినది. భాయీ గురుదాస్ ఈ గ్రంథమునకు ప్రథమ లేఖకుడు. గురుగ్రంథ సాహెబ్ మధ్యకాలీన సాహిత్యమందు గొప్ప ధార్మిక, వ్యావహారిక, కావ్యమయ, నిర్దుష్ట భాషా నిదర్శక మహత్వపూర్ణ రచనగా పరిగణింపబడుచున్నది. ఇందులో గురుసాహెబ్ సూక్తులేగాక 12 నుండి 17 వ శతాబ్దమువరకు భిన్న భిన్న ప్రాంతములలో నుండిన భక్తవరేణ్యుల దివ్యసూక్తులన్నియు కులమత భాషాభేదముల కతీతముగ సంకలనము చేయబడినవి. ఆ వాణి కేవలము సత్యపరాయణము, లోక కల్యాణకారియై యుండవలెననుట మాత్రమే దృష్టియందుంచుకొనబడినది.

## గురుగోవిందసింహ (1666-1708) :

వీరు 17 వ శతాబ్దమందలి ఒక మహావ్యక్తి. ఆయన తన తీక్ష్ణబుద్ధి, దూరదర్శిత్వ, పవిత్ర ఆచరణములతో సాహిత్యక, ధార్మిక, రాజనైతిక, సామాజిక క్షేత్ర

ములలో క్రాంతికారి కార్యములనొనర్చి పంజాబీ జీవనము నందొక నూతనోన్నతిని, విప్లవ చైతన్యశక్తిని, సంచారితమొనరించెను. ఆయన మొగలుల సామ్రాజ్యమును, ముల్లాల ఆధ్యాత్మిక సామ్రాజ్యమును తీవ్రముగ ప్రతిఘటించి రెండిటి పాదచ్ఛేద మొనర్చి పారవైచెను. 1699 లో 'ఖాల్సా పంథా'ను సృష్టించి పంజాబులోని దళిత విమ్న జాతుల జనులలో శతాబ్దములుగా నిద్రాణమైయున్న ఆత్మాభిమానమును తట్టి లేపెను. ఆయన జీవితమంతయు అత్యాచారములకు, అన్యాయములకు విరుద్ధముగ పోరాడుటలో వ్యతీతమయ్యెను. ఇంతటి రాజకీయ ఆందోళనలలో నిమగ్నులై యుండియు గురుసాహెబ్ పంజాబులోని అనందపురమున ఒక మహా సాహిత్య సంస్కృతీ కేంద్రమును స్థాపించెను. ఆయన దర్బారులో 52 మంది కవులు ఉండి ఉత్తమ రచనలు చేసిరి. ఆయన పంజాబీ ఫార్సీ వ్రజ భాషలలో కవితలు వ్రాసి భాషా సంబంధమున విశాలదృష్టికి ఆదర్శపురుషుడయ్యెను. 'జాప్ సాహెబ్', 'అకాల స్తుతి' 'విచిత్ర నాటక్', 'చండీ చరిత్ర', 'చండీదీవార్', అను రచనలు వారి రచనలలో ప్రసిద్ధమైనవి.

'చండీదీవార్' పంజాబీ భాషలో వ్రాయబడినది. ఇది ఒక ప్రతీకాత్మక కావ్యము. ఇందలి ఇతివృత్తము విశిష్టమైనది. భగవతీ, మహిషాసురులను పుణ్య పాపములకు ప్రతీకలుగా గ్రహించి రెంటికి యుద్ధము కల్పించి అసురీ శక్తులకు పరాజయమును, దైవీ శక్తికి విజయమును ఘోషించు వీరగాథ ఇందు చెప్పబడినది. ఈ రచనవలన అనంతకాలమునుండి విశ్వమున మంచిచెడు శక్తుల మధ్య సంగ్రామము సాగుచునే యున్నదని, చివరకు మంచికే విజయము లభింపగలదను ప్రేరణ లభింపగలదు.

## భాయీ గురుదాస్ (1558-1637) :

ఇతడు నాలుగవ, అయిదవ, ఆరవ గురువుల కాలమున వారికి సన్నిహితుడై గురుగ్రంథ లేఖకుడై, గురువాణికి ఉత్తమ వ్యాఖ్యాతయై ప్రసిద్ధిగాంచెను. ఆయన ఫార్సీ వ్రజ భాషలలో గొప్ప విద్వాంసుడు. కాబూలునుండి కాశీవరకు యాత్రచేసెను. ఆయన శుద్ధము, భావపూర్ణము అయిన కేంద్రీయ పంజాబీ భాషలో రచనలు చేసెను. ఆయన రచించిన 'వార్'లు పలుకుబడి సౌందర్యమున, ఛందోనైపుణ్యమున, అద్వితీయములై యున్నవి. ఆయన రచనలలో ఉత్తమ గుణము పంజాబీ సాధారణ జీవనమునకు సుపరిచితములగు వస్తువుల నాధారము చేసికొని గురువాణిలోని నిగూఢ తత్వ

ములను సరళముగ సుబోధకముగ రచించుట. ఈ కాలమునందలి 'సంతా, బలవండి', మొదలైన భట్టులను, 'భెజ్జు, పీలూ, కాన్హా' వంటి భక్తులను కొందరు విరక్తులను చేసిన రచనలు విస్మరింపరానివి.

# సూఫీ సాహిత్యము

## శాహ్ హుశేన్ (1536-1593) :

ఈ కాలపు సూఫీ మహాకవి. శాహ్ హుశేన్ అనునతడు లాహోరు నివాసి. జాతిచే బట్టలు నేయువాడు. అతడు తన సూఫీ భావములను ప్రకటించుటకు 'కాఫీ'ని గ్రహించెను. మరియు ఈరానీ సూఫీలు ఉపయోగించు సారాయికి బదులు ఇచట గాంజాయిని ప్రయోగించెను. సూఫీ అనుభూతులకు విశుద్ధ పంజాబీరూప మొసగి ప్రచారముచేయుట అతడు చేసిన గొప్ప కార్యము. అతడు వియోగకవి. అతనివలె విరహమును వర్ణించుటలో మరెవరు నిపుణులు కారు.

## సుల్తాన్‌బాహు (1631-1691) :

'బాహు' భారతదేశపు రహస్యవాదులలో ప్రసిద్ధుడు. అతనికి నలుగురు భార్యలు. 17 గురు ఉప పత్నులు ఉండిరట. అతడు అరబ్బీ, ఫార్సీ భాషలలో 140 పుస్తకములను వ్రాసెనని 'తారీఖె సుల్తాన్ బాహు'లో వ్రాయబడినది. పంజాబీలో 'తటక్' ఛందస్సు నుపయోగించి ఇతడు వ్రాసిన కొన్ని కవితలు కనపడుచున్నవి. ఈ కాలమున ప్రసిద్ధ సూఫీకవి 'సాహ్‌శరీఫ్' కూడ కొన్ని రచనలు చేసెను.

## ఖిస్సా కావ్యము (కథా కావ్యము) :

పంజాబీలో కథా కావ్య పద్ధతి ఇరానీ కవులనుండి గ్రహింపబడినది. ఇరాన్‌లో ప్రతి ఒక మహాకవి 5 బృహత్కథలను గ్రహించి కావ్యముగా వ్రాయుటకు యత్నించుచుండును. దానిని 'ఖంసా' అందురు. వీని ఇతివృత్తములు ప్రేమాత్మికములు దార్శనికములునై యుండినవి. పంజాబీలో 'మక్‌బుల్ మహమద్' మొదలైనవారు, తమ కథా కావ్యములను రచించునపుడు ఆది మధ్యాంతములలో ఇరానీ పద్ధతినే అనుసరించినారు. ఇచట ఈ కావ్య కథారచనను ప్రారంభించినవాడు 'దామోదర్' అను హిందూ

కవియై యుండెను. కథాకావ్యములను మరికొందరు వ్రాసిరి. కాని వారు దామోదరునితో సమానులుకారు. అతడు 'హీర్' కథను సూత్న ఛందమున 'లహిందీ' పల్కులలో వ్రాసెను. దామోదరునకు స్వాభావిక వర్ణనలయందు, సమకాలిక సాంఘిక పరిస్థితి యదార్థముగ వివరించుటయందు, అన్నివిధములైన ప్రేమ చేష్టలను వర్ణించుటయందు ఎక్కువ ప్రావీణ్యము కలదు. హిందువుల రచనలలో దుఃఖాంతములు కనపడవు. కావున ఇతడు కూడా ప్రాచీన భారతీయ పద్ధతి ననుసరించి విదేశీయ గాథను గ్రహించినను సుఖాంతముగ చేసినాడు.

రెండవ ప్రసిద్ధ కథాకారుడు 'పీలూ' అనువాడు. ఇతడు పంజాబీలో 'మర్జా సాహెబా' కథను వ్రాసెను. అది పంజాబీ గ్రామములలో బహుప్రచారముగల లోకప్రియగాథ. దానినే 'హాఫీజు బరుకుర్‌దార్' అదే పద్ధతిలో వ్రాసెను. అతడు 'యూసుఫ్‌జులేఖా', 'సస్సీపున్నూ' అను 'కిస్సా' లను గూడా వ్రాసెను. ఇతని పల్కులపై 'లహిందీ' ప్రభావము కలదు.

ఈ కాలములోనే అహమ్మదు కవి 'హీర్‌వధ' అను కథను 'బైత్' ఛందస్సులో వ్రాసెను. అతనిది అచ్చమైన పంజాబీభాష. అహమదు కంటె ముందు పంజాబీ లోకప్రియమైన 'బైత్' ఛందస్సునకు ఉదాహరణలు కానరాలేదు. ఖిస్సాలే గాక ఈ కాలమున కొన్ని 'వార్'లు కూడ రచింపబడినవి.

## వార్తక్ (గద్యము)

ఈ కాలపు గద్యములో వచనములు, సాఖీలు, టీకలు, పరమార్థములు, గోష్ఠులు, అనువాదములు చేర్పవచ్చును. ఉత్తమ గద్య రచనము 'లహిందీ' భాషలో వ్రాయబడిన పురాతన జన్మ 'సాఖీ' గ్రంథము. ఈ గ్రంథ రచనా కాలమును గురించి పండితులలో అభిప్రాయ భేదములున్నవి. ప్రొఫెసర్ సాహెబ్‌సింహు గారు 'జన్మ సాఖి' రచనలలో ప్రత్యేక కృషి సల్పి 1635 దాని రచనాకాలముగ నిర్ధారించిరి. రెండవ ఉత్తమ గద్య రచన 'భాయి విధుచంద్' వ్రాసిన సాఖి. అది 1640 లో వ్రాయబడినది. దీని నాధారముచేసికొని 'భాయీ బాలేవాల్ సాఖి' గురుగోవిందసింహుని కాలములో రచింపబడెనని డాక్టర్ మోహన్‌సింహ అభిప్రాయము. ఇవిగాక ఇంకను 30 వరకు 'సాఖీ' రచనలు కలవు. వీనిలో నొకటి అక్బరు చక్రవర్తికి వినిపింపబడినది.

### మొగలుల క్షీణకాలము (1708-1800) :

రాజకీయ దృష్టిలో 18 వ శతాబ్దము మొగల్ సామ్రాజ్య పతనోన్ముఖ కాలమని చెప్పవచ్చును. ఆర్థిక, సదాచార దృష్టులతో కూడ ఈ నూరేండ్లును పతనకాలమే. పతనకాలములో నుద్భవించిన సాహిత్యము కూడ అధమస్థాయిలో నుండెనని సమాలోచకుల అభిప్రాయము. కాని అది సరికాదు. ఈ కాలములో బులే, వారిస్‌వంటి మహాకవుల రచనలతోబాటు మరికొన్ని ఉత్తమ రచనలు పుట్టినవి. ఈ కాలములోనే 'నిజాబత్' అనునతడు 'నాదర్‌షాహి' వీరగాథను రచించెను. 'చండీదీవార్' తప్ప పంజాబీ వీరరస కథా కావ్యములేవియును దీనితో సరిపోజాలవు.

## (క) సూఫీ సాహిత్యము

ఫరీద్ కాలపు ప్రారంభిక సూఫీ మతము శాహ్ హుశేన్‌నాటి విప్లవ సూఫీ మతము ఈ కాలపు బలేశాహ్ అద్వైతవాది సూఫీ మతములో మేళనము పొంది ఒక నూత్న శిఖరమును స్పృశించునట్లు కనపడును.

### బులేశాహ్ (1680-1758) :

బులేశాహ్ కసూర్ దగ్గర పండూకీ గ్రామమున పుట్టెను. అతడు ప్రాథమిక విద్యను ముగించి లాహోర్‌లో ఫకీర్ ఇనాయత్‌షాకు శిష్యుడయ్యెను. అరబీ పార్శీలలో విద్వాంసుడై ఖాద్రీ సాంప్రదాయ గురువుగ ప్రసిద్ధినొందెను. ఇనాయత్‌షా తన 'దస్తూర్ అమల్' అను గ్రంథమున ప్రాచీన హైందవ మతానుసారముగ పరమహంస పదవి నందుటకు సాధనములైన సప్త మార్గములను వర్ణించినాడు. పూర్వము అలెగ్జాండరు సైనికులు భారతదేశమునుండి ఈ సప్తమార్గములను గ్రహించి గ్రీసు దేశమునకు గొనిపోయిరి. వారినుండి ఇరానీ, ముస్లిం, సూఫీలు గ్రహించిరని ఇనాయత్‌షా అభిప్రాయము. ఈ విధముగ బులేశాహ్ భావములపై ప్రాచీన హిందూ గూఢ వాద ప్రభావము పడినది. బులేశాహ్ ఇరానీ, సూఫీలు ప్రయోగించు బుల్‌బుల్, ఉద్యానము, బ్రాందీలను వదలి విశుద్ధ దేశీయ ఉపమానములగు కృష్ణుడు, మురళీ, బృందావనము, గురువు, అనువానిని ప్రయోగించినాడు. వైష్ణవ భక్తులవలె అతడు తనను పత్నిగా, భగవంతుని పతిగా భావించి ఈశ్వర దర్శనమునకై విరహతాపము నందును. అతడు సూఫీ మతమును విశుద్ధ పంజాబీ జీవనముతో రంగరించెను.

అలీ హైదర్ :

అలీహైదర్ ముల్తాన్‌లోని కాటియా గ్రామమున పుట్టెను. బులేశాహ్‌వలెనే యితడును ఖాదిరి సంప్రదాయముతో సంబంధము కలవాడు. ఇతని రచనలు లహిందీ భాషలో వ్రాయబడినవి. సాధారణముగ సూఫీ సమావేశములలో జరుగు నృత్యము లందు ఇతని పాటలు పాడుచుందురు.

## కిస్సా సాహిత్యము

సూఫీ సాహిత్యమువలెనే ఈ కాలపు కథాసాహిత్యముకూడ ఉన్నత శిఖరము నందికొన్నట్లు కనపడును. ఈ కాలపు మొదటి ఖిస్సాకారుడు 'ముక్‌బల్'. అతడు 'వారిస్' కవికంటె ముందే 'హీర్' గాథను నాలుగు చరణముల బైత్ ఛందస్సులో వ్రాసెను. ఇతని ననుసరించి 'వారిస్‌షా' అనునతడు కూడ 'హీర్' గాథను రచించెను. ముక్‌బల్ పూర్తిపేరు 'షాహ్‌జహాఁ' అతడు గ్రుడ్డివాడు.

'వారిస్‌షాహ్' (1735-1785) :

'వారిస్' 'జండ్యాలా షేర్‌ఖా'లో పుట్టెను. అతడు తన విద్యను కసూర్, పటన్, దర్గాలలో అభ్యసించెను. ఇతడొక పాకీ పనిచేయు స్త్రీని మోహించెనని తరువాత విరక్తుడై పశ్చిమ పంజాబులోని మలక గ్రామములో స్థిరపడి అచటి మసీదులో కూర్చుండి 'హీర్' గాథను పూర్తిచేసెనని ఒక ఐతిహాస్యము కలదు.

అది అహమద్‌షా అబ్దాలీ, ఢిల్లీ మొగల్ చక్రవర్తులు, సిక్కునాయకులు, పంజాబును మహా యుద్ధరంగముగ మార్చిన కాలము. వారిస్ వ్రాసిన 'హీర్' కథలో అడుగడుగున సమకాలిక రాజకీయ పరిస్థితుల ఛాయలు కనపడుచుండును. వారిస్‌కంటె ముందు దామోదర్, అహమద్, ముక్‌బల్, అను ముగ్గురు ప్రసిద్ధ కవులు హీర్ కథపై తమ కౌశల్యమును ప్రదర్శించియుండిరి. 1760 లో 'గురుదాస్ ఖత్రీ' అను నతడు హిందీ కవితలో హీర్ కథను వ్రాసెను. కాని ఎవరును వారిస్‌వలె సాఫల్యము నందలేదని చెప్పవచ్చును. వారిస్‌షా పంజాబీ వాతావరణము, పంజాబీ స్థితిగతులు అన్నిటికంటె ముఖ్యముగ పంజాబీ భాషలో విశేష పరిజ్ఞానము కలవాడగుటవలన

అతని రచన పంజాబీ కథా కావ్యములలో శిరోమణియైనది. పాత్రనిర్మాణమున అతని కౌశల్యము ప్రత్యేకమైనది.

## వార్ సాహిత్యము

అప్పుడు పంజాబులో చాల పరివర్తనము జరిగినది. ఈ కాలమున ముల్‌బల్ 'జంగ్‌నామా' వ్రాసి వీరరస కావ్యమునకు శ్రీకారమును చుట్టెను. కాని ఆ గ్రంథమునకును నాటి పంజాబు రాజకీయ పరిస్థితులకును ఎట్టి సంబంధములేదు. ఇందులో హసన్ హుసేన్‌ల పరాక్రమము వారి బలిదానము వర్ణింపబడినవి. ఈ కాలమున నజాబత్ వ్రాసిన నాదర్‌షా ఆక్రమణ గాథ రెండవ వీరరస కావ్యము. ఇందు ప్రధాన చారిత్రకాంశములు వర్ణింపబడలేదు. నాదర్‌షా ఢిల్లీలో కావించిన సార్వజనిక హత్యాకాండ నామమాత్రమునకైన ప్రస్తావింప బడలేదు. ఇది ప్రాచీన భారతీయోపాఖ్యాన పద్ధతిలో కలి నారద మహర్షుల వివాదముతో ప్రారంభమగుచున్నది. ఇందు చారిత్రికాంశముల కంటె కావ్యాంశము లెక్కువగా కనపడును. ఇందలి పద గుంభనము, సరళశైలి, నిర్దుష్టప్రయోగము గణనీయములైనవి. నాటకీయ గుణముకూడ ఈ కథలో కన్పించును.

1734 లో హక్‌కత్‌రాయ్ దుర్మరణము పాలయ్యెను. ఈ దుర్ఘటనము 'అగరే' కవిని వార్ రచించుటకు ప్రోత్సహించెను. అది దవైయా ఛందములో వ్రాయబడినది. ఈ కాలమున 'ఛట్టియాదీవార్' అనునది రచింపబడినది. ఇందు రాజా రణజిత్‌సింహుని తండ్రి మహాసింహునకు గులాం మహమ్మద్ ఛట్టే అను వానితో జరిగిన యుద్ధము వర్ణితము. ఇందలి భాష సరళము శుద్ధమునై యున్నది.

18 వ శతాబ్దమున యశోదానందనుడును 'లవకుశ్‌కీ వార్' రచించెను. దేవీదాస్ కూడా దీనినే రచించెను. ఇవి రెండును ప్రొఫెసరు ప్యారాసింగ్ ప్రకటించిన 'పంజాబీ వార్' అను సంపుటమున కనపడుచున్నది.

## గద్య సాహిత్యము

ఈ కాలమున గద్యరచన కూడా ప్రాయికముగ చేయబడినది. వెనుకటి కాలమున కంటె శైలిలో నెక్కువ మార్పు వచ్చినట్లు తోచును. హిందువులు, శిక్కులు,

ముస్లిములు, ముగ్గురును గద్యరచనవైపు దృష్టి మరల్చిరి. భాయీమణిసింహుడు ఈ కాలపు గద్యలేఖక శిరోమణి యని ప్రసిద్ధినొందెను. ఆయన ప్రఖ్యాత పండితుడు. అతడే 'దశమ గ్రంథ సంపుటి'ని సిద్ధము చేసియుండెను. వ్రజ భాష, పార్శి సంస్కృత ములలో పండితులైనందున ఆయన రచనలలో అన్ని భాషల ప్రభావములు ప్రస్ఫుట ముగ గోచరించును. ఐనను ఆయన శైలి మధురమై కావ్యకళామయమైనది. ఆతని గ్రంథములలో "జ్ఞానరత్నావళి", "భక్తరత్నావళి" అనునవి ప్రసిద్ధ గద్యకావ్యములు.

ఈ కాలమునందలి మరొక మహాగ్రంథము 'ప్రేమసుమార్గ' అనునది. ఇది నీతిబోధక గ్రంథము. ఈ కాలమున అడణ్‌షాహ్ వ్రాసిన 'వార్తక్' చాల గొప్పది. ఆయన 18 వ శతాబ్దమునందలి ఒక ప్రసిద్ధ 'సేవాపంథ్' కు చెందిన సాధువు. ఇతడు 'లవూ' గ్రామమున జన్మించెను. భాయీ సేవారాంజీకి శిష్యుడై సేవాపంథీ సంప్ర దాయమును స్వీకరించెను. అడణ్‌సాహ్ మృత్యువు 1757 లో జరిగెను. ఆయన 'పారస్ భాగ్' అను గ్రంథమును రచించెను. అది అమ్మామ్ గజాలీ' రచించిన పార్శీ గ్రంథ మున కనువాదము. అందలి భాషమధురము, భావపూర్ణము నైనది.

## రణజిత్‌సింహుని కాలము (1800-1860) :

రణజిత్‌సింహుని కాలమున ఇంచుమించు 30, 40 సంవత్సరములు ఒక విధ ముగ పంజాబు శాంతి ననుభవించెనని చెప్పవచ్చును. అట్లయినప్పటికిని ఈ కాలమున పంజాబీ సాహిత్యమునకు తగిన ప్రోత్సాహము లభించలేదు. హాషం అనువానికి కొంత జాగీరు, కాదరియార్ అను రచయితకు కొంత ఇనాము లభించుట తప్ప పంజాబీల స్వీయప్రభుత్వములో పంజాబీ భాషా సాహిత్యముల అభివృద్ధికై ఎట్టిచర్యలు గైకొన బడలేదనుట స్పష్టము. ఈ కాలపు రాజకీయ, సాంఘికస్థితులు, జాగీర్దారీ పద్ధతిలో నుండెను. రాజకీయ భాషగా గూడా పార్శీ చలామణిలోనుండెను. కొందరు ప్రముఖ లేఖకులు ఖిస్సాలను, కావ్యములను రచించిరి.

## కిస్సా కావ్యము

'హాషంషాహ్' ఇతడు ప్రసిద్ధ కథాకారుడు. ఇతడు సస్సీపున్నూ, సోహనీ మహీవాల్, షీరీన్‌ఫర్‌హాద్, కిస్సాలను రచించెను. ఇతని గాథలు సంక్షేపరూపమున నుండును. వీనిలో వారిస్ రచనలలో కానవచ్చు వ్యర్థవివరణలులేవు. దలైయ్యా

ఛందస్సుపై ఇతనికి ప్రీతియెక్కువ అందువలన ఇతడు తన 'ఖిస్సా' లకు, 'దోహాడాలకు' దలైయూ ఉపయోగించెను. ఇతని కథా కావ్యములలో 'సస్సీపున్నూ' సర్వోత్తమమైనది. అతడు 'ఖిస్సాలను', 'దోహడా' లను, 'డయోడా' లను రచించెను. హాషం రచనలలో దోహడాలే సాహిత్యదృష్టితో ఉత్తమములని మా అభిప్రాయము. 'దోహడాలను' పంజాబీలో ముల్తానీ కవులు కొందరును, సుల్తానుబాహు అను నతడును ప్రారంభించిరి. హాషం ఆ శాఖను మహోన్నత స్థితికి తీసికొనిపోయెను.

ఖాదర్ యార్ :

కాదర్యారే 'మాచీ' గ్రామములో రణజిత్‌సింహుని చివరి దినములందుపుట్టెను, అతడు టిబెట్ సర్దారుల రక్షణలో పెరిగెను. అతడు 'సోహనీమహివాల్', రాజా రసాలూ, పూరణ్ భగత్, అను ఖిస్సాలను రచించెను. 'బైత్' ఛందస్సులో 'హరిసింహనల్వేకీవార్' వ్రాసెను. అతడు సరళభాషను వాడుటయే గాక 'పూరణ్, రసాలు, నల్వా,' వంటి దేశవీరులకు తన కావ్యవస్తువులుగా గ్రహించుట వలన 'కాదరియార్' లోకప్రియ కవి యయ్యెను.

అహమద్ షాహ్ :

బాహుళ్యమే గొప్పదనమునకు మానదండమైనచో అహమద్‌షాహ్‌ను ఖిస్సా కావ్యచక్రవర్తి అనవచ్చును. అతడించుమించు 35 ఖిస్సాలను రచించెను. వానిలో హాతింతాయ్, యూసుపుజులేఖా, లైలామజ్నూ, సైపుల్‌మలూక్, కామ్‌రూప్, రాజ్ చీబీ, సస్సీపున్నూ, చంద్రవదన్, సోహనమహీవాల్ మొదలైనవి ప్రసిద్ధి నందినవి. అహమద్‌యార్ పంజాబీ ప్రథమ విమర్శకుడుగా పేరుపొందెను. తనకు పూర్వులగు హాఫిజు బర్ ఖుర్దార్, పీలూ, ముక్‌బల్, వారిస్, హాషం, మొదలైన కవుల రచనల లోని గుణదోషములను సమీక్షించెను. ఇదే కాలమున అమాంబక్ష్, మహమ్మద్‌బక్ష్, అనువారలు కొన్ని ఖిస్సాలను రచించిరి.

## దేశభక్తి సాహిత్యము

ఈ కాలమున ఖిస్సాలేగాక 'శాహ్ మొహమ్మద్, మటక్' అనువారి దేశభక్తి కావ్యములు వెలసెను. 'మటక్' కొందరు సిక్కు నాయకులను విద్రోహములను దూషించెను. షాహ్ మహమ్మద్ ఈ రచనలలో సిద్ధహస్తుడని పేరు గాంచెను. అతడు

అమృతసర్ జిల్లా 'బదాలా' గ్రామవాసి. అతని రచన 'జంగ్ సింఘారితే' ఐతిహాసిక కావ్యము. 'డాక్టర్ గంగా సింహ్, ప్రొఫెసర్ సీతారాం కోహాలీ' గారలు ఈ కావ్యమును చక్కగా పరిష్కరించి విపులమైన చారిత్రికోదాహరణములతో, టిప్పణులతో, ప్రకటించినారు. శాహ్ మొహమ్మద్ కవితా లక్ష్యము పంజాబి దేశీయులలో దేశభక్తిని, సమైక్య భావనను కలిగించుటయైయున్నది. అతడు హిందూ ముస్లిములను సోదరులుగ ఆంగ్లపాలకులను మూడవ జాతిగ పరిగణించును. ఇతని కావ్యమున చారిత్రక దృష్టితో కొన్ని దోషములు కనబడును.

## గ. గద్య సాహిత్యము

ఈ కాలమున ప్రత్యేకముగ చెప్పదగిన గద్యరచన పుట్టలేదు. రణజిత్‌సింహుని కాలమున పంజాబీ భాషలో వ్రాయబడిన ఒక 'దినచర్య' పుస్తకము మాత్రమే గద్య రచనకు ఉదాహరణముగ భావించవచ్చును. ఆ తరువాత 1815 లో క్రైస్తవుల పాదరీల ప్రయత్నములచే బైబిల్ అనువాదము పంజాబీ భాషలో ప్రకటితమైనది. 1854 లో లూధియానా మిషన్‌వారు పంజాబీ కోశమును ప్రకటించిరి. ఇదే సమయమున భాయి మెహతాబ్‌సింహ్ 'అదలె అక్బరి' అను బృహద్గ్రంథమును అనువదించెను.

### (5) పరివర్తన కాలము (1860–1900) :

మేము వెనుక చెప్పినట్లు 1849 లో పంజాబు బ్రిటిష్ సామ్రాజ్యమున భాగమైయుండెను. స్థూలదృష్టితో చూచిన అప్పటినుండియే ఆధునిక కాలమారంభమైనట్లు తోచును. ఇంగ్లీషువారు పంజాబులో కాలు నిలువద్రొక్కుకున్న వెంటనే రాజకీయ సాంఘిక, సాహిత్యక్షేత్రములమీద ఆధునికతా ప్రభావము పడుట కారంభించెను. కాని సూక్ష్మదృష్టితో పరిశీలించినపుడు 19 వ శతాబ్దము ద్వితీయార్ధమును ఆధునిక కాలమనుటకు వీలులేదు. ఈ కాలమున ఆధునికతాబీజములు పడిన మాట వాస్తవము. ఈ అర్ధ భాగమంతయు బీజము లంకురించి చెట్టుగట్టుటకే సరిపోయెను. ఇరువదవ శతాబ్దారంభముననే ఆ వృక్షము పుష్పించి ఫలించుటకు మొదలుపెట్టెను. ఈ కాలమును పరివర్తన కాలమనుట సముచితము. ఈ యేబది వర్షములలో రెండు విభిన్నసభ్యతలకు మొదలు సంఘర్షణ జరిగి తరువాత సమ్మేళము నందినవి. 1857 విప్లవము తరువాత ఆంగ్లేయుల ప్రభావము సంపూర్ణముగ స్థాపితమయ్యెను. కాని, వారు పంజాబీల బాహుబలమును,

దేశభక్తిని మరచిపోలేదు. ఈ యగ్ని మరలనెప్పుడు భగ్గుమనునో యను భయము వారికి పోలేదు. 1872 లో బాబా రామసింహుడు విదేశీ వస్తువులను, ఇంగ్లీషువారి కోర్టులను, ఇంగ్లీషు భాషను బహిష్కరించుడని నినాదము లేవదీసి భయము గొల్పియుండెను. అందువలన ఆంగ్లేయులు పంజాబువారి దృష్టిని రాజకీయ ములనుండి మరల్చి ధర్మము, విద్య, సంస్కృతి క్షేత్రముల వైపు త్రిప్పుటకు పదకములు వేసిరి. వారు హిందూ ముస్లిం, సిక్కునాయకులను ప్రోత్సహించి విద్యావిషయములలో శ్రద్ధ గైకొనునట్లు చేసిరి. అనేక సమయములలో ఇంగ్లీషు వారు ఆర్థిక సహాయముచేసి జమీందారులతో, మహారాజులతో చేయించి విద్యాసంస్థలను స్థాపింపజేసిరి. అమృతసరులోని 'ఖాల్సా కాలేజి', 'అలీఘర్ కాలేజీలు' ఇందుకు ప్రత్యక్ష సాక్ష్యములై యున్నవి. హిందూ- శిఖు, ముసల్మానులు విధిలేక విద్యా విషయాలవైపు మరలిరి. పారతంత్ర్యపు గాయము వారి మనస్సులకు వ్యథ కలిగించు చున్నను సైనిక బలము నశించిపోయినందున ఆంగ్లేయులను ప్రతిఘటింప జాల కుండిరి. ఆంగ్లరాజ్యము స్థిరపడి వాస్తవిక రూపమును బొందియుండెను. అందు వలన వారు తమ ప్రాచీన వైభవమును, సంస్కృతిని శరణుపొందిరి. తమతమ పురాతన ధర్మ, సమాజసాహిత్య,కళా, సంస్కృతుల పునరుద్ధరణ ప్రయత్నములను ప్రారంభించిరి. గతకాలమున గొప్పచేసి దానినాదర్శముగ చేసికొను కోరిక అప్పటినుండి సమస్త భారత వర్షమున పనిచేయు చుండినది. బెంగాల్ దేశములో నది బ్రహ్మసమాజ రూపము ధరింపగా, ముస్లిములలో అలీఘడ్ ఉద్యమరూపమున వ్యక్తమయ్యెను. అట్లే పంజాబు హిందువులలో ఆర్యసమాజ రూపమునను, శిఖులలో సింహ సభారూప మున ఆ వాంఛ ఆవిర్భూతమయ్యెను. పంజాబులోని ఆర్యసమాజీయులు ఆంగ్లేయుల విరోధులై యుండిరి. వారుకూడ బెంగాలులో వైష్ణవులవలె ఆంగ్లవిద్యకు విరుద్ధముగ ప్రచారము చేసిరి. ఇంగ్లీషువారు తమ్ము సమర్థించు బెంగాలీ బాబూలను పంజాబునకు తెచ్చి ఉద్యోగమొసగిరి. వారివెంట బ్రహ్మసమాజమును తీసికొని వచ్చిరి. బ్రహ్మసమా జము వారిదృష్టి ప్రాచీనసభ్యత నాదర్శము చేసికొనుటతోబాటు ఇంగ్లీషు సభ్యసించుట కూడ అయియుండెను. అలీఘడ్ ఉద్యమముచే ప్రభావితులైన పంజాబు ముస్లిములు కూడ ఇంగ్లీషు విద్యాపక్షమును బలపరచిరి. ఆర్యసమాజ సంస్థాపకుడు స్వామీదయా నందుడు మరణించిన తరువాత ఆర్యసమాజమువారును ఆంగ్లవిద్యావ్యాప్తికి కృషిచేసిరి.

ఈ ఉద్యమముల వ్యాపక ప్రభావమువలన కొన్ని సంవత్సరములలోనే దేశ ములో సాంప్రదాయక పాఠశాలలు, కళాశాలలు తలయెత్తెను. హిందువులు హిందీ,

సంస్కృత భాషలను, శిఖ్ఖులు పంజాబీ భాషను, ముస్లిములు ఉర్దూ, ఫార్సీ భాషలను బలపరచుటకు పూనుకొనిరి. ఆంగ్లేయులీ భేదభావములను ప్రోత్సహించిరి. భాషా ద్వేషములు, మత ద్వేషములు వృద్ధియైనకొలది తమ రాజ్యపు పునాదులు గట్టిపడునని వారికి తెలియును. ఈ విధముగ పంజాబులోని రాజకీయ, సామాజిక, విద్యావిషయిక, నైతిక స్థితులలో పరివర్తనలు జరుగుచున్న ఈ కాలము ఇరువదవ శతాబ్దము వరకు సాగినది. 1860 లో పంజాబునందు విద్యా విభాగ కార్యాలయము ప్రారంభింపబడి బోధనాభాష ఉర్దూ అని ప్రకటితమయ్యెను. 1864 లో 'ఓరియంటల్ కాలేజ్' లాహోరులో స్థాపించబడి డాక్టర్ లాయిట్నర్ ప్రయత్నమువలన 1877 నుండి పంజాబీ భాష బోధింపబడెను. క్రైస్తవ పాదరీల ప్రయత్నమువలన గురుముఖీ టైపు సిద్ధమై ముద్రాశాలలు వ్యవహారమునకు వచ్చెను. 1894 లో 'భాయీమ ఇయాసింహ' పంజాబ్ ఇంగ్లీషు నిఘంటువును సిద్ధముచేసెను. 1880 లో 'గురుముఖీ' అను మొదటి వార్తా పత్రిక వెలువడెను. 1899 లో భాయీ వీరసింహజీ 'ఖాల్సా సమాచార్' అను వార పత్రికను ప్రారంభించెను. అది నేటికిని నడచుచున్నది.

త్వరితముగ జరుగుచున్న ఈ పరివర్తనములను పురస్కరించికొని ఈ కాలమునకు పరివర్తన కాలమని పేరిడుట సముచితమనుకొంటిమి. ఈ కాలపు సాహిత్యమునందు వెనుకటి వన్నెతగ్గి క్రొత్త రంగు అలముకొనెను. ఈ కాలమున 'ధనికవాద వ్యవస్థ' తలయెత్త 'సామంత వ్యవస్థ' (జాగీర్దారీ పద్ధతి) పతనమయ్యెను. అట్లే గ్రామీణ సభ్యత దెబ్బతినగా నాగరిక సభ్యత వికాసముచెందెను. ఈ కారణమువలననే ఈ యేబది వత్సరములలో మద్రాసు, బొంబాయివంటి పట్టణములు పూర్వము భారత దేశమున నెట్టి ప్రాధాన్యము వహింపకపోయినను, పెట్టుబడిదారీ సభ్యత వికసించుటతో సుందర మహానగరములుగ రూపొందెను. ఇంగ్లీషువారు స్వలాభము దృష్టితో జాగీర్దారీ పద్ధతిని అంతమొందింపక వంశలకొలది సంస్థానములను, రాజ్యములను స్థిరపరిచిరి. ఈ కారణములవలన నీ యేబది వత్సరములలో పంజాబీ గద్య పద్య సాహిత్యము ఆధునిక రూపము నలవరించుకొన్నప్పటికిని విషయగ్రహణమున రాజరిక వ్యవస్థా ప్రభావమును వదలుకొనలేదు.

## కావ్య సాహిత్యము :

ఇంతవరకు పంజాబీ సాహిత్యమును విశేషముగ ముస్లిము కవులే నిర్వహించిరి. మూడు శతాబ్దములనుండి శిఖ్ఖులు తీవ్ర యుద్ధములో నిమగ్నులై యుండి

నందున వారు సాహిత్య విషయమున శ్రద్ధ వహింపలేదు. హిందువులుకూడ నీ విషయమున తక్కువ శ్రద్ధనే వహించిరి. కాని ఈ కాలమున సాగింపబడిన ఉద్యమములు హిందువులను, శిఖులను తమ సాహిత్య రచనలవైపు మరలునట్లు చేసినవి. ఈ కారణము వలననే ఈ యేబది సంవత్సరములలో హిందూ, శిఖు కవులు ఉదయించిరి. పలువురు కవులు పునరుజ్జీవనోద్యమ ప్రభావముచే ప్రాచీన హిందూ మహాపురుషుల, వీరుల కథలను గ్రహించి 'ఖిస్సా' కావ్యములను రచించిరి. వానితోపాటు 'సూఫీ'ల వలె వేదాంత భావములను 'కాఫి', 'సీహర్ఫీ', 'సైతస్ అక్కరీ', 'పత్తల్', 'బారత్', 'చరఖ్', 'కుండలీ', 'దోహడీ', 'సతవారీ', 'అఠవారీ', 'మాఝ్' మొదలైన దేశీ రచనలద్వారా ప్రచారముచేసిరి.

ఈ కాలపు పంజాబీ కవిత్వమున నొక నూత్న పద్ధతి ప్రవేశించెను. మౌలానా మహమ్మద్ హుసేన్ ఆజాద్ పంజాబ్ విద్యాశాఖా కార్యాలయమున నియుక్తుడయ్యెను. అతడు పంజాబులో ఉర్దూ భాషను సర్వప్రియ మొనర్చుటకై 'ముషాయిరా'లను ప్రారంభించెను. దాని ప్రభావము పంజాబీ కవిత్వముపైనను పడినది. అతడు శుద్ధ పంజాబీ కవి సమ్మేళనముకూడా ఆరంభించెను. అప్పటినుండి పంజాబీలో గురుశిష్య పరంపర యేర్పడెను. వీనిలో ప్యారేసాహెబ్, మౌల్వీ ఫరీద్దీన్, ముజంగీ, బాబా సాదిక్ పరంపరలు ముఖ్యమైనవి. ఈ పరంపరలవలన పంజాబీ కవిత్వము జన సామాన్యమున ప్రచారమునకువచ్చి కవితా రచనలో విశేష శ్రద్ధవహించు నట్లేర్పడెను.

## సైయ్యద్ ఫజల్‌షాహ (1827-90) :

ఫజల్‌షాహ లాహోర్ జిల్లాలో పుట్టెను. ఇతని తండ్రిపేరు ఖుతుబ్‌షాహ ఇతడొక యువతిని ప్రేమించినందుకు కోపగించి తల్లిదండ్రు లింటినుండి వెడలగొట్టిరి. అతడు ఫైనాన్షియల్ కమీషనర్ ఆఫీసులో గుమాస్తా పనిచేసి 1890 లో దివంగతుడయ్యెను. ఇతని మొదటి పుస్తకము 'తౌహఫాయె ఫజల్' అనునది. ఇతడు తనకు ముందున్న కవులు వ్రాసిన కథలనే గ్రహించి మరల వ్రాసెను. వానిలో 'సోహనీ మహివాల్' అను కిస్సా ఉత్తమమైనది. ఇతడు అరబ్బీ, పారశీ భాషలలో విద్వాంసుడైనందున ఇతని కవిత్వమున కఠిన శబ్దాడంబర మెక్కువ. ఇతని కావ్యములలో శబ్దాలంకారములు విశేషముగ వాడబడినందున కవిత్వము నీరసమైపోయినది.

## మియా మహమ్మద్ బక్షే (1829-1909) :

మియాసాహెబ్ జీహలంలోని తాకరా గ్రామమున పుట్టెను. ఇతడు హజ్రత్ ఉమర్ పరంపరకు చెందినవాడు. ఇతడు బ్రతికినంతకాలము పరవశుడగు ఫకీరువలె గడపెను. ఇతని ఖిస్సాలలో 'సైఫల్ మలూక్' ఒక్కటే ఉత్తమమైనది. ఆ కథ నతడు దవయ్యాఛందమున రచించెను.

## భాయీ భగవాన్ సింహ :

ఇతడు ఫీరోజు పుర ప్రాంతమునందలి మగజ గ్రామవాసి. ఇతడు తన ఖిస్సాలను బైత్, దవయ్యా ఛందములలోగాక మాలవ దేశమున పురాతన కవీశ్వరులు వాడిన దోహరా, కవిత్త ఛందస్సులలో రచించెను. ఇతడు 'హీర్', 'రాంఝా', 'సోహనీ మహివాల్' మొదలైన ఖిస్సాలు వ్రాసెను.

## హిదాయతుల్లా :

ఇతడు లాహోర్ నివాసి. వృత్తిలో కుట్టుపనివాడు. లాహోరులోని ప్రసిద్ధ గురువు కలీముల్లా సజ్జన్‌కు శిష్యుడై యుండెను. ఇత డితర కవులవలె చేట భారతము వంటి ఖిస్సాలను రచింపక వారిస్ వ్రాసిన 'హీర్' కావ్యములో 250 పద్యములను వ్రాసి పెంచెను. ఆతనిపేర ముద్రింపబడిన రచనలలో పదునొకండు 'సీహర్ఫీలు' 'బారామాహ' మాత్రము లభించుచున్నవి. ఇతని కవిత్వవిషయము ప్రేమ. ప్రేమకు సంబంధించిన అన్ని అవస్థలను వర్ణించినను ఇతని విరహ వర్ణన ప్రత్యేకముగ పేర్కొనదగినది.

## మహమ్మద్ బుటా :

మహమ్మద్ బుటా గుజరాత్‌వాడు. అతని జన్మ రణజిత్‌సింహుని మరణమునకు మూడేండ్లు ముందు జరిగినది. ఇతడు పూర్వులు వ్రాసిన కథలనే మరలగైకొని వ్రాసినను 'పంచ్‌గంజ్' అను రచన వలననే ప్రసిద్ధి గలిగినది. ఇందు ఐదు 'సహర్ఫీ' లున్నవి. విషయము ఆధ్యాత్మికము. బూటే భావములలో ప్రేమ మార్గము మంచిది. ఇతర సూఫీ కవులవలెగాక నితడు 'బైత్' ఛందస్సు నుపయోగించెను.

కిషణా సింహ రీఅఫ్ :

అరీఫ్ పరివర్తన కాలపు మరియొక ప్రసిద్ధ కవి. అతని తండ్రి నారాయణ సింహుడు. అమృత్‌సర్‌లో పుస్తక విక్రేతగా నుండెను. ఇతడు గులాబ్ సింహుని శిష్యుడు. కిషన్‌సింహుడు ఖిస్సాలను రచించుటేగాక 'కరోడా', 'కుండలియా', 'షట్పద్', 'బారామాహ్', 'సత్‌వారా', 'హోలీ', 'సీహర్ఫీ', 'కాఫీ'లను కూడా వ్రాసెను. ఇతని కవిత గ్రంథ బాహుళ్యముననేగాక రచనా వైవిధ్యమునను పేరు గాంచినది. కిషన్‌సింహుని భావములలో గురుమత, వేదాంత భావములు మిశ్రమములై యుండును. ఇతడు ప్రేమ సౌందర్యములను వర్ణించినను జ్ఞానమునకే ప్రాధాన్యము నొసగెను. అతని రచనలు జాతీయములతో, ఉదాత్తభావములతో నిండియుండును.

గులాం రసూల్ :

ఇతడు హోష్యార్‌పూర్ జిల్లాలోని కుగ్రామమగు 'దుసూహో'లో పుట్టెను. అరబ్బీ, ఫారసీలలో పండితుడు. 'సీహర్ఫీ' లను, 'యూసఫ్ జులేఖా' ఖిస్సాను కొన్ని లేఖలను వ్రాసెను. ఇతని లేఖలు ప్రసిద్ధమైనవి. ఇందలి భాష మృదుమధురముగ నుండును.

సాధుదయా సింహ :

19 వ శతాబ్దాంతమున సూఫీ భావములకు బదులు వేదాంత విచారముల ప్రచార మధికముగ నుండెను. ఈ కాలమున ముగ్గురు సాధుకవులు సంతరేణజీ, ఈశ్వర్ దాసజీ, సాధు దయాసింహజీ అనువారు ప్రసిద్ధులై యుండిరి. దయాసింహుడు ప్రపంచమును మిథ్యగా విశ్వసించువాడు. అతని రచనలలో 'మిథ్యా' అనునది ప్రసిద్ధమైనది. అహంకారమును త్యజించి, వినయము నవలంబింపవలెనని యుపదేశించెను. ఇతడు 'సీహర్ఫీ' లను 'తాఁటక' ఛందస్సులో వ్రాసినాడు. దయాసింహుని భాషపై ముస్లిం సూఫీలయొక్క, హిందూ సాధువులయొక్క ప్రభావము కలదు.

పండిత్ మానసింహ కాళిదాస్ (1895-1944) :

ఇతని జన్మము గుజరాన్వాలాలోనైనది. ఇతని తండ్రి పండిత జయదయాల్‌జీ మహారాజా శేర్‌సింహుని యుద్యోగిగా నుండెను. పదునేడు సంవత్సరముల వయస్సులో అతనికి గురు గృహముపై అనురాగము కలిగెను. అమృతపానమొనర్చి మానసింహు

డయ్యెను. ఆయన చాల 'ఖిస్సా'లను, 'రూపబసంత్', 'రాజా హరిచంద్', 'పూరణ్ భగత్', 'గోపీబంద్', 'భార్‌తరీ', 'ప్రహలాద్ భగత్' మొదలైనవానిని వ్రాసి ఖిస్సా కావ్య పరంపరలో నూతన పద్ధతిని ప్రవేశపెట్టెను. సాధారణముగ ఖిస్సా ముఖ్య విషయము ప్రేమగా నుండెడిది. కాళిదాస్ దానిని మార్చి ధార్మిక, నైతిక కథలను వ్రాసెను.

దౌలత్‌రామ్ :

ఇతడును కాళిదాస్‌వలెనే తన ఖిస్సాలను ధార్మిక, పారమార్థిక విషయములతో వ్రాసెను. వాడుకలోని కథలను గ్రహించి భక్తిమార్గమును, వేదాంత భావములను ప్రచారము చేయుటకై వ్రాసెను. అతడు 'రాజా హరిచంద్', 'రాజా రసాలూ', 'రాజా నరపాల్' మొదలైన ఖిస్సాలను వ్రాసెను. అతని పలుకులపై సాధువుల భాషా ప్రభావము చాల కలదు.

ఈ కాలమున నితర స్మరణీయ కవులు బరదా, జోగసింహ, లాహోరాసింహ, సాధు ఈశ్వరదాస్ మొదలైనవారు కలరు.

## (ఖ) గద్య సాహిత్యము

పరివర్తన కాలమునకు ముందు గద్యము విశేషముగ సాఖీలు, గోష్ఠులు, టీకలు, హుకుంనామాలు, రహిత్‌నామా మొదలైనవాని రూపములో నుండెను. పురాతన జన్మ సాఖీ కర్త అడణ్‌షాహ, భాయీ మనీసింహ మొదలైనవారు పంజాబీ గద్య శైలిని చక్కగా సంస్కరించిరనుటలో సందేహములేదు. ఇంతవరకు చక్కని వైజ్ఞానిక గద్యము అస్తిత్వమునకు రాలేదు. ఈ కాలపు గద్య లేఖకుల ప్రయత్నముచే చక్కని రూప మేర్పడెను.

శ్రద్ధారాం ఫిల్లోరి :

శ్రద్ధారాం ఫిల్లోరీని ఆధునిక పంజాబీ గద్యనిర్మాతగా చెప్పవచ్చును. ఆ దినములలో ఇంగ్లీషువారు పంజాబీ నేర్చుకొనుటకు గట్టిగా ప్రయత్నించిరి. అందువలన శ్రద్ధారాం ఆంగ్లాధికారులచే ప్రేరేరింపబడి 'శిఖ్ఖాందే రాజ్‌దీ ఇథియా(', 'పంజాబీ బాత్‌చీత్', అను రెండు పుస్తకములను వ్రాసెను. మొదటి గ్రంథములో గురునానక్

మొదలుకొని రణజిత్‌సింహుని అంతము వరకు జరిగిన విషయములు వివరింపబడినవి. రెండవ పుస్తకములో ఆయన పంజాబులోని భిన్న భిన్న ప్రాంతాలలో వాడుకయందున్న ఉపభాషలను జానపద గాథలను ఆచార విచారములను వర్ణించినాడు. అతడు 'దోఆబ్' (అంతర్వేది) నివాసి ఐనందువలన భాషలో 'దోఆబ్ బోలి' ప్రభావము కనపడును,

జ్ఞానీ జ్ఞానసింహ :

ఇతడీ కాలపు రెండవ ప్రసిద్ధ గద్య లేఖకుడు. ఆతని గద్యము శ్రద్ధారాం కంటె సుసంస్కృతము ఆధునికము అయినది. 'పవారీఖ్ గురూఖాల్సా', 'షంషేర్ ఖాల్సా' అనునవి అతని ప్రసిద్ధ రచనలు. వీనిలో ఆయన సిక్కుల చరిత్రను సరళముగ, సరసముగ చిత్రించెను.

బిహారీ లాల్ పురి :

ఇతడు 'విద్యారత్నాకర్', 'చరితావలి', 'అనేక దర్శన్' మొదలైన పుస్తకాలను విద్యార్థులకై లిఖించెను. వానితోబాటు ఒక వ్యాకరణమును. ఛందస్సును వ్రాసెను. ఆయన భాష అత్యంత సరళముగ, వ్యాకరణ సమ్మతముగ నుండును.

భాయి దిత్తసింహ :

ఆయన 'సింహసభ' ప్రారంభనాయకులలో నొకడు. కావున రచనలపై ఆ యుద్యమ ప్రభావము పడుట స్వాభావికము. ఆయన లాహోరులోని ఓరియంటల్ కాలేజీలో పంజాబీ ప్రొఫెసరుగా నుండిరి. కొంతకాలము 'ఖాల్సా పత్రికకు' సంపాదకుడుగా పనిచేసెను. 'నీతిప్రకాశ్' 'ధర్మదర్పణ్', 'శ్రీగురునానక్ ప్రబోధ్' 'ఆరతీ ప్రబోధ్', 'గురు అర్జున్ ప్రబోధ్', 'గురు వాణీప్రబోధ్', 'మేరాతే సాధుదయానంద్‌డా సంవాద్', 'దుర్గాప్రబోధ్' మొదలైనవి ఆయన ప్రసిద్ధ రచనలు.

డా. చరణసింహ :

ఇతడు భాయీ వీరసింహుని తండ్రి. ప్రసిద్ధ గద్యలేఖకుడుగా పేరు పొందినాడు. అతడు ఇతని రచనలు 'మహారాణీ శరాబ్‌కౌర్', జంగ్‌మడౌలీ, హీర్, భాయీ గురుదాస్ మొదలైనవి ప్రసిద్ధములు. పంజాబీ గద్యమునకు చక్కని రూపురేఖలు తీర్చుటలో దానిని సంస్కరించి ఆధునిక రూపమిచ్చుటలో నితడు గొప్ప కృషిచేసెను. ఇతని గద్యము సరళము- సరసమునైనది.

**బాబా రాంసింహ :**

ఇతడు ప్రత్యేకముగ గద్యరచనలు చేయకున్నను రంగూన్ జైలులో నున్నప్పుడు తన శిష్యులకు కొన్ని లేఖలను వ్రాసెను. వాని శైలి ప్రభావపూర్ణమైనది. ఆ లేఖ లరువది వరకున్నవి.

కర్నల్ భోలానాథ్ 'లాహోరే ఇతిహాస్' కర్త జ్ఞానీ హజారాసింహ, జ్ఞానీ గురుముఖసింహ, గద్యలేఖకులలో చెప్పదగినవారు.

**ఆధునిక కాలము (1905 —) :**

భూమిక :— పంజాబీ సాహిత్యమున ఆధునికకాలము ఇరువదవ శతాబ్దారంభము నుండి నేటివరకు నడచుచున్నది. ఆధునిక గద్యరచనా పితామహుడు భాయీ వీర సింహుడు తన మహా కావ్యమగు 'రాణా సూరత్‌సింహ' ను ప్రకటించిన 1905 వ సంవత్సరముననే ఆధునికతా శిలా న్యాసము జరిగినది. ఆయన రచనలన్నిటిపై సింహ సభా ఉద్యమ ప్రభావమున్న వనుటలో సందేహములేదు. కవితా విషయములగ గురు మత సిద్ధాంతములను గ్రహించినను రచనలో అలంకార ప్రయోగమును తగ్గించి ఆధునిక గద్యపద్య పద్ధతిని ప్రారంభించెను.

గత మహాయుద్ధము (గ్రేట్‌వార్) తరువాత పంజాబులో అకాలీ ఉద్యమము విప్లవోద్యమము, బబ్బర్ ఉద్యమములే గాక, ఈ అన్నిటి సమష్టిరూపమై తీవ్రమైన జాతీయోద్యమము కొనసాగెను. ఈ ఉద్యమము సాహిత్యక్షేత్రమును ఒక్కసారిగ విశాల మొనరించెను. సమయానుసారముగ జాతీయ వార్తా పత్రికలు వెలువడి పంజాబీ గద్యమునకు నూత్నశబ్దావళిని ప్రసాదించి జనులలో దేశభక్తినుద్దీపింప జేసినవి. కవిత గూడ ఈ రంగులచే రంజితమయ్యెను. నవ్యకవులలో 'జ్ఞానీ హీరాసింహ్‌దర్ద్' జ్ఞానీ గురుముఖసింహ ముసాఫిర్, 'మోహన్‌సింహ' అనువారు ప్రసిద్ధులు. పై ఇరువురి బందీ కావ్యములు, మోహన సింహుని ఆవేశపూర్ణకవిత్వము జాతీయ భావము నుత్తేజిత పరచి ఆంగ్ల వ్యతిరేక పక్షమును పటిష్ఠ మొనర్చెను.

ఈ సమయమున కార్మిక కర్షకోద్యమము విజృంభించి నవ్యకవులను లేఖకులను ఆకర్షించెను. ఇదే సమయముననే పశ్చిమమునుండి అభ్యుదయ భావమున మహాచ్ఛాయ గూడ దేశముపై నావరింప నారంభించెను. జాతీయోద్యమము పరంపరాగత సాహిత్య శృంఖలలనుండి విడదీసి వారి దృక్పథమును జాతీయ మార్గమును బట్టింపగా అభ్యు

దయోద్యమము వారి దృష్టికోణమును ఇంకను విస్తృతపరచి అంతర్జాతీయ మార్గమును చూపించెను. ఈ నూతనోద్యమ ప్రభావము ప్రబలి పంజాబీ సాహిత్యమున వాస్తవికతా వాదము ప్రవేశించెను. తత్ఫలితముగ ప్రాచీన ఆధ్యాత్మిక వాదము, నవీన ఆదర్శ వాదము నిస్తేజము లయ్యెను.

ఈ సమయమున మరొక ఉద్యమము బయలుదేరి పంజాబీ సాహిత్యము నకు నూతనోత్తేజమును కూర్చెను. దీనిని శుద్ధ పంజాబీ ఉద్యమమని చెప్పవచ్చును. దీని లక్ష్యము హిందూ ముస్లిం శిక్కులలో పంజాబీని ప్రచారము చేయుట మరియు అందరికిని ఆదరణీయమగు పంజాబీ సాహిత్యమును సృష్టించుటయై యుండెను. ఈ ఉద్యమమును అమృతసర్‌లో లాలాధనీరాం ఛాత్రిక్, చరణ్‌సింహ, హీరాసింహదర్ద్, మౌలాబక్ష్ అనువారు లేవదీసిరి. పంజాబీ భాషను శిక్కులు కానివారిలో ప్రచారము చేయుటకై 'సారంగ్, పంజాబీ దర్బార్', అను రెండు మాసపత్రికలను ఉర్దూ లిపిలో ప్రకటించి నిర్వహించిరి. దీనివలన హిందూ ముస్లిం ఐకమత్యం కొంత సాధింప బడెను.

నేటి పంజాబీ సాహిత్యము భిన్న సంకీర్ణ భావములతో ముందుకుసాగి సాంప్ర దాయిక ఆవరణములను తొలగించికొని విశాల మైదానములలో విహరించుచున్నది. ఈ కాలమున జరిగిన మరొక మహోదుర్ఘటనము 1947 లో పంజాబును చీల్చుట. ఆ విభజన తర్వాత భారత ప్రభుత్వము పంజాబీ భాషను పదునాలుగు జాతీయ భాష లలో నొకటిగ పరిగణించుటవలన పంజాబులో దానికి మహోన్నత స్థానము లభించెను. పంజాబు విశ్వవిద్యాలయము పంజాబీ భాషా విభాగము మొదలైన ప్రభుత్వ సంస్థల ద్వారా పంజాబీ సాహిత్యమునకు నూతనోత్తేజము లభించెను. ఢిల్లీలో సాహిత్య అకాడమి ఏర్పడి పంజాబీ రచనలకు బహుమానము లిచ్చుట వలన ఉత్తమ రచనలను ఇతర భాషలలో అనువదింప జేయుటవలన పంజాబీసాహిత్యము సకల భారతస్థాయి నందుకొనెను.

## (క) కావ్య సాహిత్యము

### భాయి వీరసింహుడు (1872-1957):

ఇతడు రెండుసభ్యతలను జీర్ణముచేసికొన్న కారణమున వీరసింహుని రచనలలో ముఖ్యముగ కవిత్వములో ప్రాచీన నవీనభావసమ్మేళనము కానవచ్చును. ఇతని రచనలు

సాహిత్యమున పూర్వపశ్చిమ రీతులకు మధ్య నిర్మించిన సేతువుగ నున్నది. భావములను బట్టి ఆయన ఆదర్శవాది యని చెప్పవచ్చును. భారతీయాదర్శవాద సాహిత్యము గూఢ మయాత్మక శృంగారాత్మిక ఆధ్యాత్మిక వాదముగా నుండినది. అందు శిక్కుగురువుల అనుభూతులు చేరి కొద్దిమార్పులు చెందెను. భాయీ వీరసింహజీ తన కావ్యరచనలో ఈ విశిష్టరూప ఆధ్యాత్మవాదమునే వ్యక్తముచేసెను. శిక్కుగురువులు గీతలో చెప్ప బడిన జ్ఞాన, యోగ, ప్రేమ మార్గములను సమ్మేళన మొనర్చి సరళసంతులిత జీవన మార్గము నుపదేశించిరి. దానిని సహజమార్గమందురు. శిక్కుల ధ్యేయము ముక్తి కైవల్యములు కావు. ఈ జీవితముననే సహజము, సంతృప్తికరమైన అవస్థను పొంద వలెను. ఈ సహజావస్థనే గురువులు ఆనందమని వ్యవహరించిరి. భాయీవీరసింహుడు ఈ సహజావస్థకు వికాసమని పేరుపెట్టెను. తన కవితలలో ఈ వికాసావస్థనే తనివిదీర వర్ణించినాడు. ఈ యవస్థాప్రాప్తి భౌతిక జ్ఞానము వలన లభింపదు. కావున సర్వమును త్యజించి పరిశుద్ధ జ్ఞానమార్గమును పట్టవలెను — అని ఆయన అభిప్రాయము.

భావములను బట్టి భాయి వీరసింహజీ రచనలు ఆదర్శవాద ముద్ర ధరించి నప్పటికిని పాశ్చాత్య సాహిత్యప్రభావము వలన ఆధునిక రీతిలో పోతబోసినట్లున్నవని చెప్పవచ్చును. ఆయన ఖిస్సారచన అను పాతపద్ధతిని వదలి పాశ్చాత్యపద్ధతిలో మహా కావ్యరచన చేసెను. అట్లే ఖండకావ్యములను గూడ రచించెను. ఆయన కావ్యములలో రాణా సూరత్‌సింహ (1905) లహరాందేహార్ (1921) మటక్‌హులారే (1925) బిజిలియాందేహార్ (1927) మేరేసాయియాఁజీఓ (1953) సుప్రసిద్ధములు.

## లాలా ధనిరాం ఛాతిక్ (1876-1954)

ఛాత్రిక్ జీ సియాల్ కోటలో జన్మించెను. ఆయన 1892 వీరసింహుని ప్రెస్సులో ఉద్యోగిగా నుండెను. ఇతడు కవిత్వము వ్రాయుటలో గురుముఖీ టైపుచేయుటలో సిద్ధహస్తుడు.

ప్రారంభమున నితడు పూర్వుల పద్ధతిలో భర్తృహరి, నలదమయంతి వంటి ఖిస్సాలను వ్రాసినను తరువాత నూతన పద్ధతి నవలంబించెను. అతని ప్రథమ కవితా సంగ్రహము 'చందన్‌బాడీ' 1931 లో ప్రకటింపబడెను. ఆ తరువాత 'కేసర్‌క్యారీ', 'నయాజహాం', 'సూఫీఖానా', మొదలైనవానిని రచించెను. ఇతని కవిత్వము ఛందో బద్ధమై లోకోక్తులచే నిండియుండును. శైలిలో కళాప్రావీణ్యము కానవచ్చును,

ఆయన కవిత్వము నైతికమై ఉపదేశాత్మకమైయున్నది. పంజాబీ సమున్నతికై ఛాత్రిక్‌జీ చేసిన కృషిని గుర్తించి దేశీయులాయనకు అందమైన అభినందన సంపుటిని బహూకరించిరి.

## ప్రొ. పూర్ణసింహ (1881-1931) :

పంజాబీ కవులలో పూర్ణసింహునకు ఉచ్చస్థానము కలదు. ఆయన విదేశములలో పర్యటించి వచ్చెను. సుశిక్షిత విశాల దృష్టిగల మహా వ్యక్తిగ చెప్పదగినవాడు. ఇతడు దర్శన విజ్ఞాన శాస్త్రములను పఠించినను నీరస పదార్థవాదిగ మారలేదు. ఈయన మనోవేగము చాల గొప్పది. ప్రాచీన కావ్యరూపములు దాని నడుపులో నుంచలేకపోయెను. అందువలన పూర్ణసింహుడు అమెరికా ప్రసిద్ధ కవియగు 'వాల్ట్ వైట్‌మన్' వలె ఒక స్వతంత్ర ఛందస్సులో కవితలు రచించెను. ఛందస్సుపై ఆయన విప్లవమును ప్రకటించి తన కావ్య సంగ్రహమునకు 'ఖులేమైదాన్' అని పేరు పెట్టెను.

## ఈ తరములో ఇతర కవులు :

ఈ కాలపు కవులలో లాలా కృపాసాగర్ సియాల్‌కోటలో పుట్టెను. జమ్మూలో ఉద్యోగము చేయునపుడు అచట స్థితిగతులు కొండలలో వసించువారి స్వభావములు ఆచార విచారములు తెలిసికొనెను. పంజాబు దేశ చరిత్రను చదివి సర్‌వాల్టర్ స్కాట్ రచించిన 'లేడీ ఆఫ్ ది లేక్' ఆధారముతో లక్ష్మీదేవి యను కావ్యమును రచించెను. ఇందు మహారాజా రణజిత్‌సింహుని 'బందరాల్' దేశ విజయము వర్ణింపబడినది. శైలీ సారళ్యమునగాని, ప్రకృతి వర్ణనలు, ఋతు వర్ణనలలోగాని, కథా కథన నైపుణ్యములోగాని, 'లక్ష్మీదేవి' కావ్యముతో పంజాబీలోని ఏ కావ్యము గూడ సరిపోలజాలదు.

## చరణసింహ షహీద్ (1891-1935) :

ఇతడును ప్రసిద్ధ కవి. పంజాబీ కవిత్వమున హాస్యరస పద్ధతిని వెలయించెను. వ్యంగ్య చిత్రణలో మన మితనిని పంజాబీ 'పానుగంటి'గా భావించవచ్చును. ఈతని హాస్యరసపూర్ణ కవితా సంగ్రహము 'బాదుషాహియాఁ' అను పేర ముద్రింపబడెను.

జ్ఞానీ గురుముఖ్‌సింహ ముసాఫిర్, జ్ఞానీ హీరాసింహదర్ద్, ఈ కాలపు ప్రసిద్ధ దేశభక్తి కవులు. వీరిరువురు ఇంగ్లీషువారితో జరిగిన పోరాటములో పాల్గొని జైలునకు పోయి అచట తీవ్రభావకవితలను వ్రాసిరి. ఇట్టి కవితలను ఫార్శీలో

'హబ్షియాత్' అనెదరు. 'విధాతసింహతీర్' అకాలి ఉద్యమముచే ప్రభావితుడై 'తీర్ తరంగ్' అను కావ్యమును వ్రాసెను. 'సయే నిషానే', 'గూంగే గీత్', 'మిఠేమేతే', మొదలైన కావ్య సంగ్రహములను, 'బందా సింహ బహదూర్', 'రూప్‌రాణీ', 'శకుంతల', 'నలదమయంతీ', మొదలైన పెద్ద కథా కావ్యములను రచించెను. ఇతని రచనా పద్ధతిని 'టక్సాలీ' అందురు.

మరొక ప్రసిద్ధ కవి డా. మోహనసింహ దీవానా (1899) రావల్పిండి ప్రాంతమున జన్మించెను. ఇతని రచనలలో 'చుప్‌ఘా(', 'నీల్‌ధారా', 'జగత్ తమాషా', 'మస్తీ'. 'పత్‌ఝడ్', 'సోమరస్' మొదలైన కావ్యములు ప్రసిద్ధములు. ఇందు బహు భాషా పాండిత్యము నిరాడంబర జీవితానుభవము ప్రత్యక్షముగ గోచరించును.

### ప్రొ. మోహన సింహ (1905):

ఆధునిక పంజాబీ కవిత్వపు రెండవ తరములో ఇతనికి విశిష్ట స్థానము కలదు. ఇతని ప్రభావము తరువాతి పంజాబీ కవితలో కానవచ్చును. ఇతని కవితలలో ప్రజా జీవితము, సార్వజనిక భావము ప్రతిబింబించుటవలన నివి లోకప్రియములైనవి. ఇతడు సరిహద్దు ప్రాంతములోని మర్దాన్ పట్టణములో పుట్టి రావల్‌పిండిలో పెరిగెను. 1939 లో నితని మొదటి కావ్య సంగ్రహము 'సావే పత్తర్' ముద్రింపబడెను. 1960 లో భారతీయ సాహిత్య అకాడమీవారు ఇతని 'బద్దావేలా' అను గ్రంథమునకు 5000 రూపాయలు బహుమతినిచ్చి గౌరవించిరి. 1945 లో నితడు ఎడ్విన్ ఆర్నాల్డ్ వ్రాసిన జగత్ప్రసిద్ధ గ్రంథము 'లైట్ అఫ్ ఏషియా'కు పద్యమయానువాదము 'ఏషియా దా చానన్' అనుదానిని ప్రకటించెను.

### అవతార్‌సింహ ఆజాద్ (1906):

ఇతని మొదటి కావ్యము 'కైదీవీర్' అను పేర ముద్రింపబడెను. దానిలో విప్లవభావ పూర్ణములైన కవితలు కలవు తరువాత ఇతడు మనకు ఆరు కావ్యముల నొసగెను. ఆజాద్ కావ్యశక్తి దేశ విభజన తరువాత 'మర్ద్ అంగమడా', 'విశ్వనూర్', 'మహాబలీ' అను కావ్యత్రయమును రచించుటతో లోకమునకు వెల్లడియయ్యెను. ఈ కావ్యములలో గురు గోవిందసింహ, గురునానక్‌దేవ్, మహారాణా రణజిత్‌సింహుల వ్యక్తిత్వములును, వారి సిద్ధులును, గొప్పగ వర్ణింపబడినవి.

### ప్రీతం సింహ సఫీర్ (1916) :

ఇతడు రావల్పిండి జిల్లా మల్వాదులో పుట్టెను. ఇతని కవిత సమకాలీన రచనలలో విలక్షణమైనది. ఇతనిని గురించి విమర్శకులు పలువిధములైన అభిప్రాయము లొసగిరి. కొందరీతనిని ప్రభావ వాది కవి అనిరి. ఇతని కవితలలో అస్పష్టత కాన వచ్చును. 'కత్తల్ కూంజా', 'పాపదేసోహలే', 'రక్త బూందా', 'ఆది జుగాదీ', 'రాగ్‌రిస్మా' అనునవి సఫీర్ వ్రాసిన ప్రసిద్ధ కావ్యములు.

### అమృతా ప్రీతమ్ (1919) :

ఈమె పంజాబులో లోకప్రియ కవయిత్రి. ఈమె కీర్తి భారతదేశమున దూర ప్రాంతములకు వ్యాపించెను. ప్రిన్సిపాల్ తేజసింహజీ ఈమెను గురించి 'పంజాబీ దీ ఆవాజ్' అన్నాడు. ఈమె పండ్రెండు కావ్యములు వ్రాసెను. వానిలో 'లోకీపీడ్', 'పత్తర్ గీటే', 'లనియావాటాం', 'సర్ఘీనేలా', సమేహదే', 'అశోకాచేతీ', 'కస్తూరీ' మిక్కిలి ప్రసిద్ధములు. ఈమె కవిత్వశైలి గంభీరమైనది.

### బాబా బల్‌వంత్ (1915) :

ఇతడు నేష్టా గ్రామమున పుట్టెను. "జ్వాలాముఖి, అమర్ గీత్, బందర్ షాహ్, సుగంధ్, సమీర్ పాంచ్", అను కావ్య సంగ్రహములను ప్రకటించెను. ఇతడు కొన్ని ప్రేమ గీతములతోపాటు విశేషముగ విప్లవ కవితలను వ్రాసెను. ఇతడు సమకాలిక వ్యవస్థతో సంతృప్తిజెందక దానిని మార్చవలెనను పూనిక కలిగియుండెను. అతని రచన 'శిల్‌నాచ్' విప్లవదృష్టి కోణము స్పష్టమగుచున్నది. వాబా బల్‌వంత్ ఉర్దూ సాహిత్యమును క్షుణ్ణముగ చదువుకొనెను. అందువలన అతని కవితలలో శబ్ద ప్రయోగము. వాక్య విన్యాసము, శైలి ఉర్దూ ప్రభావమును చెప్పుచున్నవి.

ఈ కాలములోని కొందరు కవులను ప్రయోగవాది కవులనవచ్చును, వారు భిన్న భిన్న రూపములలో రచించిరి. చవన్‌సింహ వార్ధక్యములో కవిత్వము నారంభించి 'మన్ ఆయియాం', 'ఆప్ మొహారియాం' అను రెండు కావ్య సంగ్రహములను ప్రకటించెను. హర్ దయాల్‌సింహ సీకరీ, 'పుట్‌దేసోమే' కావ్యమున వ్యంగ్యమును ప్రయోగించెను. డా. గోపాలసింహ దర్ది 'ఝనా', 'హమేరే సవేరే' అను వ్యంగ్య కావ్యములను, నరేంద్రపాల్‌సింహ అంగామీ వహింంగ్', 'కిల్లతే కామే' అను కావ్య

సంగ్రహములను ప్రకటించిరి. ఈ తరములో ప్యారాసింహ, ఈశ్వర్ చిత్రకార్, రణవీర్ సింహ కావ్యములు వ్రాసినారు.

ఈ రెండవ తరమునకు చెందిన కవులలో నొక ప్రసిద్ధ సంఘము కనపడును. వారు ప్రజలకు సన్నిహితులై రంగస్థలముద్వారా లక్షలాది పంజాబీ ప్రజలలో పంజాబీ భాషను ప్రాచీన ఛందోబంధములను కవితా నియమములను ప్రచారముచేసిరి. వీరిలో ఉస్తాద్ హందస్, ఉస్తాద్ దామన్, దేవదాస్ హిందీ, కృపారాం, సుందరదాస్, పిరోజ్‌దీ సర్ఫ్, నందలాల్ నూర్పూరీ, తేజసింహ సాబర్, దర్శన్‌సింహ ఆవారా, బిషన్‌సింహ ఉపాసక్, జస్వంతరాయ్, బరకత్‌రామ్ మొదలైనవారు ప్రసిద్ధులు.

**మూడవ తరము కవులు :**

ఆధునిక కవిత్వములో మూడవ తరము పంజాబు విభజన తర్వాత నారంభ మైనది. ఈ కవులను రెండు వర్గములుగ విడదీయవచ్చును. మొదటి వర్గమువారు అగ్రగామీ పద్ధతి ననుసరించువారు. వీరికి ముఖ్యుడు సంతోఖ్ సింహధీర్ అనవచ్చును. ఇందులో హరనామ్‌సింహ, సుఖవీర్, గురుచరణ్ రాంపురి, మొదలైనవారు చెప్ప దగినవారు. రెండవ గుంపు రూపవాది కవులకు చెందినది. వీరు విషయమునకంటె రచనకు ప్రాధాన్యమిచ్చెదరు. ఈ గుంపులో తఖ్తసింహ, హర్‌భజనసింహ, జ్ఞాన సింహ, హస్రత్ అనువారు ప్రసిద్ధులు. వీరిలో తఖ్తసింహుడు ఆశావాదిగ, హర్ భజనసింహుడు నిరాశావాదిగ కనపడుచున్నారు.

## (ఖ) నాటకములు - ఏకాంకికలు

భారతీయులకు నాటకకళ క్రొత్తదికాదు. ప్రాచీన కాలమున కాళిదాసు, మరియు గుప్త సామ్రాట్టుల కాలమున నాటకకళ పూర్ణ యౌవనదశ ననుభవించెను. పలువురు సమాలోచకులు 'ఏకాంకిక'ను ఇరుదవ శతాబ్దమున బుట్టిన ప్రక్రియగా తలచుచున్నారు. పాశ్చాత్యుల ఏకాంకికలగు 'పట ఉత్థాపకము' లను (Curtain Raisers) దృష్టి యందుంచుకొని పంజాబీలో 'చాందర్‌కా పంజా' వ్రాయబడిన దనుచున్నారు. కాని ఆధునిక పరిశోధనలవలన భారతదేశములోను, జపాన్‌లోను వేయి సంవత్సరములకు పూర్వమే ఏకాంకికలు ప్రచారమున నుండెనని తెలియుచున్నది. భారతదేశములో నాట్య - నాటక కళలనుగూర్చి చాల గ్రంథములు వ్రాయబడియున్నవి. వానిలో భరత ముని కృత 'నాట్యశాస్త్రము' చాల ప్రశస్తమైనది.

కాని భారత దేశమునకు ముసల్మానుల రాకతో నాట్యకళకు ప్రబలాఘాతము కలిగెను. నాటకకళ నాశనమే అయినది. పదునాల్గవ శతాబ్దమున భక్తి యుద్యమము విజృంభించినపుడు 'కృష్ణలీల', 'రామలీల' రూపములతో నాట్యకళ పునరుద్ధరింప బడినది. తరువాత భారతమునకు ఇంగ్లీషువారి రాకతో నాట్యకళ కొక నూతనోత్తేజము లభించెను. నాట్య రచనవైపు దృష్టి మరలదొడగెను. ఆరంభములో కొన్ని దేశీయ విదేశీయ నాటకానువాదములు వెలువడినవి. వీనిలో డా॥ చరణ్‌సింహుని 'శకుంతల', మానసింహుని 'విక్రమోర్వశీ', ప్రొ. బహల్ 'మాళవికాగ్నిమిత్ర', శంషేర్ సింహుని 'ముద్రారాక్షసము', నారాయణసింహుని 'లాల్‌బాద్‌షాహీ', బలవంత్ సింహుని 'దుబ్బీరాజా' నిహాల్‌సింహుని 'జోబ్బేభావే', సరుదయాల్‌సింహుని 'చాంది దా డబ్బా' మొదలగునవి సంస్కృత - ఆంగ్ల నాటకముల చక్కని అనువాదములు.

ప్రొ. ఐ. సి. నందాను ఆధునిక పంజాబీ నాటక పితామహుడుగ చెప్పవచ్చును. అంతకుముందు కొందరు నాటక రచన నారంభించియుండినను అవి నాటక లక్షణములు కలవి కావు. ప్రదర్శన యోగ్యమగు నాటకమును ప్రొ. నందా ఇచ్చినాడు. 'సుభద్ర', 'లిల్లీదాబియాహ్' అనునవి వారి సంపూర్ణ నాటకములు. వానిని నాటకకారుడు స్వయముగ రంగస్థలమున నభినయించి తదనుగుణ సంస్కారములను చేసెను. 'సుభద్రా వివాహము' లో విధవా వివాహ సమర్ధనము కలదు. 'లిల్లీ వివాహము' లో ప్రేమ వివాహ సమర్థన మున్నది.

ఏకాంకికులకు కూడ నితడే ప్రథముడు. అతని మొదటి యేకాంకిక 1913 లో వ్రాయబడినది. తరువాత 'ఝుల్కారే' 'లష్కారే' అను ఏకాంకికా సంగ్రహములను ప్రకటించెను.

## హరిచరణ్ సింహ :

ఇతడు నాటక రచనలో, వాని నభినయించుటలో ప్రొ. నందా ననుకరించెను. హరిచరణ్‌సింహుడు కొన్ని నాటకములను, ఏకాంకికాసంగ్రహములను ప్రకటించెను. ఇతడు గ్రామములో పుట్టిపెరిగి, పట్టణములో నివసించుట వలన రెండు జీవన పద్ధతులను తెలిసికొని తన నాటకములలో చిత్రించెను. ఇతడు సాంఘిక, చారిత్రిక నాటకములను దుఃఖాంతములుగ, సుఖాంతములుగ వ్రాసెను. ప్రొ. కసేల్ ఇతనిని సామాన్య లేఖకుడుగ పరిగణించెను.

సంతసింహసేఖు :

ప్రొ. సంతసింహుడు ఒక శక్తివంతుడగు సర్వతోముఖ పంజాబీ లేఖకుడు. ఇతడు నవలలను, నాటకములను, ఏకాంకికలను, కథానికలను, కావ్యములను, సాహిత్య సమాలోచనలను వ్రాసి అన్నిటిలో సిద్ధహస్తుడనిపించుకొనెను. ఇతని వలన పంజాబీ నాటకమొక గంభీరబౌద్ధిక శక్తిని సంతరించుకొనెను. అతని చేతిలో నాటకము కేవల మనోరంజక వస్తువుగనే కాక అత్యంత జటిలములైన సాంఘిక, చారిత్రిక సమస్యలను పరిష్కరించు సాధనముగ మారెను. అతని 'కలాకార్' అను నాటకమున సామ్యవాదదృష్టి ప్రదర్శింపబడినది. "నారకీ" లో విభజన తరువాత పుట్టిన చీకటి బజారు నిందింపబడినది. అతని ఐతిహాసిక నాటకములకు సాటియైనవి పంజాబీలో నింతవరకు రాలేదు. అతని ఏకాంకికలుగూడ నమూల్యములైనవి. 'ఛహఘర్' 'నాట్ సునేహ్రే' అనునవి ఏకాంకికా సంగ్రహములు.

బల్వంతగార్గీ :

గార్గీ మన కాలమున ప్రసిద్ధ నాటకకారుడు. ఇతడు రష్యా, చీనా, యూరోపు దేశములలో పర్యటించి అచటి నాట్యనాటక కళలను బాగుగ నభ్యసించెను. అతని రెండు నాటకములు 'కేసరి', సోహనీ' అనునవి రష్యాలోని 'జిప్సీ' థియేటర్‌లోను, జర్మనీలోని 'బ్రైస్టు' థియేటరులోను జయప్రదముగ ప్రదర్శింపబడెను. అతడచటి కలావిదులతో గలసి ప్రదర్శించుటవలన నచటి సాంకేతిక నైపుణ్యమును సంపాదించెను. నాటకములను, ఏకాంకికలను వ్రాసెను.

కర్తార్‌సింహ "దుగ్గల్" :

సంత్‌సింహుని వలెనే 'దుగ్గల్' కూడా ప్రతిభావంతుడు. కథానిక రచయితగా ప్రసిద్ధిబొంది 'ఖాలీబోత్లాం', 'మీఠాపానీ' అనునాటకములను కూడ వ్రాసెను. కథా రచనలో, నాటక రచనలో నితడు సిద్ధహస్తుడనుట నిర్వివాద విషయము.

ఇతర నాటక కర్తలు :

పైన పేర్కొన్న ప్రసిద్ధ నాటకకర్తలు గాక ప్రాచీన నాటకకారులలో లాలా కృపాసాగర్, గురుభక్తసింహులును, నవీన నాటకకారులలో గురుదయాల్‌సింహ, రోషన్‌లాల్, కపూర్‌సింహ, ప్యారాసింహ మొదలైనవారును ప్రశంసింప దగిన వారు.

# (గ) గద్యసాహిత్యము

పంజాబులో నవలారచన ఇరువదవ శతాబ్దమునుండియే ప్రారంభమయ్యెను. ఈ సాహిత్య ప్రక్రియపాశ్చాత్య ప్రభావ జనిత మనవచ్చును. నాటకముల వలెనే నవలలు కూడ అనువాదములతో నారంభమయ్యెను.

**భాయీ వీరసింహుడు :**

ఇతడు పంజాబీ భాషలో మొట్టమొదటి నవలాకారుడు. ఇతడు 'సుందరీ', 'విజయసింహ', 'సత్వంత్‌కౌర్' నవలలను ప్రకటించెను. ఈ నవలలలో ఆయన ఆదర్శశిఖువీరులను, వీరాంగనలను వర్ణించి శిఖుల చరిత్రపై మనకు గౌరవ భావమును కలిగించు యత్నమును చేసెను. కళాదృష్టితో ఈ నవల ఉత్తమములు కావు.

భాయీ వీరసింహుని సమకాలికుడు భాయీమోహన్‌సింహజీవైద్య సాంఘిక, ధార్మికోద్యమములచే ప్రభావితుడై కొన్ని నవలలను వ్రాసెను. 'ఏక్‌శిఖ్ ఘరానా'', 'సుభగ్‌కౌర్', దంపతీప్యారా' అనునవి అతని ప్రసిద్ధ నవలలు. ఇతని తరువాత చరణ్‌సింహ షహీద్ నవలారచనలో నూతన మార్గమవలంబించెను. అతని నవలలు 'దలేర్‌కౌర్', 'రంజిత్‌కౌర్', 'శరాబ్‌కౌర్' మొదలైన వానిలో భౌతిక వాదము తొంగిచూచినది.

**నానక్‌సింహ :**

నేటి పంజాబీ నవలా ప్రపంచమున భాయీ నానకసింహుడు ప్రసిద్ధుడు. ఇతడు పాతిక నవలలను వ్రాసెను. విశేషముగా నగరములలోని నిమ్న, మధ్య తరగతులవారి జీవితము లిందు చిత్రించబడినవి. ఇతని భాష సామాన్యమైనది. ఇతని నవలలలో నీతి భావుకత హఠాత్ఘటనల ప్రయోగము మొదలైన దోషములు విస్తారముగ నున్నవి. అయినను కథాకల్పనములో, రోచకతలో నితనితో సమానులులేరు. ఇతడు కొన్ని చిన్న కథలను గూడ వ్రాసెను.

**సురేంద్రసింహ నరూలా :**

ఇతడు 'పీవోపుత్తర్', 'నీలీబార్', 'రంగ్‌మహల్', 'లోక్‌దుష్మన్' మొదలగు నవలలను వ్రాసెను. ఇతని భాష అపరిపక్వమైనను యధార్థమును చెప్పుటలో శక్తివంతమైనది.

జస్వంత్‌సింహ కంవల్ :

ఇత డభ్యుదయ భావములుగల యువ నవలాకారుడు. 'పూరణ్మాసీ', 'సత్యనూ ఫాంసీ', 'పాలీ' అను మూడు నవలలను వ్రాసెను. ఇతని పాత్ర నిర్మాణము విశిష్టమైనది.

నరేంద్రపాల్ సింహ :

కర్నల్ నరేంద్రపాల్‌సింహుడు అల్పకాలములోనే 'మల్లాహ', 'సేనాపతీ', 'శక్తి' 'అమన్‌దేరాహ', 'క్రియాజాల్' మొదలైన నవలలను వ్రాసి ప్రముఖ నవలా రచయితగా పేరు పొందెను. ఇతని నవలలలో విషయ వైవిధ్యము, స్వాభావిక వర్ణనలు చెప్పదగిన గుణములు. ఇతడుగాక అమృతాప్రీతమ్, జోగీ హరీందర్, రామ్‌సింహదత్తా, కేసరీసింహ మొదలైన రచయితలుగూడ పలువిధములైన నవలలను వ్రాసిరి.

కథానికా రచయితలు :

పంజాబీలో కథారచన ఉన్నతస్థితి నందినది. గురుభక్షసింహునకు కథాప్రారంభిక వికాసమున నెక్కువ సంబంధము కలదు. దుగ్గల్ వ్రాసిన 'సవేర్‌సార్' సంత్‌సింహుని 'సమాచార్' అనునవి కథానికా రచనలో వాస్తవిక రూపమును పొందినవి. దుగ్గల్ శతాధిక కథానికలను వ్రాసి పంజాబీ కథాకారులలో శిరోమణియైనాడు. సుజాన్‌సింహ, కులవంత్‌సింహ, సంతోఖ్‌సింహులు కూడ కథా రచయితలలో చెప్పదగినవారు.

డాక్టర్ మోహన్‌సింహ, జోషువాఫజియొద్దీన్, గురుముఖసింగ్ ముసాఫిర్, అభయసింహ, దేవేంద్రసత్యార్థి, మహేంద్రసింహ, నౌరంగ్‌సింహులుకూడ చెప్పదగిన కథారచయితలు. నవీన కథాకారులలో నవతేజసింహ, గురుముఖసింహజీత్, సుఖవీర్ అనువారు చక్కని రచనలు చేసిరి.

## గద్య సాహిత్యము

ఆధునిక పంజాబీ గద్యము శ్రద్ధారామ్ ఫిలౌరీచే ప్రారంభింపబడినను అతినవ్య పద్ధతిలో వైజ్ఞానిక గద్యము ఇరువదవ శతాబ్దములో మొదలైనది. గల్పిక, చరిత్ర, నాటకము మొదలైనవి గద్యక్షేత్ర పరిధిలోనికే వచ్చినను మేము గద్యశైలీవికాసము నకుతోడ్పడి ప్రత్యేకముగా గద్యరచనలు చేసిన లేఖకులను మాత్రమే పరిగ్రహింతుము.

## మొదటి తరము :

ఆధునిక కవిత్వమునకు వలెనే ఆధునిక గద్యమునకు గూడ భాయీ వీరసింహుడే ప్రారంభకుడని చెప్పవచ్చును. ఇతని గద్యరచనలలో టీకలు, పురాతన జన్మసాఖీలు మొదలైనవి కలవు. ఇతని తరువాత భాయీ మోహనసింహుడు కూడ ఉత్తమ గద్య రచనలు చేసెను. విషయ వైవిధ్యములో నితని రచనలు పేరుగన్నవి. మోహన్ సింహుని 'దినచర్యా' పుస్తకములు గూడ సరళ సుందరశైలిలో వ్రాయబడినవి.

## ప్రొ. పూరణ్‌సింహుడు :

'ఖులేలేఫ్' అను నొక రచన చేసెను. పంజాబీలో మొదటి వ్యాసరచనా గ్రంథము నితడు రచించెను. కాని ఆ ప్రయత్నము జయప్రదము కాలేదు.

## చరణ్‌సింహ షహీద్ :

పంజాబీ గద్యశైలిలో క్రొత్త పద్ధతిని ప్రవేశపెట్టెను. ఇతని గద్యరచన వార్తా పత్రికారచన కంటె మించిన స్థాయి కలదికాదు.

## భాయీ రణ్‌ధీర్‌సింహుడు :

'చరణ్‌కమల్‌కీ మౌజ్', 'సచ్‌ఖండ్‌దర్శన్', 'గురుమత్‌వివేక్', 'నామ్ అభ్యాస్‌కమాయీ', జీన్‌చిట్టియాం' మొదలైన గ్రంథములలో దార్శనిక, ఆధ్యాత్మిక ముద్రగల గద్యరచన చేసెను.

## రెండవ తరము :

పంజాబీ గద్య వికాసములో గురుభక్తసింహు డొక మైలురాయిగ నున్నాడు. అతనితో రెండవ తరమారంభమగుచున్నది. ఇతడు తన విదేశ పర్యాటనానుభవము లతో గద్యక్షేత్రమును విస్తృతముచేసి సంపన్న మొనరించినాడు. ఇతడు ప్రగతిశీలుడైన వివేకవాది. తన గద్య రచనలచే పంజాబీలను అంధ విశ్వాసములనుండి, మిథ్యాభ్రమల నుండి విముక్తముచేసి అంతర్జాతీయ దృక్పథము నవలంబింప జేసెను. ఇతని తరువాత చెప్పదగిన వాడు ప్రిన్సిపాల్ తేజసింహుడు. ఇతడు సరళము, సుసంస్కృతము, స్పష్టము అయిన గద్యరచనలు చేసెను. ఇతడు శుద్ధ టక్సాలీ పంజాబీని సమర్థించును. ఇతరుల నీపై పాకర్షించుటకై వ్యాసములను వ్రాసెను.

లాలాసింహ కమలా అకాలీ 'మేరాబిలాయతీసఫర్నామా', 'జీవన్‌నీతి', 'సేలానీదేశభగత్' మొదలైన రచనలలో వర్ణనాత్మక, విచారాత్మక గద్యకు చక్కని ఉదాహరణముల నిచ్చెను. ప్రొ. సాహెబ్‌సింహ, ప్రిన్సిపల్ జోధ్‌సింహ, S. S. అమోల్, సర్దార్ కపూర్‌సింహ, హరీంద్రసింహ 'రూప్', గురు బచనసింహ 'తానిబ్', ప్రొ. మోహన్‌సింహ, ప్రొ. జగదీశసింహ, హీరాసింహ మొదలైన విద్యాధికులు భిన్నవిషయములతో, భిన్నశైలులతో గద్యరచనలుచేసి పంజాబీ గద్యభాండారమును నింపినారు.

## పరిశోధన – సమాలోచనము (విమర్శ)

"లిజెండ్స్ ఆఫ్ ది పంజాబ్" సంపాదకుడు సర్ రిచర్డ్ టెమ్పుల్ ప్రథమ పరిశోధకుడుగ చెప్పవచ్చును. పంజాబీ సాహిత్య నియమానుసారముగ పరిశోధనము బాబా బుధసింహునితో నారంభమైనది. ఇతడు తన అన్వేషణా ఫలితములను 'హంస్ బొగ్', 'కోహల్‌కూ', 'బంచీహాబోల్' అనువాని ద్వారా ప్రకటించెను. అతని తరువాత డా. మోహన్‌సింహ ఈ వైపు శ్రద్ధ వహించెను. ఆయన కృషివిశేషముగ శాస్త్రీయమైనది. ఇతడే మొదటిసారిగ పంజాబీసాహిత్యమునకు కాలవిభజనముచేసెను. డాక్టర్ బెనారసీదాస్ 'పంజాబీ జబాన్‌తే ఓహదా లిటరేచర్', మౌలాబక్ష్ 'పంజాబ్ దేహిరే' అను అమూల్య గ్రంథముల నిచ్చిరి. డా. గోపాల్‌సింహ 'దర్దీ', కిర్పాల్ సింహ 'కసేల్', డా. సురేంద్రసింహ 'కోహలీ, ప్రొ. సురేంద్రసింహ 'నరూలా' 'జ్ఞానీహీరాసింహ 'దర్ద్' పంజాబీ సాహిత్యేతిహాసములను వ్రాసిరి. సర్దార్ జి. బి. సింహ, ప్రొ. ప్రీతమ్‌సింహగారలు పంజాబీ లిపిపరిశోధనా రంగములో, ప్రొ. ప్యారా సింహ 'పదమ్' "పంజాబీ బోలీదా ఇతిహాస్" వ్రాసెను. ప్రొ. విద్యాభాస్కర్ 'అరుణ్', ప్రేమప్రకాశ్‌సింహులు 'పంజాబీ భాషా చరిత్రను' ప్రకటించిరి. దీనిలో అనేక నూతన విషయము లావిష్కరింపబడినవి. తరువాత పంజాబీ సాహిత్యమందలి వివిధాంగములను గూర్చి, వివిధలేఖకులను గూర్చి పరిశోధనలు, సమాలోచనలు ప్రారంభమయ్యెను ఈ విషయములో ప్రొ. గురుచరణ్‌సింహ, ప్రొ. దీవాన్‌సింహ, గురుముఖసింహ 'జీత్', ప్రొ. బలవీర్‌సింహ 'దిల్' మొదలైన వారి ప్రయత్నములు శ్లాఘనీయములు.

## జానపద సాహిత్యము

పంజాబీ జానపద సాహిత్యములో ప్రథమ మహాన్వేషకుడు దేవేంద్రసత్యార్థి. పంజాబీ లోకగీతములను సేకరించుటలో చాల కృషిచేసినారు. వీరుగాక పండిత రామ్‌చరణ్ (పంజాబ్‌దేగీత్), కర్తార్‌సింహ 'షంషీర్' (జీఊందీదునియా), (గాఁవ్రూఁదాపంజాబ్), హరజీత్‌సింహ (నైఁఘనోఁ), షేర్‌సింహ 'షేర్' (బార్‌దే ఢోలే) మొదలైన వారికృషిగూడ ప్రశంశనీయమైనది. డా. S S. రంధావాశాస్త్రీయ పద్ధతిలోజానపద సాహిత్యమును సంగ్రహించి దాని నొక విశిష్టక్రమమున ప్రకటించి మన కందించుచున్నారు. వారు ప్రకటించిన 'ప్రీత్‌కహానియాఁ', పంజాబీలోక్‌గీత్', 'కుల్లూదేలోక్‌గీత్' 'కాంగ్డా' 'హరియాణ్‌దేలోకీగీత్' మొదలైనవి మిగుల ఉత్తమ సంపుటములు.

## పాకిస్తానులో పంజాబీ

మేమిదివరలో చెప్పినట్లు రణజిత్‌సింహుని కాలమువరకు పంజాబీ సాహిత్యమున ముఖ్య రచనలు ముస్లిం కవులచేతనే చేయబడుచుండెను. ఇంగ్లీషువారి రాకతో పంజాబీలు హిందీ, ఉర్దూ, పంజాబీ భాషా పక్షములుగా చీలిపోయిరి. కొందరు ముస్లిములు మాత్రమే పంజాబీలో వ్రాయుచుండిరి. పాకిస్తాన్ యేర్పడిన తరువాత హిందీ తొలగిపోయి ఉర్దూ, పంజాబీలు రంగముపై నిలిచినవి. పాకిస్తాన్‌లోని ఆలోచనాపరులగు కొందరు పంజాబీ భాషకు ఉచిత స్థానము కల్పింప సంకల్పించిరి. త్వరలోనే పంజాబీ పక్షమున ప్రబలమైన ఉద్యమము సాగింపబడెను. ఉర్దూ లిపిలో పంజాబీ మాస పత్రికలు వెలువడినవి. 'పంజాబీ', 'పంజ్‌దరీజా', 'పంజాబీ అదబ్' అనునవి జయప్రదముగ నడుపబడుచున్నవి. ఎందరో క్రొత్త లేఖకులు పంజాబీ రచనలు చేయుచున్నారు. వారిలో అహమద్ 'రాహీ', కర్తార్, త్రిజండ్, భట్టీ అను వారు ప్రసిద్ధులు. పంజాబీ విశ్వ విద్యాలయము కూడ పంజాబీని బి.ఏ. పరీక్ష వరకు స్వీకరించెను. తూర్పు పంజాబులోవలెనే పశ్చిమ పంజాబులోగూడ పంజాబీకి మాతృభాషగా అన్ని విధముల సముచిత స్థానము లభించు దినములు దూరమున లేవని నమ్ముచున్నాము.

---

# కాశ్మీరి సాహిత్య చరిత్ర

## 1

## భాషాస్వరూప స్వభావము

కాశ్మీర లోయలోని ప్రజల భాష కాశ్మీరి. ఈ లోయ ఉత్తరమున డర్ద్ వర్గమునకు చెందిన షినా, తూర్పున లడక్ బౌద్ధుల బోధి, దక్షిణమున డోగ్రిపహారీ, పశ్చిమమున పహారీ, దక్షిణ పంజాబీ మొదలగు భాషా ప్రాంతములచే నావృత్తమై యున్నది. కాశ్మీర భాషకుగల కష్టవరి అను మాండలిక భాష పాంచాల శ్రేణి కావల లోయకు ఆగ్నేయదిశయందు గల కష్టవర్ ప్రాంతములలో వ్యాపించియున్నది.

వాయవ్య భారతములోగల సంస్కృత భాషలు, పశ్చిమమున గల ఇరాని భాషలు – కాశ్మీరికి ఇరుగు పొరుగు భాషలగుటచే వాని ప్రభావము కాశ్మీరీపై ప్రసరించుట సహజమే. డర్దిక్ భాషా కుటుంబమునకు చెందిన డర్ద్‌వర్గ భాషపై ప్రధానముగ నాధారపడిన కాశ్మీరి భాష ఒకవిధమైన సంకరభాషయని సర్‌జాన్ గ్రియర్సన్ వాదించెను. కాని, భాషా చరిత్రకారులా వాదమును ఖండించి ఆర్య విభాగమునకు చెందిన తదితర ఆధునిక భారతీయ భాషలవలె కాశ్మీరి కూడ అపభ్రంశమునుండి ఏర్పడినదని అభిప్రాయపడిరి. కాశ్మీరి భాషకు కొన్ని ప్రత్యేక లక్షణములున్నను, దాని ఉత్పత్తినిగూర్చి నేటికిని సమగ్రమైన పరిశీలన జరుగలేదు. కాశ్మీరీ భాషలో మహాప్రాణములు లేవు. ఆర్య భాషలకు సంబంధించిన ఆధునిక భారతీయ భాషలందు లేని కనీసము ఆఱు అచ్చులును, మూడు వ్యంజనాత్మకములగు స్వర సామ్యాక్షరములు (Consonental Phonemes) నిందు గలవు. వాక్యములలో సాధారణముగ కర్మపదమునకు పూర్వము క్రియాపదముండును. పూర్వాచ్చు ప్రభావమున హల్లు మారును. మౌలికమైన పదములు షినా భాషకు సంబంధించినవి. ఇట్టి విశేష లక్షణముల ననుసరించి కాశ్మీరి, ఇండో ఆర్యన్ భాషావర్గముయొక్క షినా లేక డర్ద్ భాషలపై నాధారపడినదని స్పష్టమగుచున్నది. షినా భాష తొలి దశలో ఇండో ఆర్యన్ సంస్కృతముపైనను, తదనంతరము ప్రాకృతముపైనను ఆధారపడియుండెనని తెలియుచున్నది.

వాక్య విన్యాసము - స్వరములు - మున్నగువానికంటె పదజాలమును స్వీక రించుటయందే ఇండో ఆర్యన్ సంస్కృత ప్రాకృతములపై కాశ్మీరి ఆధారపడెను. కాని, ఆ భాషలు కాశ్మీరి భాషను పూర్తిగ మార్చినట్లు తోచదు. కాశ్మీరి మాతృ భాషగ మాత్రమే నిలిచియుండెను. సంస్కృతము కావ్య భాషగను. పండితుల భాషగను వర్ధిల్లి కాశ్మీరిని వ్యావహారిక భాషగ మాత్రమే యొనర్చినది. అపభ్రంశము లేక ప్రాకృతము అభినవగుప్తుని (950-1025) తంత్రసారమునందలి 76 శ్లోకములందును, గోరక్షనాథుని మహార్థమంజరిలోని 71 ద్విపదలందును, సంస్కృత గ్రంథములందును మాత్రమే ఉపయోగింపబడినట్లు తెలియును. అపభ్రంశము లేక ప్రాకృతములందు రచించుట నాటి సంప్రదాయమని స్పష్టమగును. కాని, అపభ్రంశముకాని ప్రాకృతము కాని కాశ్మీరి భాషాస్థానము నాక్రమించెనని చెప్పలేము. అవి రెండును సరిసమానముగ ప్రజల వ్యవహార భాషగ వర్ధిల్లినవి. కల్హణుని రాజతరంగిణియందు గన్పట్టు 'రంగ స్సహిలుదిన్న' అను వాక్యభాగము కాశ్మీరి భాషా స్వరూపమునకు ప్రప్రథమోదా హరణము. ఆ వాక్యభాగ మాధునిక కాశ్మీరి భాషలోనిదగు 'రంగసహ్యోలదిన (హ్యోల్ గ్రామము రంగని కొసగబడును.) అను దానికంటె భిన్నమైనదికాదు. ఇది కాశ్మీరి అపభ్రంశ భాష మాత్రము కాదు. సునీతకుమార ఛటర్జీగారు (ఆధునిక భారతీయ భాషా వాఙ్మయ చరిత్ర : పుట 257) కాశ్మీరి ప్రాకృతము కాశ్మీరి అప భ్రంశము అనువానికి ఉదాహరణములు కన్పట్టవని సముచితముగా నిర్ణయించిరి.

పదునాల్గు, పదునేనవ శతాబ్దములనాటికి పారశీక భాషా ప్రభావము కాశ్మీరిపై కాన్పించినది. దాదాపు పదునెనిమిదవ శతాబ్దము వఱకా భాషా ప్రభావము కాశ్మీరిపై మిక్కుటముగా నుండెను. నేడు దర్దిక్ సంస్కృత మూలములగు పదములస్థానము నాక్రమించినవి. అంతియకాక ఛందోరీతులు - కవితారీతులు-అలంకారములు మున్నగు వానిని కూడ కాశ్మీర కవితకు ప్రసాదించినది. నేటి కాశ్మీరీ భాషపై ప్రాచీన ఇండో-ఇరాని సంబంధమైన దర్దిక్, ఇండో ఆర్యన్‌కు సంబంధించిన సంస్కృతము, ప్రాకృ తాపభ్రంశములు, మధ్యకాలమునాటి పారశీకము - మున్నగు భాషల ఛాయలు ప్రస్ఫు టముగ గాన్పించును.

అది యట్లుండ, భాషా సాహిత్యముల దృష్టితో బరిశీలించిన కాశ్మీరిలో కొన్ని ప్రత్యేక లక్షణములు కనపడును. నామవాచక రూపావళి ప్రధానముగ విశ్లేషాత్మకముగ నున్నను, ప్రాచీన సంశ్లేషాత్మక విభక్తులు కొన్ని సందర్భములందు నేడును గోచ

రించును. భాషాశాస్త్ర దృష్టితో బరిశీలించినచో గ్రెయర్సన్ గారి అభిప్రాయము ననుస రించి విశ్లేషాత్మక భాషనుండి సంశ్లేషాత్మక భాషగా మారిన ఆర్య భాష కుదాహర ణముగ కాశ్మీరి యొకటి మాత్రమే కనపడును. సాహిత్య దృష్టితో బరిశీలించినచో ఎన్నియో హ్రస్వ అచ్చులతోపాటు కనీసము 17 అచ్చులైనను అందు కనపడును. యతిప్రాసలు - యమకానుప్రాసలు ఇందలవోకగా బ్రవేశించినవి. అంత్యప్రాసలు- మధ్యప్రాసలు - అధికముగా వచ్చు యమకానుప్రాసయుక్తమైన పల్లవులు మొదలగు వానితో కాశ్మీరి గేయములు సంగీత ధర్మముతో నొప్పుచున్నవి.

## 2

## తొలి వెలుగు రేకలు

కాశ్మీర చరిత్రలో 1150 తో మహమ్మదీయ పూర్వయుగమంతమై కాశ్మీర సుల్తానుల యుగ మారంభమైనది. పదుమూడవ శతాబ్దమున కాశ్మీర సుల్తానుల యుగ ములో ప్రజలపై గల హైందవయుగమునాటి ప్రాచీన సంస్కృత సంప్రదాయ ప్రభా వము సన్నగిల్లినది. హైందవ సమాజము ఛిన్నాభిన్నమైనది. ఏనాడును ప్రజల వ్యవహార భాషగలేని సంస్కృతము జమీందారీ ప్రభువుల ఆదరణమును గోల్పోయినది. రాజభాషయగు పారశీకమునకు ప్రాభవము కలిగినది. ఈ కాలముననే సంఘముపైగల ప్రాచీన సాహిత్య సాంప్రదాయ ప్రభావము క్రమముగా నంతరించినది. సామాన్య ప్రజా భాషలో కవితా రచన కంకురార్పణమైనది.

శితికాంతుడు రచించిన 'మహానీయ ప్రకాశము' కాశ్మీరి భాషలో లభించిన ప్రప్రథమ గ్రంథము. ప్రాచీన పద్యమగుటచేత భాషాచ్ఛందో విశేషముల కిది ప్రధాన మైన ఆధార గ్రంథము. 94 పద్యములుగల ఈ కావ్యమువలన నాటి విశేష పద్ధతులు గ్రహించుటకు వీలగుచున్నది. 15వ శతాబ్ద ఉత్తరార్ధమున జీవించిన 'బాల బోధినీ న్యాస' అను గ్రంథకర్తయగు శితికాంతుడే మహానయ ప్రకాశ గ్రంథకర్తయగు శితి కాంతుడని గ్రియర్సన్ పండితుడు పొరపడియుండెను. 'శితికాంతవంశాళి' అను గ్రంథ లిఖిత ప్రతివలన శితికాంతుని కాలమునుగూర్చి స్పష్టముగ దెలియుచున్నది. ఈ శితి కాంతుడు తనకు నాలుగు తరాలకుముందు శితికాంతుడను కవి యొక డుండెనని వివరించెను. ఈ ఆధారమువలనను, గ్రంథమునందలి భాష విషయము మున్నగువాని వలనను, మహానయ ప్రకాశ గ్రంథకర్తయగు శితికాంతుడే మొదటివాడనియు, నతడు

పదుమూడవ శతాబ్ద్యంతమునను, పదునాల్గవ శతాబ్ద ప్రారంభమునను జీవించెననియు స్పష్టమగుచున్నది. నవమోదయులో గల ఏడవ పద్యమొకటి ఈ గ్రంథమునుండి ఉదహరింపబడుచున్నది.

ఇతయత్ప్రో వల్లీన పరంపర
దీపమాలా జన అంధకార
ధీమతధామ ఉదయేత నిరంతర
తిశిశపాయవతు అవికార.

కాశ్మీరిలో ప్రథమ కవయిత్రి లల్‌ద్యద్ అగుట విశేషముగ గమనింపదగినది. హిమాలయములోని ప్రసిద్ధ కాసారమగు సతిసారమింకిన నాటి పురాణకాలమునుండియు కాశ్మీరమున యోగులును సిద్ధులును నెందఱో జన్మించియుండిరి. కశ్యపఋషి నివాస స్థానమైన 'సతిసారము' కశ్యపామరమైనది. అదియే క్రమముగా వ్యవహారమున కాశీర - కాశ్మీర అని ప్రసిద్ధమైనది. పైశాచఆదిమనివాసులను పారద్రోలి హైందవార్యులు సుస్థిరమైన వైదిక సంఘమును స్థాపించిరి. బౌద్ధమత ముత్తర హిందూస్థానమునందు వ్యాపించిన తరువాత కాశ్మీరము బౌద్ధమత ప్రచార సంఘములకు కేంద్రముగను సుప్రసిద్ధ విద్యాపీఠముగను ప్రశస్తివహించినది. బౌద్ధము క్షీణించిన అనంతరము కాశ్మీరమున వేదాంత తత్త్వము కొద్ది మార్పులతో మరల ప్రాభవము నకు వచ్చినది. ఆది శంకరులు ప్రతిపాదించిన వేదాంతమును పూర్తిగ నంగీకరించని త్రిక-శైవాద్వైతమను ప్రత్యేక తత్త్వశాఖ యొకటి ఈ దేశమునందు తొమ్మిదవ శతాబ్దిలో వర్ధిల్లినది. మాయ అనునది ఒక శక్తి - అది భ్రాంతి కాదు - విశ్వము సత్యమైనది - అది మూలప్రకృతినుండి యేర్పడినది. సృష్టికర్త అనుభవమున కది చిహ్నము. బ్రహ్మాండమున కుత్పత్తిస్థానము, శివశక్తి తత్త్వముల కపరరూపము. (అర్ధపల్లవిత శంకర రూపముద్రా).

ఇట్టి మతసాంఘిక వాతావరణములో లల్‌ద్యద్ అనుపేర సుప్రసిద్ధమైన లలేశ్వరి పదునాల్గవ శతాబ్ది మధ్యభాగమున జన్మికచెను. ఈ కవయిత్రి జీవితవిశేషము లధికముగ తెలియవు. కాని ఈమెను గూర్చి కొన్ని కల్పితగాథలు బహుల ప్రచారము నొందినవి. లలేశ్వరి బాల్యమునందే పాంపోరులోని పండిత వంశీయునొకని పరిణయ మాడెను. అత్తవారింట పద్మావతి అను నామమున వ్యవహరింపబడిన లలేశ్వరి భర్త

యంచెట్టి భక్తి గౌరవములులేని స్త్రీ అను అపకీర్తి నొందినది. కాని ఆమె సౌశీల్య మచిర కాలముననే నిరూపింపబడినది. లలేశ్వరి అనుదినము రహస్యముగ దూరముగనున్న రహస్యమైన ప్రదేశములో నేకాంతముగా భగవద్ధ్యానము చేయుచుండెననియు నా ప్రాంతము శృంగారక్రీడలకు సంకేతము కాక భగవంతుని నిమిత్తమై ఏర్పఱచుకొనిన సంకేతమనియు లోకమునకు వెల్లడియైనది. తన్నుగూర్చి వెలువడిన కథలను విని అపనిందల నోపికతో సహించినది. దివ్య త్యాగభావ మామె మనమునందు పరవళ్ళు త్రొక్క లలేశ్వరి యొక్కొకసారి ఇలువీడి అర్ధనగ్నయై లోయలలో భ్రమించు చుండెను. ఆమె పొత్తికడుపు (కాశ్మీరిలో లల్) క్రమముగా నభివృద్ధిపొంది కడుపు క్రింది భాగముపై వ్రేలాడుచుండెను. నాటినుండి ఆమె లల్ (లల్లా) అను పేర పిలువ బడుచుండెను. లల్ స్థితినిచూచి కొందఱు భూషించుచుండిరి. మఱికొందరు దూషించు చుండిరి. కాని లల్లా నిందాస్తుతుల కతీతయైనది. 1379-80 నుండి 1385-86 వఱకు కాశ్మీరములోనుండిన షా హె హమదన్‌ను దర్శించినట్లును ఆమె తన ఉపదేశములవలన షేక్ ఆలమ్ అను ప్రసిద్ధ సిద్ధపురుషుని ప్రభావితుని చేసినట్లును పరంపరగా చెప్పు కొందురు. ఆమె కాశ్మీరమున హిందూ మహమ్మదీయుల మత సిద్ధాంతములపై ప్రగాఢ మైన ప్రభావమును గలిపించెననుటకు సందేహములేదు. మహమ్మదీయుల గౌరవాద రములకు పాత్రమైన హైందవ సిక్కులు కన్పట్టరు కాని ఈ కవయిత్రి కట్టి గౌరవము లభించినది. మహమ్మదీయ చరిత్రకారులు 'ఆరిఫాకామిలాలల్లా మజోబా' - 'ఆరిఫా కామిలా సానిరచియా' అని ఆమెను ప్రస్తుతించిరి. ఈ కవయిత్రి ఇస్లాం సూఫీ తత్త్వముచే ప్రభావిత యయ్యెననియు, నామె షాహ హమదన్‌చే ఇస్లాం మతములో చేర్చుకొనబడెననియు ఇటీవల కొందఱు ప్రచార మొనర్చుటకు యత్నించుచున్నారు. ఈమె వెజిబ్రోరు జామె మసీదు ప్రాంగణమున మరణించెనని అటగల యొక గోరిని చూపుదురు.

లల్‌ద్యద్ ప్రభావ మింతగా ప్రజలపై ప్రసరించుటకు గల కారణముల బరిశీ లించుట ముఖ్యము. ఈ కవయిత్రి ప్రత్యేకమైన శైవ సిద్ధాంతములను ప్రజాబాహుళ్య మునకు సుబోధమగునట్లు వారి భాషలో వ్యక్తీకరించెను. కొందఱికి మాత్రమే అర్థమగు సంస్కృతమునకాక ప్రజల భాషలో తత్త్వ సిద్ధాంతములు ప్రప్రథమముగా నాడు బోధింపబడినవి. కుండలినీనాదబిందు యోగసిద్ధాంతములు, తత్త్వశాస్త్ర రహ స్యములు ప్రకటించినందుననే లలేశ్వరి యోగినిగను కవయిత్రిగను బ్రసిద్ధినొందలేదు. తత్త్వశాస్త్రమునెడ గల ప్రగాఢమైన విశ్వాసము - స్వానుభవపూర్వకమైన ఆచరణ

విధానము-పద్యరూపమున పటిష్ఠమైన భాషలో తత్త్వశాస్త్ర రహస్యములను వివరించు నేర్పు - అనునవి అనితరసాధ్యములై ఆమెకు ప్రజా హృదయమునందును కాశ్మీరి సాహిత్యమునందును సుస్థిరమైన స్థానమును గలిగించినవి. ఈ కవయిత్రి సూక్తులు నేడును బహుళప్రచారమునొంది హైందవ మహమ్మదీయులయు, పండితపామరులయు జిహ్వాగ్రములందు నిలిచియున్నవి. తత్త్వశాస్త్ర రహస్యములందామెకు సంపూర్ణమైన ప్రజ్ఞ కలదని ఈ పద్యములు నిరూపించుచున్నవి.

లల్‌ద్యద్ వాఖులు (సంస్కృతమున వాక్కులు) అనగా బోధనలవలన నామె కాశ్మీర శైవ సిద్ధాంతమునకు చెందిన శివయోగిని అని స్పష్టమగుచున్నది.

1. దృశ్యమానమైన విశాల విశ్వము వట్టి మాయ (శూన్యము)
అని తెలిసినపుడును
త్రుళ్ళిపడు నీటి తుంపరులు నీటిలో బడినట్లు
సగుణము ఆకాశములో లీనమైనపుడును
అతి సూక్ష్మమైన వట్టి మాయ (శూన్యము) అదృశ్యమై
ఆనందము తప్ప ఏమియు మిగులనపుడును
ఓ పండితుడా! ఇదియే సత్యమైన తత్త్వమని గుర్తింపుము.

2. ఇక్కడ మాటలేదు - ఆలోచనలేదు - సర్వోత్కృష్టత
ఉచ్చ నీచములుకాని లేవు
మౌన ముద్రలవలన నెవరికి నిచట ప్రవేశము లభింపదు
ఇచట శివశక్తి తత్త్వములలో నేదియు మిగులదు
ఓ పండితుడా! ఇచ్చట మిగులునది అసలైన తత్త్వమని
గ్రహింపుము. (అనువాదము)

లల్లా ఇట్టి అనిర్వచనీయమైన పరమ శైవము (పరాసంవిత్) నెట్లు సాధింప గలిగెనో? కొన్ని పద్యములవలన ఈ కవయిత్రి ప్రాణాపానములను వశీకరించుట కెన్నియో విధముల యత్నించినట్లు తెలియుచున్నది.

కొలిమితిత్తి గొట్టముతో నేనెంతో కృషి గావించితి
నాలోని తత్త్వమును గ్రహించి దీపమును వెలిగించితి
అపుడే ఆంతరజ్యోతి వ్యాపించి నన్నావరించినది.
నా చిత్తాశ్వం బాకాశముపై పరుగులెత్తు
క్షణకాలంలో నది లక్షలమైళ్ళు పయనించు
అసలైన జ్ఞాని, గంతులేయు గుఱ్ఱమును కళ్లెముల బిగించి
ప్రాణాపాన చక్రములపై రథమును చక్కగా నడుపజాలు.

లల్లా భగవంతుని చేరుట కనుసరించిన దశల నతి సంగ్రహముగ నిట్లు వివరించెను.

వాయువును బంధించి నేను ఆఱువనములు దాటితి
చంద్రకళ మేల్కొన్నది ప్రకృతి శుష్కమై శూన్యమై పోయినది
అనురాగాగ్నిలో నా హృదయాన్ని కాల్చితిని
అపుడే శంకరుని నేను చూడజాలితిని.

పరమాత్మ యొక్కడను అద్వైత సిద్ధాంతమునం దీమెకు ప్రగాఢమైన విశ్వాసము కలదు. అందఱియందును పరమాత్మని, పరమాత్మయం దందఱిని ఆమె చూచెను ప్రకృతి - జీవుడు - పరమాత్మ - అంతయు నొకటే.

ద్వైత విదూరులై అధిపుల కధిపుడైనవాని నెవరు చూచిరి
తనలో నితరులను చూచువాడె! దినము-రాత్రు లేర్పడు విధ
మెఱుగువాడె.

నీవే నేనని, నేనే నీవని, నే గ్రహింపలేదు సామి!
నే నెవరనునది సందేహములకే సందేహము
నీ వెవరనునది పునర్జన్మకు దారి చూపు.

భగవంతుని వివిధ నామములగూర్చి ఆమె కెట్టి పట్టింపులేదు. హైందవులకు వివిధ మతములగూర్చికల విశాలదృష్టి ఆమెకు గలదు. పరమాత్మ నే పేరున పిలచినను నామెకు బాధలేదు.

శివవా కేశవవా జినవా
కమలజనాథ నామదార్యవయుస.

ఆత్మ దైవమునకు నిలయమైన బ్రహ్మ రంధ్రమును గుర్తించుట, సరియైన మార్గమును సరియైన దృష్టితో ననుసరించుట – అనాహత ధ్వనిని వినుట అనునవి ప్రధానమైనవి. అపుడే యోగశక్తిచే నుద్దీపితపై వ్యర్థమైన ఆలోచనలన్నియు మాయ మగును. కుంభక సాధనములు బ్రహ్మ రంధ్రమునకు వంతెనను నిర్మించును, మంత్రములకు మంత్రమైన ఓంకారము హృదయ స్పందనలతో తలయెత్తినపుడు నరుడు జ్ఞాని యగును.

ప్రతిమారాధనము నందుకాని పశుబలి యందుకాని లల్లాకు విశ్వాసము లేదు. ప్రతిమ శిలతప్ప అన్యము కాదనియు నట్టి నిర్జీవ ప్రతిమకు సజీవమైన గొఱ్ఱెలను బలి యొసగుట పరమ మూర్ఖత అనియు, కర్మలు, ఔపచారికమైన పూజలు మున్నగువాని వలన ప్రయోజనము శూన్యమనియు నామె చాటెను. కామము – ఆశ – గర్వము అను మువ్వురు గజదొంగలను సంహరించిననాడే పరమాత్ముని దర్శించుట కర్హత ఏర్పడును. నిజమైన జ్ఞాని దయార్ద్ర హృదయుడై అందరికి దాసుడుగ నుండును. వ్యర్థమైన ఆలోచనల వీడి ఆత్మనుగూర్చి ధ్యానింపవలయును. ఇట్లు చేయుట కష్టమే. అది కొందఱికి మాత్రమే సాధ్యము.

లూబ మారున సహజవ్యచారున
ద్రోగజానున కల్పన త్రావ.

ఆత్మ జ్ఞానము కేవలము మౌనమువలనగాని, కోరినంత మాత్రమునగాని, తన్నుకుచుటవలనగాని సంపాద్యముకాదు.

సహజసశామ తదమనాగచ్ఛే
య్యచ్ఛినా ప్రావఖముక్తి ద్వార.

ఈ కవయిత్రి పరమాత్మను దర్శించుట కనుసరించిన క్రమము చక్కని రూపకములతో సూచించెను. అప్పుడే త్రుంచబడిన ప్రత్తిపూవు, శుద్ధముచేయుట - ఏకుట - పట్టుదారము నేయుట - బట్టగా నేయుట - దర్జీవాని కత్తిరింపులు నొందుట - మొదలగు క్రమములకు పాల్పడును. సాధన క్రమముకూడ ఇట్టిదే.

ఆమె పరమాత్మని గూర్చి తనకుగల ఆవేదనను చిత్తమునకు హత్తునట్లు స్వచ్ఛమైన దేశీయ నుడికారములతో వ్యక్తీకరించెను.

పేనని దారముల సన్ననిత్రాడుతో నౌక నీడ్చువాని వంటిది తన స్థితియనియు, పచ్చి మట్టిగిన్నెలోని నీరువలె జీవితము వ్యర్థమగుచున్నదనియు, తన కలకండ మోపునకుగల బంధములు సడలినవనియు, వానివలన తన వీపున కాయలు గాచిన వనియు, తన గురువులవలన వినిన సత్యములు తన హృదయమును పొక్కుమందు వలె బాధించినవనియు, తన గొఱ్ఱెలమంద కాపరిని గోల్పోయినదనియు, బహుభంగుల నీ కవయిత్రి నిజస్థితిని వర్ణించెను. అతి నిస్సహాయస్థితిలో పరమాత్మ నుద్దేశించి యిట్లు యెలుగెత్తి వచించినది.

దవబోజి దయమ్యోనమ్యాశి దియిలూర్
(నా ప్రార్థనల నా పరమాత్ముడు మన్నించునా?)

ఆమె పాపములన్నియు భస్మమైనవి. కోరికలు నశించినవి. మోకాళ్ళపై నిశ్చల ధ్యానముతో కూర్చొని యొనర్చిన విన్నపమును భగవంతు డాలించెను. ఆమె నిరంతరము శక్తినిమించిన కృషియొనర్చినది. కాని ఆమె చేరినది బంధితద్వార ఆలయము మాత్రమే. ఆమె తన ప్రయత్నమునుండి విరమింపక దృష్టి విదూరుడగు పరమాత్మని దర్శించుట కింకను తపించినది.

"మ్యతికల గనేయి జిజో గమసతేత్య"

---

ద్వారమును తదేక దృష్టితో జూచుచు
నాత్మలోనాతని ధ్యానించుచుండెను.
అతడు ద్వారముల విప్పెను
తనలోనే అపుడామె పరమాత్మని జూచెను.

అపుడే నాకీర్తి వ్యాపించినది (త్యలిలతనావద్రామ) అని ఆమె వచించినది. ఈమె కైదు శతాబ్దముల అనంతరము జీవించిన తత్త్వకవి పరమానందుడు ఈ కవయిత్రి నిట్లు ప్రస్తుతించెను. ఈ స్తుతుల కామె అన్ని విధముల తగినది.

ద్వాదశాంత మండల యోగమున సాటిలేనిదై

లలేశ్వరి 'అనాహత, నాద, బిందు, ఓం' దశలను గుర్తించెను.

బ్రహ్మానంద సుఖము నొందె నామె.

లల్‌ద్యద్ పూర్వసిద్ధాంతములను పూర్తిగా ఖండించక ప్రత్యేకమైన త్రిక అద్వైత తత్త్వసంప్రదాయముల ననుసరించెను.

పూర్వోదారణముల వలన నామె వాఖ్‌లు ప్రజల నిత్యజీవితముతో సంబంధించిన నుడికారములతో భావనలతో నొప్పు కవితా రీతులుగలవని స్పష్టమగుచున్నది. ఈమె పద్యములు కొన్ని ప్రాసయుక్తములుగను మఱికొన్ని నిష్ప్రాసముగను గన్పట్టును. ఛందము సాధారణముగ గుణవిశ్లేషాత్మకమైన ఉదాత్త స్వరముగలది ఒక్కొక్క చరణమున నాలుగేసి స్వరములుండును. హ్రస్వదీర్ఘవర్ణముల పరిణామ విశ్లేషాత్మక గుణము కన్పట్టును. ఆమెకు తీవ్రమైన భవిష్యదావేదన కలదు. ఆవేశ పూరితములైన సందర్భములు కాని నీతిబోధకాత్మకములగు సందర్భములు కాని పద్యములందు కాన్పించవు.

ఈ మొదటి శతాబ్దములందు కాశ్మీరములో ఇస్లామ్ త్వరితగతి వ్యాపించి ప్రజలలో ప్రగాఢముగ నాటిన తత్త్వసంప్రదాయము లను మతవిశ్వాసములను మార్చినది. కాశ్మీరములో మహమ్మదీయులు రెండు తెగల వారు కలరు. ఒక తెగవారు కాశ్మీర దేశస్థులు. వీరు ఋషులు లేక బాబా లనబడుచుండిరి. వేఱొక తెగవా రితర ప్రాంతములనుండి కాశ్మీరమునకు వచ్చినవారు. అక్బరు కాలమునాటి 'ఆయిన్ అక్బరీ'. అను గ్రంథమునందు ఋషులు పరమపూజ్యులనియు, వారు సంప్రదాయ నిగళబద్ధులు కారనియు, మతభేదములయెడ వైరభావము లేనివారనియు, నిజమైన భగవదారాధకు లనియు వివరింపబడినది. పందొమ్మిదవ శతాబ్దములోని చివరి దశాబ్దమునందు ఇతర ముస్లిములకంటె కాశ్మీరమునగల గ్రామీణ ముస్లిములు ఋషిపీఠములయెడ గౌరవ భావమును, హైందవులయెడ సహనదృష్టి కలగియుండిరని కాశ్మీరలోయను గూర్చి

సన్నిహిత పరిజ్ఞానముగల సర్ వాల్టర్ లారెన్సు వచించెను. ఋషులలో సుప్రసిద్ధుడు షెక్ నూరుద్దీన్ (నందఋషి). లల్ద్యద్ ఉపదేశ ప్రభావము నందఋషి పైకన్పించు చున్నదనియు, బౌద్ధ, శైవపద్ధతుల వలన వచ్చిన ఋషి సంప్రదాయములం దధికముగ గన్పడుచున్నదనియు విశ్వసించుటకు తగిన ఆధారములు కలవు. ఇతర ప్రాంతముల నుండి కాశ్మీరమునకు వచ్చిన షాహెహమదాన్ వంటి మహమ్మదీయ సూఫీయోగుల ఆధ్యాత్మిక సాధన క్రమమునందును శివయోగుల యోగసాధన క్రమమునందును నెన్నియో సామ్యములు కన్పట్టుచున్నవి.

లల్ద్యద్‌నకు సమకాలికులైన యువకులలో నందఋషి యొకడు. ఆతని గ్రంథముల కర్తృత్వమును గూర్చి ఇదమిత్థముగా నిర్ణయించుట కాధారములు లేవు. 'ఋషినామా' అను పద్యసముచ్చయ గ్రంథ మాతడు రచించెననుట సందేహాస్పదము. ఈ కవి పేరనెన్నియో గ్రంథములు కన్పడుచున్నవి. ఎవరికి వారు తమకు లభించిన ప్రతియే అసలైన ఋషినామ (నూర్‌నామ) అని భావించుచున్నారు. లల్ద్యద్ రచించిన పద్యములం దధికముగ గలవనియు, నందఋషి రచించినవి కొన్ని మాత్రమే అనియు నభిప్రాయము కలదు.

లల్ద్యద్ నీ కవి సగౌరవముగ స్మరించినందున నిట్టి అభిప్రాయ మేర్పడినది. ఈ విషయమునుగూర్చి పెక్కు అభిప్రాయ భేదములు కలవు.

లల్ల వాక్యములందును ఋషినామాయందును ఈ పద్యము కనిపించును.

గరుడపక్షివలె ఊరబిచ్చుకలెట్లు వేటాడనేర్చు
వంధ్యకు గర్భిణి ప్రసవవేదన తెలియునెట్లు
పుల్లలకట్ట క్రొవ్వువత్తివలె వెలగి ప్రకాశించునెట్లు
ఈగకెట్లు తెలియు, చిమ్మట ప్రాణత్యాగ నిరతి.

ఈతని శ్రుక్ (శ్లోకములు) ల సముచ్చయముయొక్క సరియైన ప్రచురణ మింకను వెలువడలేదు. ఈ పద్యములందలి సూక్తులు లల్ద్యద్‌కంటె అధికముగా నీతి ప్రధానములని మాత్రము తెలియును. అవి చక్కని లోకోక్తులుగను సరసమైన సూక్తులుగను ప్రశస్తివహించి కాశ్మీరి భాషను పరిపుష్టమొనర్చినవి.

మామిడిపిట్ట పూలతోటనే అన్వేషించు
గ్రుడ్లగూబ ఎపుడును నిర్జన ప్రదేశమునె చూచు
నక్క వనిత పాడైన మలమునే అన్వేషించు
గాడిద ఎపుడు పేడ - బురదనె చూచు.

చిత్తమునకు హత్తునట్లు ఈ కవి పద్య రచన చేయగలడు.

ఒక్కగానొక్క గారాబుపట్టి మరణించిన తల్లికి
విశ్రాంతి ఇసుమంత లభించునే ?
కందిరీగల విషపు పోట్లు నొందినవానికి, .
నెత్తురు స్రవించు అంగీ తొడిగినట్లు ప్రేమ
దాని ధరించినవాడు నిట్టూర్పైన వదలజాలునే ?

పూనాయందు గల భండార్కరు ప్రాచ్య పరిశోధనాలయమున లభించిన భట్టావతారుని బాణాసురకథ, కవి రచించిన ప్రకారము హరివంశ పురాణమునందుగల ఉషానిరుద్ధుల ప్రణయగాథపై నాధారపడినది. ఈ గ్రంథముయొక్క సమగ్రమైన పరిష్కృత ముద్రణము లభించినపుడే అందలి భాషా సాహిత్య విశేషాంశములను వివరించుటకు సాధ్యమగును. సుల్తాన్ జైనులాబుద్దీన్ బాదుషా (1420-1470) కాలమున రచింపబడిన ప్రప్రథమ లౌకిక కావ్యమిదియే. అందలి పద్యమొకటి ఇట్లు కలదు.

జనని పానే విమలే రాజ్యే షడ్వింషే వేర్షకతకియ
దివ సర్గస్వత పూజేత ఆజ్యే హరివంశస అంధరవంథియ.

కాశ్మీరి వాఙ్మయ చరిత్ర స్వర్ణయుగములలో నొకటిగా పరిగణింపబడుచున్న జైనులాబుద్దీన్ పరిపాలనా కాలమున మఱికొన్ని సుప్రసిద్ధ గ్రంథములు వెలువడినవి కాని అవి నేడలభ్యములు. జైనులాబుద్దీన్ కళాసాహిత్య పోషకుడు. సంస్కృత పారశీక పండితుల నాదరించి వారి కాశ్రయమొసగెను. ఈతని కాలముననే కాశ్మీరిభాష కావ్యభాషస్థాయి నొందినది. యోధభట్టు జైన విలాసమును జైన ప్రకాశమను నాటకమును రచించెను. నాథసోము డనేక కాశ్మీరి గేయములను, జైన చరిత్రమను గ్రంథమును రచించినట్లు తెలియును. 1472-1484 వఱకు కాశ్మీరమును పరిపాలించిన సుల్తాన్

హసన్‌షా కాలమున గణక ప్రశస్తుడను కవి సుఖదుఃఖ మాయామోహ చరితమును రచించెను.

షామీర్ వంశమునకు చెందిన కాశ్మీర సుల్తానులలో చివరివాడగు సుల్తాన్ హబీబ్‌షా సింహాసనమును వీడుట - గాజీచౌక్ రాజ్యాధికారమును స్వీకరించుట ఈ కాలముననే జరిగినది. ఇంతటితో అనగా 1555 లో కాశ్మీరి సాహిత్య ప్రథమ యుగము పూర్తియగుచున్నది. బుద్ధిగ్రాహ్యములగు అతిసూక్ష్మములగు వ్యత్యాసములు, గంభీరార్థములు, నూత్నభావములు, నుడికారములు మున్నగు వానితో శక్తిమంతమై ప్రజల భాషయగు కాశ్మీరి కవితాభాషగ నీయుగమున రూపొందినది. ఈ యుగమునాటి లభ్యమానమగు వాఙ్మయమంతయు నీతి తత్త్వప్రధానములగు వాఖ్‌లు నీతిసూత్రములు గల పద్యములతో కూడియున్నది.

## 3

# ద్వితీయ యుగము

మొగలు పరిపాలనము నంతమొందించి అహమ్మద్‌షా అబ్బాసీ కాశ్మీరమును జయించిన కాలమును కాశ్మీరి వాఙ్మయములోని రెండవ యుగముగ (1555-1752) స్వీకరింపవచ్చును. ఈ యుగమున పారశీకభాష అధికార భాషగా స్థిరపడినది. పండిత లోకమునందీ భాషకే ఆదరము హెచ్చినది. మౌలానా యాఖూబ్ సర్ఫిజని (1522-94) 80 వేలు ద్విపదలుగల బహారుల్ ఇర్ఫాన్ అను మథ్నవీ కర్తయగు మీర్జా అక్మలుద్దీన్ కామిల్, నిగూఢతత్త్వముపై భాష్యములు రచించిన ఖాజా హబీబుల్లా నౌషేరీ (1555-1617) మొదలగు ప్రసిద్ధ కవు లీయుగమున జీవించిరి. ఉత్తమ కావ్యములతోపాటు కాశ్మీరి భాషలో గేయములుకూడ ఈ యుగమున వెలువడినవి.

కాశ్మీరి కవితారంగమున ఈ యుగము విశిష్టమైనది. నిగూఢతత్త్వ ప్రధానమైన పద్యరచనతోపాటు ప్రణయకావ్యములు కూడ ఈ యుగమున వెలువడినవి. లోలగీత మను దానిలో కాశ్మీరి కవి తన హృదయావేదనను పటిష్ఠమైన భాషలో వ్యక్తీకరించెను. పల్లవిలో నాలు లేక పది చరణములు మించని గీతికను లోలగీతమందురు. కాశ్మీరి భాషలో వ్యంజనముల సమాన సంఖ్యలో అచ్చులు అంతస్థములు కలవు. మహాప్రాణములు, కంఠ్యములు పరుషములు కొన్ని మాత్రమే. అందువలన సంగీత మాధురి,

అంత్యప్రాసలకూర్పు, పల్లవి - యమకానుప్రాసలు, స్వరసామ్యములనునవి సహజముగ దొరలినవి. లయలో నొక విధమైన శైథిల్యము మార్దవము కాన్పించును. లల్ద్యద్ పద్యము లందులకు నిదర్శనములు. పారశీక లేక హిందీ దోహాలకు తగినట్లుగా కాశ్మీరమున ఛందమింకను ఏర్పడకుండెను. లల్ద్యద్ పద్యములలో జాతి స్థానమున ఒత్తునకు ప్రాధాన్యము నొసగు ధోరణి గోచరించునని గ్రియర్సన్ భావించుట సమంజసముగ నున్నది. ఈ ఉదాత్తస్వరము లోలగీతములందును కలదు. అది గీతభావముల చమత్కార పూర్వకమైన లయను వ్యక్తీకరించుట యందు ఛందమునకు తోడ్పడును. సంగీతజ్ఞునకును గాయకునకును సంగీతాను గుణమగు రీతులను గలిగించును. అది వస్తుప్రధానమైన గీతము కాక విషయమును రసభావములను సంగీతముతో వేఱుపఱచరానిదై యుండును. ఆ సంగీతము ప్రేమసింహాసనాధిపత్యమునొసగు స్థానమునకు ప్రతిధ్వని కలిగించును.

వ్రజసంప్రదాయమునకు చెందిన గీతములందువలె లోలగీతములందు సాధారణముగ నాయికయే తన హృదయగతానురాగమును నెన్నియో విధముల వ్యక్తీకరించును. "వసంతమాసన్నమైనది. పుష్పములు వికసించినవి. కోకిల మధుర గానమొనర్చుచున్నది. కాని ప్రియా నీవెక్కడ.

వివిధ వర్ణములతో పుష్పములన్నియు వికసించె
ప్రియా ! నీ వెక్కడ.
అందమైన గులాబి తన విలాసమును చూపినది.
"సోనాపోష్" పరిమళభరిత నిశలందు విప్పారినది.
తీరుతీరుల పూవులెన్నో అందంగా వికసించినవి.
పచ్చిక బయళ్ళన్నీ నిగనిగలాడుచున్నవి.
నావేదన ఇసుమంతైనా వినలేదా ?
పర్వత సరోవరాలలో పూలెన్నో వికసించినవి,
రమ్మ ప్రియా పచ్చిక బయళ్ళలోవిహరింతము.
దూరవనాల్లోచూడు ! లీలాక్ విప్పారి కిలకిలనవ్వుచున్నది.
నీవు నావేదన వినలేదా ?

ప్రియుడెన్ని నాళ్ళకైనను రానందున నాయిక విరహవేదన మధికమైనది.

గువ్వవలె నీవు సెలయేటి స్రోవలందు విహరింతువు
నా ఎదలో కలవర మధికమైనది. పరధ్యాన మధికమైనది.
ప్రేమలో మోసమునొంది నీవు నన్ను పిలిచినట్లే భ్రమనొందితి.
ఏటి తీరాన ఎన్నిపూలు విప్పారెనో చూడు
నీకై నే నెదిరిచూచుకాలమిది
నీవు వత్తువా నాప్రాణమునే నీ కర్పించెద.
నీకె బాస యొసగితి - నన్నేల మోసగింతువు
నీకై నే తపించుచుంటి నో ప్రియా !

ఆమె విరహము దుస్సహమైనది. ప్రియుని అనురాగము తనపై కలదో లేదో అను శంక కూడ కలిగినది. అతడు తన్నువీడి అన్యాంగనాసక్తుడై యుండుననియు, విశ్వాసఘాతుకుడనియు నాయకుని దూషించుట కుద్యమించినది.

నేనతనికై మద్యము తెచ్చితిని సుదూర వనమార్గములందు,
కాని అతడేమొ దూరదూరాన తిరుగుచున్నాడు.
ఏ జిత్తులమారి ఇచ్చిన సారాయి త్రాగుచున్నాడో ?
అతడు వీడిన క్షణమునుండి ఒకనాడైనను చందనస్నానములేదు,
నా వలపు తోటలో ఒక సుమమైనను వికసించలేదు.
ఎన్నిబాసలు చేసెనాతడు అవి అన్నియు వ్యర్థమాయె !
విశ్వాసశూన్యుడు !
మధురసంధ్యా సమయమున ఒంటరిగా వదలినాడు.

ఇట్టి గేయములలో నధికగేయముల కర్తలెవరో తెలియదు. అవి పరంపరగా ప్రజలలో నిలిచియున్నవి. వీనియందు మధ్యమధ్య కొన్ని పారశీకగజళ్ళు - గీతములు కలసియున్నవి. మఱికొన్ని గేయములు ప్రాచీన సంగీత గ్రంథములందు రాగతాళ సూచనలతో గన్పడుచున్నవి, రాట్నము, కుసుంభక్షేత్రములు, గృహస్థ జీవితములోని సుఖదుఃఖములు మున్నగువానికి సంబంధించిన గేయము లెన్నియో కలవు.

– విగతభర్తృకయైన స్త్రీ ఆవేదన –

నేనెంత బాధ పడుదునో నీకెట్లు చెప్పనేర్తు
విధికృతమైన దుఃఖాన్నిట్లు మ్రింగుకొనుచుంటిని
నా బాధను వివరింప మాటలులేవు
నా వేదనను నీకెట్టు చెప్పనేర్తు.

.... ....

నా హృదయోద్యానంలో వలపులతకూడ చిగిర్చలేదు
నా జీవనాధారాన్ని మృత్యువు దొంగిలించినది.
నీ అనురాగ జలసేచనమున
వలపు "చెర్రీ" ఒక నాడైన పండలేదు.
"సీర్" వృక్షము ఒకనాడైన పెంపొందెనా?
నా హృదయబాధ నెట్లు వివరింపనేర్తు
నా హృదయ వనమున బదరీఫల మొక్కసారి పండెనా?
విధినన్ను వెక్కిరించినది.
నా వలపు పూవు వాడిపోయినది
ఎట్లు వివరింపనేర్తు నాగుండె బరువు.

ఈ గేయములలో కొన్నిటియందు పరమాత్ముని గూర్చి భక్తునకు గల ఆవేదన కూడ వ్యక్తీకరింపబడినది. హిందూమహమ్మదీయ మత సంస్కృతులు సమ్మేళనము నొందుచున్న కాలమిది. సూఫీ - వేదాంత తత్త్వములకు సమన్వయము గూర్చుటకీయుగమున ప్రయత్నము జరిగినది. లౌకికానురాగమును గూర్చియేకాక భగవద్విరహ సంబంధులైన భావములనుకూడ కవులీ గేయములందు చాటుచుండిరి. భగవత్పరమైన దివ్యప్రణయములో హిందూ మహమ్మదీయ ఛాయ లెట్లుండును?

దూరదూరము భ్రమించితిని నేను
ఎత్తైన పర్వతా లధిరోహించితిని నేను
మానవ సాధ్యమైన కృషి యొనరించితి.

విధి-భగవంతుడు నీకు ఫలమీయనిచో నింకెవరిత్తురు
మూర్ఖుడా ? "విలో" వృక్షము చేరి పండ్లాసగజాలునె,
తన్నుతా నెఱిగినవాడె మధ్యపాత్రను చేపట్టజాలును
ఆనందముగ గంతులు వేయు మత్తిలియుండువాడు
తన్నుతానే మఱచు.
జాతిమత భేదములతో నతనికి పనియేమి ?

కాశ్మీరి భక్తిగేయములలో నందఱియెడను సమానమైన దృష్టి గోచరించును. శత్రువులయెడ ద్వేషభావములేదు.

ఓ ఆశాజ్యోతి ! నిబిడాంధకార మార్గమున వెలుగు చూపించు
స్నేహబీజముల నంతట నాటు నాకై
నా శత్రువులనైనను చంపకు.

ఈ గేయములను రచించిన సుప్రసిద్ధ కవయిత్రులు పదునాఱవ శతాబ్దిలో జీవించిన హబఖాతూన్, అఫ్గానుల కాలమున జీవించిన అర్నిమాల్ అనువారు. హబఖాతూన్ జీవితము రసవంతమైన ప్రణయగాథ. ఒక సామాన్య కర్షకునకు జన్మించి ఆమె కాశ్మీర రాణిగను, కవయిత్రిగను ప్రసిద్ధినొందినది. ఈమె "పంపోర్" నకు రెండు మైళ్ళ దూరముననున్న 'షండహర్' అను గ్రామమున జన్మించెను. ఈమె జన్మనామము జాన్ (కాశ్మీరులో చంద్రుడని అర్థము) ఈ గ్రామము అతివిశాలమైన కుసుంభవనములతో గొప్ప పీఠభూములదాపుననున్నది. గహనమై విశాలమైన బీటికలు-చక్కని కోనలను రూపొందించినది. ఇవి ప్రేయసీ ప్రియులకు రమణీయమైన విహార భూములు. హబాఖాతూన్ యువతిగా నున్నపుడే తన సౌందర్యవిలాసములచే నెందఱినో ఆకర్షింపజేయుచుండెను. స్వేచ్ఛాప్రియయైవిహరించుచున్న హబాఖాతూన్‌ను ఆమె తలిదండ్రులొక కర్షక యువకున కొసగి వివాహము గావించిరి. ప్రతిభావంతు రాలగు ఈమె కత్తవారింట సుఖము లభింపలేదు. కర్షకజాతిలో జన్మించి పొలాలలో పనిచేయక సంగీత సాహిత్యము లందాసక్తయైన హబాఖాతూన్‌ను అత్తగా రభిమాన ముతో జూడలేదు. నిత్యజీవితములో తా ననుభవించిన సంఘర్షణను హబాఖాతూన్ తన గీతములందు చక్కగా వ్యక్తీకరించినది.

వారికంతా తెలుసు - ఎప్పటికీ
నా గుటించే గుసగుసలు
ఈ విధిగ్రంధు లెట్లు విడిపోవును.

ఆమె ఆశించినట్లుగా చిక్కు లచిరకాలముననే తొలగిపోయినవి. ఒకనాడామె పరవశయై ఎత్తైన పొలములలో నడవిపూల నేరుచు స్వేచ్ఛగా పాడుచుండెను.

రారండీ చెలులారా ! ఆ తీరాలకి వెళ్దాం
పసుపు పచ్చని అడవి పూలనేరుదాం
కబురైనా పంపక అతడొచ్చాడు
అదేమో ! క్షణంలో పారిపోయాడు.

అల్లంత దూరమునుండి చక్కని గుఱ్ఱమునెక్కి సుందరాకారుడగు రాజకుమారు డొకడు వచ్చి నిలబడి మధురమైన ఆ పాటను వినెను. చూపులోచూపు కలిసిన మధుర క్షణములో వారి హృదయములలో ప్రణయబీజములు నాటుకొనినవి. కొన్ని వారము లలో యూసఫ్‌షాచక్ రాకుమారుడు హబాఖాతూన్ తన భర్తకు విడాకులిచ్చునట్లేర్పాటు చేసి ఆమెను పరిణయమాడెను. యూసఫ్‌షా 1579 లో సింహాసనాధీశుడయ్యెను. హబా ఖాతూన్ రాణియై తన రాజ్యమున లలిత కళాభివృద్ధికి తోడ్పడుటయే కాక విపత్కర మైన పరిస్థితులలో దేశపురాజకీయములను చక్కదిద్ది రాజకీయములతో ననిశ్చిత ఆలోచ నలతోను సతమతమగుచున్న భర్తకు చేదోడువాదోడుగానుండినది.

హబాఖాతూన్ రాణిగా కాక లోలగేయములను రచయించిన కవయిత్రిగా నేడు స్మరింపబడుచున్నది. ఈమె గేయములందు నీతితత్త్వోపదేశములు కనపడవు. ఈ కవయిత్రి మధురమైన లౌకికప్రణయమును మాత్రమే రసవంతముగ జిత్రించెను. ప్రేయసీప్రియుల సంయోగవియోగ శృంగారమును విరహవేదనా విషయమును సరసముగ వ్యక్తీకరించెను. ఆమె విరహగీతికలు దుస్సహమైన వేదనతో కూడి యున్నవి. నాయకుని యెడగల ప్రగాఢానురాగము నిట్లు వ్యక్తీకరించినది.

నీ అన్వేషణలోనే గిరినిర్ఝరి తీరంలొ తిరుగుతాను
అడవి మల్లెలవనాల్లో నీ కొఱకే విహరిస్తాను.

దివ్యసౌందర్య దళములు విప్పారనున్నవి
నేనెక్కడైనా నిన్ను చూడనేర్తునా ?

. . .                . . .

నానొసటనుండి ముత్యాలవలె చెమట బిందువులు జారుచున్నవి·
నాప్రియునికై ఉదారంగు పూల నేరుచున్నాను,
షాల్మార్‌లోనే మద్యపాత్రల నింపుచున్నాను,
నా ప్రియుడొస్తాడు - పారవశ్యంతో గంతులేస్తాను.
వివిధపుష్పముల హారాల్ని గ్రుచ్చుచున్నానతనికే,
ఇషబారీలో సారాయి గిన్నెల నింపుచున్నాను,
ఉంగరాల కేశాల్ని సవరించి జడవేసికొంటాను,
నేను పూలదండను గ్రుచ్చుచున్నాను.

. . .                . . .

నీవు లేక నేనెట్లు కాలం గడిపేది ?
నీ వియోగాన్ని నేనెట్లు భరించేది ?
నాచేతిని గోరంటాకుతో రంగుదీర్చాను
        నీవు వచ్చేదెపుడు ?
రావొప్రియా ! నా ఆవేదన చూడు,
నీ కొఱకై నేనెట్లు తపిస్తున్నానో చూడు.

. . .                . . .

## — ప్ర ణ య భ్రాం తి —

చెప్పు సఖీ ! పండునెపుడు నా భాగ్యము
నా ప్రియు డెపుడొస్తాడో చెప్పు.
ఎన్నినాళ్ళనుండి నేనెదిరు చూచింది
నా హృదయం మూగపోయింది-శూన్యమైంది-ఇక ఆశలేదు.
ప్రణయకార్యమె మధురాతి మధురము

నా ప్రియుని అలంకరిస్తాను - చేతులలో గోరంట రంగద్దుతాను.
నాసుమధుర చుంబనాలతో ప్రియుని శరీరానికి చమురంటుతాను.
బంగారు ముద్దలతో మద్యమందిస్తాను,
నాహృదయ కాసారంలో ప్రణయ పంకజం వికసిస్తుంది,
చెప్పుసఖీ పండునెపుడో నా భాగ్యము.

... ...

వెళ్ళిచెప్పవే చెలీ! నేనాతనికై పుష్పగుచ్ఛాలు కూర్చాను,
మద్యపాత్రలు నింపిపెట్టాను.
కాని అతడేమొ దూరాన భ్రమిస్తున్నాడు.
సుదూర వనమార్గాల్లో అతడేల సంచరిస్తున్నాడో ?
ఏ జిత్తులమారితో కలిసి మద్యపానం చేస్తున్నాడో ?
అతడు లేనిది మల్లెవలె వాడిపోతాను
నేను పుష్పగుచ్ఛాలు అతనికై గ్రుచ్చాను.

ఈ పాటలలో ఆమె జీవితములోని ఛాయలు కొన్ని గోచరించుచున్నవి.

నేనాటకై ఇల్లువీడి సూర్యుడస్తమించినా తిరిగిరాలేదు
పేరుపొందిన వంశంలో జన్మించాను
హబాఖాతూన్‌గా కీర్తి వహించాను.
ప్రజలమధ్యలో తిరిగాను గట్టిగా ముసుగువేసికొని
ప్రజలంతా నా దర్శనానికి ఎగబడ్డారు
వనాల్లో ఉండే మునులు కూడా
నన్నొక క్షణం చూడాలని సంబరపడ్డారు.

లౌకికశృంగార గేయములకు గ్రొత్తమెఱుగులు దీర్చిన గౌరవము హెబా ఖాతూన్‌కు లభించినది. కాశ్మీర గేయములందు ఛందము, ప్రాసవిధానములు ఎన్నియో కలవు. ఒక్కొక్క గీతములో మూడు చరణములు పల్లవియుండును. ఈ గీతములు చక్రగీతములుగ జనప్రియములై నేటికిని బహుళ ప్రచారము నొందినవి — "రమ్మ ప్రియా రమ్మ" అనుగేయము —

నిన్ను పురికొల్పి తీసికెళ్ళిన స్త్రీ ఎవ్వరు ?
నీ అనురాగం క్రోధంగా ఏలమారింది.

అను గేయము జనప్రియములైన వానిలో ప్రశస్తములైనవి .

ఈ యుగములో జీవించిన ప్రసిద్ధ కవులలో ఖాజాహబీబుల్లా నౌషెరి (మ. 1617) యొకరు. "యార్ గచ్ఛవోదినయే" (రమ్మి సఖా! ఉత్సవం చూడపోదాం" అను గేయముతోపాటు భక్తిగేయములను ఈ కవి రచించెను. ఈతని గేయములు కొన్ని భక్తితత్త్వ ప్రధానములైనను అవి రచనావిధానములో కొంత భేదము కలవి. అందు దీర్ఘములైన చరణము లధికముగ కలవు. చివర పల్లవియుండును.

నే ననురాగ వశనైతిని
భగవంతుని ఆదరాన్ని పొందితిని.

... ...

నిజమైన అనురాగం చూపేనీకు
జీవన నదిని నింపే మద్యం రుచి చూపుతాను.
ఆ నీళ్ళలోనే భగవంతుడు జీవుల సృష్టించాడు.

... ...

కొందఱు గిన్నెపై గిన్నె ఎప్పుడు త్రాగుతారు
కొందఱు త్రాగినట్లే చేసి గమ్యం చేరుకుంటారు.
కొందఱు వేచి ఉంటారు ఆశతో
కొందఱు వేచివేచి ఏమీ పొందరు.

జహంగీరు చక్రవర్తి కాలములో జీవించిన సాహిబ్‌కౌల్ (మ. 1642) హైందవ పురాణముల ననురించి కృష్ణావతారము - జన్మ చరితము అను వానిని రచించెను. రూపభవాని (1624-1720) అనుయోగిని, కవయిత్రి సంస్కృతముతో పూర్ణమైన భాషలో నిగూఢతత్త్వములను రచించెను. "బరుహల్ ఇర్ఫాన్" అను పారశీక గ్రంథ రచయితయగు మీర్జా అక్మలుద్దీన్, అతని శిష్యురాలు జమ్‌రాషిద్, కూడ కాశ్మీరిలో చక్కని గ్రంథములు రచించిరి.

# 4

# మూడవ యుగము

క్రీ. శ. 1752 నుండి అనగా అఫ్ఘానుల రాకనుండి కాశ్మీరి వాఙ్మయమున మూడవ యుగము ప్రారంభమైనట్లు భావింపవచ్చును. అఫ్ఘానుల పరిపాలనము 1819 సంవత్సరము వఱకు మాత్రమే కొనసాగినది. తదనంతరము మహారాజా రంజీత్‌సింగ్ కాశ్మీరమును జయించెను. కాని, కాశ్మీరములో సిక్కుల పాలనము 1846 వఱకే యుండెను. జమ్మూకు జెందిన మహరాజా గులాబ్‌సింగ్ సింహాసనాధీశు డయ్యెను. అతని అనంతరము కాశ్మీరమున డోగ్రా పాలన మారంభమైనది. 1752-1925 వఱకు గల 173 సంవత్సరముల కాలమును మూడవ యుగముగ స్వీకరించుటకు తగిన కారణములు కలవు. ఈ యుగమునందు వాఙ్మయమునం దొకే ఒక విధమైన రచనా సంప్రదాయములు, కావ్యలక్ష్యములు మున్నగునవి కన్పట్టును.

పరిపుష్టమైన ఈ యుగమునందుగల కాశ్మీరి రచయితలలో నధికులు పల్లెటూరి వారు. వారు తమ దేశభాషలో కవితారచన కుద్యమించినట్లును, పారశీక రచనలకు సన్నిహితములుగ రచన లొనర్చినట్లును తెలియును. కాశ్మీరి పద్యములు శిథిలబంధములు వీడి పటుత్వము నొందినవి. భాషలో మాత్రము పారశీక పదములు - నుడికారములు - అధికముగ బ్రవేశించినవి. అంతియకాక కాశ్మీరి కవులలో నధికులు పారశీక కవిత్వము లోని అలంకార రీతులను పదబంధములను భావనారీతులను కూడ అనుకరించిరి. కాశ్మీర కవులు క్రమముగ ప్రాచీన పారశీక కల్పిత చారిత్రక గాథలగు 'షీరన్ ఫరహద్', 'లైలామజ్నూ', 'వమిక్ ఉజ్రా', 'సోరాబ్ రుస్తుమ్', 'సామనరేమాన్' మున్నగువానినుండి ఇతివృత్తమును స్వీకరించిరి. ఈ యుగమును మస్నవీ, కథాత్మక కావ్యయుగముగ పరిగణింపవచ్చును. స్థానిక కథలను వీడి, పారశీక సంస్కృత గ్రంథములనుండి కవులితివృత్తమును స్వీకరించుచుండిరి. పారశీక మస్నవీల శైలి ననుకరించి, పారశీక ఛందోరీతులందు 'బహరెహజాజు" న్ను అధికముగ నుపయోగించి ఈ కవులు ద్విపదలలో వర్ణనాత్మక, కథాత్మక కావ్యములను రచించిరి. పారశీక ప్రణయగీతముల ఉదాత్తగుణముల గ్రహించినను మొత్తముమీద ఈ యుగమునాటి గీతములు, పాటలు బహుళముగ ననుకరణ ప్రధానములైనవి. అవి పూర్వమాధురిని భావనైశిత్యమును, సౌకుమార్యమును గోల్పోయినను ఉదాత్తములైనవి. తాత్త్విక

పద్యము లీయుగమునందును రచింపబడినవి. అవి ప్రధానముగ నుపదేశాత్మకములై చప్పనై భావక్లిష్టతగలవియైయుండెను. ఈ యుగమున లీలాగీతమను నూతన కావ్య ప్రక్రియ ఆవిర్భవించినది. లీలాగీతము సాధారణముగ భక్తి ప్రధానమై నిగూఢతత్త్వ పూర్ణమైనది. ప్రపంచము సత్యమైనది. రమ్యమైనది. దృశ్యమానమగు ప్రపంచ మంతయు నిరంతరము ప్రవహించు భగవంతుని ఆనందము, లీల యొక్క స్వరూపము.

సుదీర్ఘమైన ఈ యుగమును సౌకర్యము నిమిత్తమై కొన్ని ఉపయుగములలో విభజింపవచ్చును. అట్లొనర్చుట వలన ఒక్కొక్క భాగములోని విశిష్ట ధర్మములను గ్రహించుట సులభము.

# 5

# 1752-1819

ఏ సాహిత్యోద్యమమైనను అకస్మాత్తుగా నావిర్భవించుట కాని, అణగిపోవుట కాని అసంభవము. ఏదే నొక సాహిత్యోద్యమము విప్లవావిర్భావముతో క్షణములో నంతరించదు. అది తరువాతి యుగములందును సూత్రప్రాయముగ సజీవముగనుండును. ఇట్టి సాహిత్యోద్యమ దృష్టితో మొదటి ఉపయుగమును 1752 నుండి శతాబ్ద్యంతము వఱకు ఇంకను చారిత్రకముగ స్పష్టముగ జెప్పవలయునన్న — 1752 నుండి 1819 వఱకును, అనగా ఆఫ్ఘానుల రాజ్యాంతము వరకును, సిక్కుల పరిపాలనారంభము వఱకును విభజింపవచ్చును,

ప్రశస్తమైన ఈ ప్రథమ ఉపయుగమున (1752-1819) జీవించిన అర్ని మాల్ (పచ్చని గులాబి పుష్పమని అర్థము) అను కవయిత్రి పేర్కొన దగినది. హెబ ఖాతూన్‌నకు దాదాపు 200 ఏండ్ల తరువాత జన్మించిన ఈ కవయిత్రి సంప్రదాయమును పాటించి లోలగీతమున విషాదఛాయల నింకను ప్రగాఢముగ వ్యక్తీకరించెను. కాశ్మీరి కవయిత్రులలో సుప్రసిద్ధలగు ముఫ్వురు కవయిత్రులును రెండు వందల సంవత్సర ముల అంతరముతో జన్మించుట గమనింపదగిన విశేషము. వీరందఱును తమతమ భర్తృగృహములలో దుఃఖపూరితమైన గృహస్థ జీవిత మనుభవించిరి.

"కవితా డోలికలలో పొరపాటున పడి
గీతికలందు బోధించు కష్టనిష్ఠురముల ననుభవింతురు వారు."

అర్నిమాల్ గీతములు నిరలంకృతములై కరుణరసార్ద్రములై విధిబలీయతను మానవుని నిస్సహాయస్థితిని దర్శింపజేయు నట్టివిగ నున్నవి. అసూయాభావరహితము లైన ఈ గీతములందు విగతభర్తృకలయు, దాంపత్య సుఖవిదూరలైన హైందవ స్త్రీలయు, సహన శక్తి ప్రస్ఫుటముగ గన్పట్టును. పరంపరగ వినవచ్చు గాథలవలనను, తదితరాధారముల వలనను, అర్నిమాల్ కవయిత్రి పారశీక 'బహారె తవీల్' అను భక్తి వచనముల కర్తగా ప్రసిద్ధుడైన తన భర్త మున్షీ భవానీదాసు కచ్రూవలన నెట్టి సుఖమును నొందలేదని స్పష్టమగుచున్నది. భర్తృగృహమున నిరాదృతయైన అర్ని మాల్ తన పుట్టింటి యందే చిరకాలము నివసించెననియు, రాట్నము ద్రిప్పుచు కాల క్షేపము చేయుచుండెననియు తెలియును.

సణుగబోకుమ నా రాట్నమా!
నీ గిఱకలకు తైలసంస్కారము చేసెదను నేను,
భూదేవి పచ్చిక పొరలనుండి
నీ గంభీరాకారము నెత్తిచూపు హ్యాసింత్?
చూడు నీకై మద్యపాత్రలతోడ నార్గిసెస్ ఎదిరిచూస్తుంది
జాస్మిన్ ఒకసారి వాడితే మళ్ళి వికసింపదు.

లల్ద్యద్ వలె హబాఖాతూన్ కూడ పల్లెటూరి వాతావరణమున పుట్టి పెరిగి నందున సహజసుందరమైన ప్రకృతిశోభను కన్నులార గాంచి ఆనందించు భాగ్యము నొందెను. అర్నిమాల్ శ్రీనగరములో జన్మించి అచటనే పెరిగెను. తత్పరిసరముల గల రేన్వారి ఆమె అత్తవారి ఊరు. సుప్రసిద్ధమగు డాల్ సరోవరోప్రాంతమునగల రేన్వారినాడు జనబాహుళ్యము లేక డాల్ సరోవర ప్రవేశ ద్వారములు గల వీధులతో నేటికంటెను రమణీయముగను, శోభాయమానముగను నుండెననుటకు సందేహము లేదు. ఈ కారణముననే అర్నిమాల్ గీతములందు స్వచ్ఛమైన గ్రామీణ వాతావరణము కన్పట్టును. అనంతరకాలమున క్షీణదశనొందిన పారశీక కవిత్వమున ప్రవేశించిన అసహజములగు అలంకారములు కాని, అనుకరణ ప్రధానములైన కృత్రిమభావములు కాని అర్నిమాల్ కవిత్వమున గన్పట్టవు.

ఈ కవయిత్రి గీతములందు సుమధురమైన విషాదసంగీత స్వరములు ధ్వనించవు. కరుణరసార్ద్రములగు గీతములందు అర్నిమాల్ నిరాశాపూరితమైన తన యౌవన జీవితచ్ఛాయలను, భగ్నప్రణయ రేఖలను చక్కగా చిత్రించెను.

1. నా యౌవన బాధను తొలగింప జాలునేది ?
అతడేమొ వనాల్లో భ్రమిస్తూ నాకు దూరమైనాడు
ఒకరి జోలి ఎఱుగక స్వేచ్ఛగా చెట్లకొమ్మపై
గూడునల్లుచు గువ్వనై యుంటి నేను.
వసంతా గమనంతో మెఱుము నా ఎదలోమంట రగిలించింది
అందమైన ఉంగరాలు తిరిగిన అతని ముంగురులు
వలపు సుడిలోన నన్ను గిరగిర త్రిప్పినవి
నా యౌవనబాధ తొలగింప జాలునెద్ది.

2. నన్ను చూసి నవ్వకు ఓ సఖా !
నా వంటి దీనురాలెవరు ?
నా వలె బంగారువంటి ప్రాయంలో
ప్రియునిచే పరిత్యక్త యెవరు ?
యెవతెనో చూచి అతడున్మత్తుడైనాడు.
నేనేమొ నా గృహప్రాంగణంలో
అతనికై ఎదురు చూస్తున్నాను.
నాగది గవాక్షపు టద్దంపై కిటకిట ధ్వనివింటిని
అతడు ప్రాంగణంలో అడుగు పెట్టాడని అనుకుంటిని
అతడు కాడని తెలిసిన మరుక్షణంలో
నాలో నేనే క్రుంగి పోయితిని !

3. ప్రియునికై తపించు పద్మినిని నేను
అతడెపుడొస్తాడో ?
నా వేదన తీవ్రమైంది నాబాధ తీవ్రమైంది
నేనెట్లు మఱతును.

ప్రేమదావాగ్నివంటిది భయంకర జ్వాలాజిహ్వాలచే
నా గుండియలోతులను దహించును.
నా దుఃఖానికి అంతు ఎక్కడిది ?
నా కన్నీటికి హద్దు లెక్కడివి ?

ఈ కవయిత్రి నిజనామ వ్యాజమున సుకుమారములగు భావముల నిట్లు వ్యక్తీకరించెను.

నేనొక పూర్ణవికసిత జాస్మిన్ పుష్పాన్ని
అతని వల్లనే "అర్ణిగులాబి" వలె వాడి వరుగైతి.

ఈమె నిరంతరము పోరాడి కష్టముల నోపికతో సహించినది.

నా పుట్టింటిలో పూలన్నీ వికసించాయి
కాని నీ జాడయే లేదు; ఏకాకినై
నిల్చి నగుబాటు పాలైతి ?
విధితో పోరాడి ఓడిపోతిని నేను.
విధితో పోరాడి జయింప నెవరి తరము ?
నా నొసట ఇంకా ఏం వ్రాసినాడో బ్రహ్మ
నా పుట్టింట జాస్మిన్ వికసించింది
నీ జాడయేలేదు, నే వృథాగా వేచియుంటి ?

నిష్ఫలమును వ్యర్థమునునైన జీవనములో అర్నిమాల్ మనమున ద్వేషభావ మేర్పడలేదు. అర్నిమాల్ కంటె హబాఖాతూన్‌లో ఆవేశోద్వేగము లధికముగ గోచరించును. ప్రణయేచ్ఛ నామె యధికముగ వ్యక్తీకరించినది. అలుకనొందినచో "నావలె వారును నట్టి దుర్గతినొందుదురు గాక" అని శపించుటకును వెనుకాడలేదు. కాని అర్నిమాల్ విశ్వాసశూన్యుడైన తన ప్రియునకు శుభమునే కాంక్షించినది.

సఖా ! ఎవరికేమని తెలుపుదు ?
ప్రియు నెడబాసిన నన్నుజూచి అందఱును పరిహసింతురు.
అయినా అతడు చిరంజీవి యగుగాక
వారింకను నవ్వుకొందురు గాక

అతడు సుఖముగానున్న నదియే చాలు
అదియే నాకు జీవిక.

అర్నిమాల్ తన గీతములందు భగ్నదాంపత్య జీవితమునకు పరిష్కారము సూచింపనేరని ప్రాచీన హైందవ సంప్రదాయముపై స్థైర్యముతో విప్లవశంఖము పూరించినది. ఈ కవయిత్రి భావములు రూపకములు అనుకరణ ప్రధానములు కాక నిత్య జీవితచ్ఛాయలకు సన్నిహితములై సహజములై యొప్పుచున్నవి. అర్నిమాల్ తన గీతములందు నిజజీవితచ్ఛాయలను, అనుభూతులను, సుకుమారములగు రూపకములతో వ్యక్తీకరించినది.

ఈ కాలములో జీవించిన మఱియొక ప్రసిద్ధకవి దివాకర ప్రకాశభట్టు అను నామాంతరముగల ప్రకాశరాముడు. అఫ్ఘానుల పరిపాలనా కాలమున (1760 ప్రాంతమున) కాశ్మీరమునకు గవర్నరుగా నుండిన రాజా సుఖజీవనలాల్‌కు ప్రకాశ రాముడు సమకాలికుడై యుండెనని తెలియుచున్నది. ఈ కవి రామాయణ కథను రామావతార చరితమను పేరను, ఉత్తర రామాయణ కథను లవకుశ యుద్ధ చరిత మను పేరను రచించెను. జైనులాబుద్దీన్ (1420-1570) అనంతరము సుదీర్ఘమైన కథాత్మక కావ్యమును రచించిన వారిలో నితడాద్యుడు. సరళమైన భాషలో సంపూర్ణముగ వర్ణనాత్మక ధోరణిలో రచింపబడిన కావ్యములం దిదియే ప్రథమమైనది. ప్రకాశ రాముడే ప్రప్రథమ కాశ్మీరి కథాకావ్యనిర్మాతగ గౌరవము నొందెను. మథ్నవీ సంప్ర దాయమునకును, బహరెహజాజు అను పారశీక ఛందము నుపయోగించుట యందును, అనంతరకవులకు ప్రకాశరాముడే మార్గదర్శకుడనియు, నితడే కథాత్మక కావ్యములలో ప్రప్రథమముగ మధ్యమధ్య పాట - గజలు త్రిపది - గీతము అనువానిని కాశ్మీరిశైలిలో ప్రవేశపెట్టినట్లును తెలియును.

ప్రకాశరాము డనుసరించిన శయ్యావిధాన మాతని కథాత్మక కావ్యమునకు ప్రాశస్త్యమును గూర్చినది. పారశీక శయ్యాసౌభాగ్యముతో పూర్ణమైన రెఖ్తాఅను శైలీ విధానముకంటె భిన్నమై పరిశుద్ధమైన శయ్యనుపయోగించిన మథ్నవీ కవి (మఖ్బూల్ షా తప్ప) ఈతడొక్కడే. పారశీక గ్రంథముల రచనావిధానమును అలంకారరీతులను అనుకరింపక రూపకాద్యలంకారములను, నిత్యజీవితమునుండియు ప్రాంతీయ వాతావరణమునుండియు స్వీకరించుట యందును, ధారాశుద్ధిగల వర్ణనాత్మక శైలిని పాటిం

చుట యందును, సహజధోరణిలో భావములను వ్యక్తీకరించుట యందును ప్రకాశ రామకవి అసాధారణమైన ప్రజ్ఞను ప్రదర్శించెను. సంస్కృత కావ్యేతివృత్తముపై నాధారపడినను ప్రకాశరాముని రామాయణ చరితము కేవల మనువాదగ్రంథము కాదు. ఈ కవి నాటిపరిస్థితుల కనుగుణమైన ఆలోచనా విధానమునకు, వ్యక్తుల చిత్తవృత్తి చిత్రణమునకును సముచిత స్థానము నొసగెను. అయోధ్యానగరమును వీడి వనవాస మొనర్చిన శ్రీరామునిగూర్చి పరితపించిన కౌసల్యాదేవిలో కాశ్మీర స్త్రీ మాతృహృదయము ప్రతిబింబించుచున్నది.

ప్రకాశరాముని గీతములు లీలాగీతములకు క్రొత్తదనము గూర్చెనని చెప్పవచ్చును. అంతకు పూర్వమిట్టి రచనకు ఖాజా హబీబుల్లా నౌషేరీగారి "యారగచ్ఛవో దివయే, ఆష్కారాద్రావయే" అను కావ్యమొకటియే తార్కారణముగ నుండెను.

ఈ కాలమున జీవించిన కవులలో పేర్కొనదగిన కవి కొయిషిరి అఖాయిద్ (Koeshiry Aqayid) అను కావ్యసముచ్చయ కర్తయగు అబ్దుల్లా బహాకీ.

మీర్ అబ్దుల్లా కాశ్మీరీలో చెప్పిన తత్త్వము లివి
ఇవి అన్నియు సుబోధములై యొప్పమీకు.

అని కవియే స్వయముగ విధి తత్త్వములు సుబోధముగ నుండుటకై ఈ కావ్యమును రచించినట్లు వివరించెను. ఈ కవి 'ముఖ్తసర్ వాఖియా' అను గ్రంథమును కూడ అనువదించెను.

## 6

# మహమూద్ గామి యుగము

1885 సంవత్సరము వఱకుగల కాలమును మహమూద్ గామి యుగముగ పేర్కొనవచ్చును. ఈతని ప్రభావ మీ సంవత్సరము వఱకే గాక పందొమ్మిదవ శతాబ్ది చివరి వఱకును ప్రగాఢముగ నుండెను. మత్నవీహిమాల్ గ్రంథకర్తగ సుప్రసిద్ధుడైన వలీఉల్లా మెటా తన సమకాలికుడగు మహమూద్ గామి సుప్రసిద్ధకవి యనియు, కాశ్మీరి భాషలో ప్రవీణుడనియు, నాతనికి సాటియగు వారెవరును లేరనియు ప్రశంసించెను. మహమూద్‌గామి 'షాహబాదదూర్' లోని ముల్లా వంశీయుడు. అరబీ

పారశీకభాషలను మథించిన వాడగుటచే నా భాషల ప్రభావ మాతని కాశ్మీరి గ్రంథము లందు స్పష్టముగ గన్పట్టును.

మహమూద్ చిరకాలము జీవించెను. 1819-1846 వఱకుగల సిక్కుల పరిపాలనాకాలమును డోగ్రాల కాలమునుకూడ అతడు చూచియుండెను. హాజిన్ వాసియగు వహాబ్‌పారె అను కవి తప్ప ఈ యుగమున బహుగ్రంథకర్తగ ప్రసిద్ధి వహించిన వారెవరును లేకుండిరి. ఈ కవి ప్రణయసంబంధులును, సాహససోపేతములునునగు మథ్నవీలు, గజల్లు బహువిధములైన గీతములు, పాటలు మున్నగువానిని కాశ్మీరి ఫక్కిలో రచించెను. ఈతని ప్రణయకావ్యములలో యూసఫ్‌జులైఖా, లైలా వ మజ్నూ, షీరీన్-బ-కుస్రూ, షేక్ సనాన్, హారున్-ఉర్‌రషీద్ మొదలగునవి విశిష్టములైనవి. భావతీవ్రత. రసవద్వర్ణనావిధానము అలంకృతశైలి అనునవి ఈ కావ్యములోని విశిష్టగుణములు, కాని అరబీ పారశీక శయ్యానుకరణము లధికమై కావ్యశోభను తగ్గించినవి. ఇరువది లేక ఇరువదియైదు శాతము కాశ్మీరి పదములు, క్రియాపదములు, నామవాచకములు అతికష్టముగా గాన్పించు పద్యము లీ కావ్యము నందెన్నియో కలవు. కొన్ని పద్య చరణములు పూర్తిగ అరబీ, పారశీక, ఉర్దూభాషలో రచింపబడినవి కలవు. సిక్కుల ఆగమనముతో కాశ్మీరదేశమునకు భారతదేశముతో రాజకీయ సంబంధమేర్పడి చిరకాల సాంస్కృతిక సంబంధము పునరుజ్జీవము నొందుటయే యిందులకు కారణము. స్వేచ్ఛానువాదములగు ప్రణయగాథా కావ్యములందు మహమూద్ కవి అరబీ పారశీక పదజాలమునే కాక నుడికారములను, వాక్యములను కూడ స్వీకరించినందున దేశీయచ్ఛాయలు స్వల్పముగ గన్పట్టును. మహమూద్ అనుసరించిన ఇట్టి శైలి 'రెఖ్తా కాశ్మీరి' అను శైలీవిధానమునకు దోహదమొసగినది. నాడు పారశీకము రాజభాషగను, ఆస్థాన గౌరవమునొందిన భాషగను పరిగణింపబడెను. నాటి పాఠశాలలందును మత విద్యాపీఠములందును పారశీకమునకే చలామణి యధికమయ్యెను. ఈ భాషయందు ప్రావీణ్యము చూపనేరని కవులకు రచయితలకు నాడు సముచిత గౌరవస్థానము లభింపకుండెను. మహమూద్ కవి రచనలందు గాన్పించు కృతకశైలి, అంకారములు, శయ్య, పదజాలము, నుడికారములు, రచనావిధానము మున్నగునవి దేశీయ సంప్రదాయములకు భిన్నములగుటచే నాధునికుల తీవ్రవిమర్శకు గుఱియైనవి. మహమూద్ కవి గజల్ అను పద్యభేదమునకు దేశీయ స్వరూపము నొసగి కాశ్మీరి కవితలో సముచిత స్థానమును ప్రామాణికత్వమును గలిగించి నందులకును మన మాతనికి ఋణపడియున్నాము. అతని మథ్నవీలలోని ఉజ్జ్వలగుణమువలె గజల్ల

యందును అచ్చమైన కవిత్వావేశము కాన్పించును. కాశ్మీరి కవిత్వాదర్శముల నను సరించి రచింపబడిన గీతములందును పాటలందును మహమూద్ కవి ఉత్తమ కవితా సౌరభము గుబాళించును. ఈ గీతము లతిసహజములై సుందరములై సుకుమార భావాన్వితములై సరస సంగీతచ్ఛాయలతో హృద్యముగనున్నవి. అతని మస్నవీల కంటె గీతములే నాటివలె నేడును నిత్యనూతనములై బహుజనప్రియములై యొప్పు చున్నవి. మహమూద్ రచించిన గజళ్ళు అధికముగ గీతముల రూపమునను, మస్నవీ లలో నంతర్భాగములుగను నున్నవి. ఈ గజళ్లలోని ఛందోవిధానము, ప్రాసలు, విసు వును గలిగించు సుదీర్ఘమైన మస్నలీలలోని ద్విపద ఛందమునకు భిన్నములై మధ్యమధ్య మనోరంజకములుగ నున్నవి. ఈ కవితత్వ ప్రధానములగు గేయముల నధికముగ రచింపలేదు. "తమసీలి ఆదం ప్రిచ్ఛామ హుబాబస్" — (మానవ జీవితమును వివ రింపుమని నీటిబుడగను కోరితిని) అనునదొకటి యిందుల కపవాదము. వీనిలో కవిత్వపు విలువస్వల్పముగా గోచరించును. ఈతని ప్రణయగీతములే అత్యుత్తమ కవితాఖండములు. ఏకైక విషయ ప్రధానమగు 'నజమ్' అను పద్యమును వస్త్వైక్య మును పాటించి సరసముగ రచించుటలో మహమూద్ కవియే ఆద్యుడు. ఈతడు రచించిన పాంపూర్యనామ (చిమ్మట పురుగుగాథ) కపసిపాష (ప్రత్తిగింజపూవు) మొదలగునవి యిట్టివి. ఇట్టి పద్య కవితాశిల్పము నాడధికముగ నాదరింపబడకుండెను. ఇటీవల మాత్రమే అట్టి రచనలు కొన్ని వెలువడినవి.

మహమూద్ కవి రోఫగీతమను నృత్యగేయ కవిగను ప్రసిద్ధుడు. ఇట్టి గేయము లంతకుపూర్వమే ప్రారంభదశలోనుండెను. కాని ఈ కాలముననే మహమూద్ వంటి సుప్రసిద్ధ కవుల వలనను, తదనంతరము మఖ్బూల్‌షా, రసూల్‌మీర్ అను కవుల వలనను, నట్టి గీతము లధికజన ప్రియములైనవి, నగరములందు కాని, పల్లెలందు కాని, ఈద్ ఆసన్నమై రమదాన్ అంతమగునపుడు, స్థానికోత్సవములు, పంటకోతలు మున్నగు సందర్భములందు, స్వచ్ఛమైన అంబర వీధిలో చంద్రుడు స్వేచ్ఛావిహార మొనర్చు సాయంకాలములందు; యువతులు మధ్యవయస్కులగు గృహిణులు యిలుపీడి వివిధబృందములుగ నేర్పడుచుందురు. ఈ బృందములెన్నియో వరుసల నేర్పఱిచి కొనును. ఒక్కొక్క వరుసలోని స్త్రీలు చేతులు చాచికొని, భుజములను గ్రహించికొని, నడుములకు చుట్టు చేతులు బిగించికొని అల్లుకొనునట్లు వివిధపంక్తులుగా రూపొందుదురు. ఈ పంక్తి కెదురుగా కొందఱు మఱియొక పంక్తి నేర్పఱిచి ఊయలవలె, నృత్యరాగ మున కనుగుణముగ, మందమందముగా నూగుచు ఒక్కొకరొక్కొక గీతచరణము చొప్పున పాడుచుందురు. మహమూద్ గామి రచించిన ఇట్టి గేయమొకటి యిట్లుండును,

రండో కిన్నర గంధర్వులారా! నృత్యంచేతాం
నృత్యంచేతాం
వెలుగు నాశ్రయించి శిఖరాలు ప్రకాశించినవి
శిఖరాలు ప్రకాశించినవి
గులాబివన్నె అరుణోదయముతో
గులాబివన్నె అరుణోదయముతో
నా ప్రియునికై నిర్మిస్తాను బంగారు పల్లకి
బంగారు పల్లకి
ముత్యాల అంచులతో, ఏనుగు దంతపు స్తంభాలతో
ఏనుగు దంతపు స్తంభాలతో
అతడు రాగానే నేనెదురేగుతాను
నేనెదురేగుతాను
కూడి నా సఖురాండ్రతో చెలికత్తెలతో
సఖురాండ్రతో చెలికత్తెలతో

మహమూద్‌కంటె ఒక మెట్టు తక్కువైన కవి బీరుహ సమీపమునగల దూహనగోమ నివాసియగు వలీ ఉల్లా మట్టూ (Wali Ullah Mattoo). ఈ కవి రచించిన సుప్రసిద్ధమైన హిమాల్ మథ్నవీ యితివృత్తము సంస్కృత పారశీక గ్రంథములనుండి కాక హిమాల్-నోయేగ్రే (సంస్కృతమున నాగరాజు)ల ప్రణయమునకు సంబంధించిన ప్రాచీన గాథనుండి స్వీకరింపబడినది. ఈ గాథ ప్రాచీనార్యులు కాశ్మీర లోయలో స్థిరపడిన వృత్తాంతమును, అచ్చటి పైశాచులు లేక నాగులతో ప్రథమముగా నివాస సంబంధము నేర్పఱికొనినను దంతమును బేర్కొనుచున్నది. మహమూద్‌గామి శైలికంటె వలీ ఉల్లా కవిత్వశైలి సరళమై స్వచ్ఛమై స్థానిక వాతావరణ శోభితమై యొప్పుచున్నది.

వలీ ఉల్లాకు సన్నిహితులైన అజీజ్‌ఖాన్, జరీఫ్‌ఖాన్ అను కవులీ సందర్భమున, బేర్కొనదగినవారు. వీరి గజళ్ళు, గీతములు (ప్రధానముగ అజీజ్‌ఖాన్‌వి) హిమాల్‌లో స్థానమును గలిగించుకొనినవి. వలీ ఉల్లాకు గీతములను గజళ్లను రచించుటలో సహజశక్తి లేనందున నాతడు కవిమిత్రుల సాహాయ్యము నొందినట్లు తోచును.

ఛోన్ గ్రామమునకు జెందినవాడును, మహమూద్‌గామి సమకాలికుడును, తత్త్వ కవియునగు షాగఫూర్ (Shah Gafoor) ఈ సందర్భమున పేరొ్కనదగినవాడు. ఈ కవి మథ్నవీలను రచించినట్లు తోచదు. కాని ఈతడు రచించిన గజళ్ళు హైందవ సంప్రదాయము ననుసరించి హైందవమత నిగూఢతత్త్వ సంబంధులైన దృష్టాంతము లలో పూర్ణములై ప్రశస్తములైగనున్నవి. హైందవ మహమ్మదీయ తత్త్వసంప్రదాయ ములకుగల సన్నిహిత సంబంధమును ప్రధానముగ నిరూపించుచు హైందవ సంప్ర దాయమునం దలవోకగా రచన సాగించిన మహమ్మదీయ కవులలో షాగఫూర్ యొకడు. ఈ పద్య మిందుల కుదాహరణము —

> ఇట జన్మించి నిన్నుపయోగించువారు కొందఱే
> 'తత్త్వమసి' తత్త్వమును ధ్యానింపుము
> హరిహరబ్రహ్మల నన్వేషింపుము.

ఈ కాలమున జీవించిన కవులు మఱికొందరు కలరు. సొనాఉల్లా క్రీరి (Sonaullah Kreeri) ఇస్లాం మత ప్రవక్తయగు మహమ్మద్ స్తుతి ప్రధానములగు 'న అత్' - మన్థవిత్ - అను పద్య కావ్యములతోపాటు ఎన్నియో మథ్నవీలను కూడ రచించెను. అందు 'బహరె కమల్ ముసద్దస్' అను పారశీక ఛందమునందు రచించిన 'అహవాల్ - ఉల్‌ఖిరత్' (Ahwal-ul-Kharat) అనునది ప్రధానమైనది. మహమ్మద్ స్తుతి ప్రధానముగ రచించిన కావ్యము లీ కవికి ప్రవక్తయెడ గల భక్తి గౌరవములను చాటుచు నేటికిని జనాదరణము నొందుచున్నవి. హజరత్‌బల్‌కు జెందిన బీబ్ సాహిబా (Beeb Sahiba) సన్యాసాశ్రమమును స్వీకరించెను. బీబ్‌సాహిబా రచించిన 'యాష లూహయాద్దుయహ ఓసూమయ' - (తత్త్వమసియని నేనెపుడైనను గుర్తించితినా) అను పద్యము నేటికిని గౌరవపురస్సరముగ బఠింపబడుచున్నది.

# 7

# రసూల్‌మీర్ యుగము

1885 లో మహమూద్‌గామి మరణముతో రెండవ ఉప యుగము అనగా మహ మూద్‌గామి యుగ మంతమైనదని చెప్పవచ్చును. వివిధ దృక్పథములతో బరిశీలించి అనంతర సాహిత్య యుగమును 1855-1880 వఱకు గల కాలమును పరమానంద

మఖ్బూల్‌షా లేక రసూల్ మీర్ యుగముగ పేర్కొనవచ్చును. వీరీ ఉపయుగమున గల మహా కవులే కాక అగ్రశ్రేణికి చెందిన ఉత్తమోత్తమ కాశ్మీరి కవులలో ప్రముఖులు, 1880 నాటికి వీరందఱును కాలధర్మము నొందిరి. వీరి ప్రశస్తమైన కృషి యంతయు నీ ఉప యుగమున జరిగినది.

వీరిలో వయసులో పెద్దవాడగు పరమానందుడు (1791-1879) మట్టన్ అను ప్రసిద్ధ తీర్థ క్షేత్రమున కైదుమైళ్ళ దూరమున నున్న సీర్ అను గ్రామమున నంద రాముడుగ జన్మించెను. పరమానందుడీ క్షేత్రమునకు వచ్చి సిద్ధపురుషులయు, సన్న్యాసులయు సహవాసమునొంది సాధు వృత్తిని స్వీకరించి జీవితకాలము నంతను నిటనే గడిపెను. కాశ్మీరి కవిత్వములో నపూర్వమైన పారవశ్య గుణోపేతములైన లీలా గేయ కవులలో నీతడు ప్రముఖుడు. ఇట్టి పద్యముల ననువదించుట కష్టము. అనువాదము నందా గీతముల సుకుమారాతి సుకుమార భావములు లోపించును. ఈ గీతము లందలి భావములు-సంగీతము ఒకదానితో నొకటి పెనవేసికొని అవినాభావ సంబంధము కలవియై యుండుటవలన అనువాదమునందా గుణద్వయమును జూపుట కష్టము. మూలమునందలి సంగీతమాధురి కాని, నృత్యానుగుణమైన లయము కాని లేక గీతము నందలి భావమును మాత్రమే దర్శింపజేయు అనువాద మిందుల కుదాహరణము.

ఒకసారి అంకురించిన ప్రేమలోన నిల్వనేరదు
నిరంతరముగా పెల్లుబుకుచు ప్రవహించు
మానవ, ప్రకృతి అనురాగములతో తుల్యమైయుండు
ఎల్లయెడలను వ్యాపించియుండు
అంతరమున నున్న అనురాగము బహిర్గత మగునపుడే.
ఆనంద పారవశ్యమున వేగముగా పరుగులెత్తి
జిలజిల ధ్వని చేయుచు అనురాగపు చెలమ
పొంగుచు నృత్యం చేయాలి
విశ్వ ప్రేమాకృతిదాల్చి ఉదాత్తమై యుండునపుడు-
నీ భక్తుడు తన్ను లోకం ఏమన్నా లెక్కింపడు
నిందాస్తుతులను నిర్లక్ష్యముగా జూచునతడు.

పరమానందుని లీలాగీతములు సన్యాస జీవన విధానమును కాని, సంసార త్యాగమునకు గాని ప్రోత్సహింపవు. అవి కాశ్మీర శైవతత్త్వము లేక త్రికము ననుసరించి వ్యాఖ్యానింపబడిన కాశ్మీర తాంత్రిక నిగూఢతత్త్వ సంప్రదాయము ననుసరించి, బాహ్య ఆకార - ప్రాధాన్య వాదముకంటె అంతర్ముఖమైన అనుభవములకును త్యాగముకంటె భోగమునకును, ప్రాధాన్యము నొసగెను. 'రాస' కేవలము భక్తిపూర్వకమైన వలయ నృత్యము మాత్రమే కాదని కవి యిట్లు వచించెను.

ప్రేమ విస్తార మంబుధివలె విశాలమైనదె 'రాస'
క్షార మాధుర్యములకు సామరస్యము కూర్చునదె 'రాస'
భక్తి జ్ఞాన యోగములు మా 'రాస'
జాగ్రదవస్థలో సమాధి మా 'రాస''

పద్మములు చక్రములు మండలములు మున్నగువానికి సంబంధించిన నిగూఢ తత్త్వ దృష్టాంత నిర్భరములై యున్నందునను, ప్రాస చమత్కృతులతోడను, అనేక శ్లేషార్థములతోడను పూర్ణమై యున్నందునను ఈతని లీలా గీతములను కొన్నింటిని వ్యాఖ్యానించుట కష్టము. ఐనను అధిక గీతములు మాధురీ గుణపూరితములై ఆధ్యాత్మిక దృష్టిపై గల ప్రగాఢ విశ్వాసమును, భక్తిపారవశ్యమును చాటునట్టివిగ నున్నవి. ఈ చరణములతో నారంభమగు పద్యము లిట్టివి :—

1. రమ్ము-వలయమును చేరి కిన్నర గంధర్వులవలె నాట్యం చేద్దాం
2. నీ కర్మ క్షేత్రమును సారవంత మొనర్పుము
3. తనతో నైక్యము నొందుట జీవితములోనే మృత్యువును చూచుట, సమస్తమును సాహసించుట
4. నీ ప్రేమ మృత్యుభయమును తొలగించు.

పరమానందుడు సివలగన్, రాధా స్వయంవర, సుదామ చరితములను మూడు కథాత్మక కావ్యములను లీలా ఫక్కిలో రచించెను. ఒక్కొక్క గేయమున నాలుగేసి చరణము లుండును. నాల్గవ చరణము పల్లవిగ నంతటను వచ్చును. కథాత్మక కావ్యము లన్నిటియందును మధ్య మధ్య సాధారణముగ లీలాగీతము లుండును.

ఈ కావ్యములలో జీవాత్మ పరమాత్మలకు పరస్పరానుబంధమునకు సంబంధించిన నిగూఢ తత్త్వము ప్రతిపాదింపబడినది. కథలన్నియు నుపాఖ్యానములతోడను, చక్కని వర్ణనలతోడను నొప్పుచున్నవి. శివలగన్ అను కావ్యమునందు దృష్టాంత పూర్వకమైన తత్త్వ ప్రతిపాదనము ప్రస్ఫుటముగ పాఠకుల నాకర్షించును. రాధా స్వయంవరములో సంగీత మాధురి అధికముగ గాన్పించును. సుదామ చరితము అల్పాక్షరముల ననల్పార్థమును స్ఫురింపజేయునదియై ఉదాత్తకథాత్మకమై, నిగూఢ తత్త్వ గర్భితమై కాశ్మీరి సాహిత్యములో విశిష్టమైన కావ్యముగ గణింపబడుచున్నది. సుదాముడు జీవుడుగను, కృష్ణుడు పరమాత్ముడుగను నిందు చిత్రింపబడిరి. సుదాముడు శ్రీకృష్ణుని బాల్య సఖుడు. కృష్ణునకు దూరమై ఎన్నియో కష్టముల ననుభవించెను. భార్యయగు సుశీల ప్రోద్బలమున సుదాముడు ద్వారకానగరమున కేతెంచి కృష్ణ పరమాత్ముని సందర్శించి అతని అనుగ్రహమువలన భోగ భాగ్యముల ననుభవించెను.

శివలగన్‌లోని శైలి సంస్కృతపూర్ణమైనది కాని, సుదామ చరితమునందు స్వచ్ఛమైన శైలి కన్పట్టును. సంస్కృత పదములను స్వీకరించిన సందర్భములందు కవి వానికి కాశ్మీరి భాషా స్వరూపము నొసగెను. ఈ కవి సంస్కృత పదములను సందర్భోచితముగ నుపయోగించెను.

ఈ కవి రచించిన 'అమరనాథ యాత్ర' యందు మధ్య హిమాలయములో కాశ్మీరమున 13 వేల అడుగుల యెత్తున గల అమరనాథ క్షేత్ర యాత్రా విశేషములు సరసముగ సహజ రీతిలో వర్ణింపబడినవి. మధ్య మధ్య అంతర్ముఖమైన యోగ యాత్రనుగూర్చి చెప్పిన సందర్భములే గొంత విసువును గలిగించును.

జలాలుద్దీన్ రూమి చెప్పినట్లుగా ఐక్యతనుగూర్చి పారవశ్యము ననుభవించు వారికి గల ఈశ్వర ప్రేరితమైన వాణి ఈ కవికి గలదు. అచ్చటచ్చట ప్రయోగింపబడిన ఒక్క పదము వలననే ఈ కవి వర్ణనాత్మక ధోరణి కెట్టి ఆటంక మేర్పడకుండ నిగూఢార్థమును వ్యక్తీకరించును. దేశీయ వ్యావహారికమైన నుడికారముల నీ కవి శక్తిమంతముగా బ్రయోగించును. పరమానందుని శిష్యుడును మిత్రుడును నగు లక్ష్మణ కౌలు బుల్ బుల్ (1812-1883) గజళ్ళు - భజనలు - లీలాగీతములు మున్నగువానిని రచించెను. వీనిలో 'యారదాదే యేచదోమమ తాపయ దోదుమ తాల్యాన వ్యసీ' అని ప్రారంభమగు రచన సంకలన గ్రంథముల కెక్కినది. పరమానందుని రాధా స్వయంవరములోని ఉపాఖ్యానమును గ్రహించి మోహినీ కావ్యమునుకూడ ఈ కవి రచించెను.

ఇందు శ్రీకృష్ణుడు దేశద్రిమ్మరియగు బేహారి (స్త్రీల అలంకరణములను విక్రయించు వర్తకుడు) రూపమున రాధను గలిసికొనిన వృత్తాంత మతి రమణీయముగ జిత్రింప బడినది.

సంస్కృతమున సుప్రసిద్ధమైన నలదమయంతుల ప్రణయగాధను స్వీకరించి లక్ష్మణ కౌలు 'నల దమయంతి' కావ్యమును రచించెను. 'సామనామ' అను వీరగాధా కావ్య మీతని స్వతంత్ర కావ్యము. కాశ్మీరి మథ్నవీ కవులు శృంగార రస ప్రధానము లగు మథ్నవీలను మాత్రమే రచించియుండిరి. వీర రస ప్రధానములగు మథ్నవీలను రచించుటలో నీ కవియే ఆద్యుడు. ఇట్టి మథ్నవీలలో యుద్ధములు సాహస కృత్యములు ప్రధానముగను, ప్రణయ సంఘటనలు వాని కంగములుగను మాత్రమే వర్ణింపబడును. ఈ కవి 'సామనామ' కావ్యేతి వృత్తమును ప్రధానముగ ఫిరదౌసి రచించిన సుప్రసిద్ధ పారశీకేతిహాసమగు షాహనామనుండి గ్రహించినను, ఖాజా కిరమానీ పారశీక భాషలో రచించిన 'సామనామ' నుండియు కొంతవఱను స్వీకరించియుండును. తనకు సమ కాలికుడగు అమీర్ షాక్రీరికంటె ముందే లక్ష్మణ కౌలు 'సామనామ'ను రచించెనని తోచును. అతని గ్రంథములకంటె లక్ష్మణ కౌల్ మథ్నవీయే యెన్నియో విధముల ప్రశస్తమైనది. బుల్ బుల్ రచించిన మథ్నవి పారశీక మథ్నవీకి అనువాదము కాక అనుకరణము మాత్రమే. బుల్ బుల్ కవి అందలి ఉపాఖ్యానములను అప్రధాన కథలను, సంఘటనలను వదలి కావ్యమునకు వస్త్వైక్యమును గూర్చినందున పార శీకములో ఖాజా రచించిన గ్రంథముకంటెను కాశ్మీరి భాషలో అమీర్‌షా రచించిన గ్రంథముకంటెను చిన్నదై యొప్పినది. ఈ కవి పారశీక భాషా నిష్ణాతుడగుట, తత్ప్రభావమునకు గుఱియైనను, స్వచ్ఛమైన శైలిని పాటించెను. స్థానిక వాతావరణ చ్ఛాయలను కావ్యములో చొప్పించుట యందీ కవి కృతకృత్యుడయ్యెను. పారశీక సంప్రదాయము ననుసరించి సారాయిని వర్ణింప ఈ కవి 'తేనీరు' ప్రసక్తి గావించి దేశీయ సంప్రదాయమును పాటించెను.

వ్యజిబ్రోర్ వాసియగు అబ్దుల్ - అహాద్ నాజిమ్ అను కవి గజల్ - నఅత్- మథ్నవీ - అధిక్షేప కావ్యము మున్నగువానిని రచించెను. జైనుల్ అరబ్ అను మథ్నవీలో, యాక్తూష్‌ను ప్రేమించినందులకు తన సోదరునిచే హత్య గావింపబడిన జేన్ అను నాయిక వృత్తాంతమిందు వర్ణింపబడినది. ఈ కావ్యము షేక్ ఫరీదుద్దీన్ అత్తార్ రచించిన 'ఇలాహినామ' అను కావ్యమున కనువాదమని తోచును. ఈ కవి రచించిన అధిక్షేప కావ్యములే కాశ్మీరి వాఙ్మయమున కలంకారప్రాయములు.

క్రీ. శ. 1874 లో మరణించిన సైపుద్దీన్ తారబలి కొన్ని గజళ్ళు మాత్రమే రచించెను. హిమాల్-వామిక్ ఉజ్రా అను రెండు శృంగార మథ్నవీల రచయితగా నీకవి సుప్రసిద్ధుడు. ఈ కవి పారశీక శైలి ఆలంకారిక రచనా విధానము నధికముగా నను కరించినందున నది పారశీకమో ? కాశ్మీరమో ? గుర్తింపసాధ్యముకానిదై కొన్నిపట్ల యేదియు కానట్లు తోచును. 2111 పద్యములుగల హీమాల్ కావ్యశైలి కృతకమై వలీ ఉల్లామట్టూ కావ్యముకంటె అల్పమైయున్నది. ఈతని లఘుకృతులగు గజళ్ళయందును నిట్టి శైలియే పాటింపబడినది. కాని వామిఖ్ ఉజ్రా అను కావ్యమున మాత్ర మిట్టి దొసగులులేవు.

ఖార్ నివాసియగు ఖాజా అక్రమ్ బఖాల్ (Khwaja Akram Baqal) మెహర్ ఉమాహ అను మథ్నవీతో పాటు కొన్ని గజళ్ళనుకూడ రచించెను. శృంగార కావ్యమున కనుగుణము కాని పారశీక ఛందము (బహరెతఖారిబ్) నందు వ్రాయబడినను ఈ కావ్యశైలి, ధారాశుద్ధిని మాధుర్యమును గలిగియున్నది. కరుణరసాత్మకమైన ఈ కావ్యము కాశ్మీరిలో ప్రశస్తమథ్నవీగా కీర్తిగాంచినది.

కాశ్మీరి మథ్నవీ కవులలో మఖ్బూల్‌షా అధిక ప్రశస్తి గాంచుటకాతని రెండు మథ్నవీలు కారణము. శ్రీనగరమునకు పదిమైళ్ళ దూరమునగల క్రాలవోర్ అను గ్రామమున 1820 ప్రాంతమునందీ కవి 'పీర్' అను మహమ్మదీయ మతగురువుల యొక్క సయ్యద్ వంశమున జన్మించెను. ఈ కారణమున నీ కవి సంప్రదాయబద్ధమైన నిగూఢ తత్త్వ ప్రతిపాదకములగు గజళ్ళు కూడ రచించెను. ఈ కవి రచించిన కులియాత్ మఖ్బూల్-గుల్‌రేజ్-అయూబ్ నామ అనునవి నేటికిని ప్రశస్తి వహించినవి. ఈతని గుల్‌రేజు, గ్రీస్తునామ గ్రంథములు చిరస్మరణీయములు. పారశీక మథ్నవీల వలె కాక ఈ కావ్యములందు గజళ్ళు, గీతములు మధ్యమధ్య కూర్చబడినవి. ఛందస్సు యందును మార్పు కన్పట్టును. ఈతని కాశ్మీరి మథ్నవీలలో కొన్ని మాత్రమే సజీవములైనవి. కొన్ని మథ్నవీలలోని కొన్నికొన్ని భాగములు సంకలన రూపమున కాని వైచిత్ర్యముగల కావ్యములుగ గాని నిలువజాలునట్టివి. ఆద్యంతరమణీయమైన గుల్‌రేజు కావ్యమునం దుదాత్తమైన ప్రణయ చిత్రణములకు ప్రకృతివర్ణనలు మెఱుగులు దీర్చి శక్తిమంతము లొనర్చినవి. అజబ్‌మాలిక్ నోష్లబ్ అనువారలకు సంబంధించిన ఈ గాథ పారశీకమునుండి స్వీకరించబడినది. మఖ్బూల్ ఈ కథను పరం పరగా వినవచ్చు గాథలనుండి గ్రహించెనని తోచును. ఈ దృష్టితో జూచినచో గుల్‌రేజు

పారశీక ఫక్కి ననుసరించిన కావ్యముగాక స్వతంత్ర కావ్యమని స్పష్టమగును. పారశీక శైలి అధికముగ ననుకరింపబడినను గజళ్ళయందును గుల్‌రేజు గీతములందును, మఖ్మూల్‌కవి స్వచ్ఛమైన శైలినే పాటించెను. కొన్ని పాటలలో స్వచ్ఛమైన గీతికా ధర్మము - భావతీవ్రత అనునవి గోచరించును. 'గ్రీస్తనామ' నాటి కర్షకులను గూర్చిన అధిక్షేప కావ్యము. సమకాలిక సాంఘికేతివృత్తముగల కావ్యరచనకిదియే మార్గదర్శక మైనది. భాష, అధిక్షేపాత్మకమైన హాస్యము, ప్రశస్తసంఘటనల ఎన్నిక, శక్తివంత ములగు వర్ణనలు మున్నగు గుణము లీ కావ్యమునకు కాశ్మీరి భాషలో నగ్రస్థానమును గూర్చినవి. ఈ కవియు, నితని తరువాతి కవులును మఱికొన్ని హాస్య, అధిక్షేపాత్మక ములగు పద్యములను రచించిరి కాని అవి దీనికి సాటిరావు.

మథ్నవీ శైలిలో రచింపబడిన బహార్ నామ అను లఘుకావ్యమున వసంతా గమన మిట్లు వర్ణింపబడినది.

వసంతం వచ్చింది నిద్రించిన పూలన్నీ తలలెత్తి వికసించాయి
వసంతం వచ్చింది జలపాతం మళ్ళీ ప్రతిధ్వనించింది.
పక్షు లన్నీ ఆనందంతో కిలకిల మంటున్నాయి చూడు.

బహార్‌నామ అట్టి కావ్యములలో నాద్యమైనది - పద్యభాగముల రూపమునను, కొన్ని గజళ్ళ రూపమునను తప్ప ఇట్టికావ్య మంతకుముందు వెలువడలేదు.

ఈ కాలపు యువకవులలో షాహబాద్ వాసియగు రసూల్‌మీర్ ప్రత్యేకముగ బేర్కొనదగినవాడు. ఈ కవి 1867 ప్రాంతమున చిఱుత ప్రాయమున మరణించెను. ఈతడు "జేబానిగార్" అను మథ్నవీని రచించెనని విశ్వసింపబడుచున్నది. కాని నేడా గ్రంథ మలభ్యము. ఈతడు తన పాటలవలన ప్రశస్త కాశ్మీర శృంగార కవిగ బ్రస్తుతింపబడు ననుటకు సందేహములేదు. విషయాసక్తి - భోగాసక్తి-భావావేశము - పటిష్ఠమైన స్వరమాధురి - రసభావానుగుణమైన లయ మున్నగు గుణములుగల ఈతని గీతములు పాడుట కింపుగా నుండును. ఈతడు తన గీతము లందధికముగ నాయికను గూర్చి నాయకునకుగల అనురాగమునే ప్రధానముగ వర్ణించెను. స్త్రీ అంగ సౌందర్య మును వర్ణించుటలో నీతని లేఖిని నిరాటంకముగను విచ్చలవిడిగను సాగినది. అంతకు పూర్వము రచింపబడిన గజళ్ళలో నంతగా లేని భావైక్య మిందు కలదు. పారశీక పదములను, నుడికారములను, కాశ్మీరములుగా మార్చుట యందును, గజల్‌కు ప్రత్యే

కత గూర్చుట యందును ఈ కవి తన పూర్వులను, సమకాలికులను ఓించెనని చెప్ప వచ్చును. ఈతని గీతము లేభాష యందైనను పరివర్తించుట కష్టము. అట్లొనర్చినను భావావేశమునకు లయకు, స్వరమాధురికి ఎట్టిలోప మేర్పడదు.

నిగూఢ తత్త్వప్రధానములగు రచన లొనర్చుటకు వైముఖ్యము జూపిన మహా కవులలో రసూల్‌మీర్ ప్రథముడు. అట్టి రచనా సంప్రదాయము నుడికార ప్రయోగము లందు కొంతమార్పు వచ్చినను, పారశీక సంప్రదాయము ననుసరించిన గూఢతత్త్వ కవి మధుశాల, మధుపాత్రల ఆచారమును సమర్థించును. సాధారణ మత విశ్వాసమును కర్మకాండను గూర్చియు వైముఖ్యమును బ్రకటించును. ఈ కాలమునాటి ప్రముఖ నిగూఢతత్త్వ కవి యగు రహమాన్‌దార్ అట్టి కవిత్వమును మాత్రమే వ్రాసెను. తేనెటీగకును, ఈగకును జరిగిన సంభాషణ రూపమున రచింపబడిన మాఛ్‌తులర్, లయప్రధానమైన శశరంగ్ అను చిత్రకావ్యము ప్రధానమైనవి. ఇతని గజళ్ళు కూడ ఇట్టి ధర్మము కలవియే. వృక్షమునకును ఛాయకును జరిగిన సంభాషణ రూపమున రచింపబడిన తత్త్వప్రధానమైన తులత ఛాయ అను కావ్యముతప్ప అంతకుముందు రహమన్‌దార్ రచించిన మాంఛ్‌తులర్‌వంటి కావ్యము వెలువడలేదు.

ఈయుగమున జీవించిన ప్రతిభావంతులలో మహద్‌షాడీక (Mahdshah Dika) అను కవి యొకడు. ఈతడాశువుగనే విషయమును గూర్చియైనను పద్యములు చెప్పుటకు సమర్థుడు. చమత్కార హాస్యగుణము లీతనికి పుట్టుకతో వచ్చినవి. చతురోక్తులతో ప్రత్యుత్తరముల నొసగుటలో నితడసమానుడు. కాశ్మీర పారశీకములందు సరిసమానముగ నలవోకగా పద్య రచన చేయుటలో సమర్థుడు. ఈతని చతురోక్తులు నేడు కూడ ప్రశంసింపబడుచున్నవి. ఈ కవి ప్రాస్తావిక పద్యముల నధికముగా రచించెను.

## 8

# 1800 - 1925

1800–1925 వఱకు గల కాలమును చివరి నాలుగవ ఉప యుగముగ స్వీకరింప వచ్చును. 1800 నాటికి మూడవ ఉప యుగమునాటి సుప్రసిద్ధ కవులందఱును దివంగతులైరి. నాటికే పంజాబు ఉత్తర ప్రదేశ రాష్ట్రములనుండి ఛాయామాత్రముగ ప్రసరించిన ఉర్దూ, హిందీ భాషల ప్రభావము, ఆంగ్ల భాషా ప్రభావము ఈ యుగమున

ప్రస్ఫుటమైనది. క్రీ. శ. 1885 లో మహారాజ ప్రతాపసింగ్ జమ్మూ, కాశ్మీర రాష్ట్ర సింహాసనము నధిష్ఠించెను. ప్రప్రథమముగ నా రాష్ట్రము రాజకీయముగ భారతదేశ పైసార్వ ఆధిపత్యమునకు లోబడినది. అప్పటితో రాష్ట్రమునం దాధునిక యుగ మారంభమైనది. పర్వత ప్రాంతముల నాధునిక జీవన ప్రయాణ సౌకర్యము లేర్పడి నవి. సుస్థిరమైన మార్గములు నిర్మింపబడినవి టెలిగ్రాఫ్ సౌకర్యము లేర్పడినవి పారశీకము స్థానమునునం దాంగ్ల మధికార భాషగా రూపొందినది.

తత్త్వరచనా సంప్రదాయ మీ యుగము నందును నుండెను కాని అట్టి గ్రంథములు దుర్గ్రహములై క్షీణదశను సూచించుచుండెను. నామసాయెబ, స్వచ్ఛక్రాల్, అహమద్ బటవారి అను కవులు రచించిన గ్రంథము లిందుల కపవాదములు. అహమ్మద్ రచించిన కొన్ని గజళ్ళు, నామసాయెబ స్వచ్ఛక్రాల్ షంస్‌ఫకీర్, వహాబుఖార్ అను కవులు రచించిన గ్రంథము లీ శాఖలో ప్రశస్తము లైనవి.

1919 లో మరణించిన షంస్‌ఫఖీర్ కాశ్మీరమునగల ప్రసిద్ధులగు సిద్ధకవులలో నొకడు. ఈతని గ్రంథములు సూఫీ హైందవ తత్త్వముల సామరస్యమును నిరూపించు చున్నవి. హైందవ నిగూఢతత్త్వ సంప్రదాయమునకు జెందిన దృష్టాంతములందు సరసముగ గూర్చబడినవి.

షంస్‌ఫకీర్ సమకాలికుడగు వహాబ్‌ఖాన్ 1914 లో మరణించెను. ఈ కవు లిరువురును కలిసి ఆధ్యాత్మిక ప్రసంగము లొనర్చుచు కాలక్షేపము చేయుచుండిరి. ఈత డెన్నియో గీతములను గజళ్ళను రచించెను. కాని కవితా ప్రతిభలో షంస్‌ఫకీర్‌కు సాటిరాడు. ఈతని తత్త్వగ్రంథములు ఛందోదోష భూయిష్ఠములై దుర్గ్రములైయున్నవి.

ఛాగ్రర్ సమీపమునగల రూపవనవాసియగు గులామ్ ముస్తఫాషా కూడ పేర్కొనదగినవాడు. ఈతడు రచించిన గ్రంథములు కొన్నియే యైనను నతిప్రశస్తము లైనవి. ఇందలి శైలిధారాళమైనది. భాష స్వచ్ఛమైనది. ఔచిత్యశోభితములు కాని అలంకార ప్రయోగములు, కృతకశైలి, కల్పనలు ఈతని గ్రంథములందు లేవు. అవి అన్నియు దేశీయచ్ఛాయలు గలవి. భావములు నీతి బోధకములై నుడికారములతోడను, జాతీయములతోడను హృద్యముగ వ్యక్తీకరింపబడినవి.

శక్యమె అంధునకు నిండుచంద్రుని జూడ
శక్యమె బధిరునకు ప్రణయ భావములు వినగ
శక్యమె వికలాంగునకు "పోలో" ఆటలాడ

శ్రీనగరములోని గాంధరబాల్ వాసియగు రాహమహామూద్ (మ. 1917) రచించిన సూఫీగీతములు గణుత్య నేటికిని ఆదరింపబడుచున్నవి. యతిప్రాసల నల వోరగా గూర్చు శక్తి యితని కున్నట్లు ఏరికిని ప్రత్యేక కవులకు లేదు.

నిగూఢ తత్త్వవిచారపు ధన్యమైన అరబీక (మిస్ర) కావ్యములను రచించిన కాశ్మీర కవులలో అబ్దుల్ అహద్ నాజిమ్ అగ్రేసరుడు. ఈ కవి ప్రవక్తయగు మహమ్మద్ స్తుతి ప్రధానమైన గీతములను రచించెను. అవి ఈ కవికి ప్రవక్తయెడ గల భక్తి గౌరవములను చాటుచున్నవి.

నాదిమ్ కవి ప్రవక్తస్తుతి ప్రధానములగు "నఅత్", భగవన్నుతి ప్రధానములగు "మనాజాత్'', సమకాలిక సాంఘిక పరిస్థితులను చిత్రించు ''షహరెఆషోబ్'' అను గ్రంథములను రచించెను. ఇతడు రచించిన గ్రంథములు కొన్నియేమైనను నవి ప్రశస్తములైనవి. ఈ కవి 50 ''నఅత్'' లతోపాటు మహమ్మద్ వ్యక్తిత్వ చిత్రణ ప్రధానమైన కావ్యమును కూడ రచించెను. మహమ్మద్ స్తుతి ప్రధానములగు కావ్యములు తప్ప తక్కిన స్తోత్రము లన్నియు ఉత్సవ సందర్భములందు పఠింపబడు పాటల (ప్రధానముగ పెండ్లి పాటల) రూపమున రచింపబడినవి. ఈతని శైలి సరళమై మధురమైనది. గీతములకు పాటలకు తగిన లయ కన్పట్టును. పద్య భావము లన్నియు హృద్యములగు ''ఖురాన్'' దృష్టాంతములతో శక్తిమంతములై భక్తి పారమ్యమును గలిగించును. 'షహరెఆషోబ్'అను పద్యములందీ కవినాటి మతాచార్యుల దుర్వర్తనమును, సంఘము నందలి దురాచారములను, ధనికుల చిత్తప్రవృత్తిని, కేవలము ధనార్జనపరులును, ప్రాపంచిక భోగ లాలసులునగు జనుల మనోవృత్తిని నగ్నముగ చిత్రించెను. నైతికముగను, ఆధిభౌతికముగను, సంఘము పతనావస్థ నొందిన ఈ కాలమునందు విజ్ఞులు కొందఱు సాంఘిక దురాచారములపై విప్లవధ్వజ మెత్తుచుండిరి.

"నఅత్, మనాఖిబత్ - షహర్ ఆషోబ్" అను కావ్యములను రచించిన తదితర కవులలో హసన్‌గనాయి యొకడు. ఈతడు సమకాలిక పరిస్థితులను బరిశీలించి కలరా, భూకంపము, మొదలగువానిని గూర్చి కావ్యములను రచించెను. కాని ఇతని గ్రంథములు పెక్కు నేడలభ్యములగుట వలన వానినిగూర్చి అధికముగ తెలియదు.

ఇక ఈ కాలములో జీవించిన మథ్నవీకవులను గూర్చి పరిశీలించుట ముఖ్యము. వహాబుపరే (1846-1909) పారశీక మథ్నవీలను కాశ్మీరిలో ననువదించి బహుగ్రంథ

కర్తగ ప్రశస్తి వహించెను. అక్బర్‌నామ, చార్‌దర్‌వేష్, బరామ్‌గోల్ - సుల్తానీ - ఫిరదౌసిషానామా మున్నగు గ్రంథములకు కాశ్మీరి అనువాదములు వెలువడినవి. ఈ కవి ఉర్దూ భాషలోని నౌనిహాలెగుల్బదన్ అను ప్రణయకావ్యమును కూడ అనువదించెను. ఈతని స్వతంత్రకృతులలో "హఫ్తఖిస్సయె మకర్‌జన్" — హఫ్తఖిస్సయెఅయి - బ్యబూజనామ, దర్వేషి, దీవాన్ వహాబులోని గజళ్ళు అనునవి ప్రధానమైనవి. వీరరస ప్రధానములగు రజమియా మత్నవీలను రచించిన మహాకవి యితడు. నాలుగు భాగములందుగల షాహనామ మహాకావ్యమున 23491 పద్యములు కలవు. ఈ కావ్యములోని మొదటి మూడు భాగములు ఫిరదౌసిషాహనామ కావ్యమునకు సన్నిహితమైన అనువాద రూపమున నున్నవి. నాల్గవ భాగ మధికముగా ఇస్లాం విజయములను వర్ణించు ఖిలాఫత్‌నామపై ఆధారపడినది. హజరత్ షేక్ హమ్జ మఖ్దూం శిష్యులగు మీర్ బాబా హైదర్, ఖాజామిదమ్, ఖాజాఇషాక్‌ఖారి, షేక్ అహమద్ భగ్గీ అనువారు రచించిన హిదాయతుల్‌మస్లిమీన్ - తజ్కిరతుల్ ముర్షదీన్, రాహతుల్ తాలిబీన్ సుల్తానీ అను కావ్యములను రచించిరి. సుల్తానీ అను కావ్య మీగ్రంథములకు మూడు భాగములందు కూర్చబడిన అనువాదము. వహాబ్ కవి రచించిన సుల్తానీ కావ్యమున 11753 పద్యములు కలవు. షేక్‌హమ్జముఖ్దూం శిష్యులు రచించిన గ్రంథము లన్నియు వారి గురువుగారి జీవిత చరిత్రకు సంబంధించినవి. మహమ్మద్ ప్రవక్త స్తుతి ప్రధానమగు కావ్యమున 336 పద్యములు కలవు. షాహనామాలోని నాల్గవ భాగమగు ఖిలాఫత్‌నామా అను కావ్యముకంటె భిన్నమైన అదే పేరుగల కావ్యమున మొదటి ఖలీఫానుండి సుల్తాన్ అబ్దుల్ హమీద్ వఱకుగల ఖిలాఫత్ వృత్తాంతము వర్ణింపబడినది. దేశమునకెంతయు నష్టము కలిగించిన ఏటివఱదలను గూర్చి వహాబ్ కవి సైలాబ్‌నామ అను మత్నవీని రచించెను. నాటి దుర్భరపరిస్థితుల నితివృత్తముగ స్వీకరించి ఈ కవిచేహూజునామ అను కావ్యమును కూడ రచించెను. కాని అది నేడలభ్యము. సమకాలికులగు యోగులు ఫకీర్లు, విజ్ఞులు మున్నగువారిని గూర్చి ఈ కవి కాశ్మీరి భాషలో నపూర్వమైన 'దెర్వేషి' అను మత్నవీని రచించెను. దీవానెవహాబులో నీకవి స్వయముగ రచించిన 6163 గజళ్ళు కలవు. ఇట్టి ప్రశస్త గ్రంథముల వలన వహాబ్ కవికిగల ఫిరదౌసి అను బిరుదము సార్థకమగుచున్నది.

దీవాన్ వహాబులోని 781 పద్యములందు 29 విధములైన అంత్యప్రాస లుపయోగింపబడినవి. ث, ج, خ, ژ, ش, ط, ظ, غ, ف, گ అను అక్షరములతో నంతమగు దుష్కరప్రాసలను గూర్చి ఈ కవి తనకుగల కవితాశక్తిని

పాండిత్యమును ప్రదర్శించెను. రజమియా, బజమియా, మథ్నవీలందు వస్తువున కను గుణమైన పద్యభేదముల నీకవి స్వీకరించెను. కోట్లు, ట్రౌజర్లు, స్త్రీల టోపీలు మున్నగునవి ప్రవేశించినవి. వేషధారణమునందును జీవన విధానమునందును నాటి సంఘమున కలిగిన మార్పుల నీకవి యథాతథముగ జిత్రించెను. మల్లయుద్ధములను సాముగరిడీలను, ఈ కవి రసవంతముగ వర్ణించెను. సోరాబు రుస్తుముల ద్వంద యుద్ధ వర్ణన యిది.

కదలుచున్న కుంతములతో క్షేత్రవలయంలో ప్రవేశిస్తారు వారు
ఒకరినొకరి ఎదురుకొంటారు వారు.
ఈటెలతో కర్కశ ఖడ్గాలతో పోరాడుతారు వారు,
కత్తులతో శరీరమాంసాన్ని చీల్చరు
దాహం రక్తంతో తీర్చుకొంటారు వారు,
యుద్ధానికి భీకరమైన నేత్రాలతో సిద్ధమై
ఒకరి శిరము నొకరు ఢీకొంటారు వారు;

ఈతని గజళ్ళయందు నాటి దుర్భరపరిస్థితులు సూచ్యప్రాయముగ వర్ణింప బడినవి. ఏటి వఱదల వలనను, దుష్పరిపాలనా విధానము వలనను ఏర్పడిన విధ్వంసక పరిస్థితుల నీకవి అధిక్షేపాత్మకముగ వర్ణించెను. ఈతని గీతములందును, గజళ్ళయందును నీతి బోధకాంశములు కాన్పించును. శృంగార గీతములలో నానం దోల్లాసగుణములు కన్పట్టును. ఈ కవి సరళమైన మధురమైన పద్యరచన జేయుట యందును సిద్ధహస్తుడు. యౌవనము నీ కవి యిట్లు వర్ణించెను.

"నిండు యౌవనంలో కొండలను
బంగారువలె భావింపజేసితివి
ఈ ముసలితనమున నవియె రాళ్ళురప్పలుగా గన్పడె.
నిన్నమొన్నటిదాక గిరినిర్ఝరి అది
దారిలోని గండశిలలను గెంటెను.
నీరసమై శుష్కమైన నదీమార్గము ధూళిమేఘముల చిమ్మునేడు."

ఈ కాలమునాటి మటియొక మథ్నవీకవి పీర్‌మహమ్మద్ మిస్కీన్ (మ. 1915) ఈకవి జేబానిగార్, లైలామజ్నూ, సోహినీ మహివాల్ హీర్‌రాంఝా, చందర్ బదన్ అను కావ్యములనే కాక అనేక గజళ్ళను కూడ రచించెను. దుఃఖనిరాశా భావ ప్రధానములైన ఈ గజళ్ళయందు ఆవేశము కాని, ప్రత్యేకత కాని లేదు. ఈ కవి రచించిన మథ్నవీలే ప్రశస్తములైనవి. ఈ యుగమునందు కాశ్మీర కవులదృష్టి కావ్యేతి వృత్తములకై పంజాబులోని సోహినీ మహివాల్, హీర్‌రాంఝా వంటి కావ్యములపై మరలుట గమనింపదగిన విశేషము. నాడు కాశ్మీరమునకు తదితర భారతదేశ రాష్ట్రములలో సన్నిహిత సాంస్కృతిక సంబంధము లేర్పడినట్లును, ఇతి వృత్తములకు ప్రబలాధారముగానుండిన పారశీక వాఙ్మయ ప్రాభవము సన్నగిలినట్లును ముందే వివరింపబడినది.

సైఫుద్దీన్ ఆరిజ్ 'నౌబహార్' అను ప్రణయకావ్యముతో పాటు కొన్ని గజళ్ళను కూడ రచించెను. పారశీక భాషలోగల 'బహరెదానిష్' శృంగార కావ్యమున కనువాద మైన నౌబహార్ 1889 ప్రాంతమున రచింపబడినట్లు తెలియుచున్నది.

ఆషిక్ తరాలి అనుపేర ప్రసిద్ధుడైన అలీగనాయి అనుకవి త్రాల్‌లోని గనాయి వంశీయుడు. ఇతడు పారశీకమున పండితుడు. పారశీక గ్రంథానువాదమగు ఇతని జొహ్రా-ఓ-బహరమ్ అను కావ్యము బహరెహజాజు ఫక్కీలో రచింపబడినది. నూర మాలీల సమకాలిక ప్రణయగాధ నితివృత్తముగ స్వీకరించి ఈ కవి ఒక మథ్నవీనికూడ రచించినట్లు తెలియుచున్నది. ఈ విధమైన మథ్నవీ ఇది ఒకటియే. హీమాల్ నోయిగిరాయ్ (Himal Noegyray) అకనందన్ (Akanandun) అను మథ్నవీల యితివృత్తము ప్రాచీన కాశ్మీర గాధలనుండి స్వీకరింపబడినది.

అమీరుద్దీన్ క్రీరి (మ. 1909 ప్రాంతము) సామనామ, భావర్‌నామ, జంగె అల్బమ్ అను వీరరస ప్రధానములగు మథ్నవీల రచయితగా ప్రసిద్ధుడు. ఇతడు మేరాజ్ అహమదీ - అన్వర్ మహమదీ, ఏజాజ్ సర్‌మదీలపై కావ్యములను కూడ రచించెను.

బాదిగాం వాసియగు అక్బర్‌భట్ (మ. 1912) సూఫీ సంప్రదాయము ననుసరించి గజళ్ళు రచించెను. ఈతడు హిందీ భాషయందును చక్కగా పద్యరచన చేయ సమర్థుడు.

నిన్ను నీవు గుర్తించు
నీ ఠాకుర్ (గురువు) ను మేల్కొలుపు.

మకర్ జన్, వ్యదర్ నామ, సేల్ గాహ కావ్యముల రచయితగా నీ కవి ప్రసిద్ధుడు. లోయలందును, యోగుల ఆశ్రమములందును, పయనించి తన యాత్రానుభవముల నీ కవి సేల్ గాహ అను పద్య కావ్యమున వర్ణించెను. ఈతని "నౌకాంగన" అను పద్యము వలన నాడు కవులు నూతన వస్తువును గూర్చి ఆలోచించుచుండిరని స్పష్టమగు చున్నది.

నూతన సాంఘిక చైతన్యరేఖలు అబ్దుల్ గఫార్ ఫారిజీ (మ. 1925) ముసద్దీస్‌హాలీ ఉర్దూ గ్రంథానువాదమున గాన్పించును. ఈతడు యూసఫ్ జులైఖా అను ప్రణయ గాథాకావ్యమును, ఒలనామా వంటి ఎన్నియో అధిక్షేప కావ్యములను వివిధనీతులను, సమకాలిక సాంఘిక దురాచారముల ఖండించు పద్యములను, నీతి పద్యములను రచించెను.

పీర్ అజీజుల్లా హఖాని (1854 - 1929) సుప్రసిద్ధ మథ్నవీకవి. వీరి వంశీయులు అరబీ పారశీక పండితులుగను భక్తిపరులుగను వాసి గాంచియుండిరి. ఈ కవి లాహోరు, పంజాబు, ఢిల్లీ, సూరత్, బొంబాయి, పెషావర్ సరిహద్దు రాష్ట్రములు మున్నగు ప్రాంతములందు సంచరించి అచట దేవాలయములను, యోగులను సందర్శించెను. ఈతనికి బాల్యము నుండి సంగీతమునం దభిరుచి మెండు. ప్రాచీన కాశ్మీర సంగీతము నందు (సూఫీ సంప్రదాయోపదేశము) ఈ కవికి అత్యంతాసక్తి కలదు. ఈ కవి సూఫీ సంప్రదాయములను పాటించి ప్రణయ కావ్యములను కూడ రచించెను. జహన్ - దార్ షా, బహరావర్ చానూల ప్రణయమును ''జౌహరె ఇషక్'' అను కావ్యమునందు చిత్రించెను. ఖిస్సయె ముంతాజ్ - ఉ - బేనజీర్; గుల్దస్తయె బెనజీర్; (బదర్ మునీరుల ప్రణయగాథ) గుల్బనె ఇష్ఫ్, చంద్రబుదన్ మథ్నవీ; మహరూయె గులందామ్ అను శృంగార కావ్యములతోపాటు జంగెఇరాఫ్, రోజతుల్ షహదా, ఖిస్సయెదుష్నన్ అను మథ్నవీలను కూడ రచించెను. ఈ కవి పారశీకమునందు తారీఖె ఆలమ్ అను గ్రంథమును నాలుగు భాగములందు రచించెను. ఇందు ఆదమ్ మొదలు కొని మహమ్మద్ ప్రవక్త వఱకుగల వృత్తాంతమును, సుల్తానుల చరిత్రమును, భారత కాశ్మీరదేశ వృత్తాంతము నీ వివిధ భాగములందు వర్ణించెను.

హబ్బాని బహుగ్రంథకర్త. ఈ కవి శృంగార, తత్త్వ ప్రధానములగు ఎన్నియో గజళ్ళను రచించెను. ఇతడు రచించిన ప్రాస్తావిక పద్యములు కూడ పెక్కు కలవు. సైలాబ్‌నామ (వఱదల గాథ), ఆతిష్‌నామ (అగ్నికథనము) బహార్‌నామ, దెరవేష్ నామ, షహరెఆషోబ్ మున్నగు పద్యములను రచించెను. నిజ యాత్రానుభవములనే కవి పారశీకమున రచించి ప్రసిద్ధుడైనట్లు తెలియుచున్నది.

ఈతని మత్నవీలలో పారశీక శైలి అనుకరణములు వాక్యనిర్మాణ పద్ధతు లత్యధికముగ గన్పట్టినను, సహజమును ధారాళమునునైన శైలి హృద్యముగా నున్నది. ఈ కవి పారశీకమున పండితుడు, కొన్ని పద్యములలో మచ్చున కొక కాశ్మీరి భాషా పదమైనను లభింపదు. సమకాలిక సాంఘిక పరిస్థితులను చిత్రించిన ప్రాస్తావిక పద్యము లందు అధిక్షేపధోరణి ప్రస్ఫుటముగా గన్పట్టును. ఈతని గజళ్ళు ప్రాచీన సంప్ర దాయము ననుసరించియే రచింపబడినవి. సూఫీధోరణిలో వ్రాసిన సందర్భములందు మాత్రము కొంత ప్రత్యేకత కన్పట్టును.

గత శతాబ్ద్యంతమునను, ఈ శతాబ్దారంభమునను కాశ్మీరి ప్రజలు దుర్భరస్థితిలో నుండిరి. మధ్యమధ్య వఱదలు, కాటకములు, అంటువ్యాధులు, అంతఃకలహములు మున్నగువానితో నాటి పరిస్థితులు కాశ్మీర ప్రజలను క్రుంగదీయుచుండెను. ఈ పరిస్థితులు వారి మనోవృత్తిని భావములను వికల మొనర్చెను. కాశ్మీరులు తమకుగలిగిన దుస్థితికి నివారణోపాయములు తోచక తమ బాధలనుజూచి నవ్వుటకు నేర్చిరి. ఆ నవ్వేవారి విధి నెదుర్కొనుటకు కవచమైనది. ప్రజ్ఞావంతులగు కొందఱు కవులు (లడీషా ప్రభృతులు) వికారహాస్య, అధిక్షేపప్రధానములైన పాటలలో ప్రకృతి బాధలకు గుఱి యైన ప్రజల స్థితిగతులను వర్ణించిరి. నూత్న జీవనపరిస్థితుల ననుసరిం పరిహాస పూర్వకములైన పరిష్కార మార్గములను గూర్చియు. హాస్యప్రధానములగు పద్యము లను వారు రచించిరి.

ముల్లా హబీబుల్లా హకీమ్ రచించిన గజళ్ళు కొన్ని ఆహ్లాద జనకములయ్యు సభ్యతా విదూరమగు హాస్యప్రధానములైనవి సైలాబ్‌నామ (వఱదల గూర్చిన హాస్య రచన)ను సాహిత్యదృష్టితో బరిశీలించినచో సంస్కరణాత్మకమైన ఆగ్రహము ప్రదర్శింపని హాస్యప్రధాన కావ్యరచన కదియే ప్రయత్నమని తోచును. వనవృక్ష కోటికిని, కుక్కగొడుగులకును అధిపతి "అనుభగత్ప్రార్థనతో నారంభమగు గజలు కూడ ఇట్టిదే. మునవర్‌షా అనుకవి గిలిగిత్ బేగార్ (వెట్టిపని) ని గూర్చి బృహత్కా వ్యమును రచించెను.

"మాధుర్య పర్వతాధిరోహణము కష్టకార్యమె యగు
అది మధురమని అన్నవాని దుంప తెగు గాక !

సర్ ఆరెల్ స్టీవెన్‌గారి హాతిమ్ టేల్స్ ననుసరించి సాబిర్‌తిలావని 'యార్ కంద్ అనన్ జెనన్' (మేము యార్‌కంద్‌ను జయించెదము) అను పేరుగల హాస్యప్రధాన కావ్యమును రచించెను. మధ్య ఆసియాలో గల యార్‌కంద్‌ను జయించుటకు కాశ్మీర వాసులొనర్చు ప్రయత్నములీ కావ్యమున చమత్కార పూర్వకముగ వర్ణింపబడినవి. కుమ్మరి, మాదిగ, పాకీవారు, స్త్రీపురుషులు, బాలంతలు మున్నగువారిని చేర్చుకొనుట, కోళ్ళను మాత్రమే ఒసగునట్టి గ్రామ గ్రామములనుండి అశ్వములను సేకరించుట, ఆ అశ్వముల తలలందు తోలువాలు (జీనిలోనుండి తోకకు తగిలించెడు దుమిచి) ను తోకలందు కళ్ళెములను అమర్చుట, గడ్డితో జేయబడిన ధృఢమైన జీనులు గూర్చుట మున్నగునవి వారి జైత్రయాత్రా సన్నాహములు. లారీషా పాటలలోని ఉదాహరణము లివి.

(1) విషవనది వఱదలను గూర్చి చెప్పిన పద్యము :—

వెట్టిగా త్రొట్టుపాటుతో పందు ముదుసలి యొకతె ఇట్లనె.
ఎంత కష్టమిది ? ఎంత కష్టమిది
నాటోపి ఎక్కడుంది ?

ఓ అవ్వా ! ఓ ముసలవ్వా విషవనది ఉప్పొంగింది
నీటోపి నది వఱదిలో కొట్టుకొని పోయింది.

(2) భూకంపమును గూర్చిన పద్యమిది :—

కులుకుచు గంతులేయుచు భూకంపము వచ్చెను
పల్లెలు పట్టణాలు కోలాహలంలో కలిసెను
కాళ్ళను కదలించిరి, అంగములను సాచిరి
నృత్యంచేస్తూ ఆనందంలో పునాదులపై నిలిచిరి.

(3) సర్‌వాల్టర్ లారెన్సు భూసంస్కరణలు ప్రవేశపెట్టినపుడు హాస్యకవి చెప్పిన పద్య మిట్లారంభమగును.

పట్వారీ వచించెను ప్రియాంగనతో నిట్లు
ఇది వఱకున్నట్లే నీ విపుడుండ లేవని.

ఒక్క నాజిమ్ రచించిన కావ్యములు తప్ప మహమూద్‌గామి పద్యమునకు హాస్యానుకరణ పద్యముల పంటవియు, నిట్టి పద్యములును కావ్యములును అంతకు పూర్వము వెలువడలేదు.

ఈ యుగమునాటి లీలాకవులలో విష్ణుకౌల్ (మ. 1910) అను కవి ముఖ్యుడు. ఇతని అసలు పేరు బిషాంబర్‌నాథ్. ఇతడు పల్లెటూరి పాఠశాలలో నుపాధ్యాయుడుగ బనిచేసెను. అరబీ పారశీకములందును, సంస్కృతమునందును పండితుడు. పారశీకములో నితడు 'దీవాన్ అనాదిల్' అను కావ్యమును రచించెను. కాశ్మీరిభాషలో నీకవి లీలాగీతములను (భగవన్నుతి ప్రధానములగు స్తోత్రములు) రచించెను. వాల్మీకి రామాయణమును విష్ణుప్రతాప రామాయణ మను పేర మహారాజా ప్రతాపసింగున కంకితముగ ననువదించెను. ఈ అనువాదమున 30 వేల పద్యములు కలవు. అవి సంస్కృత పదములదో పూర్ణమైనవి.

హంగల్‌గుండ్ వాసియు ప్రసిద్ధయోగియునగు మీర్జాకక్ శ్లుకు (శ్లోకము) లను తత్త్వప్రధానముగ రచించెను.

కృష్ణరాజదాన్ అను కవి (1850-1925) ప్రముఖ కాశ్మీరి కవులలో నొకడు. ఇతడు శివపరిణయ మను కావ్యమునే కాక అసంఖ్యాకములగు లీలాగీతములను, భక్తి ప్రధానమైన స్తోత్రములను రచించెను. కృష్ణరాజదాన్ శైలి సరళమైనది. ఇతని రూపకములు అలంకారములు నిత్యజీవితమునకు సన్నిహితములైనవి. శివపరిణయములోని పురాణదంపతుల వివాహవర్ణనలు కాశ్మీరమునగల లౌకిక వివాహ పద్ధతుల ననుసరించినవి. అవి పెండ్లి పాటల ధోరణిలో రచింపబడినవి.

ఇతర మష్నవీ కవులకంటె భిన్నమైన శైలి నీతడు పాటించినను అది సంస్కృత భూయిష్ఠముగ లేదు. మష్నవీ కవులు సాధారణముగ కాశ్మీర సంప్రదాయములకు భిన్నమైన పారశీకశైలి అనుకరణ ప్రధానమైన రేఖ్తాశైలిలో రచనలు గావించిరి. శుద్ధదేశీయమైన రచనావిధానమును శైలిననుసరించి కావ్యరచన మొనర్చిన కాశ్మీరి కవులు కొందఱు మాత్రమే కలరు. కృష్ణరాజదాన్ శైలి మాత్రము సరళ

మైనది. పదముల నేరి యేరి చక్కగా ప్రయోగించుటలో నీతనికి సాటియగువారులేరు. అతడుపయోగించిన పదము లన్నియు సంపర్చసహితములై ఔచిత్య శోభితములై యుండును. ఈతని గీతములందుగల నృత్యలయములు తేలికగను, సరళములుగను నుండును. భావముల వ్యక్తీకరించు విధానము ప్రశంసార్హము.

నిమ్నమార్గముల ప్రవహించు
గిరినిర్ఝరి గర్జించు భీకరముగను
గంభీర వారిధి దరిజేరి నంతనె
ఆ గర్జనలన్నియు నిశ్శబ్దాకృతి వహించు.

ఈతని భక్తిప్రధానములగు పద్యములలో ఉల్లాస పారవశ్య గుణములు కాన్పించును. బాహ్యమైన సన్యాసవిధానమునందు కాని పారలౌకిక విధానమునందుకాని ఈతనికి విశ్వాసము శూన్యము.

ఇటొక పిలుపు అటొక పిలుపు
రాధాకృష్ణుడంతట నుండును
అందరితో చేతులు కలిపియుండు.

— —

జగము నెందుకు వీడాలి
మన హృదయములలో ప్రేమజ్యోతి కలదు.
మన నందలోలుని గూర్చి
అదియె తపము - యోగాభ్యాసమదియె.

# 9

# నవీన సాహిత్య యుగము

1925 లో కృష్ణరాజదాన్ కవియు 1929 లో అజీజుల్లా హుఖ్ఖానియు మరణించుటతో సుప్రసిద్ధమైన మథ్నవీయుగ మంతమొంది నవీన సాహిత్య యుగ మావిర్భవించినది. 1925 సంవత్సరము కాశ్మీరదేశపు రాజకీయ సాంఘిక చరిత్రలో పొలిమేర

వంటిది. ఈ సంవత్సరమునందే మహారాజా ప్రతాపసింగ్ మరణముతో జమీందారీ రాజ్యపద్ధతి కూడ అంతమైనది. పరిపాలనా యంత్రాంగమునం దాధునిక పద్ధతు లనుస రింపబడిన ఈ పద్ధతి అకస్మాత్తుగ అంతమైనదని చెప్పలేము. కాని ఈ పద్ధతి అఖిల జనాంగీకారము నొందలేదు. ప్రజలలో నట్టి పరిపాలనా విధానముపట్ల అసంతృప్తి ఏర్పడుచుండెను. ఈ అసంతృప్తి నాటి సాహిత్యమునందును స్పష్టముగ గోచరించినది. ఆధునికయుగమును (1925-1947) మహజూర్ యుగ మని వ్యవహరింపవచ్చును. పుల్వా మతహశీలులోని రోముషనదీ తీరస్థమగు మత్రిగామ్ అను గ్రామమున 1885 సంవత్సరములో నొక మహమ్మదీయ పీర్ వంశమున గులామ్ అహమదు మహజూర్ జన్మించెను. ఇతడు ట్రాల్‌లో మౌల్వీ అలీగనాయి అషఖ్ నిర్వహించు పారశీక పాఠశాలయందును, శ్రీనగర్‌లో నస్రతుల్ ఇస్లాం పాఠశాలయందును విద్యాభ్యాసమొనర్చి చిఱుతప్రాయమునందే పారశీకమునందు కవితా రచన మొనర్చెను. పారశీక భాషాప్రాభవము సన్నగిలి ఉర్దూ భాషకు ప్రాధాన్య మేర్పడుచున్నందున మహజూర్ ఉర్దూ యందే రచన లొనర్చుటకు బూనుకొనెను. 1926 లో అదృష్ట వశమున నొకానొక గ్రామమున పల్లెటూరి సొగసుకత్తెలు పాడిన బృందగాన మును విని ప్రోత్సాహమునొంది కాశ్మీరి భాషలో రచనలొనర్చుట కుద్యమించెను. ఇతని తొలిపాట యగు "ఖోషేమతిజానానొ" బహుజన ప్రియమైనది. మహజూర్ కవి తన రచనల వలన ప్రశస్తినొంది తన మరణకాలము వఱకును (9 April 1952) కాశ్మీరి భాషలో మాత్రమే రచనలొనర్చి నూతన సాహిత్యయుగమునకు ప్రతినిధి యయ్యెను.

మహజూర్ రచించిన తొలిపాటలందు లోషన్‌మీర్ ప్రభావము కన్పట్టుచున్నది. కాని ఇతని పాటలు సరళ మధురశైలిలో రచింపబడినవి. పారశీక భాషలకు ప్రాధా న్యము తగ్గి ఉర్దూ ఆంగ్లభాషా ప్రాభవము హెచ్చి, సృజనాత్మక శక్తి క్షీణదశనొందిన కాలమున పందొమ్మిదవ శతాబ్ది చివర కాశ్మీరి పాటల కాదరణము కలిగించిన మహజూర్ కవికి మనమెంతయు ఋణపడియున్నాము. కాశ్మీరి భాషలోని మాధురి నాతడు గుర్తించి మత్నవీకవుల కృతకమైన శైలినుండి భాష నుద్ధరించెను. ఈ కవి తన గీతములందును గజళ్ళయందును క్రొత్త ఊపిరిపోసి నూత్న భావముల రుచి జూపి యుగధర్మములకు నిజమైన ప్రతినిధియయ్యెను. 'నా యౌవనము', 'పల్లెటూరి కన్నె' అను పద్యములిందుల కుదాహరణములు. 'పల్లెటూరి కన్నె'లో నాతడు తన కాలమునాటి కన్నెల రూపవిలాసములను మాత్రమే కాంచెను. ప్రాచీనగాథలలో స్త్రీలను

వారి ప్రణయమును మాత్రమే ఇతనికి పూర్వులు చిత్రించియుండిరి. వారి దృష్టిలో స్త్రీ స్వర్గలోక హిమాల్ - కాఫ్ నుండి యేతెంచిన అప్సర. సారాయి యొక్క పరాకాష్ఠ —

కొజ్జా స్త్రీలు నీకు సాటియగుదురా ?
నీవు పూలలో స్వేచ్ఛగా విహరింతువు
కొజ్జాస్త్రీలు యిండ్లయందే బందీలై యుందురు.

భారత దేశము సుషుప్తి నుండి మేల్కొనుచున్న కాలమది. 1931 తరువాత కాశ్మీరములో కూడ ఎన్నియో మార్పులు వచ్చినవి. మహజూర్ తత్ప్రభావమునకు లోనై హృదయమును కవ్వించు ఆవేశపూరితములైన పద్యములను రచించి దేశ ప్రజలను దాస్యబంధములనుండి ముక్తినొందుటకు ప్రబోధించెను.

ఉరుములు, గాలివాన, తుఫాను, భూకంపము
ఎన్నైనను వచ్చుగాక !
గులాబీల ప్రదేశమును నీవు మేల్కొల్ప నెంచితే
ఢంకాలతో క్రీడించుట మాను.

స్వాతంత్ర్యా నంతరము ప్రతిరంగమునం దేర్పడిన నిరాశ అసంతృప్తిని మహజూర్ కవి గ్రహించెను. అంత్యదశలో రచించిన పద్యములందు హాస్యగుణము క్షీణదశ నొందినదని చెప్పవచ్చును.

స్వాతంత్ర్యం వచ్చినందుకు కృతజ్ఞత ప్రకటిద్దాం
అది నిజంగా స్వర్గలోక సుందరి
అందరితో చిల్లరగా ఆమె తిరుగకపోవచ్చు
అందుకే ఆమె తనకు నచ్చిన వారితోనె
కొందరి సౌధాల్లో విహరించుచు సరసమాడును.

మహజూర్‌కంటె వయసులో చిన్నవాడును, అతనికి సమకాలికుడునునగు అహమద్ అజీజ్ శ్రీనగరమునకు పదుమూడు మైళ్ళ దూరమునగల రాంగర్ అను గ్రామవాసి. ఇతడు 1903 లో జన్మించి 45 వ ఏట (1948 లో) మరణించెను, పండిత

వంశీయుడగు ఈ కవి పదునాఱవయేట పల్లెటూరి పాఠశాలలో నుపాధ్యాయుడుగ బనిచేసెను. సంప్రదాయానుసారముగ తత్త్వ ప్రధానములగు గజళ్ళు రచించుటకు తొలి దశలో యత్నించి శృంగార ప్రధానములగు గజళ్ళ రచనకు పూనుకొనెను. అచిర కాలముననే నాటి రాడికల్ సోషలిస్టు సిద్ధాంతముల ప్రభావమునకు గుఱియై అభ్యుదయ రచనలలో తనకుగల అభిప్రాయములను ధైర్యముతో ప్రకటించెను. పరంపరగా వచ్చిన పాండిత్య ప్రాభవము గలవాడైన ఆజాద్ కవి మూడు భాగములలో కాశ్మీరి భాషా వాఙ్మయముల చరిత్రను రచించెను. నిస్సారములగు సాంఘిక రాజకీయ సాహిత్య సంప్రదాయములపై నతని కభిమానము లేకుండెను. జాతివర్ణ భేదముల కతీతమైన విశాలదృష్టియు సంపూర్ణమైన విప్లవము నందాసక్తియు నతని కేర్పడినవి.

ధన యౌవన సౌందర్యము లేవి నిల్చునవి కావు
మానవుని అమూల్యమైన నిధి ప్రేమించు హృదయమె.

.... ....

నీ దేవుడు గుళ్ళు-మసీదులు-ధర్మశాలలో నుండువాడు
ఐక్యత-ప్రేమ-సౌభ్రాత్రముల దేవుడె నాదేవుడు.

.... ....

అమాయకుల మోసగించి ఆకలితో నున్నవారిని దోచి
ధనికులు ధన భాగ్యములతో తైతెక్కలాడుచున్నారు
తుఫాను చెలరేగి విప్లవమచిరకాలమున రానున్నది, క్రూరులదండించును
అణచి వేయబడినవారే నిర్దోషులని నిరూపించును
వేసవి రానిండు నీవె చూతువు-హిమనిర్మిత సౌధము లొక్కసారి
కరగి కూలిపోవును
నీ నామమాత్రపు మిత్రులు తెలివిగల మాంత్రికులు
పందెములు గెలిచెదరు వారు, మీకేమొ
కాబోలు-ప్రతిమా గృహములు చూపుదురు.

ఆజాద్ రచించిన "దరయా'' (నది) పాంచాదర్ (జలపాతము) షిక్వాయె ఇబ్లీస్ - అనునవి క్రొత్త దనముగల రచనలు - అవి గజళ్ళకంటె పెద్దవియైన నజములు. ఇవి వస్త్వైక్యము గలవియై విప్లవభావ ప్రధానములైనవి. దరిద్రులను పిల్చి

పిప్పిచేయు ధనికులు కలదియు, దైన్యదాస్యములతో పూర్ణమైనదియు, ప్రణయము, సౌందర్యము, ఊహాప్రపంచము అనువానిచేత వంచన యొనర్చు కవితయుగల ప్రపంచమును సృష్టించిన భగవంతుని వివేకము నీ కవి "షిక్వాయె ఇబ్లీస్" అను కావ్యమున విమర్శించెను.

హాజీఅల్యాస్ (1881-1938) ఛాత్రిర్ లోని ఋషివంశీయుడు. ఈ కవి వంశీయులు అరబీ పారశీకములందు పండితులు. హాజీఅల్యాస్ కూడ పారశీకమునందు పాండిత్యమును సంపాదించెను. యువకుడుగా నున్నపు డీ కవి "ఖిస్సయె ముంతాజు-ఉ-బేనజీర్" అను అయిదాశ్వాసముల మస్నవీ కావ్యమును బహరెహజాజు ఛందములో రచించెను. తదనంతరమాతడు మహమ్మద్ ప్రవక్తను గూర్చియు ఇస్లాం సిద్ధుల గూర్చియు స్తోత్రములేకాక నిండు యౌవనములో దివంగతుడైన తన పుత్రుని గూర్చి యొక వియోగ కావ్యమును కూడ రచించెను. అంతియకాక అల్లాస్ కవి "ఖింజర్ ఇష్ఖ్" అను కావ్యములోని ఒక భాగమును బహరెరమల్ ఛందమునందును, రెండవ భాగమును బహరెహజాజు ఫక్కిలోను రచించెను. ఇతని గజళ్ళు-హాస్యప్రధానములగు పద్యములు మఱి కొన్ని కలవు. ఆ కాలమునాటి నూత్నమార్గముల ప్రభావ మాతనిలో కాన్పించదు. స్వభావము ననుసరించి ఈ కవి పూర్వ యుగమునకు జెందును. ఈతని గజళ్ళయందు కృతకమైన శైలియు, పూర్వయుగములో గన్పట్టు జుగుప్సాకరములును, అసహజములునగు వర్ణనలు కన్పట్టును.

పూర్వ సంప్రదాయాను యాయులగు కవు లీ యుగమున కొందఱు కలరు. దెర్వేష్ అబ్దుల్ ఖాదిర్ (మ. 1946) ఖిస్సయె యూసఫ్ జులైఖా అను కావ్యమును, మహమ్మద్ ప్రవక్త-ఇస్లాం సిద్ధులను గూర్చిన స్తోత్రములతోపాటు పారశీకమున హాజరుల్ ముహిబీన్ అను గ్రంథమునుకూడ రచించెను. ఇతని పారశీక పాండిత్యము పద్యములలో కవితాగంధము తగ్గించినది. కృతక పాండిత్య స్ఫోరకములగు పద్యములకు కృతకశైలి అలవడినది.

మహమ్మద్ ఇస్మాయిల్ నామి (మ. 1934) ఖిస్సయె షీరిన్‌ఖుసరో, మగజి-ఉల్‌నబి అను కావ్యములను, సఫర్‌నామయెతిబత్" అను యాత్రానుభవ గ్రంథమును కొన్ని స్తోత్రములను రచించెను. అతిసూక్ష్మములైన భావములను వ్యక్తీకరించుటకు కాశ్మీరి భాషకు శక్తి లేదని యితని అభిప్రాయము. పారశీక పాండిత్య మధికముగ కలవాడగుటచే తత్ప్రభావమున ఈ కవి యిట్టి అభిప్రాయములను వ్యక్తీకరించెనని

తోచును. కాశ్మీరి భాషలో నితడు రచించిన పద్యములలో పారశీక ప్రభావమే మిక్కుటముగ గన్పట్టును.

సత్‌రామ్‌భట్ (మ. 1934); ఆనందరామ్ (మ. 1939) అనువారు ప్రాచీన సంప్రదాయము ననుసరించి సూఫీ గజళ్ళను రచించిరి. ఇస్లాం మత ప్రవక్త మహమ్మద్‌ను గూర్చి రచించిన స్తోత్రముల వలన వీరికి మత సిద్ధాంతముల యెడగల గౌరవ విశ్వాసములు, విశాలదృష్టి, నాటి మత సామరస్య దృష్టి వ్యక్తమగుచున్నది.

శ్రీనగరములోని మొహల్లా పాందాన్ వాసియగు షంసుద్దీన్ హైరత్ (జ. 1887) పారశీక, కాశ్మీర భాషలందనేక గ్రంథములను రచించెను. ఇతని కాశ్మీరి పద్యములకంటె పారశీక పద్యములే మెఱుగైనవి. కాశ్మీరి భాషలో నితడు గజళ్ళ గీతములేకాక "రనావజేబా" అను మథ్నవీని కూడ రచించెను. ఈ శృంగార కావ్యము "షంస్‌ఖహఖహ" అను పారశీక వచన గ్రంథమున కనువాదము. సంకలన గ్రంథము లందే ఈ మథ్నవీ నిలువ జాలునట్టిది. కాశ్మీరిలో నితడు రచించిన పద్యములు కొన్ని మాత్రమే ప్రత్యేకత గలవి. సంగీత ప్రధానములగు పాటలు హైరత్ కవితా శక్తిని నిరూపించుచున్నవి. కాశ్మీరిలోల గీతములలోని సౌకుమార్యము. సంగీత మాధురిని మరల తమ గీతములందు చక్కగా జూపిన కవులలో హైరత్ కవి ప్రముఖుడు. ఈతడు సంగీత ప్రియుడేకాక కాశ్మీర ప్రాచీన సంగీత (సూఫియానకలామ్)మునం దభిజ్ఞుడు. కాశ్మీరి గీతములలో రెండు మూడు పద్యములు మాత్రమే యుండును. భావ వైకల్యమీ గీతములందు గన్పట్టదు.

పండిత దయారాం గంజూతా రచించిన నీతిపద్యములందు మానవులున్నత నైతిక జీవన విధానముల ననుసరింప వలయుననియు, కూపస్థమండూకములవలె నుండక లౌకిక జ్ఞానసంపన్నులు కావలయుననియు బోధించెను. ఈతని పద్యధార ధారాళమైనది. శైలియు సరళమైనది. ఈతని రచనలందు పారశీక పదములంతగా కన్పట్టవు. పారశీక పద్యముల నలవోకగా రచింపజాలు దయారామ్ కవి యిట్లు రచించుట ఆశ్చర్యము కలిగించును.

మొహిఉద్దీన్ సంప్రదాయ బద్ధమైన ఫక్కిలో గజళ్ళ రచించినను అతి నూత్నములై భావౌన్నత్యమును కలిగి యున్నవి. ఈ గజళ్ళ శృంగార రసాత్మకములై సూఫీ సంబంధమైన నిగూఢతత్త్వ ప్రతిపాదకములుగ నున్నవి. ప్రాతవడిన చప్పని ఊహలు, భావములు అందు కన్పట్టవు.

ఈ యుగములో సంప్రదాయ బద్ధులుకాని ఆధునిక కవులు నూత్నవస్తుక కావ్యములను రచించిరి. వీరందఱును దాదాపు యువకవులే. భారత దేశము నందలి సాంఘిక రాజకీయోద్యమముల ప్రభావ మీ యువకవులపై ప్రస్ఫుటముగ గన్పట్టు చున్నది. గులామ్ హసన్‌బేగ్ ఆరిఫ్ ''కాశ్మీర కళాకారుడు'' అను పద్యములందు కాశ్మీర కళాకారులను ధనికులు దోచుకొనిన విధానమును విమర్శించెను. ఈ కవి దేశ భక్తి ప్రబోధాత్మకములైన పద్యములనుకూడ రచించెను. ఇటీవల ఈ కవి "రుబాయి" (నాలుగు చరణముల పద్యము)లను రచించుటకు బూనుకొనెను. ఇట్టి పద్యములను పటిష్ఠముగా రచించుటలో నితడే ఆద్యు డనవచ్చును. ఈతడు రచించిన రుబాయిలు కాశ్మీరి సాహిత్యమున కలంకార ప్రాయములు.

"ధనికులను, జమీందార్లను, దోపిడిగాండ్రను
"రేపు శిక్షింతు" నన్నట్లు వింటిని
కాని నేటి సంగతేమి ? తీర్పుదినమని అది దరిద్రుని నలిపివేయు
నీ న్యాయము రేపు చూపిన, వాని కేమిలాభము."

గులామ్ అహమద్‌ఫాజల్ నందలాల్ అంబార్‌దాల్ అను ఆధునిక కవులు నూత్న వస్తువును స్వీకరించి నజములు గజళ్ళు రచించిరి. ఫాజిల్ రచించిన క్రాలకూరు (కుమ్మరివాని కూతురు), అంబార్‌దార్ రచించిన వోషనూల్ (బంగారు వర్ణముగల పక్షి) అను పద్యములందు వర్ణనా నైపుణి, భావనైశిత్యము అను గుణములు కన్పట్టును. పారశీక శైలి అనుకరణము లిందులేవు.

మాస్టర్‌జీ అనుపేర సుప్రసిద్ధుడైన జిందాకౌల్ అను కవి ఈ యుగకవులలో ప్రముఖుడు. 1940 వఱకు నీ కవి హిందీ పారశీక భాషలందు ప్రాస్తావిక పద్యములను మాత్రమే రచించెను. కాశ్మీరి భాషలో నితని రచనలన్నియు 1942-1950 మధ్య కాలమున వెలువడినవి. ఇవి అన్నియు 'సుమ్రన్' అను గ్రంథము రూపమున ప్రక టింపబడినవి. ఈ గ్రంథ మాధారముగ జిందాకౌలు కవితాశక్తి యెట్టిదో పరిశీలింప వలసియున్నది. 1956 లో నీ గ్రంథమునకు సాహిత్య అకాడమీ బహుమతి లభించినది. ఈతని కవిత్వములో నితని పూర్వులందును సమకాలికులందును లేని నూత్నరీతులు గన్పట్టును. ప్రాచీనార్వాచీన నిగూఢతత్త్వకవులలో నీకవి విశిష్టుడు. సంఘమున కొక నాడు నైతికముగా బలమును చేకూర్చి సాంఘిక మతవ్యవస్థకు పునాదిగా నిలచిన

ఆలోచనావిధానమున కీలడు విముఖుడు. అధిక్షేప ధోరణిలో రచింపబడిన 'నేటివిజ్ఞత' అను పద్యములలో జిందాకౌలు కవి ప్రాచీనాధునిక విజ్ఞతల తారతమ్యమును బరిశీలించెను. నేడు విజ్ఞులదృష్టిలో విశ్వము అణుపరమాణువుల అగాధమైన సముద్రము. అందు చలనము పోరాటము అనునవి ప్రాణతుల్యములు, నిర్వ్యాపారత, చలనములేమి అనునవి మృత్యుతుల్యములు జీవితమున నిరంతర సంఘర్షణము ముఖ్యాంగము సంఘర్షణ మొనర్చి చంపలేనివారు తమ్ము తామే చంపుకొనవలయును. దుఃఖము, మరణము, పాపము అనునవి కలవు. మనమెంత దీర్ఘముగను, నిశితముగను విచారించిన లాభమేమి?

క్రీస్తు 'ఆకలితో చచ్చిన వారికి
స్వర్గవాస' మని మాట ఇచ్చెనట
అది నిజముగా మంచిచోటని వారనుకొందురు.
కాని అది ఉన్నదా అని నా సందేహం.

నిర్బంధ పరిస్థితులలో సంకెళ్ళువేసి బలాత్కారముగ మనలనుంచి మనము విధిగా నేమి చేయవలెనని నిందించుట న్యాయమా అని అతడు ప్రశ్నించెను.

అతని కాతని అంతఃకరణమే ప్రమాణము. తెఱతొలగి పోయినది సత్యమే. కాని అది ఎపుడో ఒకసారి జరుగును, జ్యోతివిద్యుల్లతవలె క్షణకాలము ప్రకాశించును. చూచినవారు పలుక లేకుండుటయు, పలికెడువారు నిజముగా చూడలేదనుటయు తథ్యము.

జనులడిగెదరు "అతనికి హృదయముకలదా? అతని నేల పృచ్ఛింప"అని
తమ ఊపిరిని గాలివలె వ్యర్థము చేయనేల
హృదయము సమాధానమిస్తుంది "ఇతరులన్న దానినేల సరకుచేయ"
నే నున్నానని నీవేల మఱతువు.

ఈ పద్యమునందలి భావము నిగూఢమైనది. కాని జిందాకౌలు కవితలో నిరంతర జిజ్ఞాస, సందేహ తత్త్వాన్వేషణ అనునవి ప్రస్ఫుటముగా గోచరించును. నిగూఢమైన తత్త్వము, తదితర పద్యములందులేని సత్యాన్వేషణ నిరతి ఇందు కలవు. పరమాత్మని గూర్చి మానవునకుగల ఔత్సుక్యము, భగవంతునకు నరునిగూర్చి కల ఉత్కంఠను కవి ఈ పద్యములందు రమ్యముగా జిత్రించెను. కుమార్గము లనుసరించి జీవితములో

నెన్నియో తప్పులొనర్చిన మనము భగవంతు నెదుట యెట్లు నిలువగలమని అతడు ప్రశ్నించెను.

అతనికి విముఖులమై దూరముగానుండ
ఈ సాకులు పనికిరావు
మన మాతనికి విముఖులమైతె
అతడు మనలను వదలునా ?

ఇతని భావము లతి సుకుమారములు; ఆలోచనాత్మకగుణము, నిశ్చలమైన భక్తి అనునవి అతని కవితకలంకారములు.

జిందాకౌల్ కాశ్మీరీ కవిత్వమున నూత్న ప్రాసరీతులను, ఛందములను ప్రవేశ పెట్టెను. అందుకొన్ని క్రమబద్ధములైనవి. మఱికొన్ని తద్భిన్నములైనవి. ప్రాచీనాను కరణములతో సతమతమగుచున్న కాశ్మీరి కవిత కాతడు జీవముపోసెను.

# 10

# అత్యాధునిక యుగము

అక్టోబరు 1947 లో పాకిస్తాన్ ప్రోద్బలమున జరిగిన దాడులతో కాశ్మీరి సాహిత్య చరిత్రలో నూత్నాధ్యాయ మారంభమైనది. దీనినే ఆధునిక యుగముగ స్వీకరింపవచ్చును. ఈ యుగమున నేలయీనినట్లు కవులు బయలుదేరిరి. నాటికే కవితా రంగమున విహరించిన కవులును, ఈ కవులును ప్రజల జీవన్మరణ సమస్యలను చిత్రించునట్టి రచన లొనర్చిరి. వీరి పద్యములలో కొన్ని ప్రాస్తావిక పద్యములవలె తాత్కాలిక ప్రయోజనముకలవి. మఱికొన్ని ఉదాత్త భావనోపేతములై దేశభక్తిని ప్రబోధించునట్టివి. దీనానాథ నాదిమ్, నూరుమహమ్మద్ రోషన్, అమీర్‌కౌలు అను వారీ పరిణామ యుగమునకు నాయకులు. వీరి అడుగుజాడలలో సంచరించిన యువ కవులలో రహమాన్‌రాహి, గులామ్‌నబి ఫిరాబ్, ముజఫర్ ఆజిమ్, మోహన్‌లాల్ బేకస్, చమన్‌లాల్ చమన్, గులామ్ రసూల్ సంతోష్ అనువారు ప్రముఖులు. వీరిలో రాహి అను కవి రచన సాహిత్య అకాడమీ బహుమతిని పొందినది. వీరు నూత్నేతివృత్తములను స్వీకరించుటయే కాక గద్యకవితలను, నూత్నఛందోరీతులను, ప్రయోగించి కాశ్మీరి కవిత్వమునకు నూత్నోహలు కల్పించిరి. రాహి రచించిన 'సబారోజ్‌నొ' 1961 లో సాహిత్య అకాడమి బహుమతినొందిన గ్రంథము. వాదిమ్ బంబుర్ యెంబర్‌జల్ (Bombar Yembarzal) అను అత్యుత్తమమైన ఓపేర

(సంగీత నాటకము లేక యక్షగానము) రచించెను. ఈ కవియు, రోషన్ అను కవియు, కలిసి హిమాల్‌తనో గ్రే అను ఓపేరాను రచించిరి. ఈ రెండు ఓపేరాలు సంకేతగర్భితములు. కామిల్‌కవి 'రవరూపీ' అను ఓపేరాయందు వసంత విజయమును సంకేత రూపమున చిత్రించెను. ప్రేమనాథ్ ధర్ కవి జూయెగబర్ (Two Sons) అను ఓపేరాలో కాశ్మీర దేశములోని హైందవ మహమ్మదీయ మత సామరస్య పరిస్థితులను సరసముగ వర్ణించెను. నాదిమ్ రచించిన పంచపాది, షట్పాది సానెట్ (Sonnet) పద్యములు (సానెట్‌లో 14 చరణములుండును) అత్యాధునికములు. పర్వతమునం దుదయించిన చంద్రుడీ కవికి బన్ (భక్ష్యవిశేషము) వలె గోచరించెను. ఈతని భావనాశక్తి కిది యొక ఉదాహరణము. రాహికవి కాశ్మీరి గజల్‌ను ఉదాత్త భావనాత్మకముగను, ప్రౌఢముగను రూపొందించుటలో కృతకృత్యుడయ్యెను.

# 11

# రూ ప క ర చ న

కాశ్మీరి భాషలో రూపకరచన మాధునిక యుగమునందే ఆరంభమైనది. కాశ్మీర దేశమున ప్రాచీన కాలమునందుగల సుప్రసిద్ధ నాటక కర్తలందఱును సంస్కృతము నందే నాటకములు రచించి యుండిరి. మధ్యయుగమున నాటక రచన వికాసమును గూర్చికాని నాటక కర్తలను గూర్చికాని వివరము లేమాత్రము తెలియవు. బిండ్‌జషన్ అను నొకానొక విధమైన ఆరుబయట జానపద రంగస్థల ముండినట్లును (Open air Village Folk Theatre) దానిని నటకులు, బాండులు, అనువారు నిర్వహించుచుండి రనియు వారు సమకాలిక సాంఘిక పరిస్థితులను, నిరంకుశ పరిపాలనా విధానములను, హాస్య, అధిక్షేపపూర్వకములగు ప్రదర్శనల రూపమున జూపి ప్రజలకు వినోదమును గూర్చుచుండిరనియు తెలియుచున్నది.

ప్రాచీన నాటకకళ ఈ శతాబ్ది ప్రారంభమున పునరుజ్జీవము నొందినది. లాహోరు పంజాబు ఇతర పట్టణములలోని పార్సీ థేటరులును, శ్రీనగరములోని పంజాబీ హైందవులు దసరా సందర్భమున ప్రదర్శించు రామలీల నాటకములును ప్రదర్శనలును ఈ శతాబ్ది ఆరంభమున నాటకకళ పునరుజ్జీవము నొందుటకును నాటకకళ యందాసక్తి పెంపొందుటకును దోహద మొసగినవి. కృష్ణసుదామ, వీరాభిమన్యు మున్నగు హిందూస్తానీ నాటకములును, బహుళ ప్రచారము నొందిన ఆగాహషర్ కాశ్మీరిగారి ఉర్దూనాటకములు సఫేద్‌ఖూన్ బావఫాఖాతిల్, ఖూన్‌కాబదలాఖూన్

మున్నగునవి వివిధ నట బృందములచే ప్రదర్శింపబడుచుండెను. కాని వీనియందు కాశ్మీరి సాహిత్యమునకు జెందదగిన ప్రత్యేకత యేమియులేదు. 1925 లో మహారాజ ప్రతాప్‌సింగ్ మరణముతో కాశ్మీర దేశమున సాంఘిక రాజకీయ చరిత్రలో నూత్నా ధ్యాయము ప్రారంభమైనది. నాటినుంటియే కాశ్మీరి భాషలో నాటకములు బహుళముగ రచింప బడినవి. తొలి దశలోని నాటకములు బహుళముగ ఉర్దూనుండి పరివర్తనము నొందినవే. నందలాల్ కౌలు పరివర్తించిన హిందూస్తానీ నాటకములు రామున్‌రాజ (The Reign of Rama) ప్రహ్లాద భగత్, (The Devoka Prahlad) కాశ్మీరి భాషలో ననువదింపబడిన హరిశ్చంద్ర మున్నగునవి అన్నియు ప్రజలకు సుబోధముగ నుండునట్లు వెలువడిన ప్రశస్తానువాదములు.

అక్టోబరు 1947 లో పాకిస్తాన్ ప్రోద్బలమున జరిగిన దాడుల అనంతరము కాశ్మీరి నాటకకళయందు నూత్న చైతన్యరేఖ లేర్పడినవి. ఈ నాటకములు కాశ్మీరి భాష యందు రచింపబడుటయేకాక ప్రజల జీవన్మరణ సమస్యలకు సంబంధించినవై యుండెను. దైనందిన క్లిష్టపరిస్థితుల కనుగుణమైన ఇతివృత్తముగల నాటకములు ప్రథమముగ ప్రదర్శింపబడిన దీ కాలముననే. సాంఘికముగ జాగరూకులైన ప్రతి భావంతులగునాటి రచయిత లుత్తమ నాటక కర్తలుగ ప్రశస్తివహించి కాశ్మీరి ఉర్దూ భాషలందు నాటకములను రచించిరి. అంతియకాక కాశ్మీర సాంస్కృతిక జాతీయ సంస్థను రూపొందించి వారు శ్రీనగరములో రంగస్థలమును నిర్మించి "కాశ్మీర్ యహహై", "షహీద్ షేర్వాని", "సవ్వాలి" అను నాటికలను ప్రదర్శించిరి, కాశ్మీర సైనిక బృందములకు సాంస్కృతిక అనుబంధ అంగములుగ పల్లెపల్లెలో పర్యటించి కాశ్మీరి భాషలో ననువదింపబడిన పైనాటకములను, తదితర నాటకములను, ప్రత్యేక ముగ "కాశ్మీరి" గ్రీస్ నగ్మరీషిను ఖాను కమజూర్, (The Silk Factory Mazoor) మున్నగు నాటికలను శిల్పదృష్టితో నృత్య సంగీతయుక్తముగ బ్రదర్శించిరి. సమకాలిక ఆర్థిక సాంఘిక సమస్యలకంటె గ్రామీణ సమస్యలకు పరిష్కారము సూచించు నాటిక లను వారు గ్రామగ్రామములందు ప్రదర్శించుచుండిరి. గ్రామీణ నిత్యజీవిత సమస్యలను పరిష్కరించుకొనుటకును, వారొనర్చిన తప్పిదములను గుర్తింపజేసి కనువిప్పు కలిగించుటకును, దారుణమైన పాకిస్తాను దాడులకు దారితీసిన పరిస్థితులను గ్రహింప జేయుటకును, నాటక కర్తలు నాటకమును సాధనముగ గ్రహించిరి. ఇట్టి పరిస్థితులలో రూపొందిన నాటక ప్రక్రియ క్రమముగా సాంఘిక, ఆర్థిక, రాజకీయ దుస్థితులను ఛేదించుటకు శస్త్రముగా నుపయోగింపబడెను.

రాష్ట్రీయకళా మందిరముగా రూపొందిన సంస్థలోని నటకులు కొందఱు నిర్బంధ వైధవ్యము, వరశుల్కము, అననుకూల దాంపత్యము మున్నగు సమస్యలను చిత్రించు నాటకములను ప్రదర్శించుచుండిరి. వారు ప్రదర్శించిన నాటకములలో విధవా (The widow) అవలాద్ (The off spring) సోన్‌గామ్ (our village) అనునవి అధిక జనాదరణము నొందినవి. కాశ్మీర్ సుధార్ సమితి అను మరియొక సంస్థ ఒక ప్రత్యేక రంగస్థలమును రూపొందించి సమాజాభ్యుదయమును సాధించుట కుద్యమించెను.

1953 సంవత్సరమున కాశ్మీర నాటక వాఙ్మయమున కమూల్యాలంకారము గూర్చిన "బంబూర్ యంబ్రజల్" అను సుప్రసిద్ధ ఓపేరా వెలువడినది. దీనానాథ్ నాదిమ్ రచించిన ఈ ఓపేరాయందు శరద్హేమంత ఋతువులందు నార్గిసస్ (వసంత ఋతువులో వికసించు ఒక పుష్పము) అనుభవించు వియోగస్థితి వర్ణితము.

శరద్హేమంతముల వలనను, వాని మిత్రవర్గమగు ఉఱుములు మెరుపుల వలనను, వియోగము నొందిన తుమ్మెద, నార్గిసెస్‌ల ఆర్తస్థితి, వివిధ పుష్పములతో రమణీయమైన వసంతోదయమున పునస్సమాగమ కాంక్ష ఈడేరినవారి మనోల్లాసము ఇందు రసవంతముగ వర్ణింపబడినది. మరణ విచ్ఛేదములపై జీవితము సాధించు విజయమిందు భంగ్యంతరముగను, సంకేత పూర్వకముగను చిత్రింపబడినది. పురాతనమైన కట్టుబాట్ల తెగద్రెంపులపై, అభ్యుదయ నిరోధక శక్తులపై, అభ్యుదయ సమైక్యతా శక్తులు సాధించిన ఘనవిజయము (భారతదేశముతో విలీనమగుట)ను నాటి రాజకీయ వ్యవస్థను భంగ్యంతరముగా సూచించుచున్నది. ఈ నాటకము నందలి నృత్య సంగీత స్వరములు కాశ్మీర సంగీతమునకు వన్నెచిన్నెలు కూర్చినవి. దీనానాథ్‌నాదిమ్ తదనంతరము రచించిన రెండు నాటకములు కూడ సుప్రసిద్ధమైనవి. హిందూ హైస్కూలు విద్యార్థులు 1956 లో కాశ్మీరి రంగస్థలములో ప్రదర్శించిన "నేకీబదీ" అనునాటిక సర్వజన ప్రశంసల నందుకొనినది. నూర్‌మహమ్మద్ రోషన్‌తో కలిసి రచించిన దీనానాథుని హిమల్ తనోగ్రే యందు చిత్రింపబడిన నాగా రాజకుమారునకును, ఆర్య రాజకుమారికిని జరిగిన ప్రణయోదంతము స్థానిక పూర్వగాథ నుండి స్వీకరింపబడినది.

సాహిత్య ప్రధానమగు నాటకములలో ఆచార్య ముహిఉద్దీన్ హాజిని రచించిన 'గ్రీస్‌సుంధుఘర' అను నాటకము ప్రథమముగ గణింపదగినది. క్రీ.శ. 1939 ప్రాంతమున నాటి గ్రామీణ పరిస్థితుల ననుసరించిన కర్షకుని సంసార మీ మూడంకముల నాటకమునందు రమ్యముగ చిత్రింపబడినవి. అమీన్ కాయిల్ రచించిన 'రవరూపి' అను పద్య నాటికలోని కొంతభాగము 'క్వాంగ్‌షోష్'లో ప్రకటింపబడినది. ఈ రెండు నాట

కములలో నేదియు నిదివఱకు రంగస్థలముపై ప్రదర్శింపబడనందున అవి రంగస్థల నాటకములుగ నెంతవఱకు జయప్రదములగునో గ్రహించుట కష్టము. కునీ కథ (The save Story) అను మూడేకాంకికల సంపుటి 1955 లో ప్రకటింపబడినది ఈ సంపుటిలోని ఏకాంకికలన్నియు నొకే యితివృత్తముగలవి. లోయలోని నదులవలన నిరంతర మేర్పడు వఱదల వలన ప్రజలెదుర్కొనిన కష్టము లిందు వర్ణింపబడినవి. ఈ సంపుటిలోని అలీమహమ్మద్ రచించిన విజఖయసోనీ, నూర్ మహమ్మద్ రచించిన సోన్ సంసార్ అను రెం డేకాంకికలాధునికములు-అమీన్కామి రచించిన పగాచగాష్టార్ అను నాటిక ప్రాచీన జానపద నాటిక బందాజషన్ యొక్క ఛాయలు గలది.

ఆధునిక కాశ్మీర నాటక వాఙ్మయవికాసమున రేడియో నిర్వహించిన పాత్రను విస్మరింపలేము. కాశ్మీరమున వివిధ సృజనాత్మక రచనలపై దాని ప్రభావ మత్యధికముగ గోచరించును. విశిష్టములగు నృత్యగీతములను గూర్చి అత్యంతాసక్తిని పెంపొందించుట యందును పద్యగద్య గాథారచనల కధిక ప్రచారమును గూర్చుటయందును, ఆధునిక కథానిక - ఏకాంకికా ప్రక్రియల వికాసమునకును, రూపకరచనా ప్రదర్శనల నైపుణి నావిష్కరించుటయందును రేడియో యొనర్చిన దోహదమునకు కాశ్మీరు లెంతయు ఋణపడియున్నారు. ప్రసారము నిమిత్తమై రచింపబడిన నాటకము లెన్నియో పఠనయోగ్యములుగను ప్రశస్తిగాంచినవి. ఇందు సోమనాథజ్యోతిషిగారి 'విజివావ', అమీన్కౌలు రచించిన మాస్టర్జీ, నూర్మహమ్మద్ రోషన్గారి మిస్కీన్బడ్ అనునవి విశిష్టములైనవి. ఆకాశవాణి కాశ్మీర నిలయమువారు ప్రసారమొనర్చిన గ్రామస్థుల కార్యక్రమములో నిజసోచ్, ఒస్టర్ మచామా అను పాత్రలధిక జనప్రియములైనవి. కాశ్మీరి వాఙ్మయమునం దుదాత్తహాస్య చిత్రణము మృగ్యమగుటచే, నీ హాస్య ప్రధానపాత్రలు కాశ్మీరి నాటకములకేకాక కాశ్మీరి సాహిత్యమునకే వినూత్నశోభను కలిగించినవి. గ్రామీణ ధనికవంశీయుడగు నిజాసోచ్ నగరమునకు వలసవచ్చి విచిత్రపరిస్థితుల నెదుర్కొనిన ఘట్టములు హాస్య ప్రధానములైనవి. రవీంద్ర కవీంద్రుని (Red Oleanders) ను 'వ్వజుల గులాల' అను పేరను, ఇబ్సన్గారి (Wild ghosh) ను ఛాయ అను పేర అనువదించిన అక్తర్ మొహిఉద్దీన్, ఇబ్సన్ (Wild Duck) ను పఛిన్ అనుపేర ననువదించిన సోమనాథ జ్యోతిషి ప్రభృతులు కాశ్మీరి నాటక వాఙ్మయమున కొనర్చిన సేవ ఈ సందర్భమున స్మరణీయము.

ప్రాచీన పురాణ కల్పితగాథల నాధారముగ గొని రచింపబడిన నాటకముల కంటె ఆధునిక నాటకములు కొంతవఱకు స్వతంత్రములయ్యు నింకను విశిష్టస్థానము నొంద

లేదు. కొన్నిటి యందు సాంఘిక వాస్తవిక దృక్పథము కనప్పట్టినను పాత్రచిత్రణము నందు వైశిష్ట్యము గోచరించినను కాశ్మీరినాటకమునం దుదాత్తమైన వస్తువును స్వీకరించుటయందును, చిరస్మరణీయములగు పాత్రల సృష్టించుటయందును నింకను కృషి జరుగవలసియున్నది.

# 12

# వచన వాఙ్మయము

కాశ్మీరి సాహిత్యమున వచన వాఙ్మయము పద్యవాఙ్మయమువలె విస్తరిల్లలేదు. వివిధ సాహిత్యములందు పద్యము తరువాతనే వచన మావిర్భవించినది. కాశ్మీరి సాహిత్యమున వచన వాఙ్మయ వికాసమునకు కొంతకాలము పట్టినది. కాశ్మీర పద్య సాహిత్యము పదమూడు పదునాల్గు శతాబ్దుల నుండి క్రమపరిణామ వికాసములొంద వచనము మాత్రము పందొమ్మిదవ శతాబ్దమున చివరి దశాబ్దములందు ప్రారంభమైనది. 1947-48 తరువాతనే వచన వాఙ్మయమున కథానిక వ్యాసము - ప్రహసనము - నవల మున్నగు ప్రక్రియ లావిర్భవించినవి. పందొమ్మిదివ శతాబ్ది పూర్వార్ధము వఱకును, ఇరువదియవ శతాబ్ది ఉత్తరార్ధము వఱకును పారశీకము కాశ్మీర రాష్ట్రమున రాజభాషగా వర్ధిల్లుచుండెను. ప్రభుత్వ న్యాయశాఖా వ్యవహారములందే కాక దైనందిన వ్యవహారము లందును, పారశీక భాషకే ప్రాధాన్యమేర్పడి యుండెను. క్రమముగా ఉర్దూ భాష పారశీక భాష స్థానము నొందుచుండెను. పారశీక భాషాప్రభావము సన్నగిల్లినను, జమ్మూ కాశ్మీర రాష్ట్రమున డోగ్రీ, కాశ్మీరి, బాల్ది, లడక్ మున్నగు భాషాప్రాంతము లలో నావృతమైన ప్రభుత్వ (ప్రాంతీయ) భాషయగు ఉర్దు జనవ్యవహార విదూరమై యుండెను. ఇతర ఆధునిక భారతీయ భాషలలోలేని కొన్ని శబ్దములు కొన్ని కాశ్మీరి భాషయందు కలవు. ఈ శబ్దములకు తగిన లిపి లేనందునను నా భాషలో వచనమంతగా విస్తరిల్లలేక పోయెను. దేవనాగరి లిపి కంటెను ప్రాయశః ప్రాచీనమైన శారదా లిపి ప్రాచీన కాలమున నుపయోగింప బడుచుండెను. కాని అది పారశీక భాషాప్రాధాన్యముతో మూలబడెను. అరబీ పారశీక లిపి కూడ కాశ్మీర భాష కనుగుణముగ లేకుండెను. కాని పద్యరచన కది కొంతవఱ కనుకూలమైయుండెను. స్వాతంత్ర్యానంతరము ప్రథమ ప్రజాప్రభుత్వము అరబీ పారశీక లిపి కనుబంధముగా కొన్ని నూత్న అక్షరములు స్వరచిహ్నములు చేర్చి కాశ్మీరి లిపిని ప్రామాణిక మొనర్చుట కుద్యమించినది.

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధమువఱకును, కాశ్మీరి వచన వాఙ్మయము పదము, గాథ అనువాని రూపమున విస్తరిల్లెను. ఈ జానపద గాథలను 'హాతిమ్ గాథలు'

గాసర్ ఆరెల్ స్టీన్‌గారు సేకరించియుండిరి. రెవరెండు జె. హింటన్‌గారు వీనిలో కొన్నింటిని ఆంగ్లమునందు కూడ అనువదించిరి. గాథలను చెప్పువారు బృందములుగ నేర్పడి సంప్రదాయానుసారము పాడు గీతములు కూడ ఈ గాథలందు మధ్యమధ్య కాన్పించును.

అరబీ పారశీక లిపిలో 1884 లో బైబిలు రచింపబడి 1899 లో సంపూర్ణముగ ననువదింపబడెను. 1821 నాటికే కలకత్తాలోని సేలంపూరు మిషన్‌వారు శారదా లిపిలో బైబిల్ ననువదించియుండిరి. కాని కొంతకాలమునకే అది అంతరించినది. బైబిల్ అనువాదము జానపద గాథలలోని వచనముకంటె భిన్నముగా లేకుండెను. చిన్నచిన్న వాక్యములున్నను భాషయందును, వాక్యనిర్మాణమునందును కొంత సామ్యము కన్పట్టును.

చేతితో తయారుచేయబడిన కాగితములపై కాశ్మీరమున గల ముద్రణాలయమున 1876 లో కాశ్మీరి భాషలో ప్రథమముగా నచ్చైన గ్రంథము పండితరంజూదరుని Eulicid ప్రథమ భాగానువాదము. ఈశ్వర్ కౌలు రచించిన కాశ్మీరి భాషా వ్యాకరణము, మౌల్వీయాహయ (Maulvi yahaya) కృతమగు తఫ్సీరెఖురాన్, నూరుద్దీన్‌గారి మిసల్ హాఫీజ్ మహమ్మద్‌హసన్ రచించిన "షాహెరా హెమహమ్మదీ, అల్మారూఫ్ కోషర్ ముఫ్తీ" మున్నగు గ్రంథములందు వచన స్వరూపము పరిణత దశ నొందినది. ఇందు వాక్యనిర్మాణ విధానము గమనింపదగినది. మహోన్నతములైన భావములు చక్కని వాక్యములలో వ్యక్తీకరింపబడినవి.

క్రీ. శ. 1925 నుండి కాశ్మీర లిపిని దేవనాగరి, అరబీ పారశీక లిపుల ననుసరించి సమగ్రముగ సంస్కరించుటకు కృషికొనసాగినది. ఇట్టి కృషి నొనర్చిన వారిలో కొందఱు ప్రముఖులు పేర్కొనదగిన వారు. ఆచార్య తోషఖని శ్రీ సంక్షేమనిధి వారి బాలికా పాఠశాలల కొఱకు భాషావాచకములను, గణిత పాఠ్య గ్రంథములః చిరి. బహుళముగ హిందూస్తానీ నాటకముల ననుసరించి ప్రపథముగ కాశ్మీరి భాషలో నాటకములను రచించిన నందలాల్ కౌల్‌గారి కృషి ఆద్యముగ గణింపదగినది. ఈ రూపకములందు ప్రథమముగ నా భాషలో వివిధ పాత్రల సంభాషణలు వచన రూపమున కూర్పబడినవి. ఈ సంభాషణ పాతా్రను గుణముగను, శక్తిమంతముగను జాతీయములతో రసవంతముగ నున్నవి. నందలాల్ కౌల్ చిఱుత ప్రాయమున మరణించెను. ఈతనికి దీటుగ రచన యొనర్చువారు నాడుగాని తదనంతర కాలమునగాని లేకుండిరి.

పాకిస్తాన్ ప్రోద్బలమున జరిగిన దాడుల అనంతరమే కాశ్మీరిలో ఆధునిక వచన సాహిత్య మావిర్భవించినది. ఈ దాడుల నెదుర్కొనుటకై కాశ్మీరి రచయితలు

సాంస్కృతిక సంస్థల నేర్పఱిచి రూపకములు, ఓపెరాలు, రేడియో ఫీచరు (Feature) ప్రసంగములు, చర్చలు మున్నగునవి ప్రజలకు సన్నిహితమైన భాషలో రచించి కాశ్మీరి భాషకుగల నూత్న శక్తిని వ్యక్తీకరించిరి. నాటి పరిస్థితుల కనుగుణమైన రచనలు వెలువడినను వానిలో సాహిత్య గుణము స్థిరపడినది. దీనానాథ్ నాదిమ్ రచించిన బాంబుర్ యంబర్జల్ అను ఓపెరా నాదిమ్‌గారును నూర్‌మహమ్మద్ రోషన్‌గారును కలిసి రచించిన హిమాల్‌తనోగ్రే సర్‌నాథ్ జ్యోతిషిగారి "విజివాక" "మెడుర్మన్" అను నాటికలు ఇట్టివి. ఇంకను గణింపదగిన వారెందరో కలరు. వీరిలో రవీంద్ర కవీంద్రుని గ్రంథముల ననువదించినవారు ప్రథమగణ్యులు. వజుల్‌గులాల (Rekta karabi) ఖురుబాని (Sacrifice) అను వానిని రచించిన నూర్‌మహమ్మద్ రోషన్; డాక్‌ఘర్, రాజతరాని (King and Queen) అను వానిని రచించిన అమీన్ కామిల్; ముక్తధార కర్తయగు అలీమహమ్మదులోని, సోంతక్ అతగత్ (cycle of spring) ను రచించిన మీర్జాఆరిఫ్ అనువారు రవీంద్రుని గ్రంథముల ననువదించిన వారిలో ముఖ్యులు.

ఇబ్సన్‌గాని (Ghost) అను గ్రంథమును "ఛాయ" అను పేర అనువదించిన అక్తర్ ముహిఉద్దీన్, (wild duck) ను అనువదించిన "థజ్" అను పేర అనువదించిన సోమనాథ్ జ్యోతిషి అనువారును భారతరాజ్యాంగము ననువదించిన కొందరు అసెంబ్లీ సభ్యులును పేర్కొనదగినవారు.

ఈ కాలముననే గుల్‌రేజు, కోంగ్‌పోషి అను సాహిత్య పత్రికలు వెలువడినవి. ఇందు వ్యాసములు, సమీక్షలు, కథానికలు మున్నగునవి రచింపబడుచుండెను. ఉత్తమ కథానిక లధిక సంఖ్యలో ప్రకటింపబడినవి. అక్తర్ ముహిఉద్దీన్‌గారి "సత్‌సంగర్" అను కథానికా సంపుటి సాహిత్య అకాడమి బహుమతి నొందినది. అమీన్ కామిల్, బన్సినిర్దోషీ, ఔతార్ కిషన్ రహబర్, దీపక్ కౌలు, షంకర్‌రేనా, హృదయ కౌల్ భారతి, సూఫీ గులామ్ మహమ్మదు మున్నగువారి కథానిక లుత్తమస్థాయి కలవి. సాహిత్య వ్యాసములు, తదితర వ్యాసములు వ్రాసి ఖ్యాతి గడించిన వారిలో ఆచార్య హాజిని, రహమాన్‌రాషి, ఆలీమహమ్మద్‌లోది, హృదయ కౌల్ భారతీ మొదలగువారు ప్రముఖులు.

గత రెండు దశాబ్దముల స్వల్ప కాలముననే కాశ్మీరి వచన సాహిత్యము బహుముఖముగ వికాసము నొందినది. స్కెచ్ లలితమైన హాస్య, అధిక్షేప రచనలు, యాత్రానుభవములు వివిధ వ్యాసములు, సాహిత్య విమర్శ, కథలు మున్నగునవి ఆధునిక కాశ్మీరి వచన సాహిత్యమున కలంకారము గూర్చిన రచనలు.

---

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| తొలిపలుకు | 8 | సృష్టీ | సృష్టి |
| 1 నుంచి 144 వరకు | | దక్షిణ భారత సాహిత్యములు | ఉత్తర భారత సాహిత్యములు |
| 1 | 16 | అత్యాథునిక | అత్యాధునిక |
| 5 | 22 | గ్రంథాలూ | గ్రంథాలూ |
| 7 | 12 | శతాబ్దంలోనే | శతాబ్దంలో |
| 9 | 9 | తీసుక | తీసుకు |
| 12 | 22 | చామం వేస్తూ | చామరం వేస్తూ |
| 17 | 18 | శ్రీకృష్ణ మంగళ | శ్రీకృష్ణ మంగళగా |
| ,, | 19 | వ్రాశాడు. | వ్రాశాడు కృష్ణదాసు. |
| 18 | 26 | వ్రాశాడు. | వ్రాశాడీతడు. |
| 19 | 25 | రెండు | రెండూ |
| 20 | 2 | వేస్తుంది. | లేస్తుంది. |
| ,, | 11 | ద్వి కవిచంద్ర | ద్విజ కవిచంద్ర |
| 21 | 25 | చోరె | బోరె |
| 23 | 14 | వరో | నరో |
| 27 | 26 | తొందంలాగా | తొండాల్లాగా |
| 31 | 11 | స్తనావలీ | స్తవావలీ |
| ,, | 17 | దీపిక | దీపికా |
| 32 | 19 | ఖండాలున్నాయి. ఇందులో. | ఖండాలున్నాయి ఇందులో. |
| 33 | 15 | చైతన్య సంహితా | చైతన్య సంహిత |
| 34 | 3 | మాధుర | మాధురా |
| 37 | 6 | అనువాద సాహిత్యం* | అనువాద సాహిత్యం |
| ,, | 19 | దేష భాషలో | దేశ భాషలో |
| ,, | 20 | పండితులు. | పండితులు* |
| 39 | 5 | ఘట్లాల్లో | ఘట్టాల్లో |
| 40 | 14 | వయస్సులో నిత్యానందుడికి | వయస్సులో |
| 41 | 14 | చెవింది | చేసింది          చందావతి. |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 43 | 17 | సేనాదిపసేతి | సేనాధిపతి |
| 44 | 16 | సంవత్సరమూ | సంవత్సరం |
| 48 | 27 | శ్రీకృష | శ్రీకృష్ణ |
| 50 | 6 | సంగ] | సంగ్ర |
| ,, | 7 | దైత్యాది | దైత్యారి |
| ,, | 10 | సురేశ్వరాదేవ | సురేశ్వరదేవ |
| ,, | 19 | మహా | మరే |
| ,, | 24 | వాశీశ | వాగీశ |
| 51 | 2 | సాగిపోతాంది | సాగిపోతుంది. |
| 53 | 18 | మాలధరవసు | మాలాధర వసు |
| 54 | 5 | మూర్ఛిత | మూర్ఛిత |
| 56 | 15 | గోపీనాధా విజయ | గోపీనాథ విజయ |
| 57 | 12 | పదబంశం | పదబంధం |
| 58 | 9 | సకహితా | సంహితా |
| 59 | 4 | చంద్రవళ | చంద్రకళ |
| ,, | 16 | వీరావరుడు | వీరవరుడు |
| 61 | 21 | అది విలో | అడివిలో |
| 62 | 20 | గౌలత | దౌలత |
| 64 | 20 | కసిరంజన | కవిరంజన |
| ,, | 21 | భారతీ చంద్ర | భారత చంద్ర |
| 66 | 18 | వాదిస్తారు. | వారిస్తారు. |
| 72 | 11 | చేసి | చేసే |
| ,, | 16 | ప్రచురించాడాయన | ప్రచురించాడు. |
| ,, | 20 | ప్రతికలూ | పత్రికలూ |
| 73 | 4 | ఈసపేల్ | ఈసపేర్ |
| 74 | 16 | చారు పాఠీ | చారు పాఠ |
| ,, | 22 | చారు పాఠు | చారు పాఠ |
| 75 | 4 | ప్రతికా | పత్రికా |
| ,, | 10 | మేథినీపురం | మేదినీపురం |
| ,, | 15 | పోర్డు విలియం | ఫోర్టు విలియం |
| 79 | 24 | వేదాం ప్రవేశ | వేదాంత ప్రవేశ |
| 80 | 5 | నవి విధాన | నవ విధాన |
| ,, | 14 | త్రైలోక్యనాథ | త్రైలోక్యనాథ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 80 | 19 | జీవత చరిత్రలు | జీవిత చరిత్రలు |
| 81 | 8 | నందకుమారి | నందకుమార |
| 82 | 2 | స్వతంత్రమూర్తి | స్వతంత్రమూర్తిగా |
| ,, | 7 | పదే | పథే |
| 86 | 14 | ఇలాటీ | ఇలాటి |
| ,, | 15 | బట్ట తల | బట తల |
| 87 | 4 | స్వర్వ కుమారీ దేవి | స్వర్ణకుమారి దేవి |
| ,, | 10 | రచనకు | గద్య రచనకు |
| 88 | 18 | ఇతిహాప దార | ఇతిహాస ధార |
| 89 | 16 | పుంచాదానికి | పుంచదానికి |
| ,, | 19 | ప్రవాహ థారను | ప్రవాహ ధారను |
| 90 | 18 | పణీక | పణిక |
| 92 | 15 | సామ్రాట్లు | సమ్రాట్టు |
| 94 | 27 | రాకూరు | ఠాకూరు |
| 95 | 14 | అనువదించాడు | అనువదించాను |
| 99 | 16 | మోహాసవసు | మోహానవసు |
| 101 | 21 | కుంజి | కుంజ |
| 103 | 8 | నితంచినీ | నితంబినీ |
| ,, | 24 | చక్కనీ | చక్కని |
| 106 | 3 | విసర్జను | విసర్జన |
| ,, | 12 | చాటుతున్నాడు. | చాటుతున్నాయి. |
| 107 | 10 | ప్రతిక | పత్రిక |
| 108 | 16 | బంకిమచంద | బంకిమచంద్ర |
| ,, | 17 | ముఖ్యమైనది. | ముఖ్యమైనవి. |
| 110 | 7 | సాధారణంగా | అసాధారణంగా |
| ,, | 20 | అధేనియం | అథేనియం |
| 111 | 8 | అనావదించాడు | అనువదించాడు |
| ,, | 9 | మూదేళ్ళు | మూడేళ్ళ |
| ,, | 10 | సభత | సభ్యత |
| 112 | 10 | కావ్వేర | కావ్యేర |
| 113 | 14 | తీవ | తవ |
| 121 | 15 | వందోపాధ్యాయ | వంద్యోపాధ్యాయ |
| 122 | 11 | దత్త | దత్తు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 124 | 24 | దా చెవుల | దాని చెవుల |
| 125 | 5 | . శీహారీలాలు | శీహరిలాలు |
| ,, | 16 | మరి | మని |
| 126 | 6 | సంసొారె | సంసారె |
| 127 | 3 | కాదీయ్యన | కాడీయన |
| 133 | 27 | పశువులు. | (పశువులు) |
| 140 | 3 | పుస్తకమని | పుస్తకము నించి |
| 142 | 6 | కనేదినమూ క్షణకణమూ | దినదినమూ, క్షణక్షణమూ |
| ,, | 12 | ఆకాశ ప్రదీవ | ఆకాశ ప్రదీప |
| 143 | 7 | ప్రతుపక్షుల | ప్రతిపక్షుల |
| 144 | 9 | దిజేంద్ర | ద్విజేంద్ర |
| ,, | 22 | దేదెఖని | దేఖని |
| ,, | 23 | అవరత | అవిరత |
| 149 | 28 | నవలలో | నవలల్లో |
| 150 | 3 | ఉవ్వోదించాడు. | ఉద్బోధించాడు |
| ,, | 10 | తారకనాధ | తారికానాథ |
| 151 | 13 | శివనావ . | శివనాథ |
| ,, | 24 | జానీకనాథ | జానకీనాథ |
| 153 | 8 | ప్రవాథ చౌధురి | ప్రమథ చౌధురి |
| ,, | 18 | నవలా చక్రవర్తి | నవలా చక్రవర్తి |
| ,, | 19 | చరిత్రన | చరిత్రహీన |
| ,, | 23 | బింధూర | బిందూర |
| ,, | 25 | ఇతను 'బడదీది | 'బడదీది |
| ,, | 27 | రవీంద్రు | రవీంద్రుడి |
| 154 | 5 | వ్యాసం | వ్యాసంగం |
| ,, | 12 | అమానిత | అవమానిత |
| 155 | 19 | దిధీ | దిదీ |
| ,, | 25 | శిలప్పం | (శిల్పం) |
| 156 | 17 | గల్ప విఖి | గల్ప లిఖి |
| 157 | 3 | రవీంద్రునతో | రవీంద్రునితో |
| ,, | 13 | వ్రాయాలని ? | వ్రాయాలని |
| ,, | 20 | పత్రికల్లలో | పత్రికలో |
| ,, | ,, | ప్రాల్గంభించా | ప్రారంభించా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 158 | 13 | చోటా ఛోటా | ఛోటా ఛోటా |
| 159 | 15 | నవలు | నవలలు |
| 162 | 4 | నిందుకు | నిందకు |
| ,, | ,, | అందాక | అందుకు |
| ,, | 5 | వచ్చి ది | వచ్చింది |
| 163 | 14 | వెలుద్దాయి | వెలువడ్డాయి. |
| 165 | 19, 20, 21 | మొదలైన కథాసంపుటాలూ వ్రాశాడు. 'రమల' నవీ నులను బాగా మెప్పించిండి. సహయాత్రిని (1941. మొదలైన కథా సంపుటాలు వ్రాశాడు. 'రమల' నవీ నులను బాగా మెప్పించింది. | 'సహ యాత్రిని' (1941) మొదలైన కథా సంపుటాలు వ్రాశాడు. 'రమల' నవీనులను బాగా మెప్పించింది. |
| 165 | 23 | వీర భూరు | వీర భూమి |
| 166 | 13 | కలిత | కవిత |
| 170 | 9 | కథోర | కఠోర |
| ,, | 18 | చూసింది | చూసిందికి |
| ,, | 23 | సాహిత్యా సమితి | సాహిత్య సమితి |
| ,, | 25 | నూతన రాథ | నూతన రాధ |
| 171 | 23 | ఆకారంమీద | ఆకాశం మీద |
| ,, | ,, | పరిగిడితుంది | పరిగిడుతుంది |
| 174 | 13 | పదా | పథా |
| 175 | 7 | దత్తా | దత్తు |
| ,, | 8 | శంక లీలా | శంకర లీలా |
| ,, | 9 | ప్రతికలు | పత్రికలు |
| 180 | 19 | యధాతధముగా | యథాతథముగా |
| 188 | 6 | సరశదాసు. | సరళాదాసు |
| 189 | 9 | మార్పు | మార్పు |
| ,, | ,, | ,, | ,, |
| 190 | 2 | మటియుక | మఱియొక |
| ,, | 21 | దృష్ట | దృష్టి |
| 193 | 10 | సంధ్యల వేశల | సంధ్య వేళల |
| ,, | 22 | మహారాష్ట్రిలో | మహారాష్ట్రిల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 195 | 15 | పదొనాఅవ | పదునాఅవ |
| ,, | 14 | గీవ గోవిందము | గీత గోవిందము |
| 197 | 9 | ఒరిప్పా | ఒరిస్సా |
| ,, | 12 | ప్రేమా సుధానిధి | ప్రేమ సుదానిధి |
| 198 | 3 | విశ్వనాధ బంటియా | విశ్వనాథ ఖుంటియా |
| ,, | ,, | కన్యూ దాసు | కన్హూ దాసు |
| ,, | 8 | దినకృష్ణదాసు | దీనకృష్ణదాసు |
| ,, | 16 | కిషోరచంద్ర దాసు | కిశోరచంద్ర దాసు |
| | 22 | శృంగా రసము | శృంగార రసము |
| 199 | 4 | దినకుషు | దీనకృష్ణ |
| ,, | 7 | వ్రజనాధ బడజీన | వ్రజనాద బడజెన |
| ,, | 22 | మధుర మంగళము | మథురా మంగళము |
| 203 | 19 | ఊహాకందవు | ఊహకందవు |
| 205 | 22 | ప్రతిష్ఠ | ప్రతిష్ఠ |
| 205 | 27 | పత్త్రికాధిపతి | పత్రికాధిపతి |
| 212 | 9 | మహోను | మోహన |
| 214 | 11 | అజరామ కీర్తి | అజరామరకీర్తి |
| 215 | 27 | వరహ | వరాహ |
| 218 | 17 | పత్త్రికా | పత్రికా |
| 222 | 20 | జోహరు | జోహారు |
| 225 | 11 | బందికి | బందిర |
| 232 | 4 | పత్త్రికను | పత్రికను |
| 233 | 13 | పూర్ణతను | పూర్ణతమ |
| ,, | 18 | సబర్తు | సబత |
| 240 | 5 | బ్రహ్యాచర్యమునకు | బ్రహ్మచర్యమునకు |
| 241 | 3 | 'వాక్' | 'వార్' |
| 246 | 14 | విర్ణ విభేదమునకు | వర్ణ విభేదమునకు |
| 255 | 5 | పందితులైనందున | పండితులైనందున |
| 262 | 2 | రీ అఫ్ | అరీవ్ |
| 264 | 24 | అతడు ఇతని | ఇతని |
| 265 | 13 | వనుటలో | దనుటలో |
| 269 | 3 | మిర్త్రేమేలే | మిర్చేమేలే |
| 276 | 16 | చిట్టియాం | చిట్టియాం |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| ,, | 20 | పర్యాటసానుభవము | పర్యటనానుభవము |
| 281 | 11 | దర్ద్ వర్గ | దర్త్ వర్గ |
| 282 | 13 | ప్రవ్రధ మోదా | ప్రప్రథమోదా |
| 284 | 25 | జన్మికచెను. | జన్మించెను. |
| 295 | 23 | మఱకొన్ని | మఱికొన్ని |
| ,, | 24 | గన్నడుచున్నవి. | గన్పడుచున్నవి. |
| 297 | 4 | మద్య పాత్ర | మద్య పాత్ర |
| 299 | 24 | నేనెదిరు | నేనెదురు |
| 301 | 4 | జప ప్రియము | జనప్రియము |
| 302 | 14 | దేష భాషలో | దేశ భాషలో |
| 303 | 16 | శతాబ్ద్యంతము | శతాబ్ద్యంతము |
| ,, | 23 | విషాధఛాయల | విషాదచ్ఛాయల |
| 304 | 5 | దర్పింప | దర్శింప |
| 304 | 22 | సరోవరో ప్రాంతము | సరోవర ప్రాంతము |
| 306 | 18 | వృధాగా | వృథాగా |
| 312 | 7 | పన్నిహీత | సన్నిహిత |
| ,, | 15 | మథ్నీవీ | మథ్నవీ |
| ,, | 26 | దృక్పధము | దృక్పథము |
| 321 | 17 | పారమ్యమును | పారవశ్యమును |
| 323 | 6 | ద్వంద | ద్వంద్వ |
| 326 | 21 | ననుసరిం | ననువరించి |
| 327 | 19 | వఱదిలో | వఱదలో |
| 328 | 8 | బిషాబర్ నాధ్ | బిషాంబర్ నాథ్ |
| ,, | 14 | పదములదో | పదములతో |
| 336 | 26 | ఔత్యుక్యము | ఔత్సుక్యము |
| 344 | 15 | ఇబ్బన్‌గాని | ఇబ్బన్‌గారి |